మొదటి కూర్పు

# పీఠిక

---

## అనంతామాత్యుఁడు

ఈమహాకవి కవిత్రయము తర్వాతనున్న ప్రౌఢకవులలో నొక్కఁడని చెప్పఁదగినవాఁడు. ఈయన తిక్కనకవి బ్రహ్మవలన భవ్యభారతి యను బిరుదమును సంపాదించిన బయ్యన్నకు మునిమనుమఁడు. ముమ్మడన్న మనుమఁడు. తిక్కన్నకుఁ బుత్త్రుఁడు. ఈయనతల్లి మల్లమాంబిక. అక్కన చిట్టన రామచంద్రుఁడు లక్ష్మణుఁడు ఈకవి యనుజులు. ముమ్మడన్న యీయనకు జ్యేష్ఠసోదరుఁడు. ఈవిషయము.

ఉ. భానుతకీర్తి ముమ్మడివిభుండు మదగ్రజుఁడేను వైష్ణవ
ధ్యానసమాహితాత్ముఁడ ననంతసమాఖ్యుఁడ నాదుతమ్ము ల
జ్ఞానవిదూరు లక్కనయు సత్కవి చిట్టనయుం వివేకవి
ద్యానిధిరామచంద్రుఁడు నుదారుఁడు లక్ష్మణనామధేయుఁడున్.

అనుపద్యమువలనఁ దెలియవచ్చెడి. దీనినుండి మఱొకవిశేషము కనుఁగొనవచ్చును. అన్నయగు ముమ్మడన్న గ్రామాధికారియనియు, అనుజులలో మొదటివాఁడయిన యక్కన యగస్త్యభ్రాతయనఁదగినవాఁడనియు, చిట్టన సత్కవియనియు, రామచంద్రుఁడు వేదాంతశాస్త్రపండితుఁడనియు, లక్ష్మణుఁడు బాతయనియుఁ దెలిసికొనఁదగిన విషయములు. పద్యమున యతిప్రాసములకై యట్టివిశేషణము లుపయోగింపఁబడినవనియు, నిట్లు చెప్పుట కవులకు సహజధర్మమనియుఁ గొందఱనవచ్చును. అది యజ్ఞానసంపద్విశేషఫలమని చెప్పుటకన్న మఱి యేమనవచ్చును? తనసోదరుల నిట్టి ఘట్టమునఁ బేరుకొన్న మహాకవి పద్యము కుదురక యిట్లు చెప్పెననుట పరిహాసాస్పదము కాదా! ఏ గీతముననో వచనముననో యట్టిపేరైనఁ జెప్పియుండరాదా.

ఈయన యాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. ఈయాఱువేల నియోగిశాఖయే కవిబ్రహ్మయగు తిక్కనకాలమునందుఁ బ్రాఁకనాఁటి నియోగిశాఖయను కీర్తినొందియుండెను. ఈరెండుశాఖలకు భేదమించు

కంతయుఁ గానరాదు. ఈయనది కౌండిన్యగోత్రము. ఈయన శ్రీనాథునకుఁ బూర్వమున్నవాఁడని కొందఱును, తరువాతివాఁడని కొందఱును స్వేచ్ఛఁగా సిద్ధాంతము చేసియున్నారు. మొదటిదానికిఁ గారణము పూర్వకవిస్తుతిలో నెఱ్ఱనవఱకునున్న కవులనే స్తుతించినందున వారికిఁ దర్వాతివాఁడై శ్రీనాథునకుఁ బూర్వుఁడై యుండవలయుననుట దియే. రెండవవారు నేదోయొక హేతువును జెప్పక మానరు కదా. ఐతే "ఎఱ్ఱయమంత్రినాదిగాఁ జన్నకవీంద్రులఁ." అన్నమాట మొదటివారివాదమును మెడఁబట్టి యవ్వలికి నెట్టునేమో? కవిస్తుతిలో నందఱినెవ్వరును జేర్కొనఁజాలరు. అట్టి యాచారము లేదు.

ఈయనరచించిన గ్రంథములు భోజరాజీయము, *రసాభరణము, ఛందోదర్పణము అనునవి ప్రసిద్ధినొందియున్నవి. భోజరాజీయము అహోబలనరసింహమూర్తికంకితము చేయఁబడినది. తక్కినవి కూడ నరాంకితములుచేయఁబడక విష్ణునామాంకితములై యొప్పారుచున్నవి. భోజరాజీయము విచిత్రకథాకల్పాకరమని చెప్పఁదగినది. ఇందుఁ జక్కని స్వభావోక్తు లలరారుచుండును. పద్యములు కడుంగడుహృద్యములు, అలంకారభూయిష్ఠములు. చచ్చుశృంగారమిందు వర్ణితము కాదు. ధారాశుద్ధి యనర్గళముగఁ బ్రవహించుచుండును. రసాభరణము పేరుచేతనే తదంతర్గతవిషయమును దెలుపుచున్నది. ఈగ్రంథరత్నత్రితయమున భోజరాజీయము తొలుత రచింపఁబడినట్లు ఛందోదర్పణములోని"అనంతధీమణి లసన్మణిభోజచరిత్ర చెప్పిలక్ష్మీనరసింహుఁ గూర్చి" అనుపద్యమునుబట్టి కనుఁగొనవచ్చును.

ఈయననివాసము కృష్ణామండలములోని శ్రీకాకుళమని చెప్పవచ్చును. అని యొకరియూహ.

సీ. విలసితంబగు *కృష్ణవేణామలాపహారిణి భీమరథినాథరిత్రియందుఁ
దనరునదీత్రయాంతర్వేదియగు పావనక్షేత్రమునశోభనములకెల్లఁ
ధరనివాసంబగు పెసమగూరిపురంబునందు విద్వజ్జనానందమైన
జీవనస్థితిచేతఁ జెన్నొందు వంశకర్తృత్వసంపత్తిఁ బ్రభుత్వమొంది

* రసార్ణవమని విజ్ఞానచంద్రికవారు వ్రాసిరి.

* కృష్ణవేణ్ణమలాపహారిణి-అని ముద్రణమునం దగపడియెడి.

తే. నెమ్మిఁ బ్రత్యక్షపరమపదమ్మనంగ
నొప్పు శ్రీకాకుళంబున కొడయఁడైన
యంధ్రవల్లభహరిసేవ నలరుచుండుఁ
బెక్కుభంగుల ముమ్మడి తిక్కవిభుఁడు.

ఈపద్యముంబట్టి నైజాము రాజ్య మీయననివాసమని యింకొకరి యూహ. ఈరెండవయూహ యెట్లున్నదో స్థూణానిఖననన్యాయమున ననుసరించి యూహించెదను.

కృష్ణమలాపహారిణియు బొంబాయి రాజధానిలోఁ గలిసినది. ఇదిపుడు కన్నడ దేశము. కృష్ణయుభీమరథియు నైజాము రాష్ట్రమునందు రాయచూర్ పట్టణమునకుఁ బశ్చిమమునఁ బదారుమైళ్లమీఁదఁ గలిసినవి. ఇది తెలుఁగుదేశమని చెప్పవచ్చును. అని రెండవయూహ సిద్ధాంతము.

నదీత్రయాంతర్వేదియనఁగా మూఁడునదుల మధ్యభాగమని యర్థముచేసికొని పై యూహ తనభావమును వెల్లడిరపఁజాల్లినది. మూఁడునదుల మధ్యభాగమున నొకపవిత్రక్షేత్రముండుట సంభవించునా యనునది యొకప్రశ్నము. రెండునదులకు నడుమ యొకగడ్డ యుండవచ్చు. ఆమూఁడింటిసమాగమమునకు సమీపస్థలమనియర్థము చెప్పఁబూనునేమో? ఇట్లర్థము చెప్పుట రసవంతముగ లేదు. అంతర్వేదియనఁగా మధ్యభాగమని యెట్లర్థమగునో యానదులు కలిసినతావునకుఁ జివరనున్న భాగమనియు నర్థమగును. కాన ఈనదులు కలిసి ప్రవహించుచుండఁగాఁ దత్సమీపముననున్న తావనియు నర్థముకావచ్చును. కాఁబట్టి నైజాము రాజ్యమనుటకన్నఁ గృష్ణామండలాంతర్గత శ్రీకాకుళమనుటయే సర్వవిధముల రసము. జనప్రమాదమీపద్ధతినే యున్నది. కాన విపరీతార్థములను జెప్పఁబూనక యీయర్థము నిప్పటికిఁ జెప్పుట మంచిది,

ఈకృతి యహోబలనరసింహమూర్తి కంకితముచేయఁబడినది. దీనింబట్టి యీయన కిలువేలుపు నరసింహమూర్తియని స్పష్టమగును. అహోబిలము దత్తమండలములని పిలువఁబడుచున్న పశ్చిమాంధ్రమండలములలో నొకటిగఁ బరిగణింపఁబడుచున్న కర్నూలుమండలము

లోనిది. దత్తమండలములలోఁ బోతనామాత్యుని కాలమునఁ బుణ్య క్షేత్రములుగాని కవులనాదరించుఘనులుగాని లేరని ప్రల్లదము లాడుచు గంతులువేయువారీయహోబిలము మఠెక్కడనున్నదందురో యూహింపఁజాలకున్నాను.

ఇక్కవి తనకృతిని బరమేశ్వరార్పణమొనర్చి సుకృతియయ్యెను. ఈమహాకవికవిత్వము రసికమహాజనులకుం గడుంగడు హృద్యము. శైలి సలక్షణమైనది. కొరతుకులు పడక సందర్భశుద్ధి తప్పక యతిప్రాసములకై వ్యర్థపదముల వెదకి పడరానిపాట్లు పడక సహజగాంభీర్యమున నలరారుచుఁ దనపావనతచేనొప్పుచున్నది. అసందర్భములగు వర్ణనాదులిందు లేవు. ఏపద్యమును చదివినను శ్రవణముల కత్యంతానందము నిచ్చుచుండును.

గ్రంథమునంతయు నేతన్ముద్రణమున నేఁ బరిశీలింపనందునఁ బ్రమాదములివియని వ్రాయఁజాలను. శైలి యిట్టిదని కనఁబడుటకై యొక్క పద్యమునే యుదాహరించి విరమించెదను.

శా. అంభోరాశిగభీరుఁ డూర్జితయశోహారుండు ధర్మక్రియా
 రంభస్వాంతుఁడు నీతిమంతుఁ డసిధారాతీర్థనిర్మూక్తసం
 రంభారాతిబలుండు భూరిబలుఁడై రాజ్యంబు చేసెన్ మహీ
 గాంభోజక్షితినాథుఁ డున్నతబహూత్సాహాథుఁ డత్యున్నతిన్.

ప్రతిపద్యము ఒక్కొక్కవిధమున మెచ్చఁదగినది. వానిం బఠించినఁ గాని యాశ నివర్తింపదు. నీతిసారమగు నీప్రబంధమెల్లరకుం బరనార్థమయి వేదమువలెఁ బవిత్రతను గల్పించునదియని చెప్పి కృతకృత్యుఁడనగుటకన్న హెచ్చుగ నిపుడు వ్రాయఁదగినవిషయమేమియు లేదు. అభిప్రాయభేదములను బండితులు మన్నింపఁగలరు.

ఇట్లు పండితపాదసేవకుఁడు,
జనమంచి శేషాద్రిశర్మ.

రెండవకూర్పు

# పీఠిక

## భోజరాజీయ భూమిక

శ్రీమదాంధ్రసారస్వతమునఁ గవిత్రయముతరువాతఁ బేరెన్నికఁ గన్నవారిలో అనంతామాత్యుఁ డొకఁడు. ప్రతిభావ్యుత్పత్తుల ననుసరించి షడ్విధశ్రేణులకుఁ జెందినట్లు పరిగణింపఁబడిన యావదాంధ్రమహాకవులలో అనంతామాత్యుఁడు తృతీయశ్రేణికిఁ జెందినట్లు శబ్దరత్నాకరమున నిర్ణయింపఁబడియున్నది. అనఁగా నీతఁడు ప్రథమశ్రేణికిఁ జెందిన కవిత్రయమునకును నాచనసోమునకును, ద్వితీయశ్రేణికిఁ జెందిన శ్రీనాథపోతన సూరనార్యాదులకును దక్కువవాఁడనియు, ధూర్జటి, పినవీరభద్రుఁడు, ముక్కుతిమ్మన, రామరాజభూషణుఁడు, భాస్కరుఁడు కేతన మున్నగు వారితో సమానప్రతిభాయుతుఁడనియు నుద్దేశ్యము.

ఈతనికాలమున కాంధ్రమున భారతాంధ్రీకరణము పూర్తియగుటయు ననేకము లగునుత్తమకావ్యములు బయలువెడలుటయు జరిగినది. రంగనాథభాస్కరరామాయణములు విరచింపఁబడినవి. నన్నిచోడుని కుమారసంభవము, కేతన దశకుమారచరిత్రము, మంచన కేయూరబాహుచరిత్రము, నాచనసోముని యుత్తరహరివంశము, జక్కన విక్రమార్కచరిత్రము మున్నగునవి బహువిఖ్యాతి నార్జించినవి. అం దనంతామాత్యునకు సమకాలికుఁడైన జక్కన రచించిన విక్రమార్కచరిత్ర మద్భుతకథావిధానమై పలువురతోఁబాటు మన యనంతామాత్యుని నాకర్షించినది. విక్రమార్కుఁడు లోకోత్తరపురుషుఁ డగుటయు జక్కన కవిత్వము మృదుమధురమగుటయు నొకదాని కొకటితోడై బంగారమునకుఁ దావి యబ్బినట్లయి రసికహృదయములను విక్రమార్కచరిత్రము చూఱఁగొన్నది. విద్యాభిమానులగు పాఠకులును నద్భుతకథాశ్రవణలోలురై యింక నట్టి యపూర్వకథాసంవిధానము కలగ్రంథములఁ కెదురుచూడఁ దొడఁగిరి. ఈసమయముననే యనంతామాత్యుఁడు

బయలుదేఱి ప్రజాహృదయమునెఱిఁగి మఱియొక లోకోత్తరపురుషుని చరిత్రము వ్రాయసంకల్పించెను. ఆతని దృష్టికి భోజమహారాజు పొడ సూపెను. విక్రమార్కునివంటి సుప్రసిద్ధమహాపురుషుఁడే యాతఁడును.

"చర్చింప రెండవచంద్రుఁడు మూఁడవ
యశ్విని నాలవ యగ్నిదేవుఁ
డైదవ లోక పాలాఖ్యుఁడాఱవ పాండు
సంతాన మేడవ చక్రవర్తి
యెనిమిదవ మహర్షిజనసత్తముఁడు తొమ్మి
దవ భోగిపతి పదియవ విరించి
పదునొకండవ చక్రపాణి పండ్రెండవ
శూలి పద్మూఁడవ సూర్యుఁడనఁగఁ
దనరుఁగాంతి రూపమునఁ బ్రతాపమున స
త్యమున ధర్మచరిత నాజ్ఞ శుచిని
భూరి సత్త్వమునఁ బ్రబుద్ధతఁ గలిమిని
భూతిఁ దేజమునను భోజవిభుఁడు."

అట్టి లోకోత్తరపురుషుఁడగు భోజభూపతి సూత్రకథఁ దీసికొని తన యపూర్వమేధాసంపద్విలసితమధురకథానికరముఁ గూర్చి యనంతా మాత్యుఁడు రచించినదే యీభోజరాజీయము.

## కవివంశము-కాలము

అనంతామాత్యుఁడు కౌండిన్యసగోత్రుఁడైన నియోగిబ్రాహ్మ ణుఁడు. కవిబ్రహ్మ యగుతిక్కనకు సమకాలికుఁడై యాతనిచే భవ్య భారతి యను బిరుదందిన భైరవామాత్యుఁ డీతనిముత్తాత. పరమభాగవత విభాసితుఁ డగు మమ్మడి ప్రెగ్గడ యీతనితాత. శ్రీకాకుళాంధ్రవల్ల భుని సేవచేసి స్థిరకీర్తి నార్జించిన తిక్కన్న యీతని తండ్రి. గుణగౌరవ శోభిని యగుమల్లమాంబ యీతని తల్లి. తిరుమల గోవిందచక్రవర్తి యీతని గురువు. ఈతఁడు సుప్రసిద్ధ వంశమునకుఁ జెందినవాఁడగుట నీక్రింది వంశవృక్షము దెలుపుచున్నది.

## కౌండిన్యగోత్రము

నందన్న × లక్కమ్మ

సత్యసమంత్రి × తాతమ్మ — త్రిపురాంతకుఁడు × మారమ్మ

సత్యసమంత్రి × తాతమ్మ:
బయ్యన్న × ప్రోలమ్మ. నందన్న తిక్కన్న
(భైరవామాత్య)

బయ్యన్న × ప్రోలమ్మ:
గంగన్న × కామమ్మ. ముమ్మడన్న × ఎఱ్ఱమ్మ

గంగన్న × కామమ్మ: పెద్దన్న అప్పలన్న.
ముమ్మడన్న × ఎఱ్ఱమ్మ: తిక్కన్న × మల్లమ్మ† సింగన్న × శోభళాంబ *

తిక్కన్న × మల్లమ్మ:
1. ముమ్మడన్న
2. అనంతయ్య యీ గ్రంథకర్త
3. అక్కన్న
4. చిట్టన్న
5. రామచంద్రుఁడు
6. లక్ష్మణుఁడు.

త్రిపురాంతకుఁడు × మారమ్మ:
1. దేవన్న
2. నందన్న
3. కొమ్మన్న
4. సూరన్న
5. మంచన్న
6. తిక్కన్న

* * *

## శ్రీవత్సగోత్రము

అక్కయ్య × అక్కమ్మ

†మల్లమ్మ అయ్యలన్న చిట్టన్న తమ్మన్న

* * * *

## భారద్వాజగోత్రము

సింగన్న × అన్నమ్మ

* శోభళాంబ సారన్న మారన్న సింగన్న వల్లభన్న

శోభళాంబ:
సింగన్న చిట్టన్న ముమ్మడన్న సింగన్నశౌరి తిరువేంగళ సింగరన్న

అనంతామాత్యుఁడు తనవంశజుల గుణగణముల నధికముగా శ్లాఘించి తనవంశగౌరవము నినుమడింపఁ జేసికొనినాఁడు.

అనంతామాత్యుఁడు తన్నుగుఱించి "యేను వైష్ణవధ్యాన సమాహితాత్ముఁడ" "బుధచకోరచిత్తప్రియుఁడ, వీతకళంకుఁడ, కళోపేతుఁడ, నిర్ధూతదురితపృథుతిమిరుఁడ" ననియు,

"నరహరి చరణసరోజ
స్మరణామృతపాన సతత సంతుష్టాంతః
కరణుఁడ సంతత వాణీ
వరప్రసాదానులబ్ధ వాగ్విభవుండన్."

అని యాత్మనివేదనముతోఁ బాటు తాను నృసింహభక్తుఁడని తెలుపు కొనినాఁడు. అగుటచేతనే తనకావ్యరమును శ్రీనృసింహదేవునకే యంకిత మిచ్చి తన భక్తి విశ్వాసములఁ బ్రకటించి యున్నాఁడు.

అనంతామాత్యుఁడు తనకాలమును గుఱించి తాను రచించిన రసాభరణమున నిట్లు పేర్కొనియున్నాఁడు.

"ఆనొందన్ శకవర్షముల్ ఋతుశరజ్యాలేందులై యొప్ప న
య్యానందాబ్దమునందు మాఘమునఁ గృష్ణైకాదశీభౌమ యు
క్తానామామృతవేళ నీకృతి యనంతాఖ్యుండు సమ్యగ్రస
శ్రీనిండఁగ ధ్రువపట్టణాధిపున కిచ్చెఁ భక్తిపూర్వంబుగన్."

అనఁగా శాలివాహనశకము ౧౩౫౬ వ సంవత్సరమున నానంద సంవత్సర మాఘ బహుళైకాదశీ భౌమవారమునఁ గృతి నిచ్చినట్లు స్పష్టము. దీనికి సరియైన క్రీస్తు వత్సరము ౨౫-౧-౧౪౩౫ ఛందోదర్పణమునకుఁ బూర్వమే భోజరాజీయమును దాను రచియించినట్లు తన ఛందోదర్పణ మున నిట్లు చెప్పకొనియున్నాఁడు.

"శ్రీనిధి చక్రవర్తి గురుశేఖర పుణ్యకటాక్షలబ్ధ సు
జ్ఞానుఁ డనంతధీమణి లసన్మణి భోజచరిత్ర చెప్పి ల
క్ష్మీనరసింహుఁ గూర్చిన ప్రసిద్ధుఁడు వేడుకతో నొనర్చె ఛం
దోనుతి యోగివృద్ధికుల త్రయజవర్తి కనంతమూర్తికిన్."

వీనినిబట్టి యనంతామాత్యుఁడు భోజరాజీయము క్రీ. శ. ౧౪౩౦ ప్రాంతమున విరచించి యుండవచ్చును. కావున, ననంతామాత్యుఁడు పదునైదవశతాబ్దారంభము వాఁ డగుట నిర్వివాదాంశము.

## భోజరాజీయము : విషయము

భోజరాజీయమునందలి ప్రధానకథాభాగ మిది. తొల్లి మహుఁ డను కాంభోజరాజు కుష్ఠరోగపీడితుఁడై విసిగి వేసారి గౌతమీనదిలోఁ

దన శరీరము విడిచివేయ సంకల్పించి బయలుదేఱి పోవుచుండెను. గౌతమి యీ విషయము నెఱిఁగి స్త్రీరూపమును ధరించి వాని కెదురై వాని కార్య మడుగును. ఆతఁడు దనమరణోద్యోగము చెప్పును. హేయ మగు నాతనిశరీరమును దాను సహింపనోపక దత్తాత్రేయుఁడను మహర్షిని సేవించుచో నాతనిరోగము హరించునని చెప్పి మహాని తద స్వీప ణమునకు మరల్చి యామె వెడలిపోవును. మహుఁడును దత్తాత్రేయుఁ గనుఁగొని యాతని సేవించి యాతనికటాక్షమున రోగవిముక్తుఁ డగును. పిమ్మట మహుఁడు దత్తాత్రేయుని నివాసస్థానములగు శ్రీరంగము, హేమ కూటము, ప్రయాగక్షేత్రముల మాహాత్మ్యమును దెలుపుమని కోరును. దత్తాత్రేయుఁడును శ్రీరంగమహత్త్వ ముగ్గడించి హేమాద్రి ప్రాశస్త్య మును వక్కాణించి ప్రయాగమాహాత్మ్యము దెలుపు సందర్భమున భోజుని పూర్వజన్మ వృత్తాంతముఁ జెప్పును. భోజుఁడు పూర్వజన్మమున ద్విజుఁడై పుట్టి దారిద్ర్యదుఃఖపీడితుఁడై తీర్థయాత్రలు చేసికొనుచుఁ బ్రయాగతీర్థమున నిష్టకామ్యసిద్ధికై మరణించి పునర్భవమున భోజ రాజయి జన్మించును. ఆతఁడు రాజ్యముచేయు చొకనాఁడు వేఁటకై యరణ్యమున కేఁగినపు డందు సర్పటియను సిద్ధునిఁ గాంచి వానిని బ్రార్థించి తనగృహమునకుఁ దీసికొని పోవును. ఆతఁడొకనాఁటి యర్ధ రాత్రమునఁ దన ధూమవేధి విద్యకతమున భోజుని కొలువుచవికె స్వర్ణ మయముచేసి యెందేనిఁ జనుటవిని మఱునాఁ డావిషయము నెఱిఁగి భోజుఁ డొక కృతకమతమున నాతనిరావించును. తనకడ శబ్దభేది యను విద్య గలదని దానిని సర్పటికి బోధింతునని యసత్యమాడి యాతని విద్య నపహరించును. సర్పటి యలిగి భోజుని ప్రార్థనమున నాశాప మాతఁడు తుదకుఁ గ్రమ్మరించును. అంత భోజుఁ డాతనిఁ దనయింట విందునకుఁ బిల్వ నాతఁ డంగీకరింపఁడు.

## అగస్త్య వసిష్ఠుల కథ

భోజుఁ డంత నరుంధతీ వసిష్ఠు లగస్త్యునిఁ బూజించి యాతిథ్య మిచ్చుట యనుకథ చెప్పి నిరాహారి సదా బ్రహ్మచారి యగునగస్త్య వసిష్ఠుల మాహాత్మ్యము నుగ్గడించును. ఐనను సర్పటి వినక పంచభిక్షు మహత్త్వ మును దెలుపుకథ చెప్పును.

### దుష్టసతి, సత్పతుల చరిత్రము

దుష్టసతి గలయొక సత్పతి రహస్యముగాఁ బంచభిక్షుఁగొను యోగికి వేఁడి పాయసము చెప్పుగూడలోఁ బెట్టి యాతిథ్యమిచ్చిన కారణమున నాతఁడు మరణించిన పిదప స్వర్లోకమునందియు వేఁడి పాయసము తోలు తిత్తిలోని దనుభవింపవలసివచ్చెను. అతఁడు మొఱవెట్టఁగా నింద్రుఁడు కర్మఫలమనుభవింపక తీరదని యొకకథ చెప్పెను.

### మంటిముద్ద యోగికిఁ బెట్టినస్త్రీ కథ

ఒకస్త్రీ భిక్షుకువచ్చిన యోగిఁ గామించి యెడలు తెలియక యొక మంటిముద్ద నతనికి దానముచేయును. దాని ఫలితముగా నామె మరణించిన పిదప స్వర్గమునకేఁగి యొకమంటికొండఁ దినవలసివచ్చెను. ఆమె యార్తయై యింద్రునిఁ బ్రార్థింపఁగా నాతఁడు గరుణించి యొకజన్మము నిచ్చెను. ఆజన్మమున నామె స్త్రీయైపుట్టి యొకయోగిచేఁ దరణోపాయ మెఱిఁగి వారవనితరీతి మెలఁగుచుఁ బతివ్రతయైయుండి తన్నుదూషించు వారికిఁ దనపాపము పంచియిచ్చుచుండును.

### చండాల దంపతుల చరిత్రము

ఇట్లుండ నొకనాఁ డొకచండాలాంగనభర్త యామెను దూషింపఁ బోవ నాచండాలాంగన యాతని ధిక్కరించును. అదివిని యాస్త్రీ చండాలాంగనకు మ్రొక్కి యామె చరిత్రముఁ దెలుపుమని ప్రార్థించును. అంతఁ జండాలాంగన యిట్లు చెప్పెను. తామిరువురుఁబూర్వజన్మమున బ్రాహ్మణులైయుండి యొకనాఁడు భిక్షుకువచ్చిన యోగికి భుక్తశేషాన్నము భర్త నానతిఁ బెట్టఁ బోవ నాతఁడు వారు చండాలురై జన్మింపుఁడని శపించుటచే నట్లు పుట్టితిమనియు నాయోగి చెప్పిన శాపవిముక్తకాల మదియే యగుటఁ దరించితి మని చెప్పి యాదంపతులు వెడలిపోయిరి. విప్రకాంతయుఁ బాపవిముక్తయై పోయెను.

ఈకథ చెప్పిన నాబ్రాహ్మణుఁడు తృప్తినందక జన్మాంతర మిమ్మని యింద్రునిఁ బ్రార్థింప నాతఁడు గరుణించును.

## అతిథిపూజాప్రభావము

ఆ బ్రాహ్మణుఁడు పునర్భవమున ననేకవిధముల నన్నమహాదానము చేసి యతిథిపూజాప్రభావముచేఁ బాపవిముక్తుఁడై స్వర్గతుల నందఁగనెను పిమ్మట సర్పటిభోజన కథితిపూజావిధి వివరించుట కొకకథ చెప్పును.

## పుష్పగంధి చరిత్రము

తొల్లి కళింగదేశమున పుండరీక పురాధిపతియగు సంపాతికి దుష్టగ్రహకూటమునఁ బుష్పగంధి యనుకూఁతు రుదయించును. ఆమెఁ బరిణయమైన యాతఁడు బ్రహ్మరాక్షసుని వాతఁబడునని బ్రాహ్మణులు చెప్పిరి. ఇట్లుండఁ బుష్పగంధి పెరిగి పెద్దదై పూఁదోట విహరించుతరి మాళవదేశాధిపుని కుమారుఁడు రత్నమండనుఁ డామెను వలచి యే యిక్కట్టులకైన సహింతునని వివాహమాడును. బ్రాహ్మణులు దీవనలిచ్చి, తమమాట వ్యర్థము కాదందురు. వివాహమైనతరువాత నొకనాఁడు రత్నమండనుఁడు పరిసరకాంతారమున నుండఁగా నొక బ్రహ్మరాక్షసుఁ డాతని మ్రింగఁబోవును. రత్నమండనుఁ డొకపరి గృహమున కేఁగి రాని మ్మని ప్రార్థించుచు నాతనికి గోవ్యాఘ్రముల కథఁ జెప్పెను.

## గోవ్యాఘ్రసంవాదకథ

ఒకవిప్రుని గో వొకనాఁడడవిలో మేయుచుండఁగా నొక వ్యాఘ్రి మాగోవును మ్రింగఁగోరును. ఆగోవు దనబాలు నొకసారి చూచి వచ్చుటకుఁ బంపుమని ప్రార్థించును. వ్యాఘ్రి మెట్లునమ్ముట యని యొకకథఁ జెప్పును.

## చాకితచేఁ జెఱుపఁబడిన మునికథ

ఒకముని యొకచోఁ దపస్సు చేయుచుండఁగా నొకచాకిత బలవంతముచేసి వానితో రమించును. ఆముని పశ్చాత్తాపపడియుఁ దత్కారణమునఁ బునర్భవమున నొకపందియై జన్మించును. ఐనను దనభక్తి భావము విడువనికారణమున నీచజన్మమువై రోఁతఁగలిగి పందిజన్మము కలుగకపూర్వమే తన శిష్యుఁబిలిచి తా నొకపందికి జన్మింపఁగనే గుర్తుఁ దెలిసి వెంటనే చంపివేయుమని చెప్పియుంచెను. అట్లాతని శిష్యుఁడు చేయఁ

జూడ దేహవాసన కలిగిన యాపందిరూపియగు ముని ప్రాణములపైఁ గల తీఁపిచేఁ జంపవలదని కోరి యట్లే యుండెను. తుదకు విష్ణుమూర్తి యాతనికిఁ బ్రత్యక్షమై యుత్తమలోక మొసఁగెను. అట్టి మునీశ్వరుఁడే పందియైపుట్టికూడ చావ నిచ్చగింపలేదు. నీవు తిరిగివత్తువా యనఁగా గో వొకకథ చెప్పును.

## సత్యవాక్యమహాత్మ్యము (మదనరేఖ కథ)

పూర్వము మగధదేశాధీశుఁడగు శంబరునకు మదనరేఖ యను కూఁతురును పావకలోముఁడను కొడుకును గలరు. వారిరువు రొక గురువునొద్ద విద్యాభ్యాసపరు లయియుండఁగా నొకనాఁ డాగురు పుత్త్రుఁ డొంటరిగనున్నపుడు మదనరేఖను గలియఁ గాంక్షించును. ఆమె యెన్ని చెప్పినను వినక యాతఁడు మూర్ఛపోఁగా మదనరేఖ బ్రహ్మహత్యాదోషము కలుగునని భయపడి తనవివాహమైనపిదప భర్త నొప్పించి యాతనికోర్కె దీర్తునని యూరడించెను. కొంతకాలమున కామె శంత్రియను రాకుమారుని వివాహమై ప్రథమసంగమము నాఁటిరాత్రి తనగురుపుత్త్రున కిచ్చిన వాగ్దానముచెప్పి యట్లు చేసి వచ్చెదననఁగాఁ దుదకాతఁ డంగీకరించును. గురుపుత్త్రునికడ కేఁగుచుండ దారిలో నొక రాక్షసుఁ డామెను మ్రింగఁబూనును. ఆమె యచంచలయై గురుపుత్త్రుని కోర్కె దీర్చివచ్చెదనని యాతని నొడంబఱచి పోవును. గురుపుత్త్రుఁడు మరులువీడి యామె సత్యవాక్యపాలనమున కాశీర్వదించి పంపును. ఈసంగతివిని యారాక్షసుఁడును బశ్చాత్తప్తుఁడై యామె పాదములఁ బడ వారి సత్యనిష్ఠకు విష్ణువు ప్రత్యక్షమై వరము లొసంగును. మదనరేఖ చిరకాలము భర్తతో సుఖించి పరమపదము చేరును.

## పావకలోముని చరిత్రము

పులి యామదనరేఖ సోదరునికథఁ జెప్పుమన గోవు చెప్పును. పావకలోముఁడు కుంభియను కంసాలివానితో నజవత్తునగరంబున కరిగి మత్స్యయంత్రము నేసి యనుమతి యనువాతని కూఁతునందియుండఁగా వనమున మాయోపాయమున వారిని విడఁదీసి తానా యనుమతిఁ గొనిపోవుచుండ నొక బ్రహ్మరాక్షసుఁడు కుంభిఁ దఱిమి యనుమతి నెత్తుకొనిపోవును.

పావకలోముఁడు తుద కాలాక్షునిఁజంపి యనుమతిఁ దెచ్చుచుండఁగాఁ గుంభి మరల మాయోపాయమున నామెఁ దీసికొని యజవక్త్రుని కడకేఁగి తానే మత్స్యయంత్రము నేసితినని చెప్పును. అనుమతి యంగీకరింపక పోవుటచే వివాహము చేయకుండఁ దండ్రి యట్లేయుంచును. ఒకనాఁడు పావకలోముఁడు నిజనగరమున నీవిషయమొక యోగినిచే విని రాఁగాఁ గుంభి వాని కాలుచేతులు నఱకించెను. చెరువతోఁట వాఁడొకఁ డాతనిఁ బెంచుచుండఁగాఁ బార్వతీ పరమేశ్వరులువచ్చి వలసినప్పు డాతనికిఁ గాలు చేతులు వచ్చునని యంతర్హితులగుదురు. అనుమతి తల్లితోఁ గూడ నటకువచ్చి యాతఁడే తనభర్తయని తెలుపును. తుదకుఁ బావకలోముఁడే యామెభర్తయని యంద ఱంగీకరింతురు. అపుడు సంతసించి యుభయు లకు వివాహముచేయుదురు. కుంభినిఁ గరుణించి పావకలోముఁడు చంప నీయక యూరు వెడలఁ గొట్టుట కంగీకరించును. అనుమతి తల్లి యల్లుఁడు కాలుసేతులు లేనివాఁడని విచారింపఁగా నజవక్త్రుఁడు విధికృతము తప్పింపవీలులేదని సుశీల యనుకన్యకాచరిత్రము నామెకుఁ జెప్పును.

## సుశీలచరిత్రము

సౌవీరాధిపతికూఁతురు సుశీల యనునామెను దన మేనల్లునకిచ్చి పెండ్లిచేతునని తండ్రియుఁ దన యన్నకొడుకునకిచ్చెదనని తల్లియు విరోధించిరి. విష్ణుమహేశ్వరు లొకనాఁ డీవిషయమెఱిఁగి యందెవరికామె భార్యయగునని బ్రహ్మనడుగుదురు. వారిరువురకుఁగాక యొక పిచ్చుకుంటునకామె భార్యయగునని చెప్ప విష్ణువది పరీక్షింపనెంచి గరుడునిఁ బంపి యాపిచ్చుకుంటును సముద్రమునకవతల నొక వనమున విడియిం చును. తుదకు గరుడుఁ డొక బోనపుటిక నాతనికడ విడువ నందు సుశీల దాఁచఁబడియుండి తానుజూచిన యాపిచ్చుకుంటునే పరిణయమగును. త్రిమూర్తులుఁ బ్రత్యక్షమై వారికి వరము లొసఁగుదురు.

తరువాతఁ బావకలోముఁ డిచ్చించి కాలుసేతులందఁగా నందఱు నానందింతురు.

ఈకథ విని వ్యాఘ్రియంపఁగా గోవు గృహమునకేఁగి పుత్రుఁదనిపి తిరిగిరాఁగా వ్యాఘ్రి మాగోవు సత్యవాక్యపరిపాలన కానందించి చంపక విడుచును, విష్ణుమూర్తి ప్రత్యక్షమై వరములిచ్చును.

రత్నమండనుఁ డీకథలు చెప్పఁగా బ్రహ్మరాక్షసుఁ డంగీకరించును. రత్నమండనుఁ డింటికేఁగి సత్యవాక్యము దప్పక తిరిగి బ్రహ్మరాక్షసుని కడకేగఁ బుష్పగంధి బుద్ధికుశలతచే భర్తను సంరక్షించును. ఇట్లు బ్రాహ్మణాశీర్వచనముచే నాతఁడు రక్షింపఁబడుట సర్పటి భోజునకుఁ దెల్పును. మఱియు నన్నదానప్రభావముఁ దెల్పునొక కథ చెప్పును.

## అన్నదానపరుఁడగు విప్రుఁడు, నాతని వదినెల కథ

ఒక బ్రాహ్మణునకు ముగ్గురుకొడుకులు కలరు. వారిలోఁ దృతీయుఁడు నిరతాన్నప్రదాత. తలిదండ్రులు చనిపోయినతరువాత సోదరులు కలిసియుందురు. తృతీయుని కీర్తి విని యాతనివదినెలు భర్తలకు నూరిపోసి వేరుకాఁపురము లేర్పరింతురు. ఐనను, దృతీయుఁ డన్నదానపరుఁడై కీర్తిగాంచును. అన్నలిరువురు నైశ్వర్యహీనులై దరిద్రులగుదురు.

ఆవిప్రుఁ డొకనాఁ డన్నదానఫలమును జెప్పుమని యతిథుల నడుగఁగా వారు చెప్పలేక కాశీయన్నపూర్ణయే చెప్పఁగల్గునందురు. అంత నాతఁడు కాశీయాత్రకు బయలుదేఱి భార్యకు హితముచెప్పుచు నల్పాహార మతిథుల కిడరాదని యొకకథ చెప్పును. తరువాత నాతఁడు కాశి కేఁగ విష్ణుమూర్తి యాతనిభార్యఁ బరీక్షింపనెంచి వృద్ధబ్రాహ్మణరూపమున రాఁగా నింటనున్న కొలఁదిబియ్యమువండి యాతనికిడఁ గొందఱు సద్బ్రాహ్మణులువత్తురు. వారి కామె చేటతో యిసుక చెరిగి వండఁగా నన్నమగును. అది వారికిఁ బెట్టును. విష్ణువు స్వస్వరూపమునఁ బ్రత్యక్షమై యనేకవరము లొసఁగిపోవును.

## వ్యాధునికథ

ఆవిప్రుఁడు కాశికేఁగుచు దారిలో నొకచర్మకారుంగని యాతఁడు తనను గంగకు జ్ఞాపకముచేయుమన నట్లేయని వెడలును. కాశిలో గంగనుగని యాతఁ డన్నదానఫలమును జెప్పుమన నొక రాజశిశువు చెప్పఁగలదని యామె యాతనిఁబంపును. ఆతఁడొక యరణ్యమునఁ బోవుచుండఁగా దారితప్పును. ఒక వ్యాధుఁ డాదరించి యాతనికిఁ బప్పులుఁబెట్టి యాదరించును. నాఁటిరేయి వ్యాధుఁడు పులివాతఁబడి

మరణించును. ఆతఁడే తా నా బ్రాహ్మణునకుఁ జేసిన యతిథిపూజా ప్రభావమున రాజకుమారుఁడై జన్మించి యావిషయ మా బ్రాహ్మణున కెఱింగించును. ఆ విప్రుఁడు తిరిగి గంగయొద్దకువచ్చి యొక మాదిగవాఁ డామె నడిగె ననిచెప్పి యాతనివృత్తాంతముఁ దెల్పుకొనును. గంగ చెప్పును.

మాదిగవానికథ

తొల్లి యొక కర్కటి బిడ్డలఁ గాంచి యందొక బిడ్డనికి గంగా ప్రభావము మాటలసందర్భమున నుగ్గడింప నాతఁడు కుతూహలియై గంగాస్నానమున కేఁగుచుండ దారిలో నొక ఖగము వానిఁదినివేయును. ఆ కర్కటిబాలుఁడే మఱుజన్మమున నొకయాంధ్రదూడయైపుట్టి యాతరు వాతిజన్మమున వంజరుఁ డనురాజకుమారుఁడై జన్మించును. పూర్వజన్మ లభ్యమగు గంగాస్నాన కుతూహలమున నతఁడేఁగ నాతనితండ్రి పుత్ర వ్యామోహముచే మరణించును. అట్లాతని కొకశాపముఁగలదు. వంజ రుఁడు బ్రాహ్మణవచనముల నింటికివచ్చి పితృక్రియలు నెఱవేర్చి తపో వృత్తినుండును. ఇంద్రునిపంపున బ్రహ్మయు నారదుఁడువచ్చి యూ యో పాయమున వంజరుని గంగను భూమికిఁ దెచ్చునట్లు తపముచేయఁజెప్పి వెడలిపోవుదురు. వంజరుఁ డీశ్వరునిగుఱించి తపముచేసి విష్ణునిఁగొల్చి గరుత్మంతుని వాహనముగాఁ గొని గంగను భూమికిఁ దెచ్చును. ఇట్లు కృతకృత్యుఁడై రాజర్షియైయున్న వంజరుఁడు తీర్చినతగవునకుఁ గినిసి కొందఱతని శపింతురు ఆశాపకారణమున నీతఁ డొకస్త్రీకి పతియై, తోఁబుట్టువై శిశువై పెరుగును. ఈతనిభార్య శాపమూలమున నీతఁడు మాదిగవాఁడై జన్మించును. భార్యయు నీతని ననుసరించును. ఇట్లు చండాలురైన వంజరదంపతులనే యన్నదానపరుఁడగు బ్రాహ్మణుఁడు చూచును. అంత వంజరదంపతులు శాపవిముక్తినంది ముక్తినందుదురు.

ఇది విని విప్రుఁడును దనగ్రామమునకేఁగి భార్యతో సుఖముండును. అని సర్పటిసిద్ధుఁడు భోజున కన్నదానమాహాత్మ్యముఁ దెల్పును. పిమ్మట నాతఁడు భోజుని దృప్తిపఱుప నాతనియింట వ్రతభంగముకాన ట్లన్నము దిని యథేచ్ఛముగాఁ జనును. భోజుఁడు పుత్త్రపౌత్త్రాభివృద్ధిగా రాజ్య

మేలి విఖ్యాతిగాంచును. అని దత్తాత్రేయమహర్షి మహానకుఁజెప్పి వెడలిపోయెను.

కావున నే,

"సూత్రకథ భోజరాజ చ
రిత్రము యా నడుమ ధర్మరీతుల్ నీతుల్
చిత్రకథలై తలిర్పఁగ
శ్రోత్రసుఖముగా నొనర్పఁ జొప్పడియుండున్.

అని యనంతామాత్యుఁడే తెలుపుకొనియున్నాఁడు. ఆకారణమున నీకావ్యము వస్త్వైక్యము కలిగి యన్వర్థనామభాజకమైనది.

కథాసంవిధానము - నవీనత

భోజరాజీయమును గవి 'నూతనం బయ్యుఁ బురాతనకృతు లట్ల సంతతశ్రవ్యమై జరగు ననియు' 'వివిధకథానూత్నరత్నభూషణాభి రాము మనియు 'నుదాత్త సుకృత భోగ విశ్రుత సునీతిపథాయత్తంబై క్రొత్తగదే' యనియుఁ జెప్పికొనియున్నాఁడు. అగుట నిందలి కథాభాగములు నూతనకల్పితములే కాని పురాతనములు కానట్లు స్పష్టము.

కాని కొన్ని కథాభాగములు పురాణకథానుకరణములై కావ్య ప్రాశస్త్యమునకుఁ గొంతకారణభూతమైనవి. భారతమునందలి సదా బ్రహ్మచారి, నిత్యోపవాసి యనువాని నిర్వచనము ననుసరించి యిందుఁ గడునిపుణతతో నగస్త్యవసిష్ఠులకథ వివరింపఁబడినది. పావకలోముఁడు మత్స్యయంత్రము నేసి యనుమతి నొందిన కథాభాగము మత్స్యయంత్రము నేసి ద్రౌపదిఁ బరిణయమైన భారతార్జున కథానుకరణముగ నున్నది. ఉత్తమగుణవిరాజితుఁ డగుపావకలోముఁడు కాలుసేతులు నఱుకఁబడిన కథ సారంగధరకథను బోలియున్నది. పందిజన్మము నెత్తిన మునికథ ముని లేడియైపుట్టిన భారతోపాఖ్యానమున కనుకరణముగాఁ దోఁచును. వంజరుఁడుగంగను భూమికిఁ దెచ్చినకథ గౌతముఁడు జాహ్నవిని భువికిఁదెచ్చినకథ కనుకరణము. ఇట్లే కొన్ని కథాభాగములకు మాత్రము పురాణ కథానుకరణములు కానవచ్చు చున్నవి. మిగిలిన కథా భాగములు నీకథాభాగమున కొనర్చిన మార్పులు నద్భుతములై

యనంతామాత్యు నద్వితీయ కథా సంవిధాన చతురతను వేనోళ్లం జాటుచున్నవి.

మహాప్రతిభాకల్పితము లగు నిందలి కథాభాగములు 'ప్రశస్త ధర్మోపదేశము' లగుట విశేషములకెల్ల విశేషము. ఇం దేకథాభాగ మరసినను మహా ధర్మప్రతిపాదకమై సునీతిపథాయత్తమై పాఠకమానసముల నానందముగ్ధములనుగాం జేయుచుండుట యనంతామాత్యుని కావ్యపరమార్థదృక్పథమును వ్యక్తీకరించుచున్నది. రోగభూయిష్ఠుండగు మహానిచత్రము, మాధుకరప్రభావమును గుఱించిన దుష్టసతి, సత్పతి కథ, యోగికి మంటిముద్ద పెట్టిన యామె చరిత్ర, సుశీల చండాల దంపతులచరిత్రము మున్నగుకథలు "అవశ్య మను భోక్తవ్యం కృతంకర్మ శుభాశుభ" మ్మను నార్యోక్తికిం దార్కాణములై యల రారుచున్నవి. పుష్పగంధిచరిత్ర, మదనరేఖమహత్త్వము, అనుమతి ప్రభావము మున్నగుకథలు పరమ పాతివ్రత్యప్రభావమును వేనోళ్ల శ్లాఘించుచున్నవి. మఱియు, నతిథి పూజాప్రభావము, సత్యవాక్యపరిపాలనామహత్త్వము, నన్నదానమాహాత్మ్యము మున్నగు సద్ధర్మముల యుత్కృష్టత యద్భుతముగా నుద్ఘోషింపఁబడినది. ఇట్లు దాన ధర్మ సత్యముల ప్రభావ మనంతముగా వివరింపఁబడినట్లే యధర్మము, నన్యాయము, నసూయ మున్నగుదుర్గుణము లెట్టి యిక్కట్టులం గొనితెచ్చి నవియుం దెలుపుటకు - కుంభిచరిత్రము, విప్రుని పదినెలకథ మున్నగు నవి సాక్షీభూతము లగుచున్నవి. అన్నిటికన్న మిన్నగా మహారాత్ముని హృదయము, మహాక్రూర మగు వ్యాఘ్రిముమానసము, మహా కామాంధుని మనస్సు మార్చివేసి మహోన్నతపరివర్తనమును గొని తెచ్చిన సత్యవాక్యవిజయ మీకావ్యమున నద్వితీయముగా నద్భుతముగాం గొనియాడఁబడినది. గోవ్యాఘ్రసంవాదకథ, పావకలోముని చరిత్రము, పుష్పగంధివృత్తాంతము నాచంద్రార్కముగా నాంధ్రసారస్వతమునకు జీవము నీయంగలవు.

ఇట్టి మహనీయకథాసుధామధుర మగుటచేతనే భోజరాజీయము నందలి కథా భాగములు శ్రీకృష్ణదేవరాయలు, పింగళి సూరనార్యుఁడు మున్నగు మహాకవులే యనుకరించియున్నారు. ఆముక్తమాల్యద

యందలి మాలదాసరికథ భోజరాజీయమునందలి మదనరేఖకథ కనుకరణము. పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయము పూర్వకథానిధానమే యైనను భోజరాజీయమునఁ గలప్రతి కథా భాగవిలసితధర్మోపదేశము, నైతికసంపత్తి యందెల్లెడలఁ గానరాదు. భోజరాజీయము నందలి యన్నదానపరుఁ డగు విప్రునికన్న దానమాహాత్మ్యమపుడు పుట్టిన బాలుఁడే చెప్పిన కథకు గళాపూర్ణోదయమందలి మధురలాలసబాల్యవృత్తాంతము ననుకరణమే యనవచ్చును. పాండురంగమాహాత్మ్యమునందలి సుశీలోపాఖ్యాన మనేక విషయముల భోజరాజీయమందలి యన్నదానపరుఁ డగువిప్రునిభార్యకథ కనుకరణముగాఁ దోఁపకమానదు. ఇట్లే యింక ననేకులగు నితర కవులు నందలి కథాభాగముల మహనీయత కానందించియే తచ్ఛాయలు దమ కావ్యములందుఁ జొనిపియుండిరన్న భోజరాజీయోత్కృష్టతఁ జాటుచే యగును.

## కవిత్వము : ప్రాశస్త్యము

అనంతామాత్యుని కవిత్వ మతి మృదుమధుర మనియు నుత్తమ కవిత్వమునకుఁగల ప్రతిభావ్యుత్పత్తులు, నుత్తమశైలికిఁగల మాధుర్యము, నర్థబోధకత, మున్నగు నెల్లవానిచే నద్భుతముగాఁ విరాజిల్లుచున్నదనియుఁ జెప్పుటలో నతిశయోక్తి లేదు. ఇతఁడు పూర్వ సత్కవి విధేయుఁడగుట నటనటఁ గవిత్రయముననే కాక తదితర పురాతనకవి వర్యుల కవితానుకరణములు గానవచ్చుచున్నవి. ఉదాహరణమునకుఁ గొన్నిమాత్రమే యిటఁ జూపుచున్నాను:

"నుతజలపూరితంబు లగు నూతులు నూఱిటికంటె సూనృత
వ్రత! యొక బావి మేలు మఱి బావులునూఱిటికంటె నొక్కస
త్క్రతు వది మేలు తత్క్రతు శతంబునకంటె సుతుండు మేలు త
త్సుతశతకంబుకంటె నొకసూనృతవాక్యము మేలు చూడఁగన్."

(భార. ఆది. ౪-౯౩)

అనునన్నయ భారతపద్యమును;

"శతకూపాధిక దీర్ఘిక
శతవాప్యధికంబుఁ గ్రతువు శతయజ్ఞ సము

న్నతుఁ డొక్కసుతుఁడు దత్సుత
శతకంబున కెక్కు డొక్కసతోర్వి క్తి నృపా."

(భోజరాజీయము. ౬. ౯౨.)

అని చక్కఁగ సంక్షేపించినాఁడు.

ధర్మోపదేశమునఁ దిక్కనశైలికనుకరణము :

"మమకారంబు నహంకా
రము సంసారానుబంధ రజ్జువు లని చి
త్తముల వివర్జింతురు సం
యము లీవును నడుపుమా! తదాచారంబున్."

ఇట్టి వనేకము లున్నవి. మఱియుఁ దిక్కన నిర్వచనోత్తర రామాయణము నందలి కుసుమాపచయవర్ణనము ననేకపద్యముల ననుకరించినాఁడు. ఉదాహరణమున కొక్కటి.

సీ. చిగురాకుఁ గెంగేలి చెలిమి యొనర్పంగ
మవ్వంపులేఁ బోదల్ మలచిపట్టి
పెఱచేతి నఖపంక్తి గిఱికొని చెన్నొంద
నెగయు దీప్తుల విరులనుమడింపఁ
గురులు గన్నవమీఁద నొరసిన నెమ్మొగ
మడ్డముంకించి చూపలవరించి
తనుగెంపు గడచని దళములు సడలఁ బు
వ్వులు కోయనొల్లక త్రొలఁగనెత్తి
గీ. ...చతురముగనోర్తు పుష్పాపచయముచేసె. (నిర్వ. ౮. ౩౮.)

"తరుణీరత్నము పువ్వుఁదీఁగె యొకచేతన్ వంచి పాదాగ్రముల్
ధరణిన్ మోఁపి యొకింతనిక్కి తనుమధ్యం బొప్పఁగ తద్వాయ
స్ఫురణంబారఁ గుచంబులుబ్బ నయనంబుల్ విచ్చిలీలన్ ముఖాం
బురుహంబెత్తి యొకర్తుఁగోసె నెలమిన్ బుష్పంబులత్తోఁటలోన్.

(భోజరాజీయము. ౩. ౧౭౦.)

ఈపద్యము తిక్కన పద్యమునకు మెఱుఁగుగా నున్నది.

ఒకసహకారశాఖతుదనోలిఁ బెనంగొనియున్న పువ్వుఁ దీఁ
గకుఁ దనహస్త మెత్తుటయుఁ గ్రక్కున లేఁజిగురంచుఁ గోకిలం
బొకటి రయంబునం గదియ నుల్కిపడంకుచుఁ బాతె నొక్కబా
లకి తనబోఁటితోఁడ నబలా! యిది కాటుకతీఁగె పొమ్మనన్.

(భోజరా. 3. ౧౭౫.)

ఈపద్యము నాచనసోముని యుత్తరహరివంశపద్యమునకు (ఉ. హరి. ౫. ౫౨.) ననుకరణము. ఇఁక యెఱ్ఱనకవిత్వమున కనుకరణము.

"కీర్తి విడువఁజాలఁ గీర్తితో మెలఁగంగఁ
జావు వచ్చెనేనిఁ జత్తుఁగాని
జగములోన నెల్ల సడికంటెఁ జావుమే
లనఁగఁ బరగుమాట యనఘ వినవె." (భార ఆర. ౭. ౨౯౩.)

"పుడమి నపప్రథ యగునెడఁ
బడఁతికి దేహంబు విడువఁ బాడియకాదే
సడికంటెఁ జావు మేలను
నొడువు పురాతనముగాక నూతనపదమే."

(భోజరా. ౭. ౧౫౬.)

కేయూరబాహుచరిత్రము నందలి:

"నందనుండు వనము నల్లిల్లు నిధి సుర
గృహము చెఱువు మేలు కృతి యనంగ
జగతి వెలయు సప్తసంతానములు. (కేయూర. ౧. ౮.)

అనుపద్యము నీక్రిందిపద్యము బోలి యున్నది.

"సుతుఁడు నిధియు వనముఁ గృతియు నల్లిల్లును
గుడియుఁ జెఱువు ననఁగఁ బుడమియందు
సంస్తుతింపఁబరగు సప్తసంతానముల్. (భోజరా. ౨. ౨౦౪.)

అనంతామాత్యునకు సమకాలికుఁడైన జక్కన విక్రమార్కచరిత్రము నందలి యీక్రింది పద్యమునకు భోజరాజీయము నందలి పద్య మనుకరణ మనుట విస్పష్టము

"చెప్పఁదలంచు సిగ్గు దనుఁజెప్పఁగనీమికి సంచలించుఁ దాఁ
జెప్పెడుమాట యెవ్వరికిఁ జెప్పకుమీ యనఁజూచు నంతటం
జెప్పకయుండరాదు మఱిచెప్పఁగ రాదని కొంకు నెమ్మెయిం
జెప్పకపోదు పొమ్మనుచుఁ జిత్తమునూల్కొనఁ జేసి యిట్లనున్."

(విక్ర. 3. ౧౫౭.)

"చెప్పఁగఁ జూచి సిగ్గుపడుఁ జెప్పఁగఁ జెప్పక యున్నఁదీరదేఁ
జెప్పెదఁగాకయంచుఁ దెగి చెప్పఁదలంచు నిదేమిమాటగాఁ
జెప్పెదఁ జెప్పినం బతియుఁ జిత్తమునం గలుషించునో పరుల్
చెప్పెడువార్త కాదనుచుఁ జెప్పఁగఁబూనును జెప్పఁగాదనున్."

(భోజరా. ౪. ౨౫౯.)

ఇట్లింకను బూర్వకవుల యనుకరణములు చూపవచ్చును. అప్పకవి చెప్పినట్లు 'పూర్వకవి వాక్ప్రయోగదక్షత' కవికుండవలసిన లక్షణములలో నొకటి. ఆలక్షణ మనంతామాత్యునకుఁ గలదనుటకుఁ బూర్వోదాహృతపద్యములు చాలును.

అనంతామాత్యుఁడు పూర్వకవుల ననుకరించినట్లే యనంతామాత్యు ననుకరించినతరువాతి కవులును గలరు. అందుఁ బ్రసిద్ధులలోఁ బింగళి సూరనార్యుఁ డొకఁడు.

"మగఁడెఱుఁగవలయుఁ గాదే
మగువ యెఱుఁగవలయుఁ గాక మనుగడ తెఱఁగ
మ్మగువయు మగఁడును వెలిగా
జగమున సంసార మెట్లు జరగును జెపుఁడీ."

(భోజరా. ౬. ౧౨౬.)

"కాంతుఁ డుచితజ్ఞుఁ డైనను
గాంతకు సిగ్గువడఁ జెల్లుఁగాక కటకటా!
కాంతుఁడు సిబ్బితికాఁడై
కాంతయు నట్టైన నెట్లు కాఁపుర మింకన్." (కళా. ౪. ౬౬.)

ఈ యుభయపద్యములకుఁ జాలపోలికలు గలవు కదా!

"అక్కట మోసపోయితి ననర్ఘమణీఖని చేతి కందియుం
దక్కకపోయిన ట్లతఁడు దాఁ జనుదెంచియు దున్నిపోయె....
(భోజరా. ౨. ౧౩౬.)

"శ్రీయుతమైన దివ్యమణి చేతికి నబ్బెఁగఁబాఱవైచి త
చ్ఛాయ యెఱుఁగింతయున్కిఁగని చాలఁగృశించితి గాజుపూసకై.
(కళా. ౪. ౨౪.)

ఇది పైదానికి మెఱుఁగు. ఇట్టి యనుకరణము లితరకవుల వనేకము లున్నవి. విస్తరభీతి నింత విరమించితిని.

అనంతామాత్యుఁ డటు కవిత్రయాదులకుఁ దరువాతివాఁడు నిటు ప్రసిద్ధిగన్న ప్రబంధకవులకుఁ బూర్వుఁడు నైనకారణమున నీతనివర్ణనములును బ్రయోగములును బరిశీలనార్హములు. ఈతనికావ్యమున నష్టాదశవర్ణనములు నొప్పారుచున్నవి. అందద్భుతవర్ణనములఁ గ్వాచిత్కముగఁ జేసుకొందను. పురవర్ణనమున ధారానగరవర్ణన మత్యంతప్రతిభాయుతము.

"సారకవీంద్ర చాతకవిశాల హిరణ్మయ వృష్టిధార ని
స్సార దరిద్రభార తరుమండ విలాసకుఠారధార సం
సార కృశానుతప్తజనశైత్య కరామృతధార గాక యా
ధార తలంప నన్యవసుధారమణీశ పురోపమానమే.
(భోజరా. ౨.౪౫)

౨. ౧౧, ౭. ౪౪ మున్నచోట్ల గంగానదీవర్ణనము విరాజిల్లుచున్నది. ౧. ౧౧౧ యందు హేమకూట వర్ణనము, ౩. ౧౫౯, ౧౮౩ లయందు ఋతువర్ణనమును జేయఁబడియున్నవి. పలుతావుల సూర్యచంద్రవర్ణనము లుండుటచే నొకచోట యద్వితీయముగా విపులముగా వర్ణించి మఱియొకచో నద్భుతముగ నొకకందపద్యమున వర్ణించుట కాననగును. ఇది యనంతామాత్యుని వర్ణనావైశిష్ట్యము:

"జక్కవ లలరఁ జకోరము
లుక్కఱఁ గమలములు విరియ నొగిఁగైరవముల్
స్రుక్క సమస్తజనంబులు
మ్రొక్క దిశలు వెలుఁగ భాస్కరుఁడు పొడతెంచెన్." (౧. ౧౩౨)

౩. ౧౮౮, ౧౮౯ మున్నగుస్థలముల జలక్రీడయు, ౩. ౧౬౮ మొదలగు సందుల నుద్యానవనము, ౧. ౧౧౮ లో మధుక్రీడ, ౪. ౧౦౯, ౧౧౦ లలో రతిక్రీడ, ౩. ౨౧౩, ౨౫౫ మొదలగుతావుల విరహము, ౪. ౯౯లో వివాహము, ౬. ౩౧౮ మొదలగుపట్ల పుత్త్రోదయము, ౬. ౨౧౨, ౨౦౫ గలచోటుల యాత్రయు, ౫. ౧౧౮ లో యుద్ధము, ౩. ౧౯౪, ౫. ౭౬ ౭ ౧౨౦, ౧౨౮ మున్నగుచోట్ల ద్యూతము, ౨. ౫౨, ౫౩, ౫౪ మున్నగుస్థలముల రాజవర్ణనము నద్భుతముగా వర్ణింపఁబడినవి. నీతివర్ణన మెల్లెడల నద్భుతముగా ద్యోతకమగుచుండును.

> "ఆడకు మసత్యభాషలు
> కూడకు గొఱగానివానిఁ గొంకక యెవరు లె
> గ్గాడిన నెదురుత్తర మీఁ
> జూడకు విని వినని వానిచొప్పునఁ జనుమీ." (౬. ౩౧)

ఇంతసులభముగనే నీతివర్ణనము విలసిల్లుచున్నది.

## శైలి: వైశిష్ట్యము

గానమాధుర్యము నర్థసౌలభ్యము నవరసోచితపదప్రయోగము సహజగాంభీర్యము, మార్దవము, ఔపదేశికసంపత్ప్రకటనయోగ్యత మున్నగు నుత్తమశైలికిఁగల సద్గుణము లీభోజరాజీయమున విరాజిల్లుచుండుటే యిందలి వైశిష్ట్యము. ఇందలి ప్రతిపద్యము నేదో యొకసుగుణము గలదనుట స్వభావోక్తి. కావుననే యామూలాగ్రముగ నొక్కే విధమున మృదుమధురముగనున్న భోజరాజీయమందలిశైలి పట్టువడిన యాంధ్రకవిపుంగవు లల్పసంఖ్యాకులే కలరని పలువుర యభిప్రాయము. అనంతామాత్యుని పైశైలీప్రాభవమున కొక్కొక్కదాని కొకటిరెండుదాహరణములఁ జూపుదును.

> "చూతనవీనపల్లవము శుద్ధసువర్ణపునీటఁ దోఁచి కం
> జాతరవంబుపైఁ గలయఁ జల్లి మెఱుంగులఁ దోమితోమి..."
> (౩. ౧౪౭)

> "ఆలోలాక్షిలలాట వక్త్రసదృశత్వాకాంక్షఁ జంద్రుండు దా
> బాలత్వంబు వహించి చూచియు నొగిం బ్రౌఢత్వముం బొందియుఁ

బోలంజాలక జాలిబొంది వగలంబోల్పేది లోఁగుందెఁ గా
కాలోకింపఁ దదీయబింబము కురంగాకారముం గూరునే."

(3, ౧౫౭)

"ఆలోలమందానిలాధూతలతమాడ్కి..." (౭, ౧౦౯)

మున్నగుపద్యములందలి గానమాధుర్య మనుభవరసికు లెఱుఁగుదురు.

అర్థసౌలభ్యమునకుఁ గావ్యమంతయు నుదాహరణమే యన్న నతిశయోక్తి కాదు.

"దేవర పెట్టినచోటం
గావలియుండుదు మొకించుకయు నాలస్యం
బేవంకను లేదు ధరి
త్రీవర! కడు మోసపోయితిమి విను నిన్నన్."

"ఏమిద్దె వికంబో యెఱుఁగ మెవ్వారును
జొచ్చి వెళ్లి నట్టి చొప్పు లేదు." (౨, ౧౨౬, ౧౨౭)

"ఇటు తగునయ్య? విప్రుఁడ వహీనగుణాఢ్యుఁడ వీవు నే
మిఁటి కిటువంటి దౌష్ట్యము? శమించునె మజ్జనకుండు విన్నఁ? ద
క్కటిజను లేమియండ్రు? మదిఁ గాంక్షయె గల్గిన నగ్నిసాక్షిగాఁ
జిటికెనవట్టి కాక వృథసేయుట ధర్మమె కన్యకాత్వమున్." (౪, ౨౨3)

మున్నగు పద్యము లరఁటిపండొలిచి చేతి కందిచ్చినట్లున్నవి.

నవరసోచిత మగుశైలి కీక్రిందిపద్యములు చూడవచ్చును. శృంగారమునకు ౪, ౧౦౯, ౨౫౬ ; ౭, ౧ ౮ మున్నగుపట్టులు తార్కాణములు. కరుణారసమునకు

"పిడుఁ గడిచినక్రియ నీకెం
బొడిచినగతి గుండె వగిలి భూస్థలిమీఁదం
బడి పొరలుఁ దన్నుఁ గొను ను
గ్గడువుగఁ గన్నీరునించు గడగడవడఁకున్."

'జో'యనుఁ 'దల్లి! నీవెట
పోయెద' వను 'నన్ను డించి పులివాత బడం

బోయెదవే?' యనుఁ 'జెల్లం
బో?' యను 'నింకేటిబ్రతుకు పోనాకు' ననున్. (౬. ౪౩, ౪౪)

మున్నగు తావులు కఠినహృదయునైనను గరఁగించివేయును. మఱియు ౧. ౧౦౪ న బీభత్సము, ౫. ౧౧౮లో వీరరసము, ౪. ౫౮, ౭. ౬౯ లలో హాస్యము, ౫. ౨౩౨, ౬. ౩౧౫ లలో రౌద్రము, ౬. ౧౧౧, ౨౪౭ లలో భయానకము, ౧. ౧౩౭; ౨. ౧౧౩; ౩. ౨౪, మున్నగు తావుల నద్భుతరసము వెల్లివిరియునప్పు డందలిశైలి యెంతయుఁ దత్తదనుగుణముగా విరాజిల్లుచున్నవి. ఇఁక శాంతరసముఁ జూపుపట్లు-మహాముఁడు దత్తాత్రేయుని ప్రవర్తనమునకు మోసపోవక యభీష్టసిద్ధి పొందుటయు, మదనరేఖ బ్రహ్మరాక్షసునికడఁ బ్రశాంతముతో మాటాడి యాతనిహృదయమును గరఁగించుటయు,గోవు వ్యాఘ్రమునకు బెదరక చూపిన శాంత కరుణములును నద్భుతముగా నున్నవి.)

అనంతామాత్యునిశైలికి సహజగాంభీర్యము కలదు. ఎట్టిపట్టులనైనఁ దడవుకొనుట కాని కృత్రిమపునడక కాని యాతనిపద్యములకు లేవు. ప్రతిపద్యమును సహజధారాపూర్వకమైనదే:

"యాగంబుల నగుఫలమును
యోగంబులవలన నగుసమున్నతియును నా
నాగమ విహితార్చలనగు
భోగము శ్రీరంగసేవఁ బొలుపుగ నెగడున్." (౧. ౧౭౧)

"ఆనృపాలపుత్రి యాదటఁ గైసేసి
యతనుపాలి కరుగు రతియ పోలె
నరిగి యరిగి మున్ను గురుతనూజునితోడఁ
బల్కినట్టి కడిఁది బాసఁ దలఁచి." (౪. ౨౫౨)

"ఉన్నతశారదాభ్రరుచినొప్పెడు మేను తటిద్విభాకృతిం
జెన్నెసలారు కెంజడలు చేనొకవీణెయు మర్త్యకోటికిం
గన్నుల పండువై మెఱయఁగా దివి నుండి తపఃప్రభావ సం
పన్నుఁడు వచ్చె నారదుఁ డభంగుఁడు వంజరుఁడున్నచోటికిన్."

"గాఢనీహారంబు గప్పినఁ దప్పునే (౬. ౩౯౪.)

మార్తాండబింబ విస్ఫూర్తి పెంపు." (౭. ౨౦౬)

మున్నగు పలుతావు లిందులకు సాక్షీభూతములు.

అనంతామాత్యుని పదము లొక్కొక్కప్పు డతిమృదువులై కుసుమ పేశలములుగా నుండును.

"పెదవులు గదలెం గదలవు
రదనంబులు గానవచ్చె రానను పాటిక్
మృదు వచనరచన లెసఁగఁగ
ముదిత యతని హృదయకమలముం గరఁగించెన్." (౪. ౧౬౬)

"తావిగొనని పుష్పదామంబు విధమునఁ
జిదుమఁబడని మావిచిగురు భంగిఁ
ద్రావఁబడని నవసుధాధార పగిదిని
జెలువఁ జూడ సురతచిహ్న లేదు." (౪. ౩౨౭)

"రతిఁ జేసిన కరకమలము
చతురత మతి మఱవకుండఁ జతురాననుఁ డీ
సతిఁ జేసె ననఁగఁ జక్కని
యతివ యొకతె గలదు బ్రాహ్మణాన్వయ మందున్." (౩. ౬౮.)

పై పద్యములందలి ప్రతిపదమును మృదుమధురమే కదా !

ఇఁక నౌపదేశికసంపత్ప్రకటనయోగ్యతకు శైలికి ప్రత్యక్ష ప్రబోధకత (Directness of appeal) యావశ్యకము. అది యీ క్రింది పద్యములందేకాక పలుతావుల వెల్లివిరియుచున్నది.

"నమ్మఁదగదు పరుల నమ్మెనే నేజాతి
వానినైన నమ్మవచ్చుఁ గాని
స్వర్ణకారకుండు సర్వ జగద్ద్రోహి
కాన వాని నమ్మఁగాదు తెలిసి." (౪. ౧౭౯.)

మఱియుఁ బులి కాహారముగాఁబోవు గోవు బిడ్డకిట్లు బోధించును.

"ఆడకు మసత్యభాషలు
కూడకు గొఱగాని వానిఁ గొంకక యొరు లె

గ్గాడిన నెదురుత్తర మీఁ
జూడకు విని వినని వాని చొప్పునఁ జనుమీ."

"ఒంటిఁ జరింపకు పొలమున
నింటికిఁ గడు ప్రొద్దు గలుగ నేతెంచుచు రా
వెంటఁ బడి పొడుచు గోవుల
జంటఁ జనకు క్రయ్యఁబడకు సందడి యగుచోన్." (ఉ. ౩౧, ౩౨.)

ఈవిధముగా భోజరాజీయమునందలి శైలి యుత్తమోత్తమముగా నెన్నఁబడుచున్నది. మఱియు నీకావ్యమునఁగల సామెతలు సాంప్రదాయికములు కావ్యౌదాత్త్యమునకుఁ గారణభూతములైనవి.

### సామెతలు: సాంప్రదాయికములు

భోజరాజీయమునఁ గానవచ్చు సామెతలలో ముఖ్యమైనవివి. దుక్కొద్ధు దేశాంతరమరిగినట్లు, పెన్నిధిఁ గన్న పేద, మును కన్నులకొఱద విన వలవంత పిదప వీనుఃకుఁ జోఁకినట్లు, పనివడి వెదకం జనవలసిన సొమ్ము దాన చనుదెంచిన చాడ్పున, ముల్లుముంటిఁగొనిపుచ్చక రోఁకటఁ బుచ్చవచ్చునా? చచ్చునంతటి కలఁగన్న మేలుకొనియే యుండవలె, నుడుము నడిఁకియున్న నడుఁకునె బడెపెట్లు, పులియున్న పొదరింటి పొంతఁ జనుట, తలియఁబెట్టిన యశనముఁ ద్రోచి పిదపఁ గుడిచెద నను వాఁడు జేల, చెప్పెడువారు చెప్పిన వినియెడు వారికి వివేకము వలదా? గడివోయినపువ్వులు రసికుఁడగువాఁడు ముడుచునా?, కుడుఁబెట్టి కంచ మాఱడిఁగొనుట, మూఁగవాని యెదుట ముక్కుబఱట రాని చందము, పులిమీసల నుయ్యెల లూఁగినట్లు, ఆవగింజంత భూతిపూయు వానికి గుమ్మడికాయయంత వెఱ్ఱి గలదు, సడికంటె జావు మేలు, గ్రుడ్లు తినుటయేకాక గూఁడెక్కి కూసినట్లు, పులికిఁ బుట్టినకూన వేఁడిపులు మేయదు, గోరవ్రాయఁగ నేత్రైనట్లు, తెవులు దీరినఁ జాలుఁగాక వెజ్జు కాఁడు దేవుండు కావలయునే!, వేసరినవాఁడు వెలుఁగు మీఁద వేనీళ్లు చల్లినట్లు. ఇందువచ్చు సాంప్రదాయికములు లేక నానుడులు: అఱికాలు తడి గాకుండ, మందు కడిగినను, కాయోపండో కలరూపు చెప్పుము, అగ్నిసాక్షిగాఁ జిటికెనవట్టు, నాతులమాటలు వడగండ్లగుండ్లు, కడళ్ల

మొత్తములు, భిన్నఘటతోయములు, పూసగ్రుచ్చిన భంగి, పోనున్నది పోకమానదు, కాదుకూడదను, పోయివచ్చు, కన్నకడుపు, కానికిఁ గైకొనక, తల్లిమఱుఁగుబిడ్డ, "చులుకన జలరుహాజంతువు చులుకన తృణకణము దూది చుల్కన యిలనెగయు ధూళిచుల్కన చులుకన మఱి తల్లిలేని సుతుఁడు," పూరిమేపు, తలపువ్వులు వాడకుండ, గోళ్లు మీటుకొను, ఏపనికైనను బొడ్డు పంపలేకపోవుట, చీమచిటు కన్నను, మాటికి మాటికి మాటలేటికి, చెక్కడిచినఁ బాలు వడుచు, కన్నులు దెఱవనిశిశువు, మున్నగునవి.

### వ్యాకరణ చ్ఛందో విశేషములు

అనంతామాత్యుఁ డీభోజరాజీయమునఁ జాలవఱకుఁ గవిత్రయ నియమానుసారముగనే పోయియున్నాఁడు. కవిత్రయమునకు వలెనే ధర్మవాచకమగు 'సహాయ' పదమును వాడియున్నాఁడు, యథేచ్ఛ, నిరాశ, సంసర్గ మున్నగు పదములు చరిత్రాదులలోఁ జేరినవనియెంచి కాఁబోలు యథేచ్ఛముగా ప్రయోగించినాఁడు. చిన్నయసూరి వ్యాకరణ విరుద్ధమయిన చేయుధాతువు మీఁది చేతురూపము బహుధా యిందుఁ గాననగుచున్నది. 'పుష్పకోమలి' యని రెండు మూఁడు చోట్లఁగలదు. ఇది వ్యాకరణ విరుద్ధమగుటచేతను నిర్ధారకస్థానముల లేక పోవుట చేతను సరియగు రూపమైన 'పుష్పకోమల' గా సవరించియున్నాను. ఇట్లే 'అర్ధరాత్రి' యని ప్రయోగించినచోట్లను ఛందోభంగము లేకుండుటచే నర్ధరాత్రమని దిద్దినాను. షష్ఠీవిభక్తియందు నగాగమ లోపము పలుతావుల నిందుఁ గానవచ్చుచున్నది. రౌతుకెరఁగు, మందు కడుగు మున్నగునవి. ర. ౧౦౧ లో 'హేమాపాత్రము' లని నిరంకుశప్రయోగము గానవచ్చుచున్నది. 'విను' ధాతువుపై విందుము అనురూపమునకు 'విందుము' అనిరూపము రెండుమూఁడుచోట్ల ప్రాసస్థానములఁ బ్రయోగింపఁబడినది. ఇంతకుమించి వ్యాకరణవిషయమునఁ జెప్పవలసిన దిందేమియును లేదు.

ఇఁక ఛందోవిషయమున లోపము లత్యల్పములు. విశేషములు నంతగాఁ గానరావు. ఇమ్ముగ, క్రమ్మరి, మోదమ్మున అను వానితో అంభిక అని ప్రాసము నుపయోగించినాఁడు. అంబికను అమ్మికయను

రూపము గ్రాహ్యమే యగుట (చూ. ఆంధ్రభాషార్ణవము ౧. ౪౦) నట్లు సవరించితిని. అలికులవర్ణు నున్నత రథాకృతచారుసుపర్ణు' (౨. ౨౫) లోఁ బైస్థలమున యతిభ్రంశము కానవచ్చుచున్నది. దీనికి వేఱు పాఠ మేమియు లభింపలేదు. ౫. ౭౫ లో లేవకమున్న నీ వితని దేవి వధింపు' మని యున్నది. ఇందు యతిభ్రంశముగాన వచ్చుటచే 'దేవి' కి బదులు 'లేమ' యని సవరించితిని. అటులనే ౧. ౭ లో 'ఏకవ్రుబ్రోకరైన శ్రుతు లన్నియు' ననియున్నది. ఇచ్చట 'శ్రుతులెల్లను' అని సవరించితిని. ఇవి తప్ప యింతకు మించిన లోపము లేమియును నిందు లేవు.

భోజరాజీయమున నితర గ్రంథముల నెచ్చటను గానరాని కొన్ని పదములు ప్రయోగింపఁబడినవి. బాలికి, బిట్టబిఱ్ఱ, బిట్టుబిఱ్ఱ మున్నగున వందుఁగొన్ని, బాలకి యను కన్నడపద మొకటికలదు. దాని ననుసరించి బాలిక యను నర్థమున బాలికి యనుపదము గ్రహించుట కీక్రింది ప్రయోగము ప్రామాణికము.

"..........బా,

లకి తనబోటి తోడ నబలా! యిది కాటుకతీఁగె పొమ్మనన్.(3. ౧౭౫)

కాని, శబ్దరత్నాకరకర్త యేలనో యీపదము గ్రహింపనేలేదు. నిర్ధారకము కాకపోయినను బాలకి యని శ్రీనాథుఁడును క్రీడాభిరామమునఁ బ్రయోగించియున్నాఁడు.

ఇఁక బిట్టబిఱ్ఱ యనఁగా బిఱ్ఱ కామ్రేడిత రూపమని యీ ప్రయోగమే (భోజరా. ౪. 3౨౯) శబ్దరత్నాకరమున నీయఁబడినది. బిట్టు బిఱ్ఱ బిఱ్ఱన కామ్రేడితరూపమని శబ్దరత్నాకరమునఁగలదు. దానికిని భోజరాజీయమునే యుదాహరించినాఁడు. ఈపై పదము లిఁక యేముఖ్య గ్రంథములందును గానరావు.

భోజరాజీయ ప్రయోగముల ప్రామాణికత విషయములో నాలు గైదుశబ్దము లిట విమర్శనీయములు. ఎలనాగ, తోఁకొను, వ్రూట, బ్రాతి—ఈ శబ్దములు సానుస్వారములా నిరనుస్వారములా యనుటకు భోజరాజీయమున నిర్ధారక ప్రయోగము లున్నవి.

"రోఁగమున కోడి ప్రాణ
త్యాగము సేయుటకుఁ దెంపు దఱకొను మదితో
సాగౌతమి కరుగుచు నెల
సాగను బొడగంటి నొకవనస్పతి పొంతన్." (౧. ౧౨౩)

ఇది యెలనాఁగ నిరనుస్వార మనుటకు నిర్ధారక మగుటచే తను సాను స్వార మనుట కాధారము లేనిఘంటువున నీయఁబడని కారణమునను భోజరాజీయ మంచెల్లెడల నీపదము నిరనుస్వారముగనే గ్రహింపఁ బడినది.

తోఁకొను సానుస్వార మనుటకు.

"త్రోఁకొని పోయినంత నొక తొయ్యలి యయ్యెలనాగనప్డు పే
ర్వాఁకలిగొన్న బెబ్బులిరయంబునఁ గృష్ణమృగార్భకంబుపై
వీఁకయెలర్పఁ బెల్లడరి వ్రేయుగతిఁ గురుఁడుగ్రుఁడై ననుం
దాఁకిన మూర్ఛ నొందితిని దద్దయునీవలసిప్డు తేఱితిన్. (3.౨౨3.)

"తేఁకువ యలరఁగ సీగతిఁ
దోఁకొని చని చదల రత్నతోరణ దీప్తుల్
ప్రాఁకెడు ఘనగృహాముల న
ప్పూఁకలు విడియించె రాజముఖ్యుండెలమిన్." (४. ౮४.)
"అఁ కొనివచ్చిన విప్రులఁ
దాఁకింపక యశన మిడుము తత్పరమతి న
త్తాఁకలి సేయకు కుడువం
దోఁకొని రాపర్వమగు తిథుల మనవారిన్." (౬ ౧౬౧.)

వీని ననుసరించియుఁ జిన్నయసూరి నిఘంటువుననుసరించియు, మఱియుఁ గేయూరబాహుచరిత్రము నందలి

"త్రోఁకొని వచ్చినిం దొలుతఁ దోయజషండము దన్ను తియ్య నీ
రేఁకటవోవఁగ్రోలి దరి నిమ్మగు చెట్టులనీడ నుండఁగాఁ
బ్రోకలు గట్టి వారిఖగముల్ తమముందఱఁబెట్టుమీలఁ బే
ర్వాఁకలి యల్లఁ దీర్చుకొని యచ్చట నద్దిన రాత్రముండుచున్.
(3. ౮౭.)

అను ప్రయోగము ననుసరించియుఁ దోఁకొను సానుస్వారమగుట నీభోజరాజీయ మందెల్లెడల నట్లు సవరించితిని. ఈసందర్భమున శబ్దరత్నాకరము సూర్యరాయాంధ్రనిఘంటువు నిచ్చియున్న భారతప్రయోగము నిర్ధారకము కాదనియు నాస్థలముననే పాఠభేదములు కలవనియుఁ జిన్నయసూరి దాకొని యనుపాఠముఁజూపి తోఁకొను సానుస్వారముగాఁ గైకొనియుండుట నానిర్ణయమునకుఁ బ్రబలోపకారియనియు గ్రహింప వలసియున్నది.

పూట సానుస్వారమని నైఘంటికుల యభిప్రాయము. కాని దానికిఁ గవిత్రయ నిర్ధారక ప్రయోగములు లేవు. కావునఁ బ్రాచీనులలో నొక్క భోజరాజీయముననే యిది నిరనుస్వారమని యాక్రిందిప్రయోగము దెల్పుచున్నది.

"ఏటికి వేగిరపడ నీ
పూట నిచట నిలిచి తేపు పోవఁగరాదే
మాటలఁ దప్పితి తెరు వి
చ్చోటికి నాయడకుఁ బడియెఁ జుమ్మవి యనినన్." (ఉ. ౨౮౧)

కాని భోజరాజీయమున కర్వాచీనములైన రామాభ్యుదయము రాజవాహనవిజయముల నీపదము సానుస్వారమనుటకు నిర్ధారకముగా నున్నది. ఐన, ననంతామాత్యునిదృష్టిలో 'పూట' నిరనుస్వారమగుట నిందట్లే సవరింపఁబడినది.

బ్రాతి సానుస్వారమన్న శబ్దరత్నాకరము దోషదూషితమనుటకు భారతప్రయోగములే కలవు. దానికిఁ దోడు భోజరాజీయమందలి యీ పద్యమొకటి!

"నూతుల దరులను లోఁతగు
పాతటి కసవులను నెట్టి పచ్చికయున్నన్
బ్రాతిపడి మేయఁబోకుము
మాతి నిడకు ముగ్రసత్త్వములు గలనీటన్." (ఉ. ౩౫.)

ఈపైఁజూపిన వన్నియు భోజరాజీయము పరమప్రామాణికమనుటకుఁ జాలును. ఇంక ననేకాధారములు కలవు.

## పాఠపరిశీలనము : చిన్నయసూరి

ఈభోజరాజీయపాఠపరిశీలనమునఁ జిన్నయసూరి చక్కని ప్రయోగములు కొన్ని సేకరించితిని. అందుఁ బ్రధానములగు పట్టులు నాల్గైదు చూపుదును. ౬. ౧౩౩ లో శకటరేఫ సాధురేఫ సాంకర్యముగల ప్రాసమున్నది. ఇందుఁదక్క—మఱి భోజరాజీయమం దిట్టి సాంకర్యము లేదు. దానికి 'మూ,తో రొదగొట్టు' అనుచోటఁ 'దా, దూఱులుపల్కు' నను చిన్నయసూరిపాఠ మీసాంకర్యమునకు వ్యతిరేకముగఁ గనఁబడినది. కావున నాపాఠమే గ్రహించితిని. ౭. ౧౦౮ లో 'నవ్వుచు, యవ్వనలక్ష్మి' యను ప్రాసముకలదు. యవ్వనము వ్యాకరణవిరుద్ధము. దానికి చిన్నయసూరి పాఠములలో 'నావుడు, యావనలక్ష్మి, ఊవిళులూరు, ఈవిధము' అని యున్నది. కావున దానినే నే గ్రహించితిని. ౫. ౨౦౧ లోఁ గూడ 'ఱ' 'ర' సాంకర్యమున్నది. దానికిని 'చేరుట' యను నాల్గవపాదమున 'చీఱుట' యను చిన్నయసూరి పాఠము లభించినది. దీనినే సూర్యరాయాంధ్రనిఘంటువుసైతము గ్రహించినది. కాన నేనును గైకొంటిని. మఱికొన్నిచోట్లఁ గొంత సరసముగానున్న చిన్నయసూరి పాఠములను పుటక్రిందఁ జూపితిని. అట్లే శబ్దరత్నాకరపాఠములనుసైతము కొన్ని గ్రహించి కొన్నిటిఁ గ్రిందఁ జూపితిని. సాదర్భశుద్ధిలేనిపాఠముల నెల్ల విడిచిపుచ్చి నాకు లభ్యములైన మంచిపాఠము లెల్లఁ గైకొంటిని. చిన్నయసూరివైనను శబ్దరత్నాకరమునందలివైనను గొన్నితావుల నసందర్భములుగాఁ దోఁచినవెల్లఁ ద్యజించి నేను సరిచేసిన ప్రతిస్థలమునను దగిన యాధారములఁ జూచియే యట్లొనర్చితిని. వాని నెల్ల నిటఁ బేర్కొనుట కవకాశము లేమి విడిచిపుచ్చితిని.

## అనంతామాత్యుని యితరకృతులు

అనంతామాత్యుని యితరకృతులు మన కింతవఱకు లభ్యమైనవి రెండు కలవు. అవి రెండును ఛందోదర్పణము, రసాభరణము నను లక్షణగ్రంథమును. రసాభరణము నాంధ్రసాహిత్యపరిషత్తువారును, ఛందోదర్పణమును విపులమగు పీఠికతో శ్రీ వావిళ్ల రామస్వామి శాస్త్రులవారును బ్రకటించియున్నారు. అనంతామాత్యుని గ్రంథము లన్నియు స్వతంత్రము లేకాని దేనికి ననువాదములుగావు. రసాభరణ

మునఁ బ్రథమాశ్వాసమున స్థాయిభావములకు లక్ష్యలక్షణములు విభావానుభావ సాత్త్వికభావలక్షణములు శృంగారాదినవరసముల కుదాహరణములు నిచ్చియున్నాఁడు. ద్వితీయాశ్వాసమున నాలంబనోద్దీపనాదుల లక్షణములు మున్నగునని తెలిపి యష్టవిధసాత్త్వికభావములకు ముప్పదిమూఁడు సంచారిభావములకు సోదాహరణముగా లక్షణములఁ దెల్పినాఁడు. తృతీయ చతుర్థాశ్వాసముల విప్రలంభ శృంగారమును నితరవిధములను విస్పష్టముగాను, నాయికానాయకులఁ గూర్చియుఁ దెల్పినాఁడు. ఇఁక ఛందోదర్పణము చక్కని ఛందోగ్రంథము.

## ఉపసంహారము

అనంతామాత్యుని భోజరాజీయ మాంధ్రసారస్వతమున వెలసిన యుత్తమగ్రంథములలో నొకటి. ఇందలి ధర్మోపదేశము పరమప్రశస్తము. ఈవిషయమున నీకావ్య మద్వితీయమే యనుట కెట్టి సందియమును లేదు. ఆభ్యంతర లీనమైన కవితాపరిపాకమునఁ జక్కని ప్రతిభావ్యుత్పత్తులు లీనమై కావ్యగౌరవము నినుమడింపఁ జేసినవి. అందుచే ననంతామాత్యుఁడు దన కావ్యాంతమునఁ గోరినట్లు:

"అఖిల జగత్సేవ్యమై భూమిపై నహో
బలము దా నెందాఁక వెలయుచుండు
నాతీర్థమందుఁ బ్రఖ్యాతమై భవనాశ
నీ నది యెందాఁక నెగడుచుండు
నా మహానదిపొంత నత్యంతపూజ్యమై
గరుడాద్రి యెందాఁకఁ గదలకుండు
నయ్యద్రి శిఖరంబు నందును నెందాఁక
శ్రీనృసింహస్వామి స్థిరతనుండు
నస్మదీయకృతియు నందాఁక సంతత
శ్రావ్యమై సమస్త సభలయందు
విస్తరిల్లుఁగాత వివిధ కథానూత్న
రత్నభూషణాభిరామ మగుచు."

భోజరాజీయ మాచంద్ర తారకముగా నాంధ్ర సారస్వతము నలరించు ననుట కెట్టిసందియమును లేదు. ఈ సత్కావ్యరత్నమును సర్వాంగ సుందరముగాఁ దిరిగి ముద్రించుతలంపున దీనిని సంపాదించి భూమిక వ్రాయ నాకమిత ప్రోత్సాహము నొసఁగి యాదరించిన భాషోద్ధారక బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రి గారికి నేనెంతయుఁ గృతజ్ఞుఁడును. శ్రీవావిళ్ల వా రాంధ్ర భాషాయోష కొనర్చుచున్న మహాసేవఁ గొని యాడఁ జూచుట సూర్యభగవానుని దీపముతోఁ జూపుటే యగునని మనవి చేయుచున్నాను. శ్రీ వేంకటేశ్వరుఁడు శ్రీవేంకటేశ్వరశాస్త్రి వర్యున కాయురారోగ్యభాగ్యము లొసంగి యాచంద్రార్క మాంధ్ర భాషాయోష కనుంగు పుత్రు లనుమహాఖ్యాతి నొసంగుఁగాక !

కాకినాడ.
20-10-'44

ఇట్లు విన్నవించు బుధజన విధేయుఁడు,
బులుసు వేంకటేశ్వర్లు, బి. ఏ.

# విషయసూచిక

## షష్ఠాశ్వాసము

శ్రీ

# భో జ రా జీ య ము

## ప్ర థ మా శ్వా స ము



రమణీపయోధరపరిస్ఫుటకుంకుమఫాలభాగక
స్తూరిక లిప్తకేళిగతిఁ జోఁకినభంగి నురంబునందుఁ బ్ర
స్ఫారితరత్నలాంఛన విభాయుగళంబు దలిర్ప నొప్పుల
క్ష్మీరమణుండహోబలనృసింహుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్. 1

చ. శ్రుతితతు లుద్భవించినవిశుద్ధగృహంబు లనంగఁ జాలి వా
క్సతికి నివాసభూము లనఁగాఁ దగి యెవ్వని మోముఁదమ్ము లం
చితగతి నొప్పు నట్టిసరసీరుహసంభవుఁ డిచ్చుఁగాత మ
త్కృతికిఁ జిరాయువు న్విమలకీర్తియు సజ్జనరంజకత్వమున్. 2

చ. ఒకదెస మాతృభావమును నొక్కదెసం బితృభావమున్ సమాం
శకముగఁ దాల్చి యోగిజనసంతతి గన్గొనునంతరంగదృ
ష్టికి గుఱియై తపస్వులకుఁ జేరువచుట్ట మనంగ భక్తరా
జికి నఱచేతిసొమ్మగు శశిస్ఫుటమౌళిఁ దలంతు శంకరున్. 3

ఉ. విఘ్నము లెల్లఁ బాసి పృథివిన్ భవనీరధి పేర్మి గుల్ఫసం
దఘ్నము చేసి నిల్తు రుచితస్థితి నెవ్వనిభృత్యు లట్టి దుః
ఖఘ్నుఁడు షణ్ముఖప్రథమగర్భుఁడు భద్రగజాస్యుఁ డైనయా
విఘ్నవిభుండు మత్కృతికి వేడుకతోడ సహాయుఁ డయ్యెడున్. 4

ఉ. ఏసతిలావు లేక నరు లెవ్వరు నోరు మెదల్ప లేరు ప
ద్మాసనవాసుదేవనిటలాక్షులు లోనుగ నాత్రివిష్టపా
వాసులు పుట్టుఁ బేరుఁ జెలువంబును నేరికి దాఁప రట్టివా
ణీసతి మన్ముఖాబ్జమున నిల్చి విశేషవరంబు లీవుతన్. 5

ఉ. శ్రీకర మైనరామకథఁ జెప్పి కృతార్థులఁ గానొనర్చె భూ
లోకమువారి నేబుధి త్రిలోకములుం బొగడంగ నట్టియ
స్తోకవచోభిరాముఁడు విశుద్ధతపోవిభవాధికుండు వా
ల్మీకిమునీంద్రుఁ డెప్పుడుఁ జలింపక నామదిలోన నుండెడున్. 6

ఉ. ఏకపుఁ బ్రోక యైన శ్రుతు లెల్లను నేర్పున నేర్పరించి సూ
త్రాకృతు లొప్పఁ గూర్చి యితిహాసపురాణచయంబు లోలి న
నైక్యకరణిం బ్రబోధనులప్రార్థ్యములై వెలయన్ రచించె న
వ్యాకులబుద్ధి నేపురుషుఁ డట్టిపరాశరసూనుఁ గొల్చెదన్. 7

చ. వివిధపదానుయోజనఁ బ్రవీణుఁడు దండి సమంచితార్థగౌ
రవమునఁ బెద్ద భారవి ధురంధరుఁ డయ్యుపమాకవిత్వస
త్ప్రపణతఁ గాళిదాసు త్రివిధంబున మాఘుఁడు మేటి నాఁగ ని
ట్లవనిఁ బొగడ్త కెక్కినమహాకవులం బ్రణుతింతు నాద్యులన్. 8

ఉ. నన్నయభట్టుఁ దిక్కకవినాయకు భాస్కరు రంగనాథుఁ జే
వన్నిక కెక్కినట్టియమరేశ్వరు నెఱ్ఱయమంత్రి నాదిగాఁ
జన్నకవీంద్రులన్ నవరసస్ఫుటవాణు లనంగ ధాత్రిలో
నున్నకవీంద్రులం దలఁతు నుల్ల మెలర్పఁగ వాగ్విభూతికిన్. 9

సీ ఏమహాత్ములచేత నీజగత్త్రయము నాప్యాయితం బయ్యె నయ్యమృతకరుని
చేఁ బోలె వైద్యులచేతఁ బోలె సురక్షితం బయ్యె నూత్నరత్నములచేతఁ
బోలె నలంకృతిఁ బొరసెఁ బావిత్రత మయ్యెఁ బుణ్యతీర్థముచేతఁ బోలె నట్టి
వైష్ణవప్రవరుల వైనతేయుఁ గజేంద్రు శేషుఁ బావని నంబరీషు ధ్రువుని
తే. బలి విభీషణుఁ బ్రహ్లాదుఁ బాండవేయుఁ,బుండరీకు వేదవ్యాసుఁ బుత్రు భీష్ము
నారదునిఁ బరాశరుని శౌనకుని భృగుని,విదురు నక్రూరు గోపాలవితతిఁ దలఁతు. 10

సీ. భూనభోవారిదంతపూరితనుతకీర్తిశాలి తిర్వెంగళచక్రవర్తి
సకలసాత్త్వికశుకప్రకరసత్ఫలపూర్ణసహకార మళఘురిచక్రవర్తి
ఘనతరాజ్ఞానాంధకారవిఖండనచండాంశుఁ డౌబళచక్రవర్తి
నానార్థిజనచాతకానూనధనవృష్టిజలదంబు శ్రీదేవచక్రవర్తి
తే. యనఁగ శ్రుతిచతుష్టయముతో నెనయఁ నట్టియగ్రజులతోడఁ బుట్టినయస్మదీయ
గురునిఁ దిరుమల నల్లానువరపయూజుఁ, దలఁతు గోవిందచక్రవర్తులఁ బ్రియమున. 11

వ. అని యిష్టదేవతానమస్కారంబును విద్వజ్జనాభివందనంబును భాగవతసంకీర్తనం
బును గురుచరణస్మరణంబునుం జేసి వాణీవరప్రసాదలబ్ధవాగ్విభవుండనై కృతి

యొనర్చు నుపయోగించి తత్కృతిలక్ష్మికి ముఖమండనంబుగా నస్మదీయవంశప్రశంస యొనర్చెద నది యెట్టి దనిన. 12

సీ. శ్రీరమ్యుఁ డగునాది నారాయణునినాభిఁ బొలుపార విరిదమ్మిపువ్వు వొడమె
నాపువ్వులోఁ బుట్టు నఖిలలోకంబులు పుట్టింపఁ జాలెడు ప్రోడపట్టి
యాపట్టిమోముల నామ్నాయవితతితో నావిర్భవించె విప్రాన్వయంబు
నాయన్వయంబున నతిదృఢాచారసమృద్ధులు పెక్కండ్రు ఋషులు పుట్టి
ఆ. రట్టిఋషులలోన నధికతపోవిశేషుండు వేదశాస్త్రశోభితుండు
ఘనుఁడు సూనృతైకధనుఁడు కౌండిన్యము, నీశ్వరుండు మెఱసె విశ్వనుతుఁడు. 13

శా. ఆకౌండిన్యమునీంద్రవంశమున దుగ్ధాంభోధిసంజాతుఁడై
రాకాచంద్రుఁ డెలర్చుమాడ్కి నుపధారంభైకసంరంభుఁ డ
స్తోకానందుఁడు నందనార్యుఁడు ప్రసిద్ధుం డయ్యె నార్యప్రియుం
డాకారస్మరుఁ డచ్యుతాంఘ్రికమలధ్యానానురక్తుం డిలన్. 14

ఉ. నందితశిష్టలోకుఁ డగునందనమంత్రికి లక్కమాంబకున్
నందను లుద్భవించిరి జనార్దనశంకరనిర్విభేద మా
నందమయాత్ము లాదిమునినాయక సత్యుఁడు సత్యమంత్రియున్
మందరశైలధీరుఁ డసమానుఁడు మాత్రిపురాంతకార్యుఁడున్. 15

వ. అం దగ్రసంభవుండు. 16

ఉ. సత్యవచోవిలాసుఁడు ప్రశస్తయశోవిభవాభిరాముఁ డా
దిత్యసమప్రకాశుఁడు సుధీజనచిత్తసరోజమిత్త్రుఁ డా
చిత్యపరుండు సర్వజనచిత్తవిదుం డన మంత్రికోటిలో
సత్యనమంత్రి యొప్పె నుడుసంఘములోపలఁ జంద్రుకైవడిన్. 17

ఉ. సత్యముతో నహింస విలసద్గతిఁ గూడి చరించుచాడ్పునన్
సత్యనమంత్రిఁ గూడి గుణశాలిని తాతమ నిత్యనిర్మలా
పత్యసమేతయై నిఖిలబంధుజనంబులకుం బ్రమోదసం
పత్త్యుదయైకహేతు వయి ప్రస్తుతికెక్కె ధరాతలంబునన్. 18

క. అతనికి నయ్యాతివకు న ప్రతిమమనోదారు లరయ భాసురకవితా
చతురుఁడుబయ్యనయుసుమతి,యుతుఁడగునందనయుసత్ప్రియుఁడుతిక్కనయున్. 19

వ. ఆసత్యనామాత్యుననుసంభవుండు. 20

సీ. మారాంబ కెన యైనమారాంబ పత్నిగాఁ గనియె నార్వుర వంశకరుల సుతుల
నిశ్చలధ్యానైకనిష్ఠాగరిష్ఠుఁడై షణ్మాసములు పురశ్చరణ చేసి

మావంశజులయింటిమార్జాలమున కైన నరకంబు లేకుండ వరము వడసెఁ
గడఁగి పునస్మాతృగర్భంబు సొరకుండఁ బ్రతిన గైకొని బ్రహ్మపదముఁ బొందె
ఆ. ననిన నతనికీర్తి యఖిలదిక్తటములఁ, గప్పుకొనుట వేఱ చెప్ప నేల
విపులపుణ్యసదనుఁ ద్రిపురాంతకబ్రహ్మఁ, బోలఁ గలరె యితరపురుషు లెల్ల. 21
ఉ. నిత్యులు తత్తనూభవు లనింద్యులు దేవనయున్ సురేశ్వరా
మాత్యసముండు నందనయు మాన్యుఁడు కొమ్మనయున్ గుణాఢ్యుఁ డా
దిత్యవిభుండు నాశ్రితవిధేయుఁడు మాచనయున్ బ్రశస్తసా
హిత్యుఁడు తిక్కధీమణియు నెన్నిక కెక్కిరి బంధుకోటిలోన్. 22
సీ. ఆసత్యనామాత్యునగ్రసూనుఁడు పయోనిధిగభీరుఁడు గదానిపుణుఁ డధిక
తేజుఁ డాశ్రితకల్పభూజుఁ డుత్కటకృపారసపూర్ణహృదయుఁ డరాతిభయద
బాహాఢ్యుఁ డసహాయసాహసుం డంగనాజనభద్రుఁ డభినవమనసిజాతుఁ
డాశాంతవిశ్రాంతయశుఁ డార్తరక్షాతిదక్షుఁ డున్నతవక్షుఁ డక్షరాది
ఆ. విద్యలందుఁ జతురుఁ డుద్యద్గుణశ్రేష్ఠుఁ,డనుపమానవిభవుఁ డమితపుణ్యుఁ
డనఁగ నెగడె భైరవామాత్యచంద్రుండు, రాజసభలయందుఁ బూజ వడసి. 23
చ. క్షితిఁ గ్రతుకర్తృతామహిమ చేకొని పంచమవేద మైనభా
రతముఁ దెనుంగుబాస నభిరామముగా రచియించినట్టియు
న్నతచరితుండు తిక్కకవినాయకుఁ డాదట మెచ్చ భవ్యభా
రతి యనఁ బేరు గన్నకవిరత్నము బయ్యనమంత్రి యల్పుఁడే. 24
చ. శరధిసుత న్వరించుజలజాతవిలోచనుమాడ్కి శీతభూ
ధరజఁ బరిగ్రహించుహిమధామకళాధరుపోల్కి సద్గుణా
భరణపవిత్రమూర్తిఁ గులపాలిక నాఁ దగుబ్రోలమాంబికన్
బరిణయ మయ్యె నెయ్యమున బయ్యచమూపతి వైభవోన్నతిన్. 25
క. పతిభక్తి నరుంధతి సూనృతమతి భారతి జగద్గణితసౌభాగ్య
స్థితి రతి శాశ్వతవిభవా, యతి శ్రీసతి యనఁగఁ బ్రోలమాంబిక వెలసెన్. 26
చ. గుణయుతు లవ్వఘావరులకున్ జనియించిరి త్రేత రామల
క్ష్మణు లయి పుట్టి ద్వాపరయుగంబుతుదిం దగ రామకృష్ణులై
గణనకు నెక్కి యీకలియుగంబున నిట్లుదయించె లోకర
క్షణుఁ డగువిష్ణుదేవుఁ డన గంగనమంత్రియు ముమ్మడన్నయున్. 27
వ. ఆగంగనామాత్యుగుణవిశేషంబు లెట్టి వనిన, 28

సీ. దుగ్ధాబ్ధిలోపలితోయజాక్షుల మేలుకనిపి తీరంబున ననుపకున్న
హరుకంఠమున నున్నగరళానలముకప్పు విరియ నౌషధము ద్రావింపకున్న
నిందుబింబములోనియిఱ్ఱికి దీమంబు చూపి వెల్వఱిచి పోఁ జోఁపకున్న
శిరపాణికి నీలిచీరమీఁదిప్రియంబు మాన్పి వెల్లలు గట్ట మరపకున్న
తే. నితనికీర్తికి సరి చెప్ప నెట్లు వచ్చు, ననఁగఁ బొగడొందు బయ్యదండాధినాథు
కూర్మిపుత్రుండు కౌండిన్యకులపవిత్రుఁ, డంగసంభవనిభుఁ డైనగంగవిభుఁడు. 29

క. సోముఁడు రోహిణి నధిక, ప్రేమమున వరించుక్రియ గభీరాదిగుణ
శ్రీమహిమకీర్తి శోభిలి, కామాంబ వరించె మంత్రిగంగన ప్రీతిన్. 30

క. ఆదంపతులకు హృదయా, హ్లాదకరులు సుతులు పెద్దనార్యుఁడు సుగుణా
మోదిఘనుఁ డప్పలన్నయుఁ, బ్రాదుర్భావంబు నొంది పరఁగిరి పేర్మిన్. 31

వ. ఇట్టిసంతానంబువలన వెలయుగంగనామాత్యుననుసంభవుండు. 32

చ. కడిమిఁ గిరీటి దానమునఁ గర్ణుఁడు భోగమున న్సురేంద్రుఁ డె
క్కుడువిభవంబునన్ హరి యకుంఠితబుద్ధిఁ బురందరేభ్యుఁ డు
గ్గడు వగుధీరతన్ సురనగప్రవరుం డనఁ బ్రోలమాంబము
మ్మడి బెడఁగొందె రూపమహిమ న్స్మరుముమ్మడియై జగంబునన్. 33

సీ. పితృబుద్ధి వదలక పేర్చి యచ్యుతుసేవ యనిశంబు చేయుఁ బ్రహ్లాదుఁ డనఁగ
నగ్రజన్మునితోడ విగ్రహింపక శౌరి శరణు చొచ్చినవిభీషణుఁ డనంగ
బ్రభుత యెన్నఁడుఁ గోలుపడక సద్భక్తి నుపేంద్రుఁ బూజించుబలీంద్రుఁ డనఁగ
వైవాహికక్రియావైభవం బుడుగక బిసరుహాక్షునిఁ గొల్చుభీష్ముఁ డనఁగ
ఆ. నితరమతములందు హృదయంబు చొనుపక, యోగిఁ దదేకనిష్ఠ యుల్లసిల్లఁ
బరమభాగవతవిభాసితుండై యొప్పెఁ, బ్రోలమాంబసుతుఁడు ముమ్మవిభుఁడు. 34

క. ఆముమ్మడిప్రెగ్గడ శ్రీ, రాముఁడు సీతను వరించుక్రమమున సుగుణ
స్తోమాభిరామ నమితకృ, పామండిత నెఱ్ఱమాంబఁ బరిణయ మయ్యెన్. 35

సీ. పతిభక్తినిరతిని సతి యరుంధతిఁ బోల్పఁ దగు ననుమాట వ్యర్థంబు గాదు
సత్యవాక్ప్రౌఢిని సతి సరస్వతికంటె నెఱవాది యనుమాట కుఱుచ గాదు
సౌభాగ్యగరిమను సతి రతిదేవితోఁ బురుడించు ననుమాట బొంకు గాదు
సంపదపేర్మిని సతి శ్రీసతికి సదృక్షం బనుమాట సంశయము గాదు
ఆ. అనిన నితరసతుల కలవియె సతతవి, శ్రాణనక్రియాధురీణవాస్తుఁ
డైనముమ్మడీంద్రు నర్ధాంగలక్ష్మి నా, నతిశయిల్లు నెఱ్ఱమాంబఁ బోల. 36

క. ఆరమణీరమణులకుఁ బ్ర, భారమ్యుఁడు తిక్కవిభుఁడు ప్రకటితకాంతి
స్ఫారుఁడు సింగనయును నను, వారలు పుట్టి రిలఁ బుష్పవంతులమాడ్కిన్. 37

వ. అయ్యిరువురయందు నగ్రసంభవుండు. 38

సీ. సత్యభాషణమును సాధుపోషణమును సహజభూషణముగా జరగువాఁడు
శాస్త్రరక్షణము దయార్ద్రవీక్షణము నుదాత్తలక్షణముగాఁ దనరువాఁడు
సుకృతభావనమును సుకవిసేవనమును నిత్యజీవనముగా నెగడువాఁడు
విష్ణుకీర్తనమును విమలవర్తనమును విహితవర్తనముగా వెలయువాఁడు
ఆ. వాఁడె చూడుఁ డనుచు వసుధాజనంబులు, ప్రస్తుతింప నొప్పు భవ్యచరితుఁ
డుభయకులపవిత్రుఁ డురుకీర్తిధవళిత, దిక్కుఁ డెఱ్ఱమాంబతిక్కవిభుఁడు. 39

సీ. విలసితం బగుకృష్ణవేణిమలాపహారిణి భీమరథినా ధరిత్రియందుఁ
దనరునదీత్రయాంతర్వేది యగుపావనక్షేత్రమున శోభనముల కెల్ల
ధర నివాసం బగుపెరుమగూరపురంబునందు విద్వజ్జనానంద మైన
జీవనస్థితిచేతఁ జెన్నొందెడి వంశకర్తృత్వసంపత్తిఁ బ్రభుత్వ మొంది
తే. నెమ్మి ప్రత్యక్షపరమపద మ్మనంగ, నొప్పు శ్రీకాకుళంబున నొడయఁ డైన
యంధ్రవల్లభహరిసేవ నలరుచుండుఁ, బెక్కుభంగుల ముమ్మడితిక్క విభుఁడు. 40

చ. చిరతరశోభనుం డగువసిష్ఠమునీశ్వరుఁ డయ్యరుంధతిం
బరిణయ మై గృహస్థగుణభాసితుఁ డై వెలుఁగొందుమాడ్కిఁ గా
తరపరిరక్షణానవరతవ్రతశీలుఁడు తిక్కమంత్రిశే
ఖరుఁడు వివాహ మయ్యె గుణగౌరవశోభిని మల్లమాంబికన్. 41

సీ. శ్రీవత్సగోత్రాబ్ధిశీతాంశుఁ డగునక్కదండాధినాథుఁ డీతరుణితండ్రి
లావణ్యగుణపుణ్యలక్షణాన్విత యైనయక్కమాంబిక యీలతాంగితల్లి
చిరకీర్తినిరతులు చిట్టనమంత్రియు నయ్యలార్యుఁడు నాతి కగ్రజన్ము
లచ్యుతాంఘ్రిసరోరుహార్చనారతుఁడు పమ్మనమంత్రి యీయింతియనుఁగుఁదమ్ముఁ
తే. డనఘుఁ డగుకోటకరుణాకరార్యుఁ డనఘు, నుండు ముదునూరి పెద్దవిభుండు నివ్వ
ధూమణికిఁ గూర్మి గలమేనమామ లనిన, మగువ లెనయె తిక్కనమంత్రి మల్లమకును.

సీ. ఈయింతిప్రియభాష లెల్లపెద్దలకును బరమానురాగసంపాదకములు
నీయింతిహస్తాబ్జ మెల్లబాంధవులకు లలితకల్పద్రుమఫలితశాఖ
యీయింతివర్తనం బెల్లయింతులకుఁ బతివ్రతాచారోపదేశకర్త
యీయింతిమందిరం బిందిరాదేవికి సతతమనోజ్ఞవిశ్రామభూమి
ఆ. యనఁగ సకలశోభనావాసదేశ మై, యఖిలకులవధూజనావతంస
మగుచు వెలసెఁ దిక్కనామాత్యవిభుదేవి, మల్లమాంబ లోక మెల్లఁ బొగడ. 43

సీ. ఈగృహస్థుని కిట్టియిల్లాలు గలుగుట ప్రాగ్భవార్జితపుణ్యఫలము గాదె
యీపతివ్రత కిట్టిహృదయేశుఁ డబ్బుట పరికింప ఘనతపఃఫలము గాదె

యీమహాప్రభువున కిట్టిసజ్జనురాలు గలుగుట సంసారఫలము గాదె
యీపుణ్యకాంతకు నిట్టిధర్మక్రియాపరుఁడు గల్గుట దానఫలము గాదె
ఆ. యనఁగ మహిఁ బరస్పరానుకూలత్వంబు, మిక్కుటముగ మంత్రితిక్కవిభుఁడు
మల్లమాంబికయును మహనీయజీవన, సౌఖ్యవార్ధిఁ గేళి సలుపు చుండ. 44

మ. అరిషడ్వర్గముఁ దూలఁ దోలి ధరలో నైశ్వర్యషడ్వర్గ మీ
వరుసన్ భార్గవ మొందె నాఁగ సుతషడ్వర్గంబు జన్మించెఁ ద
త్పురుషస్త్రీతిలకంబులందు ఘనసంతోషంబు తద్బాంధవో
త్కరముల్ పొందె సమగ్రసంపద నిజాగారంబునం జెందఁగన్. 45

వ. వా రెవ్వ రంటేని. 46

ఉ. భూనుతకీర్తి మమ్మడివిభుండు మదగ్రజుఁ డేను వైష్ణవ
ధ్యానసమాహితాత్ముఁడ ననంతసమాఖ్యుఁడ నాదుతమ్ము ల
జ్ఞానవిదూరు లక్కనయు సత్కవి చిట్టనయున్ వివేకవి
ద్యానిధి రామచంద్రుఁడు నుదారుఁడు లక్ష్మణనామధేయుఁడున్. 47

క. ఈయార్వురు నొక్కొక్కఁడు, వేయిండ్లకు మొదలు గాఁగ వెలయుదు రని కా
దే యాఱువేల పే రిడి, రీయన్వయమునకు నేవ్య మెఱిఁగినపెద్దల్. 48

వ. ఇట్టిసంతానలతావితానంబునకు మూలకందం బనం దగుతిక్కనామాత్యునసుసంభ
వుండు. 49

చ. బలమున సాహలాయుధుఁ డపారపరాక్రమలీలయందుఁ గే
వలమృగరాజు రూపవిభవంబున వాసవసూతి నీతికౌ
శలమున నయ్యుగంధరుఁడు సత్యనిరూఢిని ధర్మజుండు నా
నిల నుతి కెక్కె మమ్మరథినీశ్వరుసింగన బంధుకోటిలోన్. 50

వ. అతనియతివ యెట్టి దనిన. 51

సీ. రమణీయ మైనభారద్వాజగోత్రవర్ధనుఁడు సింగనమంత్రి తనకుఁ దండ్రి
యఖిలసంపదలకు నావాసభూమి నాఁ దగునన్నమాంబిక తనకుఁ దల్లి
ఘనుఁడు నారనమంత్రియును గదాకుశలుండు మారనార్యుండును మహితమూర్తి
సింగధీమణియును ననంగనన్నిభుఁడు మాచనమంత్రియును సర్వసన్నుతుండు
తే. వల్లభన్నయు ననఁగలవారు తనకు, ననుఁగుఁదమ్ములుఁ దా శోభళాంబ యనఁగ
నలరునయ్యింతి తనకు నిల్లాలు గాఁగ, మహితగుణశాలి సింగనమంత్రి వెలసె. 52

ఉ. అతనినందనుల్ హరిపదాబ్జరతుం డగుసింగమంత్రి ని
ర్జితుఁడు చిట్టయన్నయుఁ గభీరగుణాఢ్యుఁడు మమ్మదన్న ప్ర

ఖ్యాతుఁడు సింగశౌరి ఘనుఁ డౌ తిరువెంగళసింగరన్ననా
నాతతసచ్చరిత్రముల నన్వయపావను లైరి మేదినిన్. 53

వ. ఇట్టి పుత్త్రరత్నంబులచేత నలంకృతుం డగుసింగనమంత్రి సౌమిత్రియుం బోలెఁ దనకు ననవరతప్రీతి గావింప నస్మదీయజనకుం డగుతిక్కనామాత్యచంద్రుఁడు రామచంద్రుఁడునుం బోలె ధీరోదాత్తగుణోత్తరుండై మెఱయుచుండు. 54

ఆ. దేవతాన్వయంబు దేవేంద్రుచేఁ బోలె, మహితపుణ్యుఁ డైనమనువుచేత
క్షత్త్రకులము వోలెఁ గౌండిన్యగోత్రంబు, వెలసెఁ దిక్కమంత్రివిభునిచేత. 55

వ. మఱియు నవ్వంశంబు హరివంశంబునుం బోలె గోత్రోద్ధరణాద్యచ్యుతవ్యాపార సారంబును రామకటాక్షంబునుం బోలె జనకతనయాంతర్గతానురాగరసపోషణం బును ధనంజయాంకపీఠంబునుంబోలె సుభద్రాధిష్ఠితంబును జంద్రబింబంబునుం బోలెఁ గువలయానందకరంబును సూర్యగతియునుం బోలె ననుదినాభ్యుదయోపశోభితం బును నారాయణునినాభికమలంబునుం బోలె శతానందసుందరంబును గంగా ప్రవాహంబునుం బోలె శుద్ధజీవనసమృద్ధంబును సరోవరంబునుం బోలెఁ గమలావాస భాసురంబును ఛందోలక్షణంబునుం బోలె సమవృత్తాధికారయుక్తంబును వీణావి శేషంబునుం బోలె నానాగుణగణనీయంబును సురతరునికరంబునుం బోలె సంతా నవంతంబును నగుచు సంబంధిబంధువులవలన నదనదీసముదయవిహారాకరం బగు సాగరంబును మిత్త్రలోకంబువలనఁ గేకినికరాలోకనకుతూహలకారణం బగు జీమూతజాతంబును బౌత్త్రవర్గంబువలన బహువిహగసమాశ్రయం బగుఫలితతరు షండమండలంబును సముచితసంభావితకవితావిశారదులవలన మదభృంగసంఘాను షక్తం బగుపుష్పవాటంబును సతతసమాగతాతిథిజనంబులవలన నదిలిసుతసంకులం బగునమృతరసోపేతభోగమంటపంబును ననుకరింపుచు నుండు. 56

క. ఏతద్వంశపయోనిధి, శీతాంశుఁడ బుధచకోరచిత్తప్రియుఁడన్
వీతకళంకుండఁ గళా, పేతుఁడ నిర్ధూతదురితపృథుతిమిరుండన్. 57

క. నరహరిచరణసరోజ, స్మరణామృతపానసతతసంతుష్టాంతః
కరణుండ సంతతవాణీ, వరప్రసాదానులబ్ధవాగ్విభవుండన్. 58

క. శ్రీయంబవతీకారుణ్యా, స్పాయత్తకటాక్షవీక్షణాపాదితసు
శ్రేయస్కుఁడఁ గవినికరవి, ధేయుండ ననంతనామధేయుండ జగతిన్. 59

సీ. సకలవిద్యలయందుఁ జర్చింపఁ గవిత యుక్తక్లుప్త మంత్రాదినిత్యకీర్తిగాంచు
నర్థాప్తిగాంచు నా వ్యవహారలక్షణం బెఱిఁగెడుగాంచు ననేకవిధము

లగునమంగళముల హరియించుకొఱకు నుచితనిత్యసౌఖ్యసంసిద్ధికొఱకు
నొనరఁ గాంతాసమ్మితోపదేశంబునఁ బ్రీతిమై హిత మాచరించుకొఱకు

ఆ. నయ్యెఁ గానఁ బెద్ద లాచరించెద రంచు, నేర్పుకొలఁదిఁ గృతి యొనర్పఁ బూని
యస్మదీయకృతికి నధిపతిఁ గావింప, నర్హుఁ డెవ్వఁ డొక్కొ యని తలంచి. 60

క. మనమునఁ దలపోయుచు నటు, గను మోడ్చినవేళ యొక్కఘనతరతేజో
ధనుఁ డస్మత్స్వప్నంబున, ననుకంపాయత్తచిత్తుఁడై పొడచూపెన్. 61

సీ. అభవ్యుఁ డఖిలచరాచరాంతర్గతుం డైనయాదిమవిష్ణుఁ డని యెఱింగి
యాదేవుదివ్యభవ్యావతారంబుల నిట్టి యద్భుతమూర్తి యెద్దియొక్కొ
యని చూచుచో మందహాసచంద్రిక గల్గుసింహవక్త్రంబునఁ జెలువ మైన
మనుజదేహంబును మహితాంకతలమున నక్షీణసంపత్కటాక్షరుచులఁ

ఆ. దనరుకాంతయును సుధాధామరుగ్ధామ, సమము లైనశంఖచక్రములును
దివ్యమాల్యములును దివ్యాంబరంబులు, దివ్యభూషణములుఁ దేజరిల్ల. 62

క. ఆమూర్తికి నీమూర్తికి, నేమిని భేదం బనంగ నింపగురూప
శ్రీమహిమఁ దనరి మద్గురుఁ, డామూర్తిన కడిసి యుండి యాదర మెసఁగన్. 63

ఆ. "ఇందు రమ్ము వత్స యేను నీమీఁదికృపాతిశయము పేర్మి నరుగుదెంచి
నాఁడ" ననుచుఁ బిలిచి న న్నాదరించి ప్రహర్షవార్ధి నోలలార్చి యపుడు. 64

చ. అదె జగదేకవంద్యుఁ డగురాదినృసింహునిదివ్యరూపసం
పదఁ గనుఁ గొంటి సర్వసులభంబుగ నీకృతిలక్ష్మికి న్వరుం
డొదవె ఫలించె నీతలఁపు యోగ్యుఁడవైతి యశోవిభూతి క
య్యుదధివరేణ్యుచాడ్పున మహోన్నతజీవనవైభవంబునన్. 65

ఉ. కావున నిమ్మహాత్ము నవిఖండితతేజుఁ గృపావిధేయు భ
క్తావనశీలుఁ బావనతరాంఘ్రిసరోరుహజాతదేవతా
శైవలినీకు నాకలితచక్రు నహోబలతీర్థనాయకున్
శ్రీవనితాధినాథుఁ బతిఁ జేయుము నీకృతికిన్ లసన్మతిన్." 66

వ. అని యుపదేశించె నంత నమ్మహామూర్తియుం దదనురూపంబు లగుమధురాలాపం
బుల నన్ను గారవించె నంతన మేలుకని యేను బెద్దయుం బ్రొద్దు తదీయధ్యానా
నందనిష్పందం బగుడెందంబుతో ననన్యసులభం బగునప్పరమసౌఖ్యంబు ననుభవించి
"నృసింహా! యిది యంతయు నీకృపావిశేషంబుగా నిశ్చయించి నీమహానుభావంబు
భావించి. 67

సీ. వేదంబు లేదేవుపాదాబ్జములయందు ననిశంబు మ్రోయు నయ్యలులభంగి
నలువ యేదేవునినాభిసరోవరంబున నంబుపక్షులపోల్కిఁ జదువు

శేషుఁ డేదేవునిచెవిఁ జేరి యాప్తవర్గము వోలెఁ బరమార్థసమితిఁ బల్కు
నింద్రాదిదేవత లేదేవుఁ గైవార మొనరింతు రవ్వందిజనులభంగి

ఆ. నట్టిదేవదేవు నఖిలాండనాయకు, నాదివిభు నహోబలాధినాథు
వరదుఁ బరమపురుషు శరణాగతత్రాణు, బరునిఁ బ్రస్తుతింప నోరులవశమె. 68

వ. అట్లు గావున. 69

చ. తెలియఁగఁ దొంటిపెద్దలకవిత్వము వోలె రుచించు నొక్కొ యేఁ
బలికెడు మాత్మకావ్యరసభావము లైనను భూమిఁ దల్లిదం
డ్రులకు నిజాగ్రసూనులపటుప్రచురోక్తులకంటెఁ జిన్నబి
డ్డలనడతొక్కుఁబల్కులు దృఢం బగుముద్దుల నీన కుండునే. 70

వ. అనిన నీవగుజగద్గురుత్వం బుపలక్షించి మఱియును. 71

చ. సదయుఁ డహోబలేశుఁడు ప్రసన్నగుణాఢ్యుఁ డనాగనాథుఁ డై
చదువులకుం గరంగఁడు నిజం బగుభక్తిరసోక్తిఁ బోలె ముక్
జదివినభార్గవాదులకు సన్నిధి చేసెనె దైత్యజాతుఁ డ
య్యదన సమస్తమందుఁ గలఁ డంటకు దృష్టము చూపిన ట్లొగిన్. 72

క. ఇది సార మిది యసారం, బిది యల్పము ఘన మి దనక యెందును దానై
పొదలుటఁ దెలుపఁడె దితిసుత, సదనస్తంభమున నెల్లజగములు నెఱుఁగన్. 73

ఉ. పోఁడిగ నెందునుం గలఁడు పొమ్మనుదాసునిజిహ్వనుండియో
వేఁడి రమావిభుం డనెడివీఱిఁడి దైత్యునిదృష్టినుండియో
వాఁ డిది ప్రేయుం డింక నని వావిఁ గంబమునందు నుండియో
నాఁ డటు లుద్భవించుట యనం దగుసర్వగతాత్ముఁ డల్పుఁడే. 74

సీ. మశకపిపీలికామక్షికాప్రభృతులై చరియించునజ్ఞానజంతువులకుఁ
దృణగుల్మభూరుహవృషదాదికంబులై చనుజడస్థావరజాతమునకు
నపవర్గసుఖసిద్ధి యఱచేతిధన మన్నఁ దెలివియుం భక్తియుఁ గలుగునట్టి
జనులకు గమనాగమనశూన్య మగునాఖ్యగతి బ్రాతి యిది యీయగణ్యపుణ్య

ఆ. తీర్థసేవన వినుతింపఁ బెంపారు నత్యుత్తమ మయి మహి నహోబలాఖ్య
తీర్థ మిట్టిమేటితీర్థమునకుఁ గర్త, యగునృసింహుమహిమ యడుగ నేల. 75

క. కనుఁగొనిన నధిక సుకృతము, వినినం గల్మషహరంబు వెల యఁగఁ జిత్తం
బునఁ దలఁప మేలు సేయుఁ, జనదే హరి నాశ్రయింప సత్పురుషులకున్. 76

వ. అని పురాణవేదు లగునాదిపురుషులు చెప్పునపుణ్యవచనంబులు మున్ను విని యుని
కిం జేసి నిశ్చింతుండనై. 77

సీ. నూతనం బయ్యుఁ బురాతనకృతులట్ల సంతతశ్రవ్యమై జరుగు ననియు
నాదిరాజసమానుఁ డగుభోజభూపతిచరిత మీకవితాప్రసంగ మనియు
నిందుఁ జెప్పెడికథ లిన్నియు నోలిఁ బ్రశస్తధర్మోపదేశంబు లనియు
నఖిలజగన్నాథుఁ డగునహోబలనాథుఁ డీపుణ్యకృతికి నధీశుఁ డనియుఁ
ఆ. బృథివి నెల్లజనులు ప్రియభక్తిఁ బా, టింతు రనియు నూఱడిల్లి యేనుఁ
బరమసౌఖ్య మైనభవదాభిముఖ్యంబు, నెమ్మిఁ బడసి యధికనిష్ఠతోడ. 78

సీ. వర్ణితప్రహ్లాదవాక్యజయస్తంభ మగుమహాస్తంభంబునందు వెడలి
సురసిద్ధఖేచరవరయోగిహృద్ధ్యేయ మగుమహోజ్జ్వలకాయ మమరఁ దాల్చి
భూరిదానవవంశపూర్ణతటాకంబుకట్టు నాఁ దగుదైత్యుపొట్ట వ్రచ్చి
శిష్టజనప్రజాభీష్టదానసమర్థ మగునహోబలతీర్థమందు నిలిచి
తే. యవని నాబాలగోపాల మగుసమస్త, జీవులకు నందుబడి యైనదేవభూజ
మయ్యె నే దేవుఁ డట్టిమహానుభావు, నాదినరసింహదేవుని నాశ్రయించి. 79

## షష్ఠ్యంతములు

క. అనితరసదృశమహాత్మున, కనిమిషవంద్యునకు బుధజనారాధ్యునకున్
వినమితసుత్రామునకును, ఘనతరకలిదోషతిమిరకమలాప్తునకున్. 80

క. ఇనతాసుతగమనునకును, మనసిజజనకునకు నబ్ధిమందిరునకుఁ బా
వనతరమూర్తికి సన్ముని, మనస్సరోజాంచితభ్రమరవర్యునకున్. 81

క. తామరసోదరునకు నుద్దామభుజావీర్యనిర్జితప్రతిభటపూ
ర్వామరునకు నజరామర, తామహిమాస్పదునకును బుధప్రతిమునకున్. 82

క. భవనాశనీనదీతీ, రవిహారోత్సుకకు నిందిరాననకేళీ
ప్రవణునకును యోగానం, దవినిర్మలమూర్తికిని సుధామయమతికిన్. 83

క. శ్రీదేవీవరునకుఁ బ్రహ్లాదవచనపాలమోదితాత్మునకు జగ
న్మోదావహాకారణునకు, నాదినృసింహున కహోబలాధీశునకున్. 84

వ. అఖిలజగద్ధితావతారుండ వగునీకు విన్నపంబు సేయువిధంబుగా నే నొనర్పంబూనిన
కథాప్రసంగం బవధరింపుము. 85

క. సూత్రకథ భోజరాజచ, రిత్రమయా నడుమ ధర్మరీతులు నీతుల్
చిత్రకథలై తలిర్పఁగ శ్రోత్రసుఖముగా నొనర్పఁ జొప్పడి యుండున్. 86

వ. అదియును దత్తాత్రేయమునీంద్రుండు వక్తయును మహాలం డనుకాంభోజమహీశుండు శ్రోతయుంగా నధిగతవిద్యాసమాజుం డగుభోజుండు పూర్వజన్మంబున బ్రాహ్మణుండై యుండి దారిద్ర్యభారంబు తోరం బగుటవలన సంభవించినవిరక్తికారణంబుగాఁ దీర్థయాత్ర చేయుచుఁ బ్రయాగయందు నిష్టకామ్యసిద్ధి పొంది శరీరవిసర్జ

నంబు చేసి సజ్జనప్రియుండై పుట్టి లాటదేశంబునందు ధారానగరంబున కధీశ్వ
రుండై రాజ్యంబు సేయుచు నొకనాఁడు మృగయావినోదార్థంబు వనంబునకుం
జని యందు సర్పటి యనునొక్కసిద్ధపుంగవుం గని తనపట్టణంబునకుఁ దోడ్కొని
వచ్చుటయు వాఁ డట్లు చనుదెంచి యొక్కరాత్రి రహస్యవృత్తిం దనప్రభావంబు
నెఱపం దలంచి పంచలోహమయంబై యొప్పు నప్పుడమిఱేనికొలువు చవికెం
దనచేతధూమవేధి యనునౌషధంబుచేత శుద్ధసువర్ణంబు గావించి యెందేనియుం బో
వుటయు మఱునాఁ డవ్విధంబు చూచి యాయద్భుతకర్మంబు సర్పటికృతం బని
యతని వెదకించి కానక యొక్కకృతకమతంబున నాకర్షించి భోజుండు ధూమ
వేధి దా నపహరించుటయు నతండు కోపించి శాపం బిచ్చుటయుఁ దదీయప్రార్థనం
బున శాపంబుఁ గ్రమ్మఱించుటయుఁ దదనంతరంబుభోజననిమిత్తంబున భోజసర్పటు
లకు సంవాదవశంబున వివిధపుణ్యకథాప్రసంగంబులు పుట్టుటయు ననువృత్తాం
తంబులం గలిగి యిక్కావ్యంబు సర్వజనాకర్ణనీయంబై భోజరాజీయం బను పేరం
బరగుఁ దత్ప్రారంభం బెట్టి దనిన. 87

క. మహితసముజ్జ్వలతేజుఁడు, విహితాచారైకరతుఁడు వీరవినోద
స్పృహుఁడుబహుకార్యదక్షుఁడు, మహుఁడనుకాంభోజరాజు మహిఁ గడునొప్పెన్.

శా. అంభోరాశిగభీరుఁ డూర్జితయశోహారుండు ధర్మక్రియా
రంభస్వాంతుఁడు నీతిమంతుఁ డసిధారాతీర్థనిర్ముక్తసం
రంభారాతిబలుండు భూరిబలుఁడై రాజ్యంబు చేసె న్మహిం
గాంభోజక్షితినాథుఁ డున్నతబహూత్సాహాఢ్యుఁ డత్యున్నతిన్. 89

క. ఆనరపతిరాజ్యంబున, మానవు లందఱును ధర్మమార్గప్రవణుల్
దానత్యాగపరాయణు, లానందరసార్ద్రచిత్తు లధికధనాఢ్యుల్. 90

క. నరు లడిగినట్లు వానలు, గురియుచు సస్యములు పండుఁ గోలఁదికిమిగులన్
సురభులు ఘనముగఁ బిదుకును, ధరణిఁ బ్రజావృద్ధి తనరుఁ దద్రాజ్యమునన్. 91

వ. ఇట్లు సకలజనానురాగం బగురాజ్యంబు నిరంతరపూజ్యంబై చెల్లుచుండఁ బెద్దకాలంబు
చనుటయుఁ బురాకృతకర్మంబు కారణంబుగా నప్పుడమిఱేని మేన నతినికృష్టం బగు
కుష్ఠరోగంబు ప్రవేశించిన. 92

ఉ. రాజుల మంచు లావునఁ బురాకృతకర్మముఁ ద్రోవఁ దీర దే
హోజను ముల్ శుభాశుభము లొందక యంచు విరించి యత్తఱిన్
భూజనకోటికిం దెలుపఁ బూనెనొకో యన నేమి చెప్పఁ గాం
భోజనరేంద్రుఁ డాతెవులు పోవఁగఁ ద్రోవఁగ లేఁడ యెమ్మిటన్. 93

వ. అట్లుండి యుండి. 94

ఉ. "అక్కట యేమి చేయుదు మహౌషధసేవల దేవసేవలన్
దక్కక యీమహారుజ వృథాపరితాపముఁ బొంద నేల నే
నిక్కడ నుండి చేయుపని యెయ్యది గౌతమి కేఁగి యందులో
ద్రుక్కక మేను వైతు మఱి రోగము గీగము మాను నంతటన్." 95

క. అని తలఁచి తనదుతలఁ పై, వ్వనికిఁ బ్రకాశింప కుండ వసుధాపరిపా
లనమునకుం దశతనుజ, న్మని నునిచి నిగూఢమార్గమున వెలువడియెన్. 96

వ. ఇట్లు కృతనిశ్చయుండై యరుగుదెంచునారాజు రాకఁ దనదివ్యజ్ఞానంబున నెఱింగి యమ్మహానది యాత్మగతంబున. 97

ఉ. "ఈతఁడు నన్నుఁ జొచ్చి తన హేయపుదేహము నుజ్జగించి ప్ర
ఖ్యాతిగ నూర్ధ్వలోకములు గాంచుటకుం జనుదెంచుచున్న వాఁ
డీతని కుష్ఠగంధము సహించుట దుష్కర మేమిభంగిఁ బో
ద్రోతునొకో యితండు కడుదూరమునంద తొలంగునట్లుగన్." 98

క. అని తలఁచి తగనుపాయము, గని మునిభామినివిధంబు గైకొని శీఘ్రం
బున నతఁడు వచ్చుమార్గం, బున కెదురుగ నొక్కమ్రానిపొంత వసించెన్. 99

వ. అయ్యవసరంబున. 100

క. ద్రుక్కిన యంగుళములు దళ, మెక్కిన దేహమును గాంతి యెడలిన మొగమున్
[1]మక్కినచెవులును ముడిఁగిన, ముక్కును నై వచ్చి మహుఁడు ముద్దియఁ గనియెన్.

చ. కని మునిభామ గాఁ దలఁచి గ్రక్కునఁ జేరి నమస్కరించి మో
డ్చినకరయుగ్మము న్నెదుటఁ జేర్చిన నావనితాలలామ దీ
వన లొకకొన్ని యిచ్చి "బుధవత్సల యెచ్చట నుండి వచ్చి తే
పని కెట పోయె దీవు పరిపాటిగఁ జెప్పుము నాకు" నావుడున్. 102

వ. "ఏను గాంభోజదేశంబుననుండి వచ్చితి నాపోయెడిపని యే మని చెప్పుదుఁ దల్లి! తొల్లి మహా మహీభారధారేయుండనై యుండునప్పుడు సకలజనంబులకు దృష్టిప్రియంబై యుండునట్టినాగట్టియొడలి కిట్టికట్టిఁడిరోగంబు దైవకృతంబున సంభవించిన. 103

చ. కడుకొని కామినీజనుల కౌఁగిట నే మని యుండువాఁడ నా
కొడుకులఁ బొత్తునం గుడువఁ గొంకక యేమని పిల్చువాఁడ నా
యెడ కరుదెంచుసేవకుల కే మని యేఁ గొలు విచ్చువాఁడ నే
కడ చనువాఁడ నేది కడగా నిటు వేగెడువాఁడ ధీరతన్. 104

చ. అని మది రోఁత పుట్టుడు రయంబున గౌతమి కేఁగి యందులోఁ
దనువు తొఱఁగువాఁడనయి తత్పరతం జనుచున్న వాఁడ నే"

1. మొక్కినచెవులును మునిఁగిన, ముక్కును (శ. ర. పా.)

ననవుడు "నమ్మ చెల్ల" తను వాఱికిఁ బుచ్చుట ధర్మమార్గమే
జనహితులైన రాజు లిటు చచ్చిన మెత్తురె శాస్త్రకోవిదుల్. 105

చ. అదియును గాక పూర్వకృత మైనయఘంబులు వ్యాధిరూపమై
పొదివినఁ దాను గైకొనక పోవునె చచ్చినఁ గర్మశేషమై
వదలక క్రమ్మఱం దగిలి వచ్చుట సిద్ధ ముపాయయుక్తిమై
మెదలినఁ గీడు తప్పుఁ దుది మే లొదవున్ విను నిక్క మెంతయున్. 106

వ. కావున నీ కొక్క యుపాయంబు చెప్పెద సకలజనవిధేయుం డగు నారాయణదేవుండు దత్తాత్రేయుం డను నామధేయంబుతో హేమకూటశైలంబున నున్నవాఁ డందుచనిన నీకోర్కి సఫలం బగు నయ్యోగీశ్వరేశ్వరుండును మనుష్యులకు దృష్టిగోచరుండు గాఁ డతనిఁ గనుటకై యొక్కమంత్రంబు చెప్పెద నది యనుష్ఠించునప్పుడు గౌతమియందు దర్శనస్పర్శనాదుల వర్జింప వలయు నట్లు చేయనినాఁ డీమంత్రంబు పనిచేయ"దని చెప్పి యెప్పుడు నతండు తన్నుఁ దడవకుండునట్టివైరాగ్యంబు పుట్టించి యొకమంత్రం బుపదేశించి యతని మరలించి గౌతమి యథేచ్ఛాం జనియె నది యట్ల కాదె. 107

క. ఉత్తము లాశ్రితులఁ గృపా, యత్తతఁ జేపట్టి ప్రోతు రటు గాకున్నన్
రిత్త చనఁ జేయ రొండుని,మిత్తంబున నైన బ్రతుకు మెఱుఁగొనఁ జేతుర్. 108

వ. అట్లు గౌతమిచేత నివర్తితుం డయి పోయి. 109

ఉ. సానుపరాగవస్త్రముఁ బ్రశస్తఫలాన్వితవృక్షవాటికా
నూనసువర్ణభూషణము నూర్జితపుష్పసమంచితాగ్రసం
హీనమణివ్రజాంచితము నిష్టసమాహితసింహపీఠమున్
బీనతటస్థితాబ్జహితబింబకిరీటము హేమకూటమున్. 110

చ. కని మహిఁ జగ్గిరిం గదిసి క్రమ్మెడు నశ్రులు నిర్ఝరంబులై
తనర మహీభృదాఖ్య యుచితంబుగ నున్నతమూర్తితోఁ బ్రతి
ధ్వనికరణిన్ సుభాషితరవంబు చెలంగ నిజాంగరోగవే
దన మది డిగ్గఁ ద్రావి నడదాల్చినచుట్టపుఁగొండయో యనన్. 111

ఆ. అట్లు గదిసి యాతఁ డాపర్వతాగ్రంబు, నందు నొక్కరమ్య మైనచోట
విపులనిష్ఠతోడఁ దప మాచరింపంగ, మెచ్చి కృతకవేష మచ్చుపడఁగ. 112

ఉ. విల్లును నమ్ములుం గలము వేడుకఁ గైకొని సారమేయముల్
వెల్లుగఁ దోడ రాఁగ నతిభీషణమూర్తి వహించి యమ్మహీ
వల్లభుఁ డున్నచోటికి నవారణమై ననసూయపట్టి గ
ర్జిల్లుచు వచ్చెఁ గ్రూరుఁ డగుచెంచునుఁ బోలి మహారఘుంబునన్, 113

చ. ఇటు చనుదెంచువానిఁ గని యాతఁడ పో మునిభావ మాఁక న
క్కటికముతోడఁ జెప్పినయఖండితతేజుఁ డితండు నన్నుఁ గా
చుటకుఁ బ్రసన్నబుద్ధిఁ బొడచూపెఁ గృతార్థుఁడ నైతి నంచు నా
దట నెదు రేఁగఁ జూచుటయుఁ దా నటు క్రమ్మఱఁ బాఱెఁ గానకున్. 114

ఉ. పాఱఁగ నమ్మహీపతియుఁ బాయక తోడన పాఱెఁ బాఱి న
క్కాఱడవిం గిరాతతతి కాఁపుర ముండెడుపల్లె సొచ్చి పె
న్మోఱకుభంగి మాంసములు ముక్కనబంటిగ మ్రింగుచుండ నై
వాఱెడుభక్తి నత్రిమునిపట్టియ కా మదిలోఁ దలంచుచున్. 115

వ. ఏవగింపక కదియంబోయి దండప్రణామంబు చేసిన నతండు దన్నుఁ గైకొనకకళబ
రాలయంబు వెలువడి పఱవం దొణంగిన. 1'6

ఉ. "ఎచ్చటి కేఁగె దిం కిట మునీశ్వర యేనును దోన వత్తు నీ
వొచ్చినచోన చొత్తు ననుఁ జూడఁ గదే కృప నంచు" నాత్మలోఁ
బొచ్చెము లేనిభక్తి నృపపుంగవుఁడుం బఱతెంచు చుండఁగా
వచ్చి మునీంద్రుఁ డంత్యజులవాడ విశృంఖలవృత్తిఁ జొచ్చినన్. 117

వ. అందుండి సురాపానశీలు రగుచండాలు రనేకు లెదురువచ్చి తోడ్కొని పోయి
హృద్యం బగుమద్యభాండంబు చూపుటయు నయ్యుందఱికి మొదటివాఁడై తదీయో
చితకర్మంబులు నడపుచుండ నతనిచరిత్రంబులు చూచి రోయక మహాం డమ్మహా
మునిచరణాంబుజంబులు తనశిరంబు సోఁకునట్లుగాఁ బ్రణమిల్లిన నున్మత్తునిభంగి
మత్తాలాపంబులు పలుకుచు నట పోయి పర్వతాగ్రం బెక్కిన నతండును దోడన
యెక్కి యక్కపటవేషధారి ని ట్లని స్తుతియించె. 118

చ. "తిమిరము గప్పిన న్నిఖిలదిక్కుల నీదగుమంచు పర్వి చి
త్తములకు భ్రాంతిఁ జేయుడును దథ్యము మిథ్యయుఁ గానలేక భూ
తములు భవాబ్ధిలోఁ బడుఁ బడంపడి నీకృపఁ జేసి ఘోరసం
తమసముఁ బాసి నిర్మలపదంబున సౌఖ్యముఁ బొందు నచ్యుతా! 119

క. చేరువ నుండియుఁ దెక్కుడు, దూరంబై యుండు దళిలదుష్టాత్ములకున్
దూరమున నుండియును గడు, చేరువయై యుండు దలివిశిష్టాత్ములకున్. 120

ఆ. దండిమీన వైతి తాఁబేల వైతి సూకరమ వైతి నరమృగంబ వైతి
వళ్వకంధరుండ వైతి నీభావ మేభావ మని తలంతుఁ బద్మనాభ! 121

క. ఇచ్చటఁ గిరాతవేషం, బచ్చుగ ధరియించి తంత్యజాకారతకుం
జొచ్చితి నీ విట్లైనను, బొచ్చెముగాఁ దలఁప బుద్ధి పుట్టదు నాకున్. 122

ఉ. అత్రిమహామునీశ్వరుతపోవనిజాతసత్ఫలంబు దే
వత్రయమాత గాఁగఁ జెలువం బగునయ్యనసూయ సెయ్యపుం
బుత్రుఁడు తోయజాతభవభూతగణేశులతోడఁ బుట్టు దాఁ
జిత్రచరిత్రుఁ డంచు నినుఁ జెప్పుదు రార్యులు యోగిపుంగవా! 123

వ. నీవార్తశరణ్యుం డగుదత్తాత్రేయమునీశ్వరుండవు గావే" యని బహుప్రకారంబులఁ బ్రస్తుతించునతనివాగ్జాలంబునకుఁ జాల రంజిల్లి యమ్మునీంద్రుండు. 124

ఉ. కందును గుందు లేనిశశికాంతి వహించినసెమ్మొగంబుతోఁ
జెందొవఱేకులం జులకచేయుజటావళితో సముద్యదిం
దిందిరబృందముం దెగడుదేహముతో సితపద్మపత్రరే
ఖం దనరారునవ్వెడఁదకన్నులఁ దోఁచుకృపారసంబుతోన్. 125

వ. నిజరూపంబు చూపి "యోరీ నీవు నాకందువయె ట్లెఱింగి" తనిన నతండు భయభక్తిసంభ్రమంబులు ముప్పిరిగొనుచుండఁ బ్రణామంబులు చేసి "దేవా! విన్నవించెద నవధరింపు" మని యిట్లనియె. 126

క. "రోగమున కోడి ప్రాణ, త్యాగము సేయుటకుఁ దెంపు దలకొనుమదితో
నాగౌతమి కరుగుచు సెల,నాగను బొడగంటి నొకవనస్పతిపొంతన్. 127

క. కని ప్రణమిల్లిన నయ్యం,గన నావృత్తాంత మడిగి కడు వగచి తపో
ధనవంద్య నిన్నుఁ జెప్పెనఁ, బనివిని నీకృపకు నేడు పాత్రుఁడ నైతిన్. 128

వ. ఆయవ్వ యెవ్వ రగుటయు నెఱుంగ" ననవుడు దత్తాత్రేయుండు తనయోగదృష్టివలన నది గౌతమి యగుటయు నితనిపాపంబులు భరియింప నోపక యిట్లు చేసె ననియు నెఱింగి యాతని నూఱడించి "యేను బ్రతిదివసంబును బ్రాతరుచితకృత్యంబులు ప్రయాగయందుఁ జేయుదు మాధ్యాహ్నికానుష్ఠానంబులు హేమకూటపర్వతంబున ననుష్ఠింతు నిశాసమయకృత్యంబులు శ్రీరంగధామంబున నొనరింతు నిది నాకు నియమంబై చెల్లు నీత్రిస్థానంబులును నాకు నతిప్రీతికరంబు లయి యుండు నట్లు కావున నింతప్రొద్దు శ్రీరంగంబునకుం జని రేపకడవచ్చి నిన్ను రోగవిముక్తుం జేయుదు నావచ్చునంతకు నిచ్చోటన యుండు" మని విజయంచేసిన. 129

క. ఆరాత్రి మహుఁడు తనదు,ర్వారదురితలతలు ఱే పవశ్యము దెగు నం
చారూఢిఁ గౌతుకము మదిఁ, గూరఁగ నిద్రించె నచటఁ గుశలత్వమునన్. 130

వ. మఱియుఁ బ్రభాతసమయం బగుటయు నమ్మహీపతికి నద్దివసంబున సంభవించుశరీరనైర్మల్యంబు సూచించుచందంబున నంధకారంబు విరిసె నతనియంతర్గతానురాగంబు దీపించురూపం బెఱింగించుతెఱంగునఁ బ్రాగ్దిశాభాగంబునఁ గెంజాయ పొడమెఁ దదనంతరంబ. 131

క. చక్కవ లలరఁ జకోరము, లుక్కఱఁ గమలములు విరియ నొగిఁ గైరవముల్
స్రుక్క సమస్తజనంబులు, మ్రొక్క దిశలు వెలుఁగ భాస్కరుఁడు పొడతెంచెన్.

వ. అప్పు డప్పుడమిఱేఁడు యథోచితకృతప్రాతరనుష్ఠానుండై యమ్మునిశ్రేష్ఠునకు నెదురు
చూచుచుండె నంత. 133

క. తొలునాఁ డవ్విభు నచ్చోఁ, నిలిపి చనిన యోగిరూపసిరజనాభుం
డెలమి దళుకొత్త లక్ష్మీ, లలనాసహాశయనకేళిలాలసగతులన్. 134

చ. వెలఁగుచు రంగధామమును జెంది విభావరి పుచ్చి వేకువన్
వెడలి ప్రయాగ కేఁగి సురనిమ్నగయందుఁ బ్రభాతకృత్యముల్
సలిపి నృపాలుపాలికిఁ దలంచినమాత్రన వచ్చెఁ గ్రేపుపై
నొలసినమక్కువన్ సురభి యుద్దవడిం బఱతెంచుచాడ్పునన్. 135

వ. ఇట్లు చనుదెంచి యతనియవయవంబులయందుఁ దనపాదరేణువు చమరి యరోగ
దేహుండవు గ మ్మని యనుగ్రహించిన. 136

క. తొడిగినకుప్పస మూడ్చిన, వడువున నారాజుమేన వసియించినయా
కడిఁదిరుజ లెల్లఁ బాసిన, నొడ లొప్పె సువర్ణభాతి నుజ్జ్వల మగుచున్. 137

చ. కమలము నాచు వెల్వడి వికాసము నొందినయట్లు మించుట
ద్దము తెర పుచ్చినట్టులు సుధాకరబింబము కందు వాసిన
ట్లమరినకాంతి నొప్పె విగతామయభావ మెలర్ప నమ్మహీ
రమణునినెమ్మొగంబు రుచిరం బగునేత్రమరీచు లొప్పఁగన్. 138

క. తనమేను తాఁ గనుంగొని, మనమున నాశ్చర్యరసనిమగ్నుం డగుచున్
జనపతి ప్రహృష్టమతి నమ్మునిపతికి బహుప్రణామములు దగఁ జేసెన్. 139

వ. అప్పు డమ్మునీంద్రుండు. 140

ఆ. "అడుగు మింక నెట్టియభిలాష" యనిన "నా, కింతకంటెఁ గోర్కి యేమి గలదు
స్వామి! యీకథాప్రసంగంబు వినువారు, నిరయరహితు లగుచు నెగడనిమ్ము." 141

వ అని జగద్ధితలబ్ధవరుండై యాభూవరుండు. 142

ఉ. "ఓమునినాథచంద్ర! కరుణోర్జితచిత్త! త్వదీయదర్శనం
బేమి యొనర్ప లేదు కడ యెవ్వరుఁ గానఁగ లేరు నీమహా
త్మ్యామృతవార్ధికే ననఁగ నల్పుఁడ నెంతటివాఁడ నార్తర
క్షామణి వీవు నీకు సరిగల్గునె యెన్నఁడు నేజగంబునన్. 143

ఆ. ఏను వెనుక రాఁగ నేఁగుచో నప్పుడు, చోరఁగరానియిండ్లు చొచ్చి తీవు
భవ్యమూర్తి వైనబ్రాహ్మణదైవంబ, వట్లు చేయ నేల" యనిన నగుచు. 144

ఉ. "నన్ను దృఢంబుగా నెఱిఁగినాఁడవు నాకుఁ బ్రవేశభూములై
యున్నగృహంబు లేల తెలివొందవు? భూవర! చెంచుపల్లెయుం
బన్నగ సంత్యజవ్రజముపట్టును నాశ్రమభూము లందుఁ గాఁ
పున్నజను ల్మను ల్గదుపయుక్తములు న్వివు మర్హభోజ్యముల్. 145

క. ఆమాయలచేఁ బ్రమియక, నీమనము ప్రబోధవీథి నిలుచుటఁ గాదే
యీమేలు గలిగె గౌతమి, యామహితహితోపదేశ మఫలం బగునే. 146

వ. కృతార్థుండ నైతి నా"మ్మనిన నతండు మఱియు నిట్లనియె. 147

ఉ. "నీవు జగన్నివాసుఁడవు నీకు సమస్తము నొక్కరూప యి
ట్లైవిలసిల్లుచుండియుఁ బ్రియంబు ప్రయాగము హేమకూటముం
తా వగురంగధామము నవం గలతావులు మూఁడు నంటి ల
క్ష్మీవర! యందుఁ జొప్పడువిశేషము నాకు నుపన్యసింపవే." 148

క. అనవుడు దత్తాత్రేయుఁడు, "జనవర! శ్రీరంగమహిమ సర్వము నీకుం
మును వినిపించెద నేర్పున, విను" మని యిట్లనియెఁ గరము వేడుకతోడన్. 149

ఉ. "ఆదికి నాది యైనపరమాత్మునినాభిసరోజమందుఁ గ
ల్పాదిఁ జతుర్ముఖుం డుదితుఁ డై శిశుభావముతో నుపక్రమం
బేది విమూఢునట్లు మది నెంతయు భీతిలు చున్నచోటఁ బ
ద్మోదరుఁ డంచ యై యతని యుమ్మలికంబు హరించువేడుకన్. 150

క. హరిశబ్దసమంచితముగఁ, బరువడిఁ దనుఁ జెప్పి చెప్పెఁ బ్రణవము మఱి య
ప్పరమార్థము సాధనముగ, విరించి సంధించె నఖిలవేదార్థములున్. 151

మ. కర మర్థిం హరిశబ్దపూర్వ మగునోంకారంబు జిహ్వాగ్రగో
చరమై యొప్ప నొనర్చు నెవ్వఁ డతఁ డాశ్చర్యంబు సంధిల్లఁగా
హరియించుం బహుజన్మసంచితసమస్తాఘౌఘముం సత్క్రియా
కరణాదిం బ్రభవించువిఘ్నముల నుగ్రద్వేషదోషంబులన్. 152

వ. అమ్మహామంత్రజపవిశేషంబున సమస్తభువనప్రపంచంబును సృజియించి యజుండును స్వతఃప్రకాశం బగుసత్యలోకంబు నిజావాసదేశంబుగా నుండి యుండి యథాకాలజనితం బగువిమలవిజ్ఞానంబునం జేసి నిహపరసాధనం బగునిత్యారాధనంబునకు నొక్కదివ్యమంగళవిగ్రహంబు వలయు నని యూహించి. 153

సీ. హరియురస్థ్సలమునం దాదిభూషణములై తోఁచుసన్మణియుఁ వధూమణియును
నముచిసూదనున కుత్తమవాహనంబులై కర మొప్పు వెల్లనికరియుఁ హరియుం

నెవ్వ రే మడిగిన నిచ్చుశీలము గలపాఁడిగోవును వృక్షపంచకంబు
సురపితృశ్రేణికిఁ బరితుష్టి గావించుమధురామృతము చంద్రమండలంబు
గీ. గలిగె నెందేని భువనవిఖ్యాతి యెసఁగ, నట్టిదుగ్ధాబ్ధితలమున గరుగుదెంచి
యధికతరనిష్ఠతోఁ దప మాచరించెఁ, గమలగర్భుఁడు విష్ణుఁ జిత్తమున నిలిపి. 154

చ. అతనితపోమహత్త్వమున కచ్యుతుఁ డెంతయు మెచ్చి కూర్మమై
వితతపయోధివీథి ఘనవీచులతోఁ దల చూపుచున్ శ్రుతి
ద్వితయసుఖాస్పదంబు లగుతిన్ననిమాటల గారవించి యో
చతురుఁడ! నీకు నెద్దియు నసాధ్యమె యేఁ గలుగంగ నెప్పుడున్. 155

చ. అనిన నతండు దిగ్గన నిజాంబకము ల్వికసింపఁ బ్రీతుఁడై
కనుఁగొనునప్డు వజ్రభయకంపితమై మును వార్ధి సొచ్చి దాఁ
గినపెనుఁగొండ దా నెదిరికిం జనుదెంచినభంగి నొప్పు నా
ఘనతరకచ్ఛపాంగహరిఁ గాంచి కరంబులు మోడ్చి యి ట్లనున్. 156

ఉ. "ఆదియుగంబునందు నిను హంసముగాఁ గనుఁగొంటి నశ్వకం
ఠోదితమూర్తివై పిదప నొప్పితి మత్స్యతనూవిలాసివై
వేదము లుద్ధరించి తరవిందదళేక్షణ! యిప్డు కూర్మమై
నీదృశలీలలం బరగునిట్టిభవన్నిజరూప మెట్టిదో. 157

క. ఆరూపము నిచ్చలుఁ జేయారఁగఁ బూజించునట్టియాసక్తి మదిం
గూరినది చూపవయ్యా! సరోరుహదళనయన! నీకు మ్రొక్కెద భక్తిన్." 158

చ. అనవుడుఁ గూర్మరూపహరి యాతని కి ట్లని యానతిచ్చెనో
వనరుహగర్భ! భక్తజనవత్సలభావ మెలర్ప నేను దా
ల్చినయవతారరూపము లచింత్యము లర్చ్యము లగ్రకీర్త్యముల్
వినవె శ్రుతిప్రపంచములు వేమఱు నిట్టుల చాటి చెప్పెడున్. 159

క. కడుపార నామిషము గొని, యుడుగక తలఁచియును జూచియుం బొదివియు నె
ప్పుడుఁ బ్రోచుచుండుఁ బిల్లల, నడరఁగఁ గమఠమును ఝషము నయ్యండజమున్.

వ. అట్లు గావున. 161

తే. తలఁచి రక్షింతు నను నాత్మఁ దలఁచువారిఁ, జూచి రక్షింతు ననుఁగోరిచూచువారిఁ
గదిసి రక్షింతు నను భక్తిఁ గడియువారిఁ, గమఠమత్స్యమరాళరూపములు దాల్చి.

మ. జనసత్త్వాదిగుణంబులం గలుగునశ్వం బాజిలో నుగ్రశా
త్రవకోటిన్ గెలిపించి యాశ్రితు నిజస్థానంబు నొందించుమా
డ్కి విషాదాస్పదమైనసంసృతి హయగ్రీవుండనై వెల్వరిం
తు వెసన్ నాపయిఁ జిత్త మున్నతనిఁ దెత్తు న్మత్పదప్రాప్తికిన్. 163

వ. కావున నస్మదీయావతారభేదంబులందు భేదబుద్ధి సేయక నన్నే కాఁ దలఁచి సేవించుసత్పురుషుండు గలిగెనేని వాని యోగక్షేమంబు నాదియకా విచారించి యనుసంధింపుదు నది యెట్లంటేని నీవు నా దగుదివ్యరూపనిరీక్షణం బపేక్షించి తది పరమదుర్లభంబు తదేకనిష్ఠుఁడవై యింకను గొంతకాలంబు తపం బాచరింపు మనుటయు నతం డవ్విధంబునఁ దపంబు చేయుచుండ ననేకదివ్యవర్షంబులు చనుటయు నొక్కనాఁడు. 164

ఉ. మంగళతూర్యముల్ సెలఁగ మానితరత్నసువర్ణదీధితుల్
నింగియు నేలయున్ దిశలు నిండఁగఁ బర్వ ఫణీంద్రబంధురో
త్తుంగవిశాలతల్పమునఁ దోఁచురమారమణీశుతోడ శ్రీ
రంగసమాఖ్యఁ బ్రస్ఫుటతరం బగుమంటప మద్భుతాకృతిన్. 165

క. దివిజులు సేవింప మునిప్రవరులు గొనియాడఁ గిన్నరప్రముఖులగీ
తవితానంబులు చెలఁగఁగ, యువతీకరచామరంబు లొప్పఁగఁ బొలయన్. 166

ఆ. అవతరించి యతనియగ్రభాగంబున, నిలువ నాతఁ డష్టనేత్రములకు
నవవికాస మొదవఁ బ్రవిమలజ్ఞానసం, భరితచిత్తుఁ డగుచు భక్తితోడ. 167

ఉ. పెక్కుప్రదక్షిణంబులును బెక్కుప్రణామములుం గ్రమంబుతోఁ
బెక్కుప్రశంసలుం బెరయఁ బెద్దయుఁ బ్రొద్దు ప్రమోదలీలఁ బెం
పెక్కువిరించిఁ జూచి కమలేక్షణుఁ డిట్లని యానతిచ్చె "నీ
మ్రొక్కుల కెల్ల నెల్ల యగుమూర్తిఁ జుమీ ననుఁ జూడు వేడుకన్. 168

క. నినుఁ బుట్టించితి నాభీవనరుహమున నిన్నుఁ బ్రోవ వచ్చితి నిపుడేఁ
బునరావృత్తిరహితమై, చనునస్మత్పదము నీకు సమకూర్తుఁ దుదిన్. 169

వ. ఇమ్మహామంటపం బస్మదీయసంకల్పంబునం జేసి స్వయంవ్యక్తంబై రమాసమేతుండ నగునాకు నిరవధికసుఖశయనయోగ్యంబై వైకుంఠపురంబునందుఁ బెద్దగాలంబుండి యిప్పుడు నీతపోవృక్షంబునకుఁ బరిపక్వఫలంబై యొదవెఁ గృతార్థుండవుగమ్ము పొ" మ్మనిన మహాప్రసాదం బనుచు మదభృంగసంగతం బగుకనకకమలంబునుం బోలె జగన్నాథసనాథం బైనయాదివ్యభవనంబు నిజలోకంబునకుం గొనిపోయి విరజానదీతీరంబున నిలిపి యాబ్రహ్మ ఋషిసమన్వితుండై పూజింపం దేజరిల్లుచుండెఁ గొండొకకాలంబునకు నిక్ష్వాకుమహీనాథునకుఁ దపోలబ్ధం బయి మధ్యమలోకమండనం బగునయోధ్యాపట్టణంబున సరయూపాంత సకలజనసేవ్యంబై మెఱయుచుండె మఱికొండొకకాలంబునకు రఘుకులాబ్ధిచంద్రుం డగురామచంద్రుం డొసంగ దానవాన్వయభూషణుం డగువిభీషణుండు లంకానగరంబునకుం గొనిపోవునప్పుడు ధర్మ

వర్మ యనుచోళభూపతిచేత సంప్రార్థితంబై యుభయకావేరీమధ్యంబునఁ జంద్రపుష్కరిణీతటంబున సుప్రతిష్ఠితం బయ్యె నాభవ్యతీర్థం బఖిలతీర్థంబులకు నగ్రగణ్యంబు గావున నాశ్రీగంగశాయిం గొలుచువేడుకఁ జతుర్ముఖప్రముఖనిఖిలబృందారకులును దివస్పతిప్రభృతిదిక్పతులును సనకసనందనాదియోగీశ్వరులును వసిష్ఠవాలఖిల్యాదిమహామునీంద్రులును నంద వసియించి యుండుదురు నేను దద్గరిష్ఠగోష్ఠిఁ బ్రొద్దు పుచ్చుటకు నచ్చటికి నరిగి సుఖరాత్రి చేయుదు. 170

క. యాగంబుల నగుఫలమును, యోగంబులవలన నగుసమున్నతియును నా
నాగమవిహితార్చల నగు, భోగము శ్రీరంగసేవఁ బొల్పుగ నెగడున్. 171

ఆ. అఖిలతీర్థఫలము నంతవంతం బగుఁ, గాని రంగధామగామి యైన
యతని కొదవు నపునరావృత్తిసౌఖ్యంబు, దీనిఁ బోల వితరతీర్థతతులు. 172

వ. మఱియు హేమకూటమహత్త్వంబు చెప్పెద దత్తావధానుండవై యాకర్ణింపుము.

చ. అజునకుఁ బైఁడికొండయు సుధాంశుకళాకమనీయమౌళికిన్
రజతనగంబుఁ బోలె ననురాగ మొనర్ప మదీయబుద్ధికిన్
సుజనవరేణ్య వెండియును జూతుము విందుముగాని యిట్టి య
క్కజ మగుపర్వతంబు మఱి గల్గదు సుమ్ము ధరాతలంబునన్. 174

క. తక్కటి నెలవులకంటెను, నొక్కటి లక్షయును గోటియును గుణితములై
యెక్కుడుఫల మొసఁగుట నీ, చక్కటి కెచ్చోటివారుఁ జనుదెంతు రొగిన్. 175

చ. అసురుల కోడియోడి విబుధావళి వేసరి సంగరాంగణో
ల్లసితజయంబు గోరి మొదల న్నను నేగిరియందుఁ గాంచి రే
నొసఁగితిఁ దన్మనోరథము నొప్పుగ నేగిరి నట్టియిప్పుడా
నసులభ మైనయిగ్గిరి ఘనస్తుతిపాత్రము గాదె భూవరా! 176

క. హరిహరవిరించు లేకోదరు లయి పుట్టుటకుఁ దాన తానక మగుని
ర్భరవైచిత్రి కలదె పెఱ, గిరులకు నీ హేమకూటగిరికిం దక్కన్. 177

క. కావున నీపర్వతముప్రభావము వర్ణింప వశమె బ్రహ్మాదులకున్
నీ వింక వినుము చెప్పెద, భూవల్లభ! నీ ప్రయాగభూరిగుణంబుల్. 178

చ. అతులితభక్తి యొప్పఁగఁ బ్రయాగజలంబులఁ గ్రుంకునట్టిసు
వ్రతుఁడు పురాకృతాఘనికరంబులు సర్వముఁ బాఱఁ దోలు ట
ద్భుతమె ప్రయాగ యంచుఁ బెఱతోయములందు మునింగె నేనియున్
క్షితి నతినిర్మలుం డగుట సిద్ధ మతండు ధరాతలేశ్వరా. 179

చ. వెలయఁ బ్రయాగయందు నొకవిప్రున కన్నముఁ బెట్టెనేని న
య్యలఘుఫలంబు కోటిగుణమై యొదవుం గ్రతు వాచరించినన్

దలకొని యాగభాగములు తార భుజించుచుకుతూహలంబునం
దొలఁగక దివ్యతేజములతోఁ జనుదెంతురు వేల్పు లందఱున్. 180

చ. పరగఁ బ్రయాగమాఘముద్విపక్షమునందుఁ బ్రహృష్టచిత్తుఁడై
పరువడిఁ దీర్థమాడుఘనపావనమూర్తి పునర్భవంబులం
బొరయఁడు వానివంశమునఁ బూర్వుల కెల్లను సంభవించు న
చ్చెరువుగ నాకలోకసుఖసిద్ధి యనేకసహస్రవర్షముల్. 181

క. అచ్చుగఁ బ్రయాగలోపల, విచ్చలవిడిఁ దనదు మేను విడిచినమనుజుం
డొచ్చెల్ల యేమి చెప్పుదుఁ, జెచ్చెరఁ గను నిష్టకామ్యసిద్ధి ధరిత్రిన్.” 182

చ. అనవుడు నానరేంద్రుఁడు ప్రియంబున నిట్లను నమ్మునీంద్రుతో
నొనరఁ “బ్రయాగ యందు మృతినొందినమానవుఁ డిష్టకామ్యముల్
గను నని యానతిచ్చి తనఘా! యిటమున్న ప్రయాగయందు నీ
యనువునఁ గన్నవారు గలరయ్య! జగంబున నెవ్వరేనియున్? 183

వ. అని తదీయనిదర్శనాకర్ణనకౌతుకాయత్తచిత్తుండై యడిగిన. 184

చ. మృగనరవక్త్రవిగ్రహవిమిశ్రసముజ్జ్వల! విస్ఫురత్త్రయీ
నగశిఖరానిరూఢ! భువనత్రయపావనతత్పరోల్లస
త్సుగుణగరిష్ఠ! దానవనిషూదన! శిష్టజనాభినందనా
నుగనుతివాక్యపూజితమనోజ్ఞ పదద్వయ! వైష్ణవప్రియా! 185

క. యోగీంద్రహృదయమందిర, భోగీశ్వరభోగశయన! భూగగనదిశా
భోగపరిపూర్ణ తేజ! ద, యాగుణమణిభూష! నిర్జితాశ్రితదోషా! 186

మాలిని. సజలజలదవర్ణా! సంతతానందపూర్ణా!
త్రిజగదభయకర్తా! దిత్యపత్యైకహర్తా!
వృజినవనకుఠారా! వీరశృంగారసారా!
సుజనగణహృదీశా! సూర్యకోటిప్రకాశా! 187

గద్యము. ఇది వాణీవరప్రసాదలబ్ధవాగ్విభవ తిక్కనామాత్యసంభవ సుకవిజనవిధేయ అనంతయనామధేయప్రణీతం బైనభోజరాజీయం బను కావ్యంబునందు ననుక్రమణికయు మఱియుం దనుకాంభోజమహీశ్వరుండు దత్తాత్రేయమునీశ్వరు నాశ్రయించి రోగవిముక్తుం డగుటయు నతనివలన శ్రీరంగమాహాత్మ్యంబును హేమకూట పర్వతప్రభావంబును బ్రయాగమహిమయు ననుపుణ్యకథాకథనంబు లాకర్ణించుటయు నన్నది ప్రథమాశ్వాసము.

శ్రీ

# భో జ రా జీ య ము

## ద్వి తీ యా శ్వా స ము



నారీనయనచకో
రానందసుధాంశుబింబ హారిదశ్వసహ
స్రానూనతేజ నిర్జర
సేనాసంసేవ్యమాన శ్రీనసింహా. 1

ఆ. అవధరింపు దేవ భవదీయదివ్యాంశ, జనితుఁ డైనయత్రిసంభవుండు
నిజపదాబ్జరేణునిర్మలదేహుఁడై, తనరుమహుని కిట్టు లనియెఁ బ్రీతి. 2

తే. "అధిప! చెప్పెద వినుము ప్రయాగమరణ, మిష్టకామ్యసిద్ధిద మగు టెల్లఁ దొల్లి
వేదవేదాంగతత్త్వసంవేది యొక్క, విప్రవర్యుఁడు గలఁడు పవిత్రయంతుఁడు. 3

చ. ధనరహితుండు పుత్త్రసముదాయసమేతుఁ డుపాయశూన్యవ
ర్తనుఁ డరయంగ నాద్విజుఁడు తత్ప్రియభామయు బుద్ధిహీన జీ
వన మొనరింప నేర దిలు వాడ నెఱుంగదు భాండశుద్ధి లే
దనిశముఁ బోరుచుండుఁ దదుపాత్తపురాకృతకర్మమో యనన్. 4

తే. అతఁడు విరుగనియూరును నతనిచేత, నడుగఁ బడనిమానవుఁడును నతని చొరని
తోఁటయుఁను జూడలేదు మందునకు నైన, నగవు గా దిది నిక్క మానట్టునందు. 5

క. ఆలిని బిడ్డలఁ బ్రోచుట, కై లాఘువవృత్తి కగ్గమై నిర్ధనతా
ఖిలపయోధి మునుంగుచుఁ, దేలుచు దరిదాపు లేక తిరుగుచు నుండెన్. 6

వ. ఇట్లు సర్వశూన్యం బగుదారిద్ర్యదైన్యంబు సైరింపం జాలక సంసారంబువలనవిసివి పంకనిర్మగ్నం బగుగోవునుం బోలె నమ్మహీదేవుండు తన్ను సముద్ధరింప దిక్కెవ్వరు లేక దుఃఖంబునఁ గృశశరీరుండై యుండఁ గొండొకకాలంబు సనుటయు నొక్క నాఁడు తనమనంబున నిట్లని చింతించె. 7

ఉ. "ఓలి గృహస్థధర్మముల నుండెడువానికి గ్రాసవాసముల్
చాలఁగఁ గల్గి పుత్త్రులుఁ గళత్రము సౌఖ్యము నొంద బంధువుల్

మే లన నార్యకోటి మది మెచ్చఁగ నుండుట యున్కి గాక యే
చాలును లేక యాచనఁటిజాలిఁ బడం బని యేమి చెప్పుమా. 8

తే. కుడిచి కట్టినయునికిగా కిడుమఁబడుచు, నింట నిట్లున్నఁ బురుషార్థ మేమి కలదు?
కడఁగి యిహమైనఁ బరమైనఁ గాక తాన, యూరకుండుట నరునకుఁ బౌరుషంబె?

ఉ. లావు గలంతకాలముఁ దొలంగక తాల్చితిఁ బెక్కుభంగులన్
జీవనభార మిప్డు ముదిసెం దల’’యంచుఁ బరోక్షసాధనా
భావము నెమ్మదిం దలఁచి భవ్యపథంబున నిశ్చితాత్ముఁడై
యావసుధామరుం డరిగె నయ్యఘనాశిని యైనకాశికిన్. 10

మ. కనియె న్విప్రుఁడు సర్వలోకహితవిఖ్యాతం జగన్మాతఁ బా
వనవాఃపూరతరంగసంఘుసినదధ్వస్తాఖిలస్వాంతికా
వనిజంతుప్రజపాపభారమురజిద్వామాంఘ్రిజన్ ఘాలదృ
ఘనజూటధ్వజగర్వితాంబునిధిసంగన్ గంగ నుద్యన్మతిన్. 11

క. కని యానందించుచు మోడ్చిన కేలు లలాటవీథిఁ జేర్చి వచోగుం
భన మెసఁగఁ బ్రస్తుతించుచుఁ, దనరఁ గృతస్నానుఁ డయ్యెఁ దత్పుణ్యనదిన్. 12

మ. అతఁ డర్థిం దదనంతరంబ తలఁచెన్ హారామరాహారశో
భితవర్ణున్ జగదంతపూర్ణమహిమున్ బృందారకారాధ్యునిన్
జతురాస్యప్రణుతాంఘ్రిపద్మయుగళున్ జంద్రార్ధమౌళిన్ శివా
న్వితవామాంగు ననంగదర్పదమనున్ విశ్వేశ్వరున్ శంకరున్. 13

ఉ. నిచ్చలు గంగకుం జని వినిర్మలవారిఁ బవిత్రగాత్రుఁడై
వచ్చి శివాలయంబులును వైష్ణవధామములుం గ్రమంబునన్
జొచ్చి నమస్కరించుచును సువ్రతశీలుఁ డనంగఁ గాశిలో
మచ్చిక యుల్లసిల్లఁ బలుమాఱును బెద్దలయిండ్ల కేఁగుచున్. 14

వ. ఇట్లు పుణ్యతీర్థంబునఁ గొన్నిదినంబు లుండి యొక్కనాఁడు. 15

సీ. ప్రాణాంతికావస్థఁ బడినయప్పుడు గాని కలుగదు సిద్ధి యీ కాశియందు
నంత చేయఁగఁ గల్గునవి తోలుచీరలుఁ బునుకపేరును జటాభూతిధార
ణంబులు భిక్షాటనముఁ గపాలపుఁ గోర భూతసంగతి ప్రేతభూమియునికి
యివి యేల నాకు దుక్కెద్దు దేశాంతర మరిగిన ట్లగును నిట్లైతి నేని

ఆ. హీనదశకు నోడి యిలుడించి పరదేశ్యమునకు నిట్లు వచ్చియును నపార
విభవ మొందకున్న వృథ గాదె యనుబుద్ధి, నాతఁ డచటు వాసి యరిగె ననఘ —

ఉ. వేగమ యేఁగి కాంచెఁ బృథివీసురముఖ్యుఁ డశేషయోగిసం
యోగము లోకకల్మషవియోగముఁ జారుతరంగమాలికా
భోగసముత్థితాంబుకణపూర్ణసమీరణపాలితాప్తది
గ్భాగము సన్మునీంద్రపరికల్పితయాగము నా ప్రయాగమున్. 17

వ. కని కరంబులు మొగిచి యిట్లని స్తుతించె 18

తే. ఉర్విపై నశ్వమేధి యగు గర్వ ముడిపి, బ్రహ్మహత్యాపరుం డనుభయము వాపి
యొసఁగు సుకృతికిఁ బాపికి నొక్కగతియ, యన్యతీర్థములెనయె ప్రయాగమునకు. 19

చ. అవె దివిజాపగాజలము లల్లవె యాయమునాజలంబు లా
ధవళతయు న్వినీలతయుఁ దార్కొని చూడ్కికి వేడ్క చేసె మా
ధవసదనాంగణం బగుటఁ దత్పరిచారిక లర్థిఁ జందన
ద్రవమునఁ గ్రొత్తకస్తురిని దక్కక రేకలు పెట్టిరో యనన్. 20

చ. పొరిఁబొరి నీమహానదులఁ బుట్టెడుబుద్బుదఫేనపుంజవి
స్ఫురితతరంగమాలికలు చూడఁగఁ గన్నులపండు వయ్యె శ్రీ
ధరవిభవంబు చూడఁ బ్రమదంబున వచ్చిన యప్సరోంగనల్
కరకుశలత్వము ల్మెఱయఁ గైకొని పెట్టినముగ్గులో యనన్. 21

క. గంగాయమునలవిమలత, రంగంబులు ధవళచామరంబులు నసితో
త్తుంగబహుబర్హనివహము, సంగజజనకునకు వైచున ట్లొప్పెఁ గడున్. 22

చ. కలకల మొప్ప నంబువిహగంబులు గూడి చెలంగుటల్ మహో
జ్జ్వలహరికీర్తనంబులుగ సంఘటితోత్కటవీచికాచయం
బులు పటహళిగా నదులు పొంపిరివోయెఁ బ్రయాగమాధవుం
గొలువఁగ వచ్చుభాగవతకోటుల పోలె ససంభ్రమంబునన్. 23

వ. అని గంగాయమునలసాంగత్యవిశేషంబులు గొనియాడుచు నందుఁ గృతస్నానుం
డై యాద్విజుండు. 24

చ. అలికులవర్ణు నున్నతరథాకృతిచారుసువర్ణు నిందిరా
లలితకుచోపగూహనసులక్షితవక్షుఁ బయోరుహాక్షు సా
కలితఘనప్రతాపుఁ ద్రిజగన్నుతరూపు నిజాంఘ్రిజాపగా
మలసలిలోద్భవాస్ఫురదుమాధవుఁ గొల్చెఁ బ్రయాగమాధవున్. 25

ఉ. చూపులు విష్ణుమూర్తులకు సొమ్ముగ జిహ్వలు విష్ణుమూర్తి యా
లాపసుఖంబుఁ జెందఁగఁ దలంపులు విష్ణుమహత్త్వచింతనం
బైపడుచుండ నిట్టు లగుభాగవతోత్తమకోటిచే జగ
ద్దీపిత మైనయవ్విపులతీర్థమునం దతఁ డుండె వేడుకన్. 26

వ. ఇట్లుండి యవ్విప్రుం డొక్కనాఁ డెప్పటియట్ల గంగాస్నానంబు సేయునప్పు డొక్కవనితాచతుష్టయం బచ్చటికి వచ్చి మరణోద్యోగంబున సంకల్పంబు చెప్పుకొనుచుండిన నతం డద్భుతాయత్తచిత్తుండై కనుంగొనుచుండె నంత. 27

చ. కనకపుఁగుప్పలున్ మణినికాయములున్ ధనధాన్యరాసులున్
వినుతగజాశ్వసంఘములు విశ్రుతగోమహిషాదికంబులున్
దన కధికంబుగాఁ గలిగి దాతయు భోక్తయు నైనవాఁడు నా
కనయము భర్త గావలయు నం చొకభామిని కోరె వేడుకన్. 28

చ. తనవదనంబు వాక్సతికిఁ దానకమై చెలువొందఁ దన్నుఁ జూ
చినజను లందఱుం గవిత చెప్ప సమస్తకళాకలాపముల్
దనవశమై తలిర్ప నుచితజ్ఞుఁ డనంగఁ బొగడ్త కెక్కువాఁ
డనయము భర్త గావలయు నం చొకభామిని కోరె వేడుకన్. 29

చ. అనుపమసంపదాఢ్యుఁడును నంచితనిర్మలకోమలాంగుఁడున్
ఘనకవితారసోదయవికాసితచిత్తుఁడునై సమస్తభూ
జనపరిరక్షణక్షమతఁ జాలఁగ నొప్పి ధరిత్రి నేలువాఁ
డనయము భర్త గావలయు నం చొకభామిని కోరె వేడుకన్. 30

చ. కనకశలాకవోని తనుకాంతియుఁ బున్నమచంద్రుఁ బోలు నా
ననవిభవంబుఁ బద్మముల నవ్వుపరిస్ఫుటనేత్రరోచులున్
దన కమరంగ భావభవతంత్రములందుఁ బ్రవీణుఁ డైనవాఁ
డనయము భర్త గావలయు నం చొకభామిని కోరె వేడుకన్. 31

వ. ఇవ్విధంబునఁ బునర్భవానుభవంబు గోరి. 32

చ. తలకొని నాగకన్యకలు తత్తటినీతటి కేఁగుదెంచి వి
చ్చలవిడిఁ గేలి సల్పి నిజపద్మముఁ గ్రమ్మఱఁ జొచ్చుభంగిఁ జే
రెలమి దలిర్ప నానలువు రిందునిభాస్యలు నాస్యమండలం
బులు వికసింప నయ్యుదధిపూరమునందు మునింగి రిమ్ములన్. 33

ఉ. అంతయుఁ జూచి విప్రుఁడు ప్రియంబున నేనును నిట్లు చేసి యీ
కాంతలు నాకళత్రములు గాఁగ నభీష్టసుఖోపభోగముల్
గాంతు ధరిత్రిలో నని యకంపితచిత్తసరోజుఁడై యనా
ద్యంతుఁ బ్రయాగమాధవుఁ గృపాబ్ధిఁ దలంచి నమస్కరించుచున్. 34

సీ. దారిద్ర్యఘాతంబు తనుఁ బాసి పోవు నీయుదకపూరము చొచ్చియున్న ననియుఁ
బెద్దకాలము మేనఁ బెరిగినపాపపంకము లిందు మునుఁగఁ గరఁగ ననియు

నిది శుద్ధజలరాశి యిందులో వెదకినఁ గోర్కిముత్యములు చేకూరు ననియు
నిందు డిందిననల్పూరింతుల వెడలించి గుఱిలేనికోర్కెఁ గైకొందు ననియు

ఆ. నిట్లు తెగువ చేసె నీవిప్రుఁ డని కొని, యాడునట్లు గాఁగ నతఁడు మునిఁగెఁ
జటులదురితతిమిరపటలప్రచండమార్తాండ మగుప్రయాగగుండమందు. 35

ఉ. అంతఁ బ్రయాగమాధవుఁ డనంతదయానిధి పద్మవాసినీ
కాంతుఁడు వారికోర్కె యొసఁగంగఁ దదీయవరోపలబ్ధి య
త్యంతనిరూఢమై నెగడునట్లుగ విప్రుఁడు సూర్యకాంతభూ
కాంతునియందుఁ బద్మవతి గాదిలితల్లిగఁ బుట్టె మేదినిన్. 36

క. అవనితలం బొక్కొకవసు, ధావల్లభునందు సముచితం బగుప్రాదు
ర్భావము నొందిరి భాగ్య, శ్రీవిలసితరూపములు ప్రసిద్ధికి నెక్కన్. 37

వ. ఇట్లు పుట్టి యాద్విజుండు భోజుం డనుపేరఁ బ్రసిద్ధుం డయ్యె నంగనారత్నంబులు నలువురును సుగంధి పద్మగంధి కనకవతి చంద్రప్రభ లనునన్వర్థనామంబులతో నతనికి భార్య లైరి. ఇవ్విధంబున నతండు వివిధవిభవవిలసితుండును నత్యంతరూపసంపన్నుండును సకలకళాప్రవీణుండును నై లాటదేశంబునందు ధారానగరంబున కధీశ్వరుండై యనేకవర్షంబులు రాజ్యంబు చేసె నట్లుగావునఁ బ్రయాగతీర్థం బిష్టకామ్యసిద్ధిప్రదం బని పలికితి"నని చెప్పిన. 35

చ. "విమలవిచార నీవలన వింటిఁ బ్రయాగమహత్త్వ మెల్లఁ ద
త్సముదితపూర్ణపుణ్యఫలజన్ముఁడు భోజవిభుండు భూమి యే
క్రమమున నేలె వాఁ డటులు రాజ్యము సేయుదినంబులన్ విశే
ష మొకటి యెద్దియేనియును సమ్మునినాయక! రూఢి కెక్కెనే." 39

చ. అనవుడు నానృపాలునకు నామహనీయవివేకశీలుఁ డి
ట్లను "మును భోజుఁ డాదినృపులట్టుల రాజ్యము చేసె వానివ
ర్తనము నుతింప నల్పులతరంబె మహిం జతురుత్తరంబు గాఁ
దనరినషష్టివిద్యలు నతం డెఱిఁగింపక కల్గ వేరికిన్. 40

చ. తనుఁ గనుఁగొన్నవారు కవితాఘను లౌదురు తద్విశేష మెం
తని గుఱిపెట్టవచ్చు మనుజాధిప! యిన్నిటికంటె నెక్కుడిం
క నొకటి చెప్పెద న్వినుమఖండితమై యొకవిద్య చేరె నా
తనికి సమస్తభూజనకదంబము ప్రస్తుతి చేయునట్లుగన్. 41

వ. అది యెయ్యది యంటేని. 42

ఆ. మనుజు లెల్లవిద్యలను జొచ్చి సాధింపఁ, గలరు కాని లోహకులము నెల్లఁ
బసిఁడి సేయువిద్య పడయ లే రెవ్వరు, నట్టివిద్య భోజుఁ డభ్యసించె. 43

వ. కావున నశేషవిశేషంబులకు నత్తం డాశ్రయం బగుట వేఱ చెప్ప నేల యతనిచరిత్రంబు రామచరిత్రంబునుం బోలెఁ బరమపవిత్రంబై యొప్పు నతనికీర్తిలతాజాలంబునకు నాలవాలం బగుధారానగరంబుమహిమ. 44

ఉ. సారకవీంద్రచాతకవిశాలహిరణ్మయవృష్టిధార ని
స్సారదరిద్రభారతరుషండవిలాసకుఠారధార సం
సారకృశానుతప్తజనశైత్యకరామృతధార గాక యా
ధార తలంప నన్యవసుధారమణీశపురోపమాన మే. 45

చ. కడఁగి రసాతలంబు భుజగంబులు వెల్వడి వచ్చి కొమ్మలం
బడగలు విచ్చి యాడు నెడఁ బంకజమిత్త్రుఁడు రాహుశంకఁ బె
ల్లడరెడుభీతితో సరద మట్టును నిట్టును దోలు నిమ్నముం
బొడవును నేమి చెప్ప నదఁ బొల్చు నగడ్తయుఁ గోటయుం బురిన్. 46

సీ. ఆచారమున బ్రహ్మ నైనను నోడించి పఱపంగఁ జాలుసద్బ్రాహ్మణులును
బరశురాముని నైనఁ బ్రధనవైముఖ్యంబు నొందింపఁ జాలురాజోత్తములును
నలకాధిపతితోడ నైన మచ్చరికించి కొన నమ్మఁ గలమేటికోమటులును
జట్టుపై నైన రాజనమును జేఱకును గావింపఁ గలమహాకర్షకులును
తే. మదపుటేనుంగుతో నైన మాఱుపెనఁగి, విఱుగఁ దోలంగ నోపెడువీరవరులుఁ
గడఁగి విజితేంద్రియుల నైనఁ గరఁగఁ జేయు, జారసతులును నప్పురిఁ జాలఁ గలరు.

చ. సురపతిదంతిసంతతియొ సూర్యునివాజులపాగయో పొరిం
బొరి నలకామధేనువునఁ బుట్టినక్రేపులతోయమో యనం
బరువడి నొప్పు నప్పురముభద్రగజంబుల పెల్లు నుల్లస
త్తురగచయంబు పెంపు నవిదూషితగోనికరంబు పేర్మియున్. 48

క. మొగి నాఱును దొమ్మిదియును, నగురసములఁ గలుగుబహుపదార్థంబులు బ్రా
తిగఁ జవి గొననిసరుం డా, నగరంబున మందు కడిగినం జొప్పడు నే. 49

ఉ. కైపద మిచ్చువారలును గ్రక్కునఁ బద్యము చెప్పువారలున్
రూపితసంస్కృతాదికదరూఢి యెలర్ప మహాప్రబంధముల్
చే పొసఁగంగఁ బల్కి పృథివిం బ్రథితంబుగఁ జేయువారు ధా
రాపురమందె కాక కలరా మఱి తక్కినపట్టణంబులన్. 50

వ. మఱియు నప్పురంబు మేరుశిఖరిశిఖరోచ్ఛేదంబులు దెచ్చి కైలాసనగోత్తుంగశృంగంబులం గీలించినట్లు కనకకలశశోభితంబు లగుసుధాధవళసౌధంబులవలనను గామగమనంబు లగుదివ్యవిమానంబులు గూర్చి భూలోకంబునం బ్రతిష్ఠించినట్లు

నానాముఖవాస్తులక్షణలక్షితంబులయి సముచితోపకరణబహుళంబు లగుగృహంబులవలనను భూగర్భనిక్షిప్తంబు లగునిధానంబులను సాధించి సకలజనగోచరంబులుగా నాచరించినట్లు సమస్తవస్తుభరితంబు లగువిపణివీథులవలనను విరహిజనమనోమథనుం డగుమదనునకుఁ బ్రోత్త లగునాయుధంబులు సమకూర్చి యిచ్చు సేవానిపుణిక లట్లు పౌరజనమనోహారిణు లగుపుష్పలావికలవలనను గామరూపవిశారద యగుశారద బహుపురుషరూపంబుల దీపించునట్లు మధురచిత్రాదివివిధావధానకవితాప్రవీణు లగుసుకవిజనంబులవలనను మేఘవాహనశిబిదధీచ్యాదులు క్రమ్మఱజన్మించిన ట్లనవరతదానశీలు రగువదాన్యులవలనను గారణజన్మంబులం గలకిన్నరమిథునంబునట్లు సమరూపవయోవిలాసచాతుర్యంబుల యొరపునెరపునిటవిటీ యుగ్మంబులవలనను ననంతుండు సురభూజబీజంబులు సంగ్రహించి దుగ్ధసముద్రంబు క్రయ్యొత్తున నారుపోసి యథాకాలోత్పాటనపాటవం బెసంగ నిట తెచ్చి కస్తూరికాకరీషపూరితంబు లగుపాదుల నిడి యమృతజలసేచనంబులం బ్రోది చేసినం బూవులవింటివాఁడు కావలి యున్నట్టు సతతసురభికుసుమవిసరంబుల నతిమధురరసభరితఫలనివహంబులఁ గలిగి నిత్యనవీనంబులగుతరులతావితానంబులవలనను మన్మథగాయత్రీకింబ్రణవోచ్చారణంబు చేయువిధంబున నాగగనపర్యంతంబుగాఁ జెలంగుకలకంఠధ్వనులును బలికి పలికింపక యలుకలు దీఱ వని ప్రణయకలహంబులఁ బరాఙ్ముఖు లగు దంపతులకు హితోపదేశంబు సేయువిధంబున విచ్చలవిడిం బెచ్చు పెరిగి పలుకుకలికిరాచిలుకలకలకలంబులం జేసి యభిరామంబు లగునారామంబులవలనను రంగత్తరంగరంగవల్లికలను భ్రమద్భ్రమరధూమశ్యామంబు లగునుపరిభాగంబులం గలుగునుత్ఫుల్లహల్లకప్రదీపంబులను నరుణకిరణకుంచికానిపాటితకవాటంబు లయి సరససౌరభసంవాసితంబు లగువికచకమలగేహంబులను లక్ష్మీసమాగమోత్సవాలంకృతి నతిశయిల్లునట్లు మధురమధురశీతలంబు లగుజలంబులం బరిపూర్ణంబు లగుదీర్ఘికలవలనను బ్రభాతసమయంబున నింటింటికి విందుచెప్ప వచ్చుబంధుజనంబున ట్లానందస్పర్శ గావించుచు మందమందగమనంబునం బొలయుమలయానిలంబులవలనను నపారవిభవోదారం బగునల కానగరంబు నధఃకరించి యమరావతికంటె నభినవంబై పరమపదంబుకో దమ యన ననన్యపురసామాన్యంబై యొప్పునప్పురంబున కధీశ్వరుండు. 51

క. భోజుఁడు ప్రసన్నవదనాం, భోజుఁడు నిఖిలార్థికల్పభూజుఁడు విలస
త్తేజుఁడు సంభృతసుకవిస, మాజుఁడు రూపాదిజితరమాజుఁడు జగతిన్. 52

సీ. అమరమహీజంబు లైదును నైదుభూతములుగాఁ గూర్చి దేహము సృజించి
యతనుఁడై ధరియించునంగజుప్రాణంబు నెమ్మిఁ బ్రాణంబుగా నిర్వహించి

యదితికి దేవేంద్రుఁ డావిర్భవించినపుణ్యంపుఁ బ్రొద్దునఁ బుట్టి వొసఁగి
భారతి దాదియై గారవం బారఁ బోషించుచునట్లుగ నియమించెఁ గాక

ఆ. నలినభవుఁడు కానినాఁ డిట్టివితరణం, బిట్టిరూపమహిమ యిట్టివిభవ
మిట్టివిద్య యితని కెట్లు గల్గె ననంగ, భూమిఁ బ్రబలి కెక్కె భోజరాజు. 53

క. బలిరాజ్యము రామమహీ, తలపతిరాజ్యంబు ధర్మతనయునిరాజ్యం
బిల నెట్టి దట్లు భోజుని, సలలితరాజ్యంబు సర్వసౌఖ్యములందున్. 54

క. భ్రాజితమణిభూషాంబర, రాజివలన సమవిభావిరాజితు లగుటన్
భోజునియోలగమునఁ గవి, రాజుల రాజులను దెలియ రా దెవ్వరికిన్. 55

క. ఆపృథివీపతిధర్మం, బేపాటియొ కాని యాతఁ డేలెడుధరలో
నేపట్టునఁ బొడగానము, యూపస్తంభములు లేనియూ రొకచోటన్. 56

చ. చతురత నీతిపెంపునఁ బ్రసన్నత నున్నతవిద్యలందు ధీ
రత సుకుమారతన్ సుకవిరాజసమాజసమాశ్రయక్రమా
ద్భుతరతిఁ గాంతిఁ దేజమున ధూర్తకళంకత నెన్ని చూడఁగా
నితఁ డొకరుండ పో నృపుల కెక్కుడు నాఁ దగు భోజుఁ డెప్పుడున్. 57

చ. జనవర ! భోజుఁ డట్లఖిలసమ్మతుఁడై ధర యెల్ల నేలుచున్
విను మొకనాఁడు గానగుణవిశ్రుతుఁ డాధరణీతలేశ్వరుం
డనుపమసత్వశాలి మృగయారతిఁ గాననభూమి కేఁగి కాం
చనరసలిప్తపుంఖశరసంహతిఁ గ్రూరమృగాళిఁ గూల్చుచున్. 58

క. తురగజవంబున మృగములఁ, బొరిగొని తమకమున నలపు పుట్టినయంతః
కరణముతో నతిదూరము, నరుగ నరుగ నెదుర నొకమహాటవిలోనన్. 59

తే. అఖిలవిపినంబులకుఁ దన్న యాధిపత్యమునకుఁ బట్టంబు గట్టిన యనువు దోఁపఁ
దరువితానంబులో నెల్లఁ దాన యతిని, గూఢమై యొప్పు నొక్కన్యగ్రోధతరువు. 60

సీ. ఈమట్టియాకొకో యేకార్ణవమునాఁడు శేషాహిశాయికి సెజ్జయయ్యె
నీమట్టిమొదలనొకో మహాదేవుఁ డేకాగ్రచిత్తంబున నతిశయిల్లు
నీమట్టిభావమొకో మృగాంకుని మేనఁ బ్రతిబింబరూపమై పాయకుండు
నీమట్టిమీఁదనొకో మున్ను గజకచ్ఛపములతో లంఘించెఁ బక్షివిభుఁడు

ఆ. నిట్టిమట్టి యుండ నీద్వీపమును వటద్వీప మనక యేమి తెలివియొక్కొ
తొంటిపెద్ద లెల్లఁ దొడఁగి జంబూద్వీప, మనిరి నాఁగ నొప్పె నక్కుజంబు. 61

సీ. దిక్పాలపురముల తెరు వేల యడుగ నీశాఖాశాఖలవెంటఁ జనఁగ రాదె
యంబరస్థల మెంత యన నేల యీమ్రానుఘనవిశాలత చూచికొనఁగ రాదె

యుడుమండలం బొంత పొడవౌనో యన నేల యీభూజ మెక్కిన నెఱుఁగ రాదె
యవని యేమిట నిల్చె నన నేల యీ మ్రాన దిగినయూడలు చూచి తెలియరాదె
తే. యనఁగ నాశ్చర్యధుర్యమై యఖిలమృగస, మాజమాశ్రితచ్ఛాయమై యమరియుండుఁ
బక్షిపక్షచ్ఛదాఘాతపాతఫలస, హస్రవర్షోద్భటంబు మహావటంబు. 62

క. ఆయుర్వీరుహశిఖర, చ్ఛాయ పథశ్రాంతి దీర్ప సరభసమున భూ
నాయకుఁడు సుఖాసీనుం, డై యుండి తదీయవిభవ మిటు గనుఁగొనుచున్. 63

చ. బలితపుశాఖయందుఁ బదపద్మయుగంబుఁ బెనంచి పార్శ్వశా
ఖలఁ గరకాండము ల్పొనిపి కన్నులు మోడ్చి యధోముఖాబ్జుఁడై
తలకొని వ్రేలుచున్నయొకతాపసుఁ గాంచె విభూతిభూషణో
జ్జ్వలుఁ దగువాని భోజనృపసత్తముఁ డావటభూరుహంబుపైన్. 64

చ. కని యితఁ డెవ్వఁ డొక్కొ యిటుగాఁ గత మెయ్యదియొక్కొ పిల్చినం
గినియక పల్కునొక్కొ పలికించెదఁ గా కనుమానమేల యి
మ్మునివరు నంచు హస్తములు మోడ్చి శిరంబునఁ జేర్చి భోజుఁ డా
నన మొకయింత యెత్తి నయనద్యుతిసంపద యొప్ప ని ట్లనున్. 65

క. పటుతరుశాఖాలంబిత, పటుతరచరణ మగు మీతపశ్చరణము దు
ర్ఘటనము మీ రెవ్వరు మీకటాక్షలాభంబు నాకుఁ గానఁగ వలయున్. 66

వ. అనిన నతండు విని యుం వినని య ట్లుండిన. 67

ఉ. భోజుఁ డదేమియొక్కొ మునిపుంగవుఁ డేఁ బిలువంగఁ బల్కఁ డీ
భూజమహోన్నతిం బలుకు పొందదొ వీనుల నిట్లుగాక తా
నేజగడంబు నొల్లక తదేకమతిం దప మాచరించువాఁ
డై జనభాష లేమి విన నంచు గణింపఁడొ యంచు ని ట్లనున్. 68

క. 'అన్యుఁడఁ గాను భవాదృశ, మాన్యుఁడ భోజుఁ డను పేర మహిఁ బరగినరా
జన్యుఁడ ననుఁ జూడఁ గదే, ధన్యుఁడ నయ్యెద' ననిన నతఁడు ప్రీతుండై. 69

వ. కను విచ్చి చూచి యి ట్లనియె. 70

తే. 'అధిప పెఱయాశ్రమస్థుల కందఱకును, విను గృహస్థాశ్రమము వాఁడె వెలయనూఁత
యట్టిగృహమేధులకుఁ గీడు పుట్టకుండఁ, గాచుకర్తలు రాజులు గారె యరయ. 71

క. ఏతన్మాత్రమహీపతి, వే తగవుచు ధర్మమును నహింసారతియుక్
నీతియు ననఁ గలయీగుణ,జాతము నీయందె కాదె శాశ్వత మయ్యెన్. 72

క. ఏకచ్ఛత్రముగా భూ,లోకము పాలింపు బంధులోకముఁ గరుణాం
జేకొని ప్రోవుము సజ్జన, లోకము మన్నింపు శత్రులోకవిదారీ. 73

శా. నీ బాహాపరిరక్షణంబునఁ గదా నిర్విఘ్నమై మాతపం
శ్శీబాధం బడ కిట్టు చెల్లుట ధరాధీశా! గిరీశుం ద్రిలో
కీబంధుం గరుణారసార్ద్రహృదయుం గీర్వాణవంద్యున్ దృఢ
ప్రాబల్యంబునఁ బట్టి యేఁ దప మొనర్పం గంటి నిశ్శంకతన్. 74

క. నీవును నీమంత్రులు నా, నావిధసుభటులును నేఁడు నాయింటికి ని
ట్లీవేళ నతిథు లయితిరి, గావున నాతిథ్య మిచటఁ గైకొన వలయున్.' 75

చ. అని తరుశాఖ డిగ్గి యతఁ డాతని నల్లనఁ జేర వచ్చినన్
గనుఁగొని భక్తిపూర్వకము గాఁగఁ బ్రణామ మొనర్చి మోడ్పుఁగే
లొనరఁగ 'నోమునీంద్ర! భవదుజ్జ్వలనామ మెఱుంగఁ జెప్పవే'
యనవుడుఁ బిన్ననవ్వు వదనాబ్జమునన్ బొడమంగ ని ట్లనున్. 76

క. 'ఒకపేరును నొకయూరును, నొకకులమును నసఁగఁ గలదె యోగీశ్వరజా
తికి నైనను బాఁపఁగ నేఁటికి సర్పటి యాంద్రున నొన్నడికముగఁ బెద్దల్.' 77

చ. అని యుచితప్రసంగముల నానరనాథునిఁ బ్రీతుఁ జేసి యా
తనిమది కద్భుతం బొదవ దాఁచినచోటిపదార్థసంఘముల్
గొని చనుదెంచునట్లు మునికుంజరుఁ డాక్షణమందె తెచ్చె న
య్యనిమిషధేనుసంస్మరణమం దొడఁగూడిన యట్టిభోజ్యముల్. 78

క. అట్టిదె కాదె తపస్వుల, కెట్టిపదార్థములు బ్రాలియే నిస్పృహులై
యిట్టుండుము రట్టుండుదు, రెట్టుండినవారి నొరుల కేమన వచ్చున్. 79

వ. ఇట్లు సద్యస్సంకల్పితంబు లగునభిమతాహారంబులు దెచ్చి యారాజునకు నమాత్య
భృత్యసమస్తసైన్యంబునకుఁ దృప్తి గావించిన నారాత్రి యంద యుండి మఱు
నాఁడు. 80

క. తెలతెలవాఱఁగ భూపతి, వల నొప్పఁగఁ బ్రాతరుచితవర్తనములు వే
సలుపుచు సర్పటి కి ట్లను, 'వలయును మఱుపురికి రా నవశ్యము మీరల్.' 81

వ. అని ప్రార్థించి పలికిన నానరేంద్రునకు సమ్మునీంద్రుం డి ట్లనియె. 82

తే. 'అధిప! మాబోఁటితపసుల కడవినుండి కూరగాయలు నమలుచు పీరఘోర
తపము సేయుచు నునికి యుక్తంబు గాక, చెలఁగి నగరప్రవేశంబు సేయ నగునె?'

క. నావుడు సర్పటితో నతఁ, 'డీవిధమున నాన తిత్తురే మీరు మదీ
యావాసం బిది వే రొక, తావే యి ట్లవధరింపుఁడా తెలియంగన్.' 84

క. ఏ మీశిష్యుఁడఁ గానే, సామీఁది కృపాతిశయమునం జనుదేరం
గా ఖిన్నుఁ జనఘా సందియ, మేమిటి?' కని పలుక నాతఁ డెంతయుఁ బ్రీతిన్. 85

ఆ. 'మేలు గాక పొందఁడు మీమాట లేనిటఁ, ద్రోపు చేయఁ జాల మీపురమున
కరుగుదెంతు' ననిన నౌఁ గాక యని గంధ, సింధురాధిరూఢుఁ జేసె నతని. 86

క. దివిజగణంబులు గొలువఁగ, ధవళాశ్వము నెక్కి చనుశతక్రతుగతి న
య్యవనీశ్వరుండు వివిధా,హవవీరులు గొలువ నుత్తమాశ్వము నెక్కెన్. 87

వ. ఇట్లు సర్వటిం దోడ్కొని చని త్ర్యంబకసఖుం డగుకుబేరుండునుం బోలె నాధీ
రుండు వివిధవిభవోదారుం డగుచు నిరంతరాలంకారసారం బగుధారానగరంబు
ప్రవేశించునప్పుడు. 88

చ. అలసవిలాసలీల నొక యంగన నెచ్చెలిమూఁపుమీఁదఁ గో
మలకర మూఁది యావనితమాటున మోము సగంబు తోఁపఁ బుం
విలుతునిదీమమో యనఁగ విభ్రమసంపద సొంపెలర్పఁగాఁ
బులకితగాత్రయై నిలిచి భోజమహీపతిఁ జూచె వేడుకన్. 89

సీ. కక్షభాగముల నఖవ్రణంబులమీఁదఁ గుచకుంభదీప్తులు గొనలుసాఁగఁ
దనరుకంఠమున దంతక్షతంబులమీఁద హారామలప్రభ లలమికొనఁగ
సురుచిరాధరబింబచుంబనముద్రపై మందహాసద్యుతి మాటుమలయ
ఫాలస్థలంబునఁ బరగులేఁజెమటపై నలకాగ్రసంచయ మంటికొనఁగ
తే. సురతతంత్రంబునందుఁ బ్రసూనశరుని, నెలమిఁ జరితార్థుఁ గావించి యేఁగుదెంచి
నేత్రయుగమున రాగంబు నివ్వటిలఁగ, భోజవిభుఁజూచె నొక్కపయోజనయన.

చ. ఒకసతి నాముఖం బమరునో యిది యొప్పునో చూడుఁ డంచు వే
డుకపడి యెల్లవారికిఁ గడుక రభసంబునఁ జూపవచ్చిన
ట్టొకముకురంబు చేతఁ జెలువొందెడునట్లుగఁ దాల్చి రాజపీ
థికిఁ జనుదెంచి భోజజగతీపతిఁ జూచెఁ బ్రియం బెలర్పఁగన్. 91

చ. అలరుపటీరశైలపవనాహతిఁ బయ్యెదకొంగు జాఱఁ గుం
తలములు చిక్కు జీఱువడఁ దద్దయు సంభ్రమ ముల్లసిల్లఁ జూ
డ్కులు దళుకొత్త నెచ్చెలులకుం దలమీఱి యొకర్తు వచ్చి వి
చ్చలవిడిఁ జూచె భోజనృపచంద్రుని భోగజితామరేంద్రునిన్. 92

ఉ. ఈతఁడు రూపసంపద నుపేంద్రతనూజునిఁ బోలు నంచుఁ బ్ర
ఖ్యాతిగఁ జెప్పఁగా నితనిఁ గాంచుట మేలయి వచ్చెఁ గాక యీ
రీతివధూటు లెందుఁ గలరే యని చూపఱు పిచ్చలింపఁగా
నాతుక యొర్తు భోజనరనాయకుఁ జూడఁగ వచ్చెఁ జెచ్చెరన్. 93

సీ. భూచక్రమునఁ గలరాచబిడ్డల కెల్లఁ దిలకమై పుట్టినచెలువుఁ డితఁడె
కర్ణాదిదాతలకథ లెల్ల మఱపించి పేరు గాంచినదానశూరుఁ డితఁడె
సారంబు లగుచతుష్షష్టివిద్యలకును దాన తానక మగుధన్యుఁ డితఁడె
తనమోముఁ జూచినజనుల కెల్లఁ గవిత్వసరణిఁ జేకుఱఁ జేయుచతురుఁ డితఁడె
తే. నిఖిలరాజన్యమకుటమణిప్రభావిభూషితాంఘ్రిపద్ముం డగుభోజుఁ డితఁడె
యనుచుఁ గొనియాడు పౌరులహర్షభాష, లంబునిధిఘోషమునకంటె నతిశయిల్లె.

వ. ఇట్లు సమస్తజనంబులకు నయనపర్వంబు నిర్వహించుచుండం జని యేనుంగు మొగసాల చొచ్చి యానరేంద్రుం డఖిలపరివారంబును సుచిత్రప్రకారంబున వీడుకొల్పి సర్పటి నొక్కపీడుపట్టున విడియింపను నతనికి సర్వసత్కారంబు లాచరింపను నాప్తజనంబుల నియమించి యశ్వావతరణంబుచేసి యంతర్గృహంబునకు నరుగు నవసరంబున. 95

సీ. మదనుదీమంబులకదుపులై తోఁతెంచుగతిఁ బ్రీతిఁ గొందఱు కమలముఖులు
పసిఁడిపళ్లెరములఁ బంచవర్ణాక్షతప్రతతిఁ బద్మాకృతిఁ బరఁగఁదీర్చి
కర్ణికాకారము ల్గా హారిద్రాకర్దమాదనంబున జ్యోతు లమర నిల్చి
యోలి నన్నింట సప్యోఘృతంబుల నించి వెలఁదిపట్టున వత్తు లలవరించి
తే. యందుఁ బవమానబంధుని నావహించి, రభసమునఁ దెచ్చి కక్ష్యాంతరమున నిలిపి
యందముగ నివాళించి రయ్యవనిపతికిఁ, జారుకంకణముల ఝుణత్కార మెసఁగ.

వ. అంత నమ్మహీకాంతుం డంతఃపురంబున కరిగి మజ్జనభోజనాదులు సలిపి యథార్హవిహారంబుల దినశేషంబు గడపి తదనంతరంబున. 97

ఉ. రేఁగి చకోరదంపతులఁ బ్రేల్చినకల్మషపంక మిందులోఁ
దోఁగినఁ గాని పాయ దని తోయజబాంధవుఁ డిట్లు చేసెనో
నాఁగఁ బ్రశాంతి నొంది కిరణంబులవేఁడిమి దక్కి శైత్యముల్
గాఁగ రథాంగము ల్బెదరఁగా నపరాంబుధిఁ జొచ్చెఁ జెచ్చెరన్. 98

సీ. దిననాథమిత్త్రుఁ డేతెంచిన నపరదిగ్రమణిఁ జెందినమనోరాగ మనఁగఁ
గమనీయచక్రవాకద్వయాంగములఁ జోఁకినవియోగానలకీల లనఁగఁ
జరమాచలాగ్రభూజములపైఁ బ్రాఁకినవినుతవిద్రుమలతాతతి యనఁగఁ
బశ్చిమాధీశునిప్రాసాదతలమున దీపించునునుదోఁపు తెర యనంగఁ
తే. గీరముఖభాతిఁ బుష్పితకింశుకంబు,పగిదిఁ జాతపోతాంకురప్రతతిభంగి
నలరి పడమటిదెస యొప్పె నంతకంత, కధిక మగుచు సంధ్యారాగ మతిశయిల్ల.

క. సురభూరుహకుసుమంబులు, పొరిఁ బొరిఁ గానఁబడుభంగిఁ బొడమెఁ దొడంగెన్
ధరతరమ తారకంబులు, స్ఫారిడిఁ బరార్భకులు వ్రేళ్ళఁ జూపుచుఁ జెలఁగన్. 100

సీ. లోకపాలోన్నతప్రాకారములయందు మృగమదపంకంబు మేఁదిరో కాక
వలయంపుఁ గొండపై నలరుతమాలంపుఁదీఁగె లెల్లెడలను సాఁగె నో కాక
యమునామహానది యన్నిచోట్లం ముంచి యంబుమార్గమున నిట్టపాడిచె నో కాక
యఖిలలోకంబులు నంజనచ్ఛాయగాఁ బద్మసంభవుఁ డచ్చుపఱిచె నో కాక
ఆ. యనఁగ మిట్టఁ బల్ల మని యేరుపఱుపరా,నట్టిభంగి మిగుల దట్ట మగుచు
జారచోరనికరసంచారహేతువై, యొదవె నంధకార ముర్వియందు. 101

వ ఇట్లు తమోవిజృంభణంబు చెల్లునవసరంబున కప్పూరంబు గృహదీపంబులవలనను గరదీపికానికరంబులవలననుం జేసి మహానాగంబులశిరోభాగంబులందోఁచు రత్నదీధితులవలన శోభిల్లుపాతాళకుహరంబునుం బోలె నుండునంత. 102

సీ. ప్రాగ్దిశాభామిని పశ్చిమాంగనచేతి కందిచ్చు నిద్దంపుటద్ద మనఁగ
వడిఁ జకోరంబులవడ దీర్ప నమృతంబు నిలిపినపటకంపుగలఁతె యనఁగ
విరహులపై దండువెడలుమన్మథునకుఁ బట్టినధవళాతపత్త్ర మనఁగ
నమరేంద్రరక్షితం బగుసుధాకలశంబుమీఁదఁ బొంపిరిగొన్నమీఁగ డనఁగ
ఆ. దిమిర మడఁగఁ గుముదసమితి విజృంభింపఁ, గమలవనము లెల్లఁ గన్నుమూయ
సకలలోకములకు సంతాప మేపారఁ, దూర్పువలనఁ దోఁచెఁ దుహినకరుఁడు. 103

క. అతుహినకరకరావళి, యాతతనక్షత్త్రయుక్తమై బుద్బుదసం
ఘాతయుతం బగువిబుధన,దీతోయమువెల్లి యనఁగ దీపించుటయున్. 104

క. జగ మెల్లఁ బాలఁ దోఁగిన, పగిదిఁ బటీరమునఁ గలయఁ బ్రామినభంగిన్
గగనసరిత్సైకంబున, నిగిడించినయట్లు నెగడె నిర్మలభాతిన్. 105

సీ. కొండ లెల్లను వెండికొండఁ బోలఁగఁ గామదమనుఁడు ప్రమథబృందంబుఁ బిలువ
జలధు లన్నియుఁ దుగ్ధజలధిఁ బోలఁగఁ జక్రపాణి యెచ్చటనైనఁ బవ్వళింప
సతు లందఱును సరస్వతిఁ బోలఁగను బ్రహ్మ పరికించి మఱి తనభామ నెఱుఁగ
దంతు లన్నియు నభ్రదంతిఁ బోలఁగ వజ్రి తనదంతికందువ తప్పి తిరుగ
ఆ. దెసలఁ గలయఁ బర్వి వసుమతీతల మెల్ల, నిండి యాకసమున నివ్వటిల్లి
తారహారహీరధవళమై చంద్రికా,జాల ముల్లసిల్లె జగమునందు. 106

సీ. నునులేఁతవెన్నెలకొనలు మెల్లనఁ ద్రుంచి పిల్లతండమునకుఁ బెట్టునవియుఁ
జవిగొనవెన్నెల చంచులఁ గబళించి యింపారఁ బ్రియులకందిచ్చునవియుఁ
గడఁగి యింతటఁగాని వడదేర దనుభంగిఁ దనర వెన్నెలవెల్లి మునుఁగునవియుఁ
బగలింటియాఁకలి పాయఁ బైఁబైఁబడి ముదురువెన్నెల గ్రోలి సోలునవియుఁ
తే. గడుపునిండినఁ గసికాటుకఱచునవియుఁ, గూడియొండొంటితోఁ జెరలాడునవియు
నగుచు వెన్నెల తమసొమ్మై యనినయట్లు, కోరి చరియించెఁ జవలఁ జకోరచయము.

శా. ఆవేళ న్వివిధాశ్రితవ్రజచకోరానందుఁడై విస్ఫుర
ద్భావుండై విలసత్కళాకలితుఁడై భగ్నీకృతారాతిభూ
పావష్టంభతమస్కుఁడై కువలయాహ్లాదప్రదుండై యశః
శ్రీవిభ్రాజితచంద్రికుం డయి తనర్చెన్ భోజరా జున్నతిన్. 108

సీ. సంగీతవిద్యాప్రశస్తమానసులతోఁ గూడి వినోదించుఁ గొంతదడవు
సాహిత్యవిద్యావిశారదాత్మకులతోఁ గూడి వినోదించుఁ గొంతదడవు
నృత్తవిద్యాకళాయత్తచిత్తులతోడఁ గూడి వినోదించుఁ గొంతదడవు
వాద్యవిద్యానిరవద్యభావకులతోఁ గూడి వినోదించుఁ గొంతదడవు
ఆ. శబ్దశాస్త్రమంత్రశాస్త్రధనుశ్శాస్త్ర, తురగశాస్త్రవిదులతోడిగోష్ఠి
నడుపుఁ గొంతతడవు నయశాస్త్ర వేదులఁ, గూడి మాటలాడుఁ గొంతదడవు. 109

చ. దళమగుహంసతూలనిజతల్పమునందు నిజప్రియాంగనా
లలితకుచోపగూహనముల న్మధురాధరపానలీలలం
దలకొని యంగము ల్పులకితంబులుగా సుఖయించు నవ్విభుం
డెలమిదలిర్పఁ గొంతతడ విక్షుశరాసనుఁ గ్రేణి సేయుచున్. 110

వ. మఱియు నెవ్వేళ నెయ్యది కర్తవ్యం బట్టికృత్యం బప్రమత్తుండై యొనర్చు నప్పు డమిఱేనికి నిమిషార్ధంబును నిరర్థకం బయి పోవ దిట్లు నిశాసమయధర్మంబులు చెల్లుచుండ నక్కడ సర్పటిసిద్ధుండు. 111

క. నను నీతఁడు వేడుకపడి, కొనివచ్చెను వీనితోడిగోష్ఠికిఁ దగునై
యునికి తగ దితని కొకమే, లొనరించి యథేచ్ఛఁ జనుట యుక్తము నాకున్. 112

వ. అని తలంచి పంచలోహకల్పితం బగునతనికొలువుచవికె సువర్ణంబు గావించుటకు నం దున్నదీపశిఖపయి నొక్కయోవధం బెవ్వరు నెఱుంగకుండునట్లుగా వైచి యథేచ్ఛం జనియె. 113

తే. అంత గృహదీపతతియును నంబరమునఁ, దనరునక్షత్రపంక్తియుఁ దరతరంబ
వెలరుపాఱుచు వచ్చె నుర్వీరుహములఁ, బత్తులు గలకలంబునఁ బలుకఁ దొడఁగె.

సీ. సర్పటిచే నొండొనర్పంగఁబడినమహాద్భుతక్రియ చూడ నరుగుదెండు
నిద్ర చాలింపుఁడు నెలఁతలకౌఁగిళ్ళు మెల్లన వదలుండు మేనులందుఁ
బొడమినఘర్మాంబుపూరంబు లన్నియు నిచె పోవఁ జల్లెద నీక్షణంబ
యివ్వేళ నొడలికి హిత మగు తాంబూల మనుభవింపుఁడు మేలుకనుఁడు ప్రీతి
ఆ. ననుచుఁ దెలుప వచ్చునట్లు వాతాయన, పథమునందు నడ్డపాటు లేక
తగిలి గృహగృహంబు తప్పక ప్రత్యూష, మారుతంబు వీచె మలసి మలసి. 115

క. అప్పుడు తూరుపుదిక్కున, విప్పినచెంగావివలువవిధమున రాగం
బొప్పఁగఁ బ్రభాతసమయము, చొప్పడియె రథాంగములకు సొంపుగ నంతన్. 116

సీ. ప్రాగ్దిశాసతిపాణిపల్లవంబుననుండి తోఁచుమాణిక్యకందుక మనంగఁ
గై సేయువేళ నాఖండలాంగనమ్రోల రాజిల్లురత్నదర్పణ మనంగ
నిర్జరనాగంబు నిటలస్థలంబునఁ దీర్చినసిందూరతిలక మనఁగఁ
జక్రవాకములకు శాంతిగా వెలిచి ప్రజ్వలించినవహ్నిపటల మనఁగ
తే. నుదయరాగ సంపద బింబ మొప్పుమిగుల, నఖిలదిక్కులఁ దనతేజ మతిశయిల్ల
నెల్లవిప్రులునర్ఘ్యంబులెత్తిమ్రొక్క, భానుఁడుదయించెఁద్రైలోక్యబంధుఁడగుచు. 117

వ. ఇట్లు సూర్యోదయం బగునంతకంటె ముందర. 118

ఉ. మంగళపాఠకధ్వనులు మాగధగీతులు వందిబృంద ము
ఖ్యాంగి యొనర్చుసంస్తుతులఁ బూర్ణపయోధిరవంబుచాడ్పునన్
సంగతమై శ్రుతిద్వితయసౌఖ్య మొనర్పఁగఁ జేర్చి భూమిభృ
త్పుంగవుఁ డార్యసమ్మతుఁడు భోజుఁడు మేల్కనియెం బ్రియంబునన్. 119

క. అతఁ డట్లు మేలుకని యచ్యుతు సంస్మృతియందుఁ దగిలి శుభలక్షణల
క్షితము లగునిజకరాంభోజతలంబులు చూచుచుండుసమయమునందున్. 120

చ. వనధికిఁ బుట్టినొండె హిమవద్గిరికిం బ్రభవించెఁ గాని యీ
ఘనకుచ యన్యసంజనిత కా దనఁగాఁ దగుకాంత యొర్తు కాం
చనమయపాత్రికన్ సురభిచందనపుష్పఫలాదివస్తువుల్
గొని చనుదెంచి చూపుమెఱుఁగు ల్వెదచల్లుచు మ్రోల నిల్చినన్. 121

వ. భాగ్యదేవతాయత్తంబు లగునర్థంబు లాత్మాయత్తంబులు గావించునట్లు భక్ష్యంబు
లగుతదీయద్రవ్యంబు లంగీకరించి యారాజశేఖరుండు. 122

సీ. పాదపద్మంబులఁ బసిఁడిపావలు మెట్టి సముచితమందయానమున వెడలి
శౌచియై వార్చి సుస్థలమునఁ బ్రాఙ్ముఖంబుగ సుఖాసీనుఁడై పుణ్యకాష్ఠ
మున దంతధావనం బొనర మౌనస్థుఁడై చేసి సుస్నాతుఁడై శిఖియుం ధౌత
వస్త్రంబు నుత్తరావాసంబు గోపికాచందనంబును దన కంద మొంద
ఆ. నాచరించె వైదికాచారవిధు లెల్ల, దాన మొసఁగె విప్రతతులఁ బిలిచి
భూమిధాన్యరత్నహేమగోమహిషాశ్వ,వస్త్రభూషణాదివస్తుచయము. 123

ఉ. అంతఁ బ్రసూనగంధవివిధాభరణాదులు దాల్చి యమ్మహీ
కాంతుఁడు రాజచిహ్నలఁ బొగడ్త వహించి సమస్తమంత్రి సా
మంతపురోహితాప్తభటమండలి గొల్వఁగ వేత్రహస్తు లం
తంతనఁ జూచి పాయుఁ డనునట్టియెలుంగులు నింగి ముట్టఁగన్. 124

వ. భూలోకపాలనలాలసుం డగు త్రిదశపాలుండునుం బోలె నమ్మహీపాలుండు వివిధ విభవవిశాలుం డగుచుఁ గక్ష్యాంతరంబులు గడచి కొలువుకూటంబునకు నరుగునవసరంబున నిద్దఱుభృత్యు లెదురువచ్చి భయభక్తియుక్తంబు లగుచిత్తంబు లుత్తలపడుచుండఁ బ్రణామంబు లాచరించి యి ట్లని విన్నవించిరి. 125

క. 'దేవర పెట్టినచోటం, గావలి యుండుదు మొకించుకయు నాలస్యం
బేవంకను లేదు ధరి, త్రీవర! కడు మోసపోయితిమి విను నిన్నన్. 126

ఆ. ఏమి దైవికంబొ యెఱుఁగ మెవ్వారును, జొచ్చి వెళ్ళినట్టిచొప్పు లేదు
పంచలోహమయవిభాసితం బగుమన, యనుఁగుమేడ పసిఁడి యయ్యె' ననిన. 127

క. 'వింటిమి మీచేఁ గ్రొత్తలు, కంటిమె లోహంబు లెందుఁ గనక మగుట య
య్యింటికి నిట్టిమహిమ యెటు, వంటిమహాత్మకునిచేత వర్తిల్లెనొకో!' 128

వ. అని పలుకుచుం దనమేనును బరిజనంబులమేనులును గలయ నవలోకించి 129

క పసుపున నానినచీరలు, ముసుఁగుపడినయట్లు దేహములఁ బీతరుచుల్
బొసఁగినయవి కనకగృహము, పసిమియె కాకున్నె యని నృపతి వెఱఁగందెన్. 130

వ. ఇట్లు వెఱఁగందుచుఁ బోయి. 131

సీ. కుంభినిఁ బగిలించుకొని మీఁది కుబ్బినపృథునిధానంబులప్రేఁక మనఁగ
ఘనసమీరణహతిఁ దునిసి మేదినిఁ బడి చెన్నొందు హేమాద్రిశిఖర మనఁగఁ
బురవైభవము చూడ నరుదెంచి శ్రీకంఠసఖుఁ డుర్వి నిడినపుష్పక మనంగఁ
గామరూపము పేర్మి గలవైనతేయుఁడు చేకొన్నమూర్తివిశేష మనఁగ
ఆ. సకలదిశలయందు సంపంగి రేకులు, చల్లినట్లు తనవిశాలకాంతి
చాల నెసఁగ నొప్పుసౌవర్ణగేహంబుఁ, జూచి భోజవిభుఁడు చోద్య మంది. 132

చ. 'ఇది కడునద్భుతం బిచట నెవ్వఁడొకో యిటు చేసి పోయె స
మ్మదమున నొక్కదివ్యుఁడు విమానగతుం డయి వచ్చి యిచ్చమై
నది యిట డించి యాచవికె యాదటఁ దాఁ గొనిపోయె నొక్కొ యె
య్యదికత మొక్కొ హేమమయమై యిటు లుండుట యొక్కరాత్రిలోన్'. 133

చ. అని తలపోసి యాచవికెయందు వెలుంగుప్రదీపవహ్నియుం
గనుఁగొని సర్పటిం దలఁచి కంటి నతం డిటు ధూమవేధిచే
ననువుగఁ జేసినట్టిపరమాద్భుతకృత్యము గాఁగ నోపు నా
యన యెటు పోయెనో వెదకుఁడా యని భోజుఁడు సంభ్రమంబుతోన్. 134

క. తనపరమాప్తులఁ బంచినఁ, జని పుర మంతయును వెదకి సర్పటి నెచ్చో
టను గానక క్రమ్మఱి వచ్చినఁ బశ్చాత్తాపతప్తచిత్తుం డగుచున్. 135

ఉ. 'అక్కటా! మోసపోయితి ననర్ఘమణీఖని చేతి కందియుం
దక్కక పోయిన ట్లితఁడు దాఁ జనుదెంచియు దుస్సిపోయె నిం
కెక్కడఁ గందు? నప్పురుషుఁ డెక్కడఁ బోయెనొ? యేమి చేయుదుం!
గ్రక్కునఁ బోవరన్న మను గాంచిన యవ్వటశాఖియొద్దకున్.' 136

క. నావుడుఁ దద్భటనికరం, బావటవిటపికడ కేఁగి యంతయుఁ గలయం
గా వెదకి వచ్చి 'యోపృథివీవర! కాన' మని విన్నవించి యరిగినన్. 137

ఉ. ఆతఁడు దాను నిచ్చటికి సాదటతోఁ జనుదెంచునట్టి ప్ర
ఖ్యాతపుమార్గ మేమిగతిఁ గల్గునొకో యని చింత చేసి యా
భూతలనాయకుండు తనబుద్ధి నుపాయ మొకండు గాంచి య
జ్ఞాతవిధంబునందు నది సాధ్యము చేయఁ దలంచి నేర్పునన్. 138

ఆ. 'శబ్దభేది గలదు చర్చింప భోజభూ,పాలునగర' ననుచుఁ బట్టణమునఁ
జాటఁ బంచె నంత సకలదేశముల న, వ్వార్త మించె నెల్లవారలకును. 139

సీ. అట్లు కర్ణాకర్ణి నవ్వార్త విని భూమిఁ గలసిద్ధు లెల్ల నయ్యలఘువిద్యఁ
బరికించు వేడుక నరుదెంచుచుండంగ నవనీశ్వరుండు రహస్యవృత్తి
నపైఁడిమేడ దా విప్పించి యొక్కొక్క ప్రతికి నూఱును వేయుఁ బ్రతులు గాఁగఁ
గప్పెర లాతంబు ఘనకమండలువులు మొదలుగా నన్నియుం మున్న చేసి

ఆ. యితరు లెఱుఁగకుండ నిది యెవ్వ రేమి దెచ్చినను వానిఁ బుచ్చుకొని తొలంగ
వైచి యిచ్చుఁ దనసువర్ణకల్పితములు, బొంకు నిక్క మయ్యె భోజునకము. 140

క. వారును దమ తెచ్చినయవి, బోరనఁ దనవిద్యవలన భోజుం డిచ్చెం
గారవముఁ జేసి మాకిం,పారఁగ నిచ్చె నని సుముఖులై చనుచుండన్. 141

తే. తీర్థముల కేఁగున ట్లెల్లదేశములజ,నంబులును భోజవిభునిఁ బ్రియంబుతోడఁ
జూడ నరుగంగ సర్వటి చోద్య మంది, నెమ్మి నిట్లని తలఁచుఁ జిత్తమ్మునందు. 142

చ. 'వెలయఁగ శబ్దభేది యనువిద్య జగంబున భోజరాజుచేఁ
గలదఁట వాఁడెపో నృపనికాయము కెల్లను మేటి వానిచేఁ
గలుగుట యేను ము న్నెఱుఁగఁ గాని యెఱింగినఁ బుచ్చుకొందు నాఁ
డేమి దలిర్ప నప్పురికి నేఁగినయప్పుడ మిత్త్రభావనన్. 143

ఆ. ఇంక నైన నచటి కేఁగి యానరనాథ, చంద్రుచేత నున్న శబ్దభేదిఁ
బుచ్చుకొనఁగ వలయుఁ బొలుపార నాచేత, నున్న ధూమవేధి యొసఁగి యైన. 144

ఉ. తక్కువజాతియందు వనితామణి యున్నను నీచమర్త్యునం
దక్కువవిద్య చొప్పడిన సంగిలిచోట సువర్ణ మబ్బినన్

దక్కఁక వెన్విషంబున సుధారస ముండిన గ్రాహ్యమండ్రు వాఁ
డొక్కమనుష్యమాత్రుఁడె మహోన్నతుఁ డున్నతరాజపూజ్యుఁడున్. 145

వ. అదియునుంగాక. 146

చ. గురునకు సేవ చేయుట తగుం దగువిద్యఁ బరిగ్రహింపఁగా
నరుదుగ నర్థ మిచ్చి పడయం దగు నొండె సువిద్య యిచ్చి వి
స్తరముగఁ విద్యఁ గైకొనుట దా నొకపక్షము మూఁడురీతులం
బరగుట దక్క నాలవ నుపాయము లే దని చెప్పు శాస్త్రముల్. 147

క. కావున నాతనిచేఁ గొనఁ, గా వచ్చును నిట్లు నాదుఘనవిద్యయు నా
భూవరున కొసఁగ వచ్చును, బోవలయును భోజరాజపురమున' కనుచున్. 148

క. కతిపయదినములనాఁటికి, నతఁడును బ్రచ్ఛన్నమూర్తియై తగ భోజ
క్షితిపతిసమ్ముఖ మగుటయు, నతఁ డాతనిఁ జూచి ప్రముదితాననుఁ డగుచున్. 149

ఆ. ఎదురు లేచి కరము లెత్తి నమస్కృతి, యాచరించి యున్నతాసనంబుఁ
బెట్టఁ బనుప నతఁడు ప్రీతుఁడై దీవన, లిచ్చి భోజపతికి నెలమి మిగుల. 150

వ. ఆసీనుం డగుటయు నమ్మహీపతియు నిజసింహాసనస్థుండై సగౌరవంబుగా నిట్లనియె.

ఉ. 'ఎచ్చటనుండి రాక యిట కెచ్చటి కేఁగుట? సూరు లెవ్వ రే
నిచ్చట మా కొనర్పుపని యెయ్యది? పుణ్యుఁడ నైతి నేను మీ
వచ్చుటఁ జేసి' నావుడు నవస్మితచారుముఖారవిందుఁడై
యచ్చుగ నాతఁ డానృపతియాననపద్మముఁ జూచి యి ట్లనున్. 152

తే. 'ఆది వేటమై వచ్చి మీ రల్లనాఁడు, మఱ్ఱికడ నన్నుఁ బొడగని మాటలాడి
పరగఁ దోఁకొని రారె మీపట్టణమున, కేను సర్పటి యనువాఁడ నెఱుఁగవయ్య. 153

వ. మీకుఁ జెప్పక పోవుటం జేసి నాఁటికొఱంత వాపికొన వచ్చితి' ననిన నన్నరేం
ద్రుండు పెన్నిధిఁ గన్న పేదయుం బోలె నత్యంతసంతుష్టాంతరంగుండై పునఃపు
నఃప్రణామంబు చేసి యిట్లను 'నీశ్వరేచ్ఛగదా! దీని కేది కొఱంత? నా మీఁది కారు
ణ్యంబునఁ గ్రమ్మఱ నిట్లు వచ్చుటం జేసి నామనోరథంబు సఫలం బయ్యె' నని యనే
కవిధంబుల నూఱడించిన నాసర్పటియు నతనిగుణవిశేషంబులు గొనియాడి యిట్ల
నియె. 154

చ. 'తిరిగితిఁ బెక్కుదేశములు దేవ! భవత్సముఁ డైన మేదినీ
శ్వరుఁ బొడగాన నీకు వశవర్తిని నై విలసిల్లునట్టిభా
సుర మగుశబ్దభేది యనుచోద్యపువిద్య తదీయలక్షణం
బరయఁగ వేఁడి యేను బ్రియ మారఁగ వచ్చితి నిందు భూవరా! 155

క. అలనాఁడును నీవిద్యా, జలనిధి లోఁ దెలియఁగ లేక చపలాత్ముఁడనై
తొలఁగితి నే నటులుండఁగ, వలదే రాజ ననువాఁడు వసుమతిలోనన్. 156

క. సిద్ధులలోపల నెల్ల బ్రసిద్ధుఁడు సర్వటి యనంగఁ జేయుఁడు ననుస
ద్బుద్ధి గలదేని నాకుఁ బ్రవృద్ధం బగుశబ్దభేది విద్య యొసఁగుమా. 157

క. ఏనును నిచ్చెద నీకు న, నూనం బగుధూమవేధి యొప్పుగ' ననినన్
'గానిందు మీరు పెద్దలు, గానఁ దొలుత నాకు నొసఁగఁగా వలయుఁ జూఁడీ! 158

క. మఱి నాకన్న తెఱంగున, నెఱిఁగించెద నాదువిద్య యేర్పడ' ననినన్
దెఱఁ గేది భోజభూపతి, కఱిమిఱి దనవిద్య చెప్పి యతఁ డిట్లనియెన్. 159

ఉ. 'చెప్పితి నాదువిద్య యర చేయక నీదగువిద్య యేర్పడం
జెప్పుము నాకు' నావుడును జెన్నగుమోమునఁ గొంతవింతన
వ్వొప్పఁగ భోజుఁ డిట్టు లను 'నొచ్చెల నే నొకవిద్యవాఁడనే
తప్పఁగఁ జిత్తగింపకుఁడు తద్విధ మే నెఱుఁగ న్మునీశ్వరా!' 160

క. అనిన విని 'యేటిమాటలు, ఘనతర మగుశబ్ద భేది గలుగుట లేదే
జననాథ! మున్న నీచే,' ననవుడు విని భోజుఁ డిట్టు లను నాతనితోన్. 161

ఉ. 'మించగువిద్య భోజునకు మేదినిపైఁ గలదన్నశబ్ద మొ
క్కించుక నీదువీనుల వహించినమాత్రన నామనంబు వే
ధించుటఁ జేసి యిందుఁ జనుదెంచితి గావున శబ్దభేది నా
నంచిత మైనవార్త గల దంతియ కాని యెఱుంగ నెద్దియున్. 162

ఉ. నావుడు 'నిట్లు పల్కఁ దగునా? ధరణీశులు మీరు సిద్ధవం
శావళివార మేము నిజ మాడుము చాలుదు విద్య లేనివా
రీవిధి నెల్లవారలకు నిత్తురె కాంచనకల్పితంబు లే
లా వెడమాట లీచెనఁటెలాగున మాకును గోప మయ్యెడిన్.' 163

వ. అని ఘట్టించి పలుకునప్పు డక్కుఱుకుందపసికడకన్నులం బొడముకెంపు గని కంపించుచు నమ్మహీనాథుండు చేతులు మొగిచి 'నాకు మీచేతిధూమవేధి సిద్ధించుటకు నిట్టికపటోపాయంబు చేసితి నాతప్పు మన్నింప వలయు' ననుచు మదకుంభికుంభస్థలస్పర్శనకర్కశంబు లగుతనహస్తంబుల నతనిపాదంబులు పట్టుకొనఁబోవుటయుం నతండు కోపంబు డింప నోపక యడిచిపడుచుఁ దొలంగి యంతంత నిలిచి యిట్లనియె. 164

క. 'రాజ వని నిన్ను నమ్మితి, భోజుఁడు ధర్మాత్ముఁ డనుట బొంకయ్యెఁ గదే
యోజ చెడ నిట్లు చేత బ్రయోజనమే వలయు ననిన నొసఁగనె నీకున్. 165

ఉ. నన్నదకించి యొద్దరితనంబున నాదగువిద్య నీవు గై
కొన్న సహింప నేర్తునె తగుం దగు లెస్స విచార మయ్యెఁ బో
మున్నటు మేలు మేలనఁగ మూర్ఖుఁడవై ధనకాంక్షఁ గాదె యీ
పిన్నతనంబు చేసి తిది పెద్దలు మెత్తురె రాజధర్మమే? 166

వ. కావున నీవు చేసినయపరాధంబునం జేసి నీ వనపత్యుండవు గ' మ్మని శపియించె.'

చ. అనవుడు నమ్మహుండు వినయానతుఁడై ముని నాథుతోడ ని
ట్లను "మును సిద్ధు లెవ్వరును నారయ సర్వటిభంగి మోసపో
యినవిధ మెన్నఁడు న్వీన మదేమినిమిత్తమొకో యతండు చే
సినకపటప్రసంగమునఁ జిక్కుట?" నావుడు నాతఁ డిట్లనున్. 168

వ "దీని కొక్క-కారణంబు కల దాకర్ణింపుము చెప్పెద. 169

సీ. తమ్మిలోరేకులు తరుణరంభామృదుస్తంభంబు లున్నతసైకతంబు
మండితమృగరాజమధ్యప్రదేశంబు లాలితనవమృణాళద్వయంబు
మదమత్తభద్రసామజకుంభయుగళంబు మహితశంఖంబు కొమ్మావిచిగురు
కుందుఁ గందును లేనికుముదాప్తబింబంబు కవ గూడి యాడెడుగండుమీలు

తే. నసఁగ నళికాళ్యఁ బెందొడ లలఘుజఘున, మలఁతికౌఁదీఁగె కెంగేలు వలుఁదచన్ను
లబ్జు కెమ్మోవి నెమ్మొగ మక్షియుగము, వరుస నొప్పారునొకవారవనిత గలదు.

క. ఆవనిత యొక్క-నాఁ డొక, దేవాలయమునకు నరిగి దేవుఁడు తన కా
భావంబునఁ బొడచూపిన కైవడి నొకసిద్ధుఁ డుండఁ గాఁ బొడగనియెన్. 171

క. కని ప్రణమిల్లిన నాతఁడు, తనతో భాషింప కున్నఁ దాఁ దొలఁగక శం
భునిఁ బురుషభిక్ష మడుగం, జనుదెంచినరతియొపోలె సన్నిధి నుండెన్. 172

ఉ. మానుగ హస్తము ల్మోగిచి మండితవృత్తిఘనస్తనాంగభా
రానతయో యనంగ వినయానత యై నయనాబ్జరోచులుక్
మానక యమ్మహాత్ముచరణంబులమీఁదన సంచలింప న
మ్మానిని భక్తిసంభరితమానసయై యటు గొల్చి యుండఁగన్. 173

క. ధ్యానానంతరమునఁ బర, మానందవిజృంభితాత్ముఁడై సిద్ధుఁడు 'బా
లా! నీ వెవ్వరిదానవు? నీనాథుం డెవ్వఁ?డేల నిలిచితి విచటన్?' 174

వ. నావుడు నాసిద్ధునకు నమ్మగువ యి ట్లను 'నేను వేశ్యాధర్మంబునఁ జరియించుదాన
నిమ్మహాదేవునకు నమస్కరింప వచ్చి యిచ్చట మమ్ముఁ గని దండప్రణామంబు చేసి
మీకటాక్షం బపేక్షించి యున్నదాన' నవవుడు నతండు ప్రీతుండై చేరం బిలిచి
నొసలు నిండ విభూతి పెట్టి దీవించిన 'సయ్యా! మదీయావాసంబునకు విచ్చేయ వల
యు' నని యచ్చెలువ ప్రార్థించిన. 175

క. 'ఊరు చోరనొల్ల నేను శి,వారాధనతత్పరుండ నై నెలఁ బదినా
ళ్ళీరమ్యం బగుదేవా, గారంబున నుండు వేడ్క గదిరెడు నాకున్. 176

ఉ. బాలకి పొమ్ము' నావుడుఁ దపస్విపదాబ్జయుగంబుమీఁద నీ
లాలకజాలము ల్నెరయ నాయలికంతల సోఁగి మ్రొక్కి క్రొ
వ్వాలినకన్నెఱుంగులు నివాళి యొనర్చి రతీశమత్తశుం
డాలమనోజ బింకపునడల్ బెడఁ గొందఁగ నేఁగి భక్తితోన్. 177

క. నాఁడు మొదలుకొని యాపూఁ,బోఁడి యనారతముఁ దెచ్చి భోజన మిడఁగా
నేఁడొక్కటి చనునంతకు. వాఁ డక్కడ నుండు సుచితవర్తనలమెయిన్. 178

వ. అంత నతం డక్కాంతతో నొక్కనాఁ డేకాంతంబున నిట్లను 'నేను నీతాత్పర్యం బునకు మెచ్చితి నీకొక్కచోద్యం బగువిద్య యిచ్చెదం గొను'మని యనుగ్రహించి. 179

ఆ. ఔషధములు చెప్పి యవి గూర్చువిధమును, జెప్పి దీపవహ్నిశిఖలమీఁద
నైవ ధూమవేధవలన లోహంబులు, హేమ మగుతెఱంగు లెఱుఁగఁ జెప్పి. 180

క. సిద్ధుఁడు చనుటయు నింతి ప్ర,బుద్ధచరిత్ర యగు తోడఁబుట్టినసతి కా
శుద్ధి యెఱిఁగించి యౌషధ,సిద్ధి పడయుఁబనికిఁ జింత సేయుచుఁ దమలోన్. 181

ఉ. కన్నులు లేనివాఁ డొకఁడు గల్గినఁ జాలు నతండు నూరఁగా
నిన్నియుఁ మార్ప వచ్చు నొరులెవ్వరు దీని నెఱుంగ కుండఁ బ్ర
చ్ఛన్నపుఁజేతభంగి సువిచారము సు మ్మని యొక్కరాత్రి యా
సన్నముఖాబ్జలై మిగులఁ జప్పుడు గానిరహస్యభాషలన్. 182

క. ఆలోచింపఁగ సర్పటి, యాలో భిక్షమున కరిగి యాపలుకులు దా
నాలించి దానికిం దగు,కీలు విచారించి మగిడెఁ గృత్రిమభంగిన్. 183

క. మఱునాఁడు విగతచక్షుని, తెఱఁగున నొకపంచఁ జేరి దీనత దోఁపం
గొఱమాలినయొకపెంచిక, యఱచేతం బట్టికొని నతాననుఁ డగుచున్. 184

తే. 'కపటిఁ జుండన్న యిటునటుఁ గదలలేని,వాఁడఁ జుండన్న యోభాగ్యవంతులార!
పుణ్యసతులార! నన్నుఁ గారుణ్యబుద్ధి, నరసియుందరాగ్ని యార్పుఁడీ'యనుచునుండ.

క. అప్పొలఁతి చూచి నయనము,*లొప్పెడు చెలువంబువలెను నున్నవి యిది యే
చొప్పో కానం డట యితఁ, డప్పా యిట వచ్చి చూడు మని చూపుటయున్. 186

క. చూచి యితం డగుఁ బో మన, చూచినపని కనుచు వానిచూపులసత్త్వం
బేచందమొ యని తెలియం, జూచుటకయి పెంచిలో నశుద్ధము కలియన్. 187

ఉ. వైచినఁ బ్రత్యయార్థముగ వాఁ డతిప్రీతి భుజింపఁ బోయినన్
జూచి కరంబు పట్టుకొని శుద్ధము కన్నులు చెడ్డవాఁడ కాఁ

*ఒప్పెడు కర్ణికలుబోలె నున్నవి యిదియే చొప్పొకో......(చి. ని. పా.)

జూచుచుఁ జెట్టపట్టుకొని స్రుక్కక యింటికిఁ దెచ్చి నవ్వుచున్
వాచవులైన భోజ్యములు వానికిఁ బెట్టుచు నే ర్పెలర్పఁగన్. 188

ఆ. వలయు మందు లెల్ల వానిచే నూరింప, నతఁడు తోడుతోన యన్నిక్రియలు
నెఱిఁగి యొక్కనాఁడు తెలివసమ్ముఖమున, నిలిచి నేత్రరుచులు నివ్వటిలఁగ. 189

ఉ. 'సింధురయాన! యేను నినుఁ జెంది కృతార్థుఁడ నైతి నన్ను నీ
వంధుని గాఁ దలంచి యిటు లన్నియుఁ జూపఁగ నీప్రసాదసం
బంధము పేర్మిఁ జేసి పరిపాటి నెఱింగితి ధూమవేధి యే
నంధుఁడఁ గాను సిద్ధుఁడఁ జుమమ్మ ! వధూమణి ! పోయివచ్చెదన్.' 190

క. అనవుడు సిగ్గును గోపం,బును మఱిఁ బెనఁగొనఁగ 'మోసపోయితిన కదా!
నను నితఁ డిట్లు ప్రమోషిం,చిన దానికి మాఱు చేయఁ జెల్లదె' యనుచున్. 191

ఉ. చేతులు మోడ్చి నిల్చి తనచిత్తము నైక్యము చేసి "మద్గురుం
డాతతసత్యశాలి యగు టారయ నిక్కమ యయ్యె నేని నే
రీతి నితండు నన్నొరఁగి రిత్తకు రిత్త గ్రహించె విద్య యీ
రీతినె మోస పోయెడు ధరిత్రి నితం'డని పల్కె నల్కతోన్. 192

క. అది కారణముగ సర్వటి, విదితంబుగ మోసపోయె విను"మని సతతా
భ్యుదయుఁడు దత్తాత్రేయుఁడు, మొదలిటికారణము తెల్లముగఁ జెప్పుటయున్. 193

చ. విని మహిఁ దమ్మునీంద్రునకు వేడుక నంజలి చేసి "యోకృపా
వననిధి! నీముఖంబున నవారణమై వినఁ గంటి శ్రోత్రరం
జన మొనరింపఁ జాలెడుప్రసంగము లప్పుడు సిద్ధుఁ డల్గి భో
జనృపతిఁ దా శపించి మఱి శాపవిముక్తి యొనర్చె నే తుదిన్?" 194

చ. అనవుడు "శాంతి నొందుటకు నారయ నెట్టిఫలంబు మీరు స
జ్జనులు గదయ్య కోపము ప్రసాదము గల్గుట యొప్పుఁ గాక కా
దన నితరుండు చాలఁడె మహాపురుషా! యనపత్యుఁ డైనవాఁ
డొనరఁగ నూర్ధ్వలోకముల యుక్తుఁడు గాఁ డని చెప్పు శాస్త్రముల్. 195

ఉ. పాండువిభుండు సన్మునులపజ్జఁ జనం జన నమ్మునీంద్రు లిం
దుండి యపుత్రవంతులకు నొందఁగ రా దివి దివ్యభూము లీ
వుండుము నావుడున్ మగిడి యుల్లము డిల్లము చెంద నవ్విభుం
డొండొకధర్మమార్గమున నొప్పఁగ సంతతి నిర్వహింపఁడే. 196

ఉ. కాన మనుష్యు లూర్ధ్వగతి గాంచుటకుం దగుసాధనంబు సం
తానము యట్టిసంతతియ తప్పునయేని ధనంబు లేల నా

కీనిఖిలావనీభరము నేల శరీరసుఖంబు లేల నీ
తోన చరింప వత్తు ననుఁ దోఁకొని పొమ్మని ముట్టఁ బల్కినన్. 197

చ. 'ఇటు తగునయ్య భోజజగతీశ్వర! పేరుఁడ వీవు నీకు నిం
తటిపనికై కలంగు టుచితంబె విచారము దక్కు' మంచు స
ర్వటి పలుకంగ నించుకయుఁ బాయనియంతరచింతతోన మి
క్కుటముగ నమ్మహీవిభుఁడు గొందల మందుచు వెచ్చ నూర్చుచున్. 198

వ. ఉండె నప్పుడు సర్వటి. 199

చ. 'వలవనిదుఃఖ మేల? జలవల్లభ! మర్త్యుఁడు దానధర్మముల్
సలుపఁగ నూర్ధ్వలోకములు సాధ్యము గా వెటు కన్నబిడ్డలే
పొలుపుగఁ దన్ను సద్గతికిఁ బుత్తురె? యీ వెడబుద్ధి లేల? నా
పలుకు దృఢంబు గా వినుము పార్థివశేఖర! లెమ్ము నెమ్మితోన్.' 200

క. అనవుడు 'మాయట్టిమహాత్మున కెవ్వరు వలదు గాక మునుకొని గృహధ
ర్మనిరూఢుఁడ నగునాకుం, దనయులు వలదయ్య రిత్తతర్కము లేలా? 201

క. ఆరయ సంసారమునకు, దారాపత్యములు గావె తగునంగము లిం
పార నవి లేనిపురుషుని, పే రెవ్వఁ డెఱుంగు వానిపెంపేమిటికిన్? 202

ఆ. దివియలేనిగృహము తెఱఁగున సంతాన, రహితుఁ డైనవాని బ్రతుకు చూడఁ
గడు నిరర్థకంబు గాదె? నావుడు నతఁ, డతనితోడ నిట్టు లనియె నధిప. 203

ఆ. 'సుతుఁడు నిధియుఁ వనముఁ గృతియు నగ్రహారము
గుడియుఁ జెఱువు ననఁగఁ బుడమియందు
సంస్తుతింపఁ బరగు సప్తసంతానముల్
గలవు కీర్తిసుకృతకారణములు. 204

తే. తొలుత నిందులోఁ బుత్త్రుండు తొలఁగె నేని
నున్నయాఱును నేలోక మొసఁగఁజాల
వధిప యిన్నింటిలోపల నధికమరయఁ
గృతియ చూ నిత్యకీర్తికి గతియుఁ గాన. 205

క. తొల్లిటిపెద్దలచరితలు, తెల్లంబుగ నేఁడు మనకుఁ దెలియుంట ధరణీ
వల్లభ! యిటు వినుమా! విలసిల్లుకృతులవలన నగుట సిద్ధము గాదే. 206

ఉ. ఆర్యవరుచక్రవర్తులుఁ బదార్యవరురాజులు నేఁటివారలే?
యుర్వి బహుప్రకారముల నొప్పుగఁ బాలన చేయరే? గుణా
ఖర్వులు వారలుం జనిరి కాదె? తదీయ యశంబు లెల్లెడం
బర్వుట సత్కవీంద్రఘన భాషితసత్కృతిమూలమే కదా. 207

క. కర్త యొనరించుధర్మము, కీర్తికి నాస్పదము ధర్మకీర్తులు ఘనవి
స్ఫూర్తికిఁ గారణ ముజ్జ్వల, మూర్తివి సుకృతివియ చుమ్ము మూఁడుజగములన్. 208

క. కావునఁ గ్రతు లొనరింపం,గా విద్వజ్జనులఁ బంపు గారవ మెసఁగన్
దేవాలయములఁ జెఱువులఁ, గావింపుము ధనము లిమ్ము కడుపేదలకున్. 209

క. భూసురులఁ బెండ్లి చేయుము, భూసురముగ నెల్లచోట్ల ఫలవృక్షంబుల్
వేసరక పెట్టఁ బనుపుము, చేసెద మనువారి కేమి చెల్లదు చెపుమా!' 210

చ. అనవుడు భోజుఁ డిట్టు లను 'నక్కట! భూజను లెల్లవారలున్
దనయులముద్దుఁజేఁతల సుధారసపానము చేసినట్లు నె
మ్మన మలరంగ సౌఖ్యరసమగ్నులుగాఁ గనుఁగొంచు ముచ్చటల్
దనుకగ నెవ్విధంబున నలందురు చుండెదువాఁడ ? జెప్పుమా!' 211

ఉ. నావుడుఁ 'బుత్రమోహము ఘనంబుగ నున్నది రాజుడెందమం
దేవిధిఁ దేర్చువాఁడ నతఁ డే మని తేర్చినఁ దేర? డక్కటా
నావచనం బమోఘ మయినం దగ నొక్క తెఱంగు చేసి యీ
భూవిభు కాంక్షఁ దీర్తు' నని బుద్ధిఁ దలంచుచు సిద్ధుఁ డిట్లనున్. 212

క. 'ఓరాజ నాదువాక్యం, బేరూపున బొంకుఁ బొరయ దీవును సంతా
నారూఢి బుద్ధి వదలఁగ, నేరవు విను మొకవిధంబు నీ కొనరింతున్. 213

క. నీవు గదా యిప్పుడు నా,చే విద్యాసంగ్రహంబు చేసితి కపట
ప్రావీణ్యంబున నిది నీ, చే విచువారలకుఁ బాపు చేయక యుండున్. 214

సీ. ఉర్వీశ! వినుము విద్యోపదేశము చేయువాఁడు తండ్రియుఁ గొనువాఁడు సుతుఁడు
నని చెప్పుదురు పెద్ద లటుగాన నీకు నేతన్మూల మైనసంతానకరణి
లే కుండునని నెపంబై కాని శాపంబుతుది డిందు పడఁగ నేరదు తదీయ
దోషంబువలన ముక్తుఁడవుగా నొండుపాయము లేదు గాన నీయనువు నెనయఁ
తే. దగ విచారించి చేసితి దానఁ జేసి, పుత్రవంతుఁడ వగుము పవిత్రచరిత్ర!
యోడ కుండుము నీ' వని యూఱడించి, మనుజవిభుతోడ సర్వటి యనియె మఱియు.

సీ. 'బొంకెడుపురుషునిఁ బొంద నొల్లదు లక్ష్మి తొల్లింటిసిరియును దొలఁగి పోవు
బ్రహ్మహత్యాదిపాపము లెన్నియైనను నిల నసత్యంబుతో నెత్తు రావు
మద్యపానము చేయ మరగినాతనికంటెఁ గీడు సు మ్మనృతంబు లాడువాఁడె
యూర్ధ్వలోకము త్రోవ యుడిగించి యధమలోకప్రాప్తి గావించుఁ గల్లతనము
ఆ. కాన నింతనుండి మానవేశ్వర నీవు, నిత్యసత్యనిష్ఠ నెఱపుమయ్య
సత్యమందె నిలుచు సర్వలోకములు సత్యవ్రతంబుకంటెఁ దపము లేదు. 216

క. ఇప్పుడు నీకును నాకును, జొప్పడినవివాదమునకు శోకింపకు నీ
తప్పున నైనది గా దిది, యప్పరమేశ్వరుఁడు మూల మఖిలంబునకున్.' 217

క. అని బోధింప నతఁడు దన, మనము శరత్కాలసరసిమాడ్కిఁ బ్రసన్న
త్వనిరూఢంబుగ నాతనిఁ, గనుఁగొని యిట్లనియె వినయగౌరవ మెసఁగన్.

క. 'మీకరుణఁ జేసి వంధ్యత, లేక మదీయోదరము ఫలించినఁ జాలున్
నా కంతియ పదివేలు ని,రాకులమతి, నైతి' ననియె" నని చెప్పుటయున్. 219

క. ఆకర్ణించి మహుండు "ప్ర,భాకరసమతేజ! నీకృపం బుణ్యకథల్
నాకు విన నయ్యె భోజుం, డేకరణిఁ జనించె సిద్ధుఁ డేమైఁ జనియెన్?" 220

వ. అని తదనంతరకథాకర్ణనోత్సుకుం డయి యడిగిన. 221

చ. సరసిజనాభ! భక్తజనసంచితపుణ్యఫలప్రదాన! వా
గ్వరమతపాదపంకజ! జగన్నివహాభయదానభూమ! మం
దరగిరిమూలమండిత! రథాయితచారుఖగాన్వయేశ! శం
కరరమణీసదాస్మరణకారణనిర్మలనామశోభితా! 222

క. గర్వితహిరణ్యకశిపువ, పుర్విదళనకరణఘననిపుణనఖనికరా
పూర్వాద్యాయుధ! కరసంభృత, సర్వాయుధ! దురితతిమిరచండమయూఖా! 223

మత్తకోకిల. నీలనీరదచారుకోమలనిర్మలాంగ! 'విజృంభితా
ఖిలదానవమానమర్దన! భీమనక్రగృహీతశుం
డాలభీతినిరాస! ఘోరకుఠారలూనసమస్తభూ
పాలకానన! సన్మునీశ్వరపాలనా! నరకేసరీ! 224

గద్యము. ఇది వాణీవరప్రసాదలబ్ధవాగ్వైభవ తిక్కనామాత్యసంభవ సుకవిజనవిధేయ అనంతయనామధేయ ప్రణీతం బైనభోజరాజీయం బను కావ్యంబునందు విప్రుండు దారిద్ర్యనిర్వేదనంబునఁ దీర్థయాత్రానిరతుం డగుటయుఁ గాశికాదర్శనంబును బ్రయాగతీర్థాభిగమనంబును జతుర్లలనాజలప్రవేశంబును దదనుగమనంబున విప్రుండు భోజుండై పుట్టుటయు మృగయావిహారంబును సర్పటిసిరీక్షణంబును దదాగమనంబును లోహగృహంబునకు సువర్ణత్వంబు ప్రాప్తం బగుటయుఁ గృతక మంత్రప్రకటనంబును సర్పటిపునరాగమనంబును ధూమవేధివిద్యాహరణంబును వారాంగనోపాఖ్యానంబును సంతానవిషయం బై భోజసర్పటులయిష్టానులాపంబును నన్నది ద్వితీయాశ్వాసము.

శ్రీ

# భోజరాజీయము

## తృతీయాశ్వాసము



రమణీకుచకుంకుమ
సారారుణవిపులవక్ష! జలజదళాక్షా!
మారశతకోటిసుభగశ
రీర! నిగమగిరివిహార! శ్రీనరసింహా! 1

వ. అవధరింపుము దత్తాత్రేయమునీంద్రుం డన్నరేంద్రున కిట్లనియె. 2

ఆ. "అట్లు నిష్కళంకుఁ డైన భోజుఁ డనఘ! యాఁ, కొంటి రీనిరర్థగోష్ఠిఁ దగిలి
యాచరింప కుండ లే రింతతడవు బాలురును యోగివరులు సరియ కాన. 3

క. ఇంతకు మీతోడం బ్రార్థింతును భోజనము నాకుఁ బ్రియ మయ్యెడు మీ
బంతిఁ బ్రసాదము గొనఁగా, నంతఃపురమునకుఁ బోద మరుదెం'' డనియెన్. 4

క. అతఁ డట్లు తన్నుఁ బిల్చుడు, నతఁ డిట్లను నతనితోడ "నయ్యా! నీయా
నతి యిది యిట్టిద యగు మద్వ్రతపద్ధతి వినుము చెప్పెదం దెలియంగన్. 5

ఉ. చేయుదుఁ బంచభిక్ష యిటు చేయుట నానియమంబు మీరు వి
చ్చేయుఁడు వేళ యయ్యెను భుజింపఁగ' నావుడు భోజుఁ డిట్లనున్
'బాయక దీన మీకు వ్రతభంగము గా దిది యేకభిక్షగాఁ
జేయుఁడు నేఁడు మాచనవుఁ జేకొని మద్గృహమందు' నావుడున్. 6

తే. 'పంచభిక్షయు నాహారపరత లేక, యునికియును నొక్కరూప కావున నరేంద్ర!
వ్రతము పూనితి గురువాజ్ఞ వపల రాదు, వలదు పొం'డని సిద్ధుండు పలుకుటయును.

తే. ఎచట మీరెఱుఁగనిధర్మ మేమి గలదు, వినుఁడు మీతోడ మాటాడ వెఱతుఁ గాని
పూని యొండుల ప్రార్థన భోజనంబు, సదుపవాసంబుగాఁ జెప్పు శాస్త్రచయము. 8

క. ఈయర్థంబున కొకకథ, మీయట్టిమహాత్ము లర్థి మెయిఁ జెప్ప మునీం
ద్రా! యేను వింటిఁ దదభిప్రాయ మవధరింపు విన్నపం బొనరింతున్. 9

క. అనఘుఁడు వసిష్ఠముని ప్రతిదినమును దగ నగ్నిహోత్రదేవార్చనముల్
ఘనును చేసి యరుంధతిచేఁ, బనుపు నగస్త్యునకు భిక్ష పరమప్రీతిన్. 10

ఉ. గౌతమియవ్వలం దపము గైకొని చేయుచు నున్నకుంభసం
జాతున కివ్విధంబున నజస్రముఁ దత్సతి భిక్ష దేరఁ బ్ర
ఖ్యాతిగ నన్నవర్జ మగునట్టివ్రతం బొనరించు చుండియుఁ గ్
ప్రీతమనస్కుఁడై పరిహరింప కతండు భుజించు నిచ్చలున్. 11

క. ఎప్పటియట్టుల యొకనాఁ, డప్పొలఁతి యగస్త్యమునికి నాదట నన్నం
బొప్పఁ గొనిపోవ నే మని, చెప్పుదుఁ గట్టెదుట భయదజృంభణ మెసఁగన్. 12

శా. గంగాభోగవతీతరంగిణుల కైక్యప్రీతిఁ గావించున
బ్భంగిం బొంగుచు నేల గ్రొచ్చికొనుచుం బాథోనిధుల్ రెంటికిన్
సాంగత్యం బొనరింపఁ జూచుగతిఁ బార్శ్వవ్యాపకం బై బృహ
ద్భంగశ్రేణిపరంపరాక్రమణ మొప్పం బాఱునగ్గౌతమిన్. 13

చ. కనుఁగొని యయ్యరుంధతి ఖగప్రకరంబున కైన నిమ్మహా
ధుని యవిలంఘనీయ మయి తోఁచుచు నున్నది మర్త్యు లెవ్విధం
బునఁ దరియింపఁ జాలుదురు బుద్ధిఁ దలంపఁగ మర్త్యులందు నం
గనలవశంబె యిప్పని యగమ్యము పొమ్మని భీతి నొందుచున్. 14

క. వెసఁ దిరిగి వచ్చి యాపుణ్యసతీతిలకంబు పతికి నమ్ర యగుచు వె
క్కస మెసఁగఁ జెప్పెను నదీప్రసరరవగభీరఘోరపాథోరయమున్. 15

వ. ఇట్లు చెప్పి వివర్ణవదన యగుచు నున్నయన్నలినవదనవదనం బవలోకించి చిఱు
నవ్వు నవ్వుచు నవ్వసిష్ఠుండు. 16

క 'పడఁతుక! నీ వేమియు భయ,పడకు సదా బ్రహ్మచారిపనుపున నే నొ
క్కెడ కేఁగెదఁ దెరు విమ్మని, యడుగుము పొమ్మనినఁ బోయి యట్ల యడిగినన్. 17

ఆ. ఆన వైచినట్లు పూని మంత్రప్రయోగంబు చేసినట్లు కట్టినట్లు
నిట్టవాడిచి యెదురఁ దొట్టినవాహిని, యిపుర జలము వాఱె నిసుక దోఁప. 18

క. ఆతెఱపి నబల చనుటయు, నాతతముగఁ దొంటియట్ల యానది పాఱెన్
నాతి యట కరిగి యన్నం, బాతపసికిఁ బెట్టి మరలునవసరమందున్. 19

క. అనుమానింపుచు నాతనిఁ గనుఁగొని 'యోతండ్రి! నేఁడు గౌతమి దర్పం
బున మిన్ను ముట్టి పాఱెడిఁ, జన నేర నుపాయ మొకటి చయ్యనఁ జెపుమా! 20

చ. అనవుడుఁ దల్లి! నీ విచట కాదటతోఁ జనుదెంచునప్పు డే
యనువున వచ్చి తన్నఁ బతి యాడినచందము నట్లు పల్కి నం
దన కది త్రోవ యిచ్చుటయుఁ దా నటు దాఁటినయాక్షణంబ వా
హిని గడుఁ బొంగి పాఱుటయు నేర్పడఁ జెప్పిన నయ్యగస్త్యుఁడున్. 21

ఉ. ఆరమణీలలామకుఁ బ్రియంబునఁ జేతులు మోడ్చి 'సద్గుణా
ధారచరిత్ర! యింతియ కదా యిది యెంతటికార్య మానదిం
జేరఁగఁ బోయి యిట్లనుము చెప్పెద నే నొకమార్గ మిన్నిరా
హారున కోదనం బిడుటకై చని క్రమ్మఱ యేను బోయెదన్. 22

క. తెరు విమ్మని యటు లనుగుము, సరభసగతి నుదక మిరుదెసలఁ బాయఁ గడుం
బరువునఁ బోవఁగ నయ్యెడుఁ, దరుణీ! యరుగు మఱి కాలు తడి గాకుండన్.' 23

క. అనిన వసిష్ఠుఁడు మున్న, ట్లనుటకుఁ దో డిదియు నొక్కయాశ్చర్యము పో
మ్మని తలఁచుచు గౌతమికిం, జని యట్టుల పల్క నది వెసం దెరు విచ్చెన్. 24

సీ. ఆమార్గమునఁ బ్రీతి నరుదెంచి ప్రాణేశుఁ డగువసిష్ఠునిఁ గాంచి యతని యడుగుఁ
దమ్ములు తనదుమస్తకము సోఁకఁగ మ్రొక్కి ప్రాంజలియై నిల్చి భక్తితోడఁ
బడఁతి యిట్లని విన్నపము చేసె 'మీవాక్యగతి విన్నయప్పుడు గౌతమీమ
హానది తెరు విచ్చె నట పోయి క్రమ్మఱి వచ్చుచో నమ్మునివరునిఁ జూచి

ఆ. యేఁటి నేఁడు నిండి పాఱుచున్నది నాకుఁ, జన నుపాయ మెద్ది యనిన నాతఁ
డేమి యనియె వింటివే తొల్లి యెన్నఁడు, విననియద్భుతములు వింటి నేఁడు.' 25

వ. అని పలికి తా నిటు మరలి వచ్చునప్పు డగస్త్యుండు గౌతమితోఁ బల్కు మన్న తెఱంగున నట్ల పలికిన నానది తొంటియట్ల తెరు విచ్చుటయును జెప్పి యప్పొలంతి 'యనఘా! నాయందుం గడుపార నూర్వురకొడుకులం బడసినయట్టినీవు సదాబ్రహ్మచారి ననుటయు మీపంపున నేను నిచ్చలుం గొనిపోయి పెట్టినయట్టిమృష్టాన్నంబు తుష్టిగా ననుభవించుచున్నయమ్ముని దాను నిరాహారుఁడ ననుటయు నతివిరుద్ధంబులై యున్నయవి మీమాయ లెవ్వరికి నెఱుంగ నగునైనను నాచనవు చెఱుపక యీరెండుతెఱంగులు నాకుం దెలియ నానతీయ వలయు' ననిన విని నవ్వుచు వసిష్ఠుం డిట్లనియె. 26

సీ. 'అశనాభిరతి లేక యటవీస్థలంబున నియతతపోనిష్ఠ నెఱపుచుండ
గృహధర్మనిరతులు గొనివచ్చి భక్తిపూర్వకముగాఁ దగ సమర్పణము చేయు
నన్నపానాదుల నాసక్తుఁ డై కొనునతఁడు నిరాహారుఁ డండ్రు బుధులు
ధర్మమార్గమున సంతతి యుపార్జింప సమాన్వయంబున వివాహంబు వడసి

తే. మనసుతమకంబు లే కాత్మవనితయందుఁ, బూని ఋతుకాలమందునఁ గానితిథులు
పరిహరించి యథోచితభంగిఁ గేలి, సలుపువాఁడు సదాబ్రహ్మచారి యండ్రు. 27

క. కావున నమ్మునిమాటకు, నావచనంబునకుఁ గారణం బిది కంటే
నావుడు సవినయభాషల, నావనితారత్న మిట్టు లనుఁ బ్రాంజలియై. 28

ఉ. 'ఇట్టిది ధర్మసూక్ష్మ మిది యెవ్వ రెఱుంగుదు?రింత యొప్పునే
యిట్టిమహానుభావమును నిట్టిచరిత్రము నీక యొప్ప ని
ట్టట్టని తేటి చూడ నమరాదులకుం దరమయ్య నేఁడు నా
పుట్టు కృతార్థతం బొరసె భూరిభవద్వచనామృతంబునన్.' 29

తే. అనియె నటుగాన నీవును నయ్యగస్త్య, మునివిధంబున నాదు ప్రార్థనముఁ గరుణ
నవధరించుట కర్తవ్య మనిన నతఁడు, భోజవిభుఁ జూచి యాననాంభోజ మలర. 30

క. 'అది యట్టిద యగునైనను, విదితంబుగఁ బంచభిక్ష విడువక కొనువా
రది యుడిగి యేకభిక్షను, మదిఁ గొనుపుడురయ్య యెంత మచ్చిక యైనన్.' 31

క. అనవుడు నవ్విభుఁ డిట్లను, 'ననఘా! భిక్షాశనంబ యత్యంతముగాఁ
గొనియాడెద రం దయ్యెడు, వినుతవిశేషంబు నాకు వినిపింపుఁ డొగిన్.' 32

సీ. అనిన నిట్లనుసిద్ధుఁ 'డధిప! భిక్షాశి నిరాహారుఁ డని. చెప్పు నాగమంబు
లది యప్రతిగ్రహం బై చెల్లు నె ట్లన్న దృష్టంబు చెప్పెదఁ దెలియ వినుము
నయమునఁ బుష్ప మేమియుఁ గందకుండంగ మధుసంగ్రహము చేయుమధుకరంబు
కరణి గృహస్థు లెవ్వరును వేసరకుండ నపరాహ్ణసమయంబునందుఁ జేయు

తే. భిక్ష మాధుకరం బను పేరఁ బరగుఁ, గాన నది భూమి నప్రతిగ్రహము నయ్యె
నది నిరాహారసంకాశ మదియుఁ గాక, యొకవిశేషంబు చెప్పెద నొనర వినుము. 33

క. ఈనియమంబున భిక్షయు,మానుగఁ గొనుపరమయోగిమహిమలు చెప్పం
గా నేల యతని కిడునది, దా నొక్కటి కోటిఫలము తప్పదు గృహికిన్. 34

వ. ఏతదర్థప్రతిపాదకం బగునొక్కయితిహాసంబు గలదు చెప్పెద నాకర్ణింపుము. 35

క. కలఁ డొకవిప్రుఁడు హరిహర, జలజాసనపాదకమలసతతధ్యానా
కలితాత్ముఁ డుత్తముఁడు నిర్మలచిత్తుఁడు ధర్మకర్మరతుఁడు ధరిత్రిన్. 36

సీ. ఆవిప్రుసుదతి యనాచారముల కిక యుగ్రకర్మంబులయుఁ నికిపట్టు
దుర్గుణంబులవెంట దుశ్శీలములకు తా నవివేకముల కెల్ల నాస్పదంబు
కలహంబులకు మూలకందంబు బొంకులపుట్ట ప్రల్లదములపుట్టినిల్లు
క్రూరత్వములచోటు కుటిలతపొలము లోభంబులనెలవు గర్వంబునిక్క

తే. యిరుగుపొరుగులవారి నింటింటివారి, నూడుకొనఁ దిట్టి మఱి కాని కూడు గుడువ
దతిథి వచ్చిన నొకపట్టెఁ డశన మిడదు, కడఁగి బలియును భిక్షంబుఁ గడపుచుండు. 37

సీ. ఎందేని యొక్కనాఁ డెల్లవారును జూడ నతఁడు నిక్కంబ గృహస్థుఁ డనుచు
గ్రాసంబు వేఁడినఁ గడపంగ నేరక యింటికిఁ గొనిపోవ నెదురు వచ్చి
యాతనిదొరతనం బాఱడిఁ బోవ నోరికి వచ్చిన ట్లెల్ల రేఁగి తిట్టి
మెడ పట్టి ముంగిలి వెడలంగ ద్రొబ్బినఁ జూచి గ్రాసార్థియుం జోద్య మంది

ఆ. 'యింతలెస్స యగునె యిల్లాలిసోజ యే, కొందు: జూచి యెఱుఁగ నిట్టినీచ
సకట యొండుచోట నడుగ వేళయుం దప్పె,నే మొనర్తు?' ననుచు నేఁగె మఁగుడి.

క. ఆవెడఁగువనితకతమున, దేవాతిథిపూజనములు దిరముగఁ జేయం
గా నెరవు లేక విప్రుఁడు, డా వెక్కసపడుచు నుండుఁ దద్దయు వంతన్. 39

సీ. కస్తూరినీకెంపుఁ గాంతి గల్పింపక నలుపుగాఁ జేసిననలినభవుఁడు
భూరిసౌరభమైనపుష్పంబు నోరికిఁ, జవి పుట్టఁ జేయనిభువనకర్త
చూడ శోభితమైనశుద్ధహేమమునకుఁ బరిమళం బొసఁగనిపద్మయోని
నిలువెల్లఁ దియ్యనై చెలువొందుచెఱకునఁ బండు పుట్టింపనిబ్రహ్మదేవుఁ

ఆ. డిట్టివిప్రవరుని కిట్టియాచారవం,తునకు నిట్టిదురితదూరమతికిఁ
దలఁపుకోలఁదియంద మెలఁగుచుండెడునట్టి,భామఁ గూర్ప కుండు టేమియరిది. 40

క. అని తనుఁ బుట్టించినస్రష్టను దూఱెడునట్లు గా నసంగతవృత్తిం
బఱపడి యుండుచు నొకనాఁ, డెనయఁగ నవ్వనిత నీళ్ళ కేఁగిన తెఱపిన్. 41

చ. అఱువుడుకుప్పసం బమర నొఁదలఁ దాలికలైనవెండ్రుకల్
తఱచుగఁ దూలియాడ దవుదవ్వులఁ గన్గొని సారమేయముల్
మొఱుఁగఁగఁ బౌరబాలకులు మూఁకలు గట్టి పిఱుంద రాఁగ వేఁ
డుఱుకొని వచ్చువానిక్రియ దూఁగుచు వచ్చె నొకండు భిక్షుకున్. 42

ఆ. అతనిఁ జూచి విప్రుఁ డతులితజ్ఞానసం,పన్నహృదయుఁడైనపరమయోగి
యనుచుఁ గడప నోడి తనభార్య రాకుండ, నిలిచి నాల్గుదెసలు నిక్కి చూచి. 43

క. ఇలు చొచ్చి సకలభాండం,బులు శోధింపంగ నొక్కమూలదెసను దొం
తులసందిఁ గ్రమ్మరించిన, సలసల మను వేఁడిపాయసముఁ గనుఁగొనియెన్. 44

క. కని తొంగి చూచి చే బెట్టినఁ బొక్కెడు దర్వి యాకుటిల యెచ్చటఁ దాఁ
చెనొ యోగి వచ్చె తడ వయ్యెను భిక్షము పెట్టవలయు నేక్రియ నైనన్. 45

ఆ. అనుచు నాల్గుదెసలు నరసిన నది సమ,కూడ కున్నఁ జెప్పకూడ యొకటి
తెచ్చి దానఁ దిగిచి తిగిచి మూఁకుటఁ బోసి, పెట్టె బాయసంబు భిక్షుకునకు. 46

ఉ. ఈకరణిం దపోధనున కేర్పడ భిక్షముఁ బెట్టి పుచ్చి యా
డాకిని వచ్చునో యని వడంకుచు మూసి తొలంగి నిర్విశా
రాకృతి నూర కుండునెడ నంగన వచ్చి సతోయభాండముల్
వాకిట డించి లోనికడవ ల్వివరంబుగఁ బాఱఁ జూచుచున్. 47

ఆ. పొడువ యిల్లు సొరఁగఁబోలుఁ బొమ్మని యిట్టు, నట్టుఁ జూచి మనసు పట్ట లేక
దర్వి యరసి మున్ను దాఁచిపోయినచోటు,నున్న నూరకుండె నుడుకు మాలి. 48

వ. మఱికొంతకాలంబునకు విధివశంబున నాదంపతులు మృతు లగుటయుం గాలకింక
రులు దానిం బట్టి కట్టికొని పోయి పతిప్రతికూలార్హదండనంబుల దండించుచుండి
రిట దేవదూత లతనిం దోడ్కొని పోయి దేవలోకంబునం బెట్టిన నతం డచ్చట
నుండి క్షుత్పీడితుండై యాహారంబు వేఁడిన. 49

ఆ. తోలుపాయ వఱచి తోరంపురాశిగాఁ, బోయఁబడిన వేఁడిపాయసంబు
దనరఁ జూపి 'దీని ననుభవింపుము భూసు, రాగ్రగణ్య!' యనిన నతఁడు రోసి. 50

తే. 'అకట నా కిట్టికష్టదుష్టాన్నభుక్తి, యొసఁగ నేనేమి చేసితి నొక్కొ దివిజు
లింత యవినీతిచేతురె యెఱిఁగియెఱిఁగి, యతిథియగునన్నుఁ దగదె పూజితునిఁ జేయ.

క. నా కున్న నిట్టికష్టపు, నాకము నా కేమి సేయ నన్నీ యెడకుం
దే కున్న నేమి కడపట, నీకట్టిఁడితనము సేయ నేటికిఁ దనకున్. 52

ఆ. ఉదరవహ్నిచేత నురియుచుండెదఁ గాని, చూడఁ గడఁగి యిట్టికూడుఁ గుడువ
నొల్ల' ననిన నమరవల్లభుకడ కేఁగి, దేవదూత లతని తెఱఁగు చెప్ప. 53

క. విని విప్రునిఁ దనయెదిరికిఁ, గొనిరా నియమించి చిత్రగుప్తుని దెసఁ గ
న్గొని యింద్రుఁ 'డితఁడు మును చేసినదానఫలంబు కొలఁది చెపుమా' యనినన్. 54

చ. కవిలియ విప్పి చూచి 'యనఘా! యితఁ డన్వయధర్మకర్మముల్
దవిలి యొనర్చెఁ గాని మది దానము లెవ్వియుఁ జేయఁ డొక్క నాఁ
డు నిద యెఱుంగ కుండ నొకయోగికి భిక్షము తోలుగూడ చేఁ
దివిచిన వేఁడిపాయసముఁ దెచ్చి రయంబునఁ బెట్టెఁ గావునన్. 55

క. ఒక్కటి కోటిగుణంబుగ, నెక్కటి నీతోలుపాయ నిప్పాయస మి
ట్టిక్కడ భుజింపవలయును, బెక్కేఁడు లితండు దేవబృందలలామా!' 56

మ. అని ధర్మజ్ఞుఁడు చిత్రగుప్తుఁడు యథార్థాలాపసాశీలుఁ డిం
ద్రునితోడ న్వినిపించెఁ గావున మహాత్ముం డైనయోగీంద్రునం
దు నివేదించినయర్థ మత్యధికమై తోఁచున్ ఫలం బిచ్చుచో
ననఘా! యోగి యనంగ దైవ మన వేఱా యెందు నెట్లుండినన్. 57

ఆ. బాలలీల సలుపు నోలి నున్మత్తసం, చరణ మియ్యకొనుఁ బిశాచరీతి
నొందియుండుఁ బరమయోగి విరక్తుఁడై, యతనిఁ దెలియ నేర రన్యజనులు. 58

క. కరచరణాద్యవయవయుత, శరీరధారి యని మనుజసామాన్యునిగాఁ
బరికింపఁ జనదు యోగిం, బరతత్త్వముగాఁ దలంచి ప్రార్థింపఁ దగున్. 59

క. కావున యోగికి నిడునది, భూవర కోట్యధికఫలదముగఁ జెప్పఁ జుమీ
యా వేదార్థము లెందను. నావుడు భోజుండు సిద్ధునకుఁ బ్రాంజలియై. 60

క. యోగీంద్రసమర్పితభిక్షాగుణగౌరవము నీముఖంబున వింటిన్
యోగీశ్వరవర! విప్రుం, డేగతిఁ జరియించెఁ జెప్పు దేర్పడ నాకున్. 61

ఆ. చిత్రగుప్తుఁ డట్లు చెప్పిన విని విప్రవరునితోడ సమరవరుఁడు పలికె
'నవని నెంత చేసె నంతయు నిచ్చోట, ననుభవింప వలయు సజ్జనులకైన. 62

వ. కావున నీ కిది యనుభవింపక పోవ'దనిన నమ్మహీదేవుండు 'దేవా! యే నిట్టియనుభవం బొల్ల నొండుచోట నునుపు' మనిన నతం డతనిచలగ్రాహిత్వం బుడుపుటకునై యిట్లని పలికె 'నీవు తొలుమేనఁ జేసినదానఫలంబు మఱి లేదు గావున నీ కింక నిటు లోడం బని లేదు ప్రాప్తవ్యం బనుభవనీయం బగుటఁ దెలుపుచున్న యితిహాసంబు గలదు తెలియ విను' మని యిట్లనియె. 63

క. రతిఁ జేసినకరకమలము, చతురత మతి మఱవకుండఁ జతురాననుఁ డీ
సతిఁ జేసె ననఁగఁ జక్కని, యతివ యొకతె గలదు బ్రాహ్మణాన్వయమందున్. 64

క. ఆనెలఁతభాగ్య మెట్టిదొ, కాని ప్రవాసైకవృత్తిఁ గాంతుఁడు చనినం
దా నుండెఁ బుట్టినింట ను,నోన్నిగ్రహమునకు నెల్లనుం గుదు రగుచున్. 65

వ. అట్లుండ నొక్కనాఁ డురూపజితరతీశ్వరుం డగు నొక్కయోగీశ్వరుం డీశ్వరుండపోలె వచ్చి భిక్షం బడిగిన నతనిరూపాతిశయంబునం దననయనంబు లనిమిషంబులై నిగుడ మగుడింప నేరక వెఱఁగుపడి యుండె నంత నతం డయ్యతివ కి ట్లనియె. 66

క. భిక్షానిరతుల నెన్నఁడు, వీక్షింపవె తొల్లి యింతవెఱఁ గేటికిఁ బ
ద్మాక్షీ! కలిగినఁ బెట్టుము, భిక్షము లే కున్నఁ గడపు పెక్కేమిటికిన్.' 67

క. అనవుడు మును గన్నుల కొద, వనయవ్వలవంత పిదప వీనులకుం జోఁ
కె ననఁగఁ దన్మధురోక్తులు, విని తనుఁ దా నెఱుఁగ లేనివిస్మృతి పేర్మిన్. 68

ఉ. నిట్టకనిల్వనం గలఁగి నేత్రయుగంబున బాష్పపూరముల్
దొట్టఁగ ఘర్మతోయములతోఁ బులకాంకురజాల మెల్లెడం
బుట్టఁగఁ దొల్లియిల్లలుకఁ బూని యొనర్చినమంటిముద్ద దాఁ
బెట్టెఁ దదీయపాత్ర నది భిక్షయకాఁ గొనిపోయె సిద్ధుఁడున్. 69

ఆ. అట్లు కాదె మన్మథాంధులు నంధులు, నెదిరిఁ దన్నుఁ గాన నెట్లు నేర్తు
రట్లు సిద్ధుఁ డరుగ నమ్ముగ్ధ మృతిఁ బొందె, విరహవహ్నిచేత వెచ్చి వెచ్చి. 70

సీ. ఆరీతి మృతిఁ బొంది యాబాలి మత్పురి కరుదెంచి యుదరాగ్ని యధిక మైన
వాపోవుచుండ నివ్వనిత కెయ్యది ప్రాప్త మని చిత్రగుప్తుని నప్పు డేము
పిలిపించి యడిగిన నెలమిఁ బుణ్యాపుణ్యవిదుఁ డోలిఁ గవిలియ విప్పి చూచి
యొకమంటిముద్ద యోగికి భిక్షగాఁ బెట్టు నది కోటిగుణితమై యొదవెఁ గానఁ

ఆ. దదనురూపభుక్తి తరుణికిఁ గైకొన, వలయు ననినకర్మవశము గాదె
యట్లు సేయఁ గాక యనిన మత్కింకరుం,డొక్కమంటికుప్ప యొనరఁ జూపి. 71

చ. 'ఇలపయి నెల్లవారలు ననేకవిధంబుల దానధర్మముల్
సలుపఁగ నీకు నిట్టికువిచారము పుట్టుట యేమిపాపమో
వెలఁది! పురాకృతం బనుభవింపక పోవునె పొమ్ము' నావుడుక్
దలఁకి మదీయసన్నిధికిఁ దాఁ బఱతెంచి కృతప్రణామయై. 72

క. 'మన్నింపు మమరవల్లభ!, మ న్నిటు భక్షించునట్టిమనుజులు గలరే
యన్నముఁ బెట్టింపు' మనుచుఁ, గన్నీరొలుకంగ నున్నఁ గరుణ దలిర్పన్. 73

క. 'ఇది చేసినకర్మము బె,ట్టిదమై యున్నయది దీన డిందు పఱుప రా
దుదరాగ్ని చిత్రగుప్తుఁడ, పదిలంబుగఁ జూడవయ్య పత్రిక లెల్లన్.' 74

చ. అనవుడుఁ జూచి 'యీతరుణి యారయ నొండొకదాన మిర్విఁ జే
సినయది లేదు మీకొకటి చెప్పెద మృణ్మయభిక్ష పెట్టునాఁ
డొనరఁగ నందులోఁ గలసి యుండెఁ జుఁడీ యవగింజ దానఁ గ
ల్గినసుకృతంబు మీరు పరికింపుఁడు' నావుడు నవ్వధూటికిన్. 75

క. ఒకదివసము యవపిండియు, నొకనెల మృత్తికయుఁ గాఁగ నొసఁగిన నది కొం
డొక దెలిసి కర్మఫల మ్మా,ప్రకారమున ననుభవించె బహుకాలంబున్. 76

వ. అప్పుడు నమ్మంటికుప్ప గరిగంటి గా కుండినం జూచి వెఱఁగుపడి యీలేమ మా
సమ్ముఖంబునకు వచ్చి ముచ్చిరుచు నిట్లని విన్నవించె. 77

క. 'తనచేసినకర్మంబును, దనవండినకూడు నెవ్విధంబున నైనం
దనకు ననుభవింపక పోవునె నావిన్నపము విని యవును గా దనుఁడా. 78

క. నెఱగొండలు గువ్వలచే, నఱుగునె యీమంటిదిబ్బ యది నాచేతం
దఱుగునె నానాఁటికిఁ గ్రమ్మఱఁ బెరుఁగుచు నున్న దేమిమాయయొ యెఱుఁగన్.

క. ఉడుగక యీభవమున నిది, కడతేర భుజింప నోపఁ గ్రమ్మఱ వత్తుం
గడమ భుజింపఁగఁ దండ్రీ!, యొడ యి మ్మొక జన్మ' మనిన నే నిచ్చుటయుఁన్. 80

చ. ధరణికి నేఁగియొక్కవసుధాసురవర్యునియింటఁ బుట్టి సు
స్థిరముగ శైశవక్రియలు చెల్లినమీఁద వివాహమై తలో
దరి దనపుట్టినింట సుచితస్థితి నుండఁగ నొక్కనాఁడు వి
స్ఫురితతపోధనాధ్యుఁ డొకపుణ్యుఁడు భిక్షకు నేఁగుదెంచినన్. 81

క. మడ్డునకుఁ బోయున ట్లొక, తెఱ్డెఁ దుడుకుపాయసంబుఁ దెచ్చి యతనిచే
నిడ్డ నడిచిపడి కనలెడి, గుడ్డులఁ జెలియంగఁ దెఱచికొని కనుఁగొనుచున్. 82

సీ. 'అక్కట మున్ను నీ వాచరించినయట్టిపాపంబు చాలదె పంకజాక్షి!
నాచేయి మండంగ నీచందమున వేఁడిపాయసం బీపత్త్రభాజనమున
వైవంగఁ బాడియె నీ వేమి సేయుదు నైజమై చెల్లెనీయోజ నీకు'
ననుచు దూఱఁ బలికి యాతాపసోత్తముం డరిగిన నింతి యచ్చెరువునొంది
ఆ. 'యేమిపాప మొక్కొ యేఁ దొల్లి చేసితి, నిమ్మహానుభావుఁ డిట్లు పలికె'
ననుచుఁ దత్తఱించి మనసు పట్టఁగలేక, యాతఁ డున్నయెడకు నరుగుదెంచి. 83

ఉ. అల్లనఁ జేరి మ్రొక్కి వినయానతయై 'మునినాథ! యేను నీ
చెల్లెలఁ జుమ్ము నన్నుఁ గృప సేయుము నాయపరాధసంచయం
బెల్ల సహింపు మే నబల నెఱటిదానఁ గ్రియాపహీననై
తొల్లి యొనర్చినట్టిఘనదోషము దా నది యెట్టిదో కదే. 84

ఉ. అప్పుడు నీవు నాయెదుర నాడినమాటకు దేహ మంతయున్
నిప్పుల బ్రుంగిన ట్లయిన నిల్వఁగ నోపక యిందు వచ్చియుం
దెప్పిఱికున్న దాన భవదీయవచోమృతవారిధారచేఁ
దొప్పఁగ దోఁచి నన్నుఁ బరితోషితమానసఁ గా నొనర్పవే.' 85

క. అనవుఁడు నది తొలుబామున, నొనరించినకర్మగతియు నొగిఁ బరలోకం
బునఁ బడినపాటుఁ దజ్జన్మనిమిత్తము భావికరణమతిఁ జెప్పుటయున్. 86

క. వడవడ వడఁకుచుఁ గ్రమ్మఱ, నడుగులపైవ్రాలి 'యోమహామతి! యే నె
క్కుడ కర్మశేష మెక్కుడ, వెడలింపఁగదయ్య దురితవిషనిధివలనన్.' 87

చ. అనవుడు 'నింతి! నే నొకయుపాయము చెప్పెద నీకుఁ జూడఁ బో
లిన తెఱఁగైనఁ గోమలి! చలింపక చేయుము జారకాంతచొ
ప్పునఁ దగ వన్నె వెట్టుకొని పోయి విలోచనరోచు లొప్పఁగాఁ
గనుఁగొనుచుండు మీ పక్షిలకాముకులుం బ్రియ మందునట్లుగన్. 88

చ. నినుఁ గని యెవ్వఁడేని మది నెయ్య మెలర్పఁగఁ గోరి చేర వ
చ్చిన దృఢచిత్తవై నెపము చెప్పి తొలంగుము లోను గాకు చి
క్కిన నది తొంటికంటెఁ గడుఁ గీడగుఁ గావున మోసపోకుమీ
యెనయఁగ నిట్లు నీవు చరియింపఁగ లోకములోనిదూషకుల్. 89

క. మానక నిను దూషింపుచు, మానిని నిను ముద్దఁ జేసి మన్న గొనంగా
నానాఁటికి నానీచుల,చే నది యంతయును బోవుఁ జెడి పుడిసిళ్లన్. 90

క. అట్టిద కాఁదె దురాత్ములు, దిట్టుట సజ్జనులు దమకు దీవన లని చే
పట్టుదురు దురితములఁ బోఁగొట్టుటకు నుపాయ మిది యగుట విని యంగనికిన్. 91

క. నమ్ము మిది తగునుపాయము, పొమ్మనవుడు నూరు వెడలి పోయి నిజేచ్ఛన్
ద్రిమ్మరు తెఱఁగునఁ దత్సతి, ద్రిమ్మరియెను నెల్లవారుఁ దెగడెడునటుగాన్. 92

క. ఒకయేకాంతపుగృహమున, నొకరుండును మర్మ మెఱుఁగ కుండునటులుగాఁ
గృకలాసమువిధమునఁ బ్రొద్దొకచాయఁ జరించుచుండె నొకనగరమునన్. 93

సీ. పగ లెల్లఁ గైసేసి పట్టణం బంతయుఁ దిరుగుఁ బువ్విలుకానిదీమ మనఁగ
విటకోటిఁ బొడగని వెడనవ్వు నవ్వుచుఁ గన్ను లార్చుచుఁ జనుంగవ యొకింత
దోఁపఁ బయ్యెదకొంగు దొలఁగఁ గఱద్యుతు లలరంగ నిలుచు నొయ్యారమెసఁగ
నొకఁ డాస పడి చేర నొకనిచేరువ నిల్చి తుది నొందు చేయక దుస్సిపోవు

ఆ. నంత ప్రొద్దు గ్రుంక నవ్వేష ముడిగి సుస్నాతయై శివార్చనం బొనర్చి
యొక్క ప్రొద్దు గుడిచి యుల్లంబుఁ దనభర్త, యందు నిలిపి నిద్ర నొందు నబల. 94

క. ఇవ్విధమునఁ బ్రతిదినమును, నవ్వెలఁది చరింపఁ గొంద ఱతిదూషకులై
అవ్వాలు సేయుచు నోరులఁ, గ్రొవ్వునఁ బాపంబు పంచికొందురు వరుసన్. 95

క. తమచేసినదుష్కృతసుకృతము లొగిఁ దా రనుభవించెదరు గాక నిమి
త్తము లేక తడవు టది యుక్తము గాదని కొంద ఱెల్లఁ దడవరు దానిన్. 96

వ. అంత నొక్కనాఁ డొక్కమాదిగ తనసుదతియుం దానునుం బదత్రాణంబులు గొంచుఁ జనుదెంచునప్పు డప్పడంతి నెదురం గని యాచర్మకారాంగన దవ్వుదవ్వులం దెరువు దొలంగి నిల్చినం జూచి వాఁ డి ట్లనియె. 97

చ. 'వలవనిభీతి యేల తగువారలకుం దెరు విచ్చు టొప్పుఁ గా
కలయక నేఁడు నాఁ డనక యబ్బినచోటన యెవ్వఁ డైనఁ గా
సులు పది సూపునేని మది స్రుక్కక వానికిఁ దక్కినట్లు వి
చ్చలవిడి నుండునీయధమజాతి దలంపఁగ విప్రకాంతయే!' 98

చ. అనినఁ గరారవిందముల నాసతి వీనుల మూసికొంచు 'ని
ట్లను టుచితం బె? యొడ్లఁ జెడసాడినఁ బెద్దఱికంబు వచ్చునే?
విను మది గాక కొంద ఱవివేకులు నిందలు చేసి చేసి యీ
వనితకు భోజ్య మైనత్రిదివస్థితమృణ్మయరాశి యంతయున్. 99

క. పంచుకొనఁగ శేషించిన, యించుకబూడిదయుఁ జెఱుప నేటికి నది భ
క్షించుతలంపున నే యిటు, వంచింపక పలికె దనుచు వడి భర్జించెన్. 100

క. ఆమాటలు విని యాద్విజ, కామిని యీవనిత యెట్లుగా నెఱిఁగె నొకో
భూమి ననన్యవిదిత మగు, నామర్మం బనుచు నెమ్మనము వెఱఁగందన్. 101

ఉ. 'అంగజమాతవో మఱి గజాననమాతవొ కాక నీవు మా
తంగివె యోలతాంగి ననుఁ దప్పక చూడుము నీవు నీకృపా

పాంగమరీచు లొప్పు' నని ప్రస్తుతి సేయుచుఁ జేర వచ్చి య
య్యంగనపాదపద్మయుగళాంతికమేదినిఁ జాఁగి మ్రొక్కఁగన్. 102

చ. తొలఁగఁ గదమ్మ నాకు నిటు దోసముఁ గట్టకు మమ్మ యింత మొ
క్కులమిది యేటికమ్మ కొఱగానికులంబునఁ బుట్టినట్టినా
వలనఁ బ్రయోజనం బొకటి వచ్చునె చెప్పఁగదమ్మ నీకుఁ జె
ప్పులు వలతేని నిచ్చెదము పోరునఁ గైకొనవమ్మ' నావుడున్. 103

ఆ. 'నీవు నాదుభాగ్యదేవత వనికాని, యొండుగాఁ దలంప నుల్లమాను
మగువ యిట్లు పల్కఁ దగునమ్మ నను గావ, వలదె' యనుచు విప్రవనిత యపుడు.

క. దిగ్గన లేచి కరాబ్జపు, నొగ్గలు దననుదుటిమీఁద మోపి 'లతాంగీ!
యెగ్గుగఁ జూడకు నీచెవి, యొగ్గుము నామాట' కని ప్రియోక్తులు దనరన్. 105

క. 'నాపాప మెల్లఁ బొలిసెనొ, యేపారఁగఁ గర్మశేష మించుక గలదో
రూపించి చెప్పు' మనవుడు, నాపడఁతుక సస్మితాననాంబుజ యగుచున్. 106

చ. తెరవరి నీవు నీ కనుభవింపఁగఁ బాలిదియైనవృత్తికో
త్కరము నశేషదూషకనికాయమునం బగఁ బంచిపెట్టి తె
వ్వరు సరి నీకు నోతరుణీ! వంశపవిత్రము నీచరిత్ర మ
చ్చెరువు దలంప నీవిభునిఁ జెంది సుఖింపుము పొమ్ము నెమ్మదిన్.' 107

వ. అనిన నవ్విప్రకాంత విస్మయాక్రాంత యగుచు నక్కాంతతో మఱియు నిట్లనియెఁ 'దల్లి దేవరహాస్యంబు లెఱుంగునట్టిమహానుభావంబునకు నిట్టిహీనజన్మం బనురూపంబు గాదు నీ వెవ్వ రెఱిఁగింపు' మనిన నదియుఁ దనమగనిం జూపి యి ట్లనియె. 108

క. 'అక్కా! విను మాతఁడు మున్నొక్క మహీదేవుఁ డతనియుల్ల మలర నే
నెక్కుడువేడుక మెలఁగుదు, నిక్కపుసహధర్మచారిణిత్వము పేర్మిన్. 109

క. వితతతపోనియమంబులఁ, బ్రతిదివసముఁ గందమూలఫలముల నాస
క్తత భుజియించుచు నుచితా, యతవిస్మృతపర్ణగృహములం దుండు నెడన్. 110

మ. ఒకనాఁ డేమని చెప్ప మాగృహమునం దొప్పార నైమిత్తికం
బకలంకంబుగఁ జేసి విప్రులకు నాహారం బపూపాజ్యపూ
ర్వకమై తద్దయుఁ దృప్తిగాఁగ మన సారం బెట్టి యట్లున్నచో
నొకయోగీంద్రుఁడు వచ్చె భిక్షకు మహాయోగ్యుండు మాయింటికిన్. 111

ఉ. వచ్చిన నేను భిక్ష యిడువాంఛఁ జనం బతి నన్నుఁ జూచి యీ
వచ్చినవాఁడు దా మలినవస్త్రుఁడు దేహము చూడ రోఁత వీఁ
డెచ్చటిబీదయో యితని కేటికి భిక్షము భుక్తశేషముల్
దెచ్చి విదల్పరాదె యని తిట్టిన గాదన నోడి వానికిన్. 112

క. ఎంగిలి పెట్టిన' ననలము, భంగి నతఁడు మండి 'యోరిపాఱుఁడ! నా కీ
యంగన భిక్షము పెట్టఁగ, నెంగిలి పెట్టు మని చెప్పితే గర్వమునన్. 113

శా. ఏలా యింత వృథాభిమానము క్రియాహీనుండవై నావిధం
బాలోకింపక యెగ్గు చేసి తిట నీయాచారము న్నీదువా
గ్జాలంబు న్మఱి నీతపోమహిమయుం జర్చింప నీపాటియే
నీలా గంతయుఁ గంటి నంత్యజుఁడవై నీ వుండు మిద్ధాత్రిలోన్. 114

క. నీచెప్పినట్ల చేసిన, యీచపలయు నీపిఱుంద నెడపక భవదీ
యాచరణమునకు ననుగుణ, యై చరియింపంగ వలయు' నని పల్కుటయున్. 115

ఉ. కంపము నొంది యే నతనికాళ్ళపయిం బడి 'యోమునీంద్ర! మ
న్నింపు శతాపరాధులము నీ విటు లల్గుట భూతధాత్రిలో
నిం బగునీర నగ్ని యుదయించుట కాదె తలంప నిట్టిపే
యంపుభరంబు దా నుడుగునట్టియుపాయము మాకొనర్పవే'. 116

సీ. అనవుడు 'విను మింతి యజ్ఞాతధర్మంబు నలుపుచు భూమివారలకుఁ జూడ
నిది దుశ్చరిత్ర నా నెవ్వతె చరియించు నట్టిబ్రాహ్మణి మీకు నగ్గమైనఁ
గని నీవు దొలఁగ నీకాంతుఁ డక్కాంత నెగ్గులు పల్క నీవు తద్గుణ మెఱింగి
తగవు గాదని పూని మగనిఁ గోపింప నమ్మగువయు నినుఁ జేరి మాటలాడ
ఆ. నపుడు శాపమోక్ష మగుఁ బొమ్ము నీదుభా,వమునఁ బూర్వజన్మవర్తనములు
నుత్తములచరిత్ర లొగిఁ గాంచు తెలివియుఁ, గల్గు' ననియె నతఁడు గరుణతోడ.

ఉ. కావున నిన్నుఁ జూచి కడఁగంటిమి మాదురితాబ్ధి కంచు సం
భావన చేసి యావనిత భర్తయుఁ దాను నిషిద్ధభావముల్
పోవఁగఁ బ్రోచి శుద్ధమగుపూర్వపుమేనులు దాల్చి నెమ్మదిం
బోవఁగ విప్రకాంతయును బోయె నకల్మషవృత్తి నింటికిన్. 118

వ. అటుగావునఁ బురాకృతకర్మఫలం బవశ్యభోక్తవ్యంబు గావున రోసినం బోవ దని యెంతచెప్పిన నవ్విప్రుం డియ్యకొనక దేవశిఖుం జూచి 'దేవా! నాకుఁ బునర్జన్మంబు ప్రసాదింపుము నీచిత్తంబునకు మెచ్చు వచ్చునట్టిదానధర్మంబులు నలిపి గతకల్మషుండనై వచ్చి యిచ్చోటన యుండెద' నని విన్నవించినం గరుణించి యింద్రుఁ డతని కట్ల యొసంగిన. 119

చ. ఇల నతఁ డుద్భవించి దనయిచ్చకు వచ్చువధూటిఁ బెండ్లియై
వెలయఁగ నన్నపానములు విప్రముఖంబున భూతతృప్తిగా
నలువడఁ బెట్టుచుం గ్రతువు లాదట జేయుచుఁ బంచపూజలుం
బొలుపుగ సాగ మోక్తవిధిఁ బూని యొనర్చుచుఁ బెక్కుభంగులన్. 120

క. గతకల్మషుఁడై విప్రుఁడు, శతవర్షము లుర్వి నుండి స్వర్గగతుండై
శతమన్యునికొలువున నీప్సితసౌఖ్యము లందుచుండెఁ జిరకాలంబున్. 121

క. కావున గృహికి నవశ్యము, సూవె యతిథిపూజ యట్టిసుకృతక్రియకుం
దావలము భార్య యది సద్భావసరణి మెలఁగకున్నఁ దప్పు నఖిలమున్. 122

క. ఆవిప్రుఁడు తొలుబామున, నేవిధులం బడియె భార్య యిచ్చకు రామిన్
భూవర యది ననుకూల, స్త్రీవలనఁ గదయ్య కనియెఁ జిరసౌఖ్యంబుల్.' 123

వ. అని సర్వటీసిద్ధుండు చెప్పినయితిహాసంబు విని భోజనరేంద్రుండు ముకుళీకృత కరారవిందుం డగుచు నిట్లనియె 'నట్లకాదె గృహిణి సహధర్మచారిణియగుట నదదను కూలత లేక యేకార్యంబులు నేల సిద్ధించు నది యట్లుండె గృహపతికి నతిథిం గడ పుట యతినింద్యంబుగా విందు నిది యేమిచందం బానతి' మ్మనిన నతం డతని కి ట్లనియె 'మనుష్యుండు పుట్టినగోలె నిడుములం బడి గడించినయొడమి పుడమిఁ జే డలిగి గడియదడవులోన నొడగోలుగొన శక్తుండగునట్ల గృహాగతుం డగునతిథి తిరస్కృతుండై యతనిపూర్వార్జితసుకృతంబు లన్నియు నపహరింపం జాలు నట్లుగావున. 124

క. మానుగ గృహి మధ్యాహ్న, స్నానముఁ జేసినది మొదలు సద్ధర్మరతిం
దా నశనము గొనునది తుద,గా నతిథికిఁ బెట్టవలయుఁ గాదు గుడువఁగన్. 125

క. వినుము విశేషించియుఁ బురుషునిభోజనవేళ నతిథి క్షుత్పీడితుఁడై
చనుదెంచి గ్రాస మడిగినఁ, దనముందటియశన మైనఁ దగు నొసఁగంగన్. 126

క. ఈసదృశార్థమునకు నితిహాస మొకటి గలదు విను నృపాగ్రేసర పృ
థ్వీపతిముఖతిలకంబు న,దీసంయుత మగుకళింగ దేశమునందున్. 127

సీ. పుండరీకం బనుపుర మొప్పు నప్పురంబున కధీశ్వరుఁడు ప్రభూతయశుఁడు
సంపాతి యనురాజు సద్గుణశీలుఁ డాచారవంతుఁడు నిత్యసత్యధనుఁడు
చర్చింప శ్రీరామచంద్రుతో సెనవచ్చు నితరులతరము గా దతనిఁ బోల
నట్టిభూతలనాథునర్ధాంగశోభిని వర్ణితరూపలావణ్యసదన
ఆ. చంద్రరేఖ యనఁగ జానకిఁ బోలు న,ప్పడఁతి వంధ్య యగుటఁ బార్థివేంద్రుఁ
డధికనిష్ఠ నభవు నర్చించి సంతాన, మడిగె నవ్విభుండు నట్ల యొసఁగె. 128

క. పరమేశ్వరుఁ డట్లొసఁగిన, వరప్రసాదమునఁ జేసి వసుధాధిపశే
ఖరుఁ డగుసంపాతివలనఁ, గరమొప్పఁగఁ జంద్రరేఖ గర్భిణి యయ్యెన్. 129

క. తెలుపకుఁ గుచమండలమును, మఱి పిఱుఁదును ఘనము చేసి మధ్యమునకుఁ జే
దఱిక మొసఁగు నని యజు నం,దఱు దూఱుట మానెఁ జూలు దాల్చుటవలనన్.

సీ. పాలిండ్లు నల్లన పాలిండ్లయై చాల బలిసెఁ జూచుకములు నలుపు లెక్కె
వళులు స్రుక్కులు విచ్చెవెలసె నాభీరంధ్ర మాయ గప్పారుచుఁ దోర మయ్యె
గండదర్పణములఁ బాండురచ్ఛవి దోఁచె నధరపల్లవరాగ మల్ప మయ్యెఁ
దలఁపు కోరికలకు నెలవయ్యె జిహ్వకు నరుచి వాటిల్లె దేహంబు డస్సె
ఆ. గమన మలస మయ్యెఁ గైసేయుపనులందు, జాడ్య మొదవె నుదరసంప్రవృద్ధ
గర్భభారవహనగౌరవంబునఁ జేసి, పద్మనామనగరభర్తసతికి. 131

వ. అంత నవమాసంబులుఁ బరిపూర్ణం బగుటయు నొక్కపుణ్యదివసంబునందు 132

క. విమలపయోనిధివీచీ, సముదిత యగులక్ష్మివోలె సౌందర్యాద్యు
త్తమలక్షణలక్షితయై, కుమారి యుదయించె రాచకోమలి కెలమిన్. 133

క. సుతయుదయవేళ నయ్యెడు, వితతశుభాశుభము లెఱుఁగ వేఁడి ధరిత్రీ
పతి యడిగినఁ జెప్పెఁ బురోహితుఁడు గ్రహస్థానములు నిరీక్షించి తగన్. 134

ఉ. 'ఇప్పటివేళ చూడ మనుజేశ్వర! తక్కినగండదోషముల్
చెప్పఁగ లేవు భావిఫలచిహ్న మొకం డటు చిత్తగింపుఁడా
యిప్పడఁతిం గరగ్రహణ మెవ్వఁడు చేసె నతండు లేడగుం
దప్పదు బ్రహ్మరాక్షసకతంబునఁ దొమ్మిదినాళ్ళనాఁటికిన్.' 135

క. అని చెప్పినఁ గర్ణద్వయ, ముచు జూఁడినచంద మైన మూర్ఛాగతుఁడై
జనవిభుఁడు కొంతతడవున, కు నొకించుక తెలిసి యెలుఁగు కుత్తుకదగులన్. 136

ఉ. 'పట్టపురాజ నంచు నొడఁబాటులు దప్పను భూజనంబులన్
గట్టియుఁ గొట్టియుం బహుముఖంబుల నర్థము గూడఁబెట్ట నే
పట్టున నర్థులం గడప బ్రాహ్మణసీమల కెగ్గు సేయ నేఁ
బుట్టి ప్రబుద్ధశామహిమఁ బొందినకోలె నొనర్పఁ బాపముల్. 137

క. క్రతువులు మొదలగు వేదవ్రతములు దగఁ జేయునపుడు వసులోభమునన్
మలిచెడి తత్తద్దక్షిణ, లతిహీనము సేయ గురుల నవమానింపన్. 138

క. సేవకులకు మును చేసిన, జీవితములు చెఱుప లావు చేసినవానిన్
జేవ చెడనాడ విధి నా, కీవిధిఁ బ్రతికూలుఁ డగుట కెయ్యది కతమో 139

సీ. కొడుకు పుట్టెడు నని కొండంతయాసతో నుండంగఁ దుదిఁ గూఁతు రుద్భవించె
నది యైనఁ గన్నులకెదుర నెమ్మది నున్న నుల్లంబు గొండొకయూఱడిల్లుఁ
బరమేశుఁ డిదియును బట్టక పోఁజేసె నట్టినందనయాఁగి యరయ నెద్ది
సంతతి లేనినాఁ డింత ఘొఱుంగము కడపట దుఃఖంబు గట్టెఁ దెచ్చె

ఆ. యేమి చేయువాఁడ! నిమ్మహోదురవస్థ, నెట్టిభంగి నపనయింతువాఁడ?'
అనుచు వగవఁ దొడఁగె నారాజపుంగవుఁ, డరులకైన నాత్మ నడలు వొడమ. 140

క. అంతయుఁ గనుఁగొని విప్రులు, 'వింతలె భూజనుల కరయ విధికృతములు మీ
రింతటిపనికై యేలొకో, చింతించెద'రనినఁ దనదుచిత్తములోనన్. 141

ఉ. మిక్కుట మైనశోకము శమింపక పేర్చిన వెచ్చనూర్పుచుం
జెక్కుటఁ బాణిపల్లవము చేర్చి కనుంగవ బాష్పపూరముల్
నెక్కొని క్రమ్ముదేర ధరణీపతి తద్దయు విహ్వలించినన్
దక్కక విప్రవర్గముఁ బ్రధానచయంబును భృత్యకోటియున్. 142

క. 'తనయోత్సవసమయం బిది, జననాయక! నీకు శోకసమయమె వగవం
బని లేదు లెమ్ము శీఘ్రం,బున నడుపుము జాతకర్మములు సకలంబున్. 143

ఉ. ఇంకొకనాఁడు వచ్చుపని కిప్పుడ యింత దలంక నేల? మీ
వంకఁ గృపావిధేయుఁ డగువాఁ డొకపుణ్యుఁడు గల్గెనేని న
య్యంకిలి దీర్పకున్నె'యని యందఱుఁ జెప్పినఁ జింత దక్కి యా
పంకజపట్టణాధిపుఁడు బాలికఁ జూచి కృతార్థకృత్యుఁడై. 144

క. పదియును రెండును దినముల, తుదిగృహశుద్ధి యొనరించెఁ దోరణములఁ బొం
పొదవెడుకలుపడమును నం, బుదముల క్రియఁ జూడ నొప్పెఁ బురిలో నెల్లన్. 145

వ. ఇట్లు పట్టణం బలంకృతంబు సేయించి భూసురాశీర్వాదంబులతోఁ బుణ్యాహంబు చేసి పుష్పగంధి యనునామకరణం బిడి పాఠకుల నపారదక్షిణలను గోభూహిరణ్యదానంబులనుఁ బరితృప్తులం జేసి యిష్టాన్నంబు లొసంగి సుఖం బుండునంత దాదులు పెనుప నానాఁటికి శైశవవినోదంబులం దల్లిదండ్రులకు ముద్దుసూపుచు నా పుష్పగంధి రూపవిలాసవిభ్రమంబుల జిగి దళుకొత్తఁ బెరిగి చెలికత్తియలం గూడి బొమ్మపెండ్లిండ్లు సేయుచు నంతఃపురోపవనవృక్షంబులకు రక్షకంబు లగునట్టి పను లనుసంధింపుచు భాగ్యప్రదంబు లగునోములు నోముచు మఱియు వివిధవిహారంబులు సల్పుచుండం గొండొకకాలంబు సనుటయు నొక్కనాఁడు. 146

ఉ. చూతనవీనపల్లవము శుద్ధసువర్ణపునీటఁ దోఁచి కం
జాతరజంబుపైఁ గలయఁ జల్లి మెఱుంగులఁ దోమి తోమి ల
క్ష్మీతనయుండు వేడ్కపడి చేసినపుత్తడిబొమ్మ నాఁగ నా
భూతలనాథుసన్నిధికిఁ బుత్రిక వచ్చె సఖీసమేతయై. 147

ఉ. వచ్చినఁ జూచి హర్షరసవార్ధితరంగల నోలలాడుచుం
జెచ్చెరఁ గౌఁగిలించుకొని చెన్నగుమోమున మోముఁ జేర్చుచుం

దెచ్చి నిజాంకమం దునిచి తిన్ననిమాటల గారవింపుచుక్
ముచ్చటవోవఁ జూచెఁ దనముద్దులపట్టిఁ బయోరుహాననన్. 148

ఉ. ఆనన మెత్తి కన్గొనిన నాసభ యంతయు దృష్టిఁ జీచిపీ
చీనివహాంబుచే మునిఁగి చేడ్పడునో యనుభీతిఁ బోలె ల
జ్జానతయై కరాగ్రవివిధాభరణంబులు చూచుచుండఁ బ
ద్మాననయుం గటాక్షరుచు లాదట నొక్కొకమాటు పర్వఁగన్. 149

క. గౌరియుఁ సిరియు నిజాంకవి, హారిణు లగునట్టి హిమనగాబ్ధులభంగిన్
ధీరవ్రగభీరత్వము, లారంగా విభుఁడు మెఱసె నాత్మజతోడన్. 150

వ ఇట్లు నిజపుత్రీలాలనలాలసుండగుచు నమ్మహీనాథుండు కొండొకతడవు వినోదించి తద్వయోరూపంబులకు ననురూపంబు లగువిద్యావిలాసంబులభ్యసింపనియోగించిన.

ఉ. భారతి యొండె నొండె నలపార్వతి గాని తలంచి చూడ నీ
నీరజనేత్ర యొక్కధరణీపతిపుత్రికమాత్ర గాదు వో
ధారుణి నంచు సజ్జనకదంబము మెచ్చఁగ సాక్షి ధాత్రయై
చేరి గురుండు చెప్ప నతిశీఘ్రము మెలర్ప గ్రహించె నేర్పునన్. 152

క. పాటయు జనుపును వ్రాఁతయు, నాటయుం వాద్యంబు నాది యగువిద్యలకున్
మేటి యని పొగడఁ దగియెడు, పాటిగఁ దా నభ్యసించె బాలిక పేర్మిన్. 153

వ. అంత నొక్కనాఁడు దనకూఁతు విద్యావిశేషంబులకు సంతోషంబు నొంది గాఢాలింగనంబుచేసి మస్తకంబు మూర్కొనుచుం దొడపైఁ బెట్టుకొని యిత్తన్వి యెవ్వరికి నిత్త మని చంద్రరేఖ నడిగిన నయ్యింతి నయనారవిందంబులందు బాష్పబిందువులు గ్రమ్మ గద్గదిక నెలుంగు వెడలక తల వంచికొనియున్న నరేంద్రుండును దన మనంబున నెఱింగి. 154

ఉ పెంపు వలిర్చ నీతరుణి పెండిలి చేసితి మేని నల్లునిం
జంపును బ్రహ్మరాక్షసుఁడు చాలము తద్దురవస్థ యేము వీ
క్షింపఁగ నింక మానుఁ బరికింపఁ ననూభవయుం దనూజుఁడున్
సొంపెసలారఁగా నిదియు చుమ్మని నిశ్చితవృత్తి నుండఁగన్. 155

సీ. బాలికజఘనంబు ప్రబలెఁ దోరంబుగ వెడవిల్తునేకాంతవేది యనఁగ
నెలనాగనూగారు నేర్పడి కడునొప్పెఁ బంచబాణునిమీనుపడగ యనఁగ
ముదితలే జన్నులు మొన లెత్తి బలసె నంగజుఁ డేలుమేటిదుర్గము లనంగఁ
గన్నియ నిడువాలుఁ గన్నులు మెఱసెఁ గెక్కె నతనునిక్రొవ్వాఁడియమ్ము లనఁగ

ఆ. నతివనడపు మెఱసె రతిరాజుసాధన, గతులనంగ విమలకమలనేత్ర
పలుకు లమరె భావభవుమంత్రసారంబు, లనఁగ నాఁడునాఁటి కంద మగుచు. 156

శా. ఆలోలాక్షిలలాటవక్త్రసదృశత్వాకాంక్షఁ జంద్రుండు దా
బాలత్వంబు వహించి చూఁచియు నొగిం బ్రౌఢత్వముం బొందియుం
బోలం జాలక జాలి పొంది వగలం బొల్చెది లోఁ గుందెఁ గా
కాలోకింపఁ దదీయబింబము కురంగాకారముం గూరునే. 157

క. ఆనయనము లానుచుఁగురు, లానగు మొగ మామృదూక్తు లాగాంభీర్యం
బానడుపు లావిలాసము, లానెలఁతకె యొప్పు నొరుల కలవడ వెందున్. 158

తే. అంత నత్యంతరూపసత్కాంతులందుఁ, బువ్వవిల్కాని ప్రోచునాపుష్పగంధి
జవ్వనముతోన నిలఁ గలయవ్వనంబు, లెలమిఁ బొందఁ వసంత మిట్లే గుదెంచె. 159

క. జర యుడిపి మాకుఁ గ్రమ్మఱఁ, దరుణత్వం బొసఁగు మనుచు ధరణీదేవిన్
బోరిఁబోరిఁ బూజించినక్రియఁ, దరమిడి కారాకు రాల్చెఁ దరుచయ మెల్లన్. 160

ఉ. పల్లవితక్షమాజములు బంధురకోరకితద్రుమంబులుం
బెల్లగుపుష్పితక్షితిజబృందములు న్వనభూములందు శో
భిల్లె ప్రసూనసాయకుఁ డభీష్టవిహార మొనర్పవచ్చుచో
నుల్లములందు వేడ్క లిగురొత్త వసంతు నలంకరించినన్. 161

ఉ. కాయజనాయకుం డలరుగద్దియ యెక్కె వసంతవేళ సుం
డో యిల నెల్లవారలుఁ దదుత్సవసంపదసొంపు చూడ రం
డో యెలనాగలం దొఱఁగి యొంటిఁ జరింపకుఁ డో విటాలి యం
చాయతరీతిఁ జాటునటు లామనిఁ గూయఁ దొడంగెఁ గోయిలల్. 162

క. తరమిడి పువ్వులగుత్తులఁ, జొరిగెడిమకరందరసము తోయంబుగఁ ద
త్తరులతలు చల్లులాడెడు, దరుణవిటీవిటులు వోలెఁ దత్సమయమునన్. 163

చ. అవిరళగంధవాహనికరాహతి నొక్కొకచోటఁ బుప్పరే
ణువు లెగయంగ నప్పుడు మనోభవుఁ డశ్వము, దోలుచో ఖురో
ద్ధృతధరణీపరాగములు పర్వె నొకో యని యెల్లవారలుం
దివిరి నుతింప నొప్పు జగతి న్వనభూములఁ గొన్నిచోటులన్. 164

ఉ. ఝుమ్మని మ్రోయుమ్రోఁతఁ గడుశ్రోత్రసుఖం బగుగర్జచాడ్పుగాఁ
దుమ్మెదతండముల్ బెరసి తోయదరీతిఁ జరింపఁ జూపులం
గమ్మనితేనియల్ దొరుగఁగా జినుకు ల్లవి సోగ లెత్తి మో
దమ్మున నాడఁ గేకిసముదాయము కాంతివిలాస మొప్పఁగన్. 165

ఉ. ఎక్కడఁ జూచినం జిలుక లెయ్యెడఁ జూచినఁ గోకిలమ్ము లే
చక్కటిఁ జూచినన్ సమదషట్పదసంఘము లెందుఁ జూచినం
జొక్కపుశారికల్ ఋతువుసొంపు నుతింప వశంబె పువ్వుఁదే
రెక్కినపంచసాయకుఁడ యెద్దెసఁ జూచిన నవ్వనంబునన్. 166

ఉ. అట్టివసంతవేళఁ గుసుమాపచయోత్సుకబుద్ధి నెమ్మదిం
బుట్టఁగఁ బుష్పగంధి తనబోఁటులుఁ దాను బూర్ణచంద్రుతోఁ
బుట్టినయట్టికాంతి గలముద్దుమొగంబు నెలర్ప నంచెలున్
మట్టెలు దట్టమై చెలఁగ మందగతిం జని యవ్వనంబునన్. 167

ఉ. కంతునిపూజ సేయుదము కాంచనపుష్పచయంబు లీవు సే
వంతులు నీవు నీవు విరవాదులు పొన్నలు నీవు నీవు వా
సంతిక లీవు గొజ్జఁగులు చంపకమంజరు లీవు దెమ్ము మా
వంతు సరోరుహంబు లని వావిరిఁ గోయఁ దొణంగి రందఱున్. 168

సీ. మెట్టుచో నడుగులదట్టంపుఁగెంజాయఁ బ్రాంతదేశంబులు పల్లవింప
వీచుచోఁ గరములవిద్రుమచ్ఛాయలు రెండుపక్కియలను నిండి నెఱయఁ
జూచుచోఁ గన్నులచొక్కంపుఁదళుకులు గళుకులై ముందటఁ గలయఁబొలయఁ
బలుకుచో గంభీరపదనిస్వనంబులు కోకిలస్వనములఁ గూడఁ బిలువఁ
తే. గదిసి తోఁతెంచుకామాంధకార మనఁగ, వలుఁదక్రొమ్ముడి వెనుకకుఁ జెలువొనర్పఁ
గమలదళగంధి యగుపుష్పగంధి యొక్క,తెయయును బువ్వులుగోసెను దేజమెసఁగ.

మ. తరుణీరత్నము పువ్వుఁదీగె యొకచేత న్వంచి పాదాగ్రమున్
ధరణిన్ మోపి యొకింత నిక్కి తనుమధ్యం బొప్పఁ గక్షద్వయ
స్ఫురణం బారఁ గుచంబు లుబ్బ నయనంబు ల్విచ్చి లీల న్ముఖాం
బురుహం బెత్తి యొకర్తు గోసె నెలమిన్ బుష్పంబు లత్తోఁటలోన్. 170

క. రుచిరేందువదన యొక్కతె, కుచపరిధానంబు నిండఁ గోసెఁ బ్రసూన
ప్రచయము దనహృదయేశ్వరు, నుచితస్థితిఁ బూజచేసె నొక్కొ యనంగన్.
తే. బాలఁతియొక్కతె సంపెఁగపువ్వుఁ గోసి, మూర్కొనియెఁ గామినులఘ్రాణములకు నదిస
దృశ మనుసత్కవీంద్రోక్తి తెలుపఁ బూని, యొక్కొ యిటు చేసె ననిజాణ లుల్లసిల్ల.

చ. ఒకసతి యిక్షుదండమును నొప్పగుచాపముగా నొనర్చి దా
నికిఁ బువుఁదీఁగె నారి యిడి నెమ్మి దలిర్పఁ బ్రసూనబాణపం
చకము ధరించి కాముపరిచారికవోలెఁ జరించెఁ దద్వనాం
తికచరవిప్రయోగులమది న్బెద రూనఁగ నంతకంతకున్. 173

ఉ. అప్పు డొకర్తు కొన్నివిరు లాదటతో నఱచేతఁ బట్టి యే
నప్పుడు గోయుచోటఁ జెలువై యిటు లిప్పుడు రక్తవర్ణమై
చొప్పడు టేమి చిత్ర మనుచుం జెలికత్తెల కెల్లఁ జూపెఁ బైఁ
గప్పినపాణిపల్లవముకాంతికతంబున భ్రాంతి యెత్తినన్. 174

చ. ఒకసహకారశాఖతుద నోలిఁ బెనంగొనియున్న పువ్వుఁ దీఁ
గకుఁ దనహస్త మెత్తుటయుఁ గ్రక్కున లేఁజిగు రంచుఁ గోకిలం
బొకటి రయంబునం గదియ నుల్కి పడంకుచుఁ బాఱె నొక్కబా
లకి తనబోఁటితోడ నబలా యిది కాటుకతీఁగె పొమ్మనన్. 175

చ. కుసుమపుగుత్తి చూచి యొకకోమలి దగ్గఱి కోయఁ బోయినన్
బసిఁబడియందు నున్నమధుపంబులు వచ్చి ముఖంబుతావికిన్
ముసరఁగఁ జోఁపి చోఁపి పెను మ్రోఁతలతో నవి దట్టమైన వె
క్కసపడి పాఱుఁజెంచెఁ జెలికత్తియ లందఱుఁ జూచి నవ్వఁగన్. 176

సీ. 'తరళాక్షి ! చూచితె తరళాక్షిరోచులు చల్లక పూవ దీచంపకంబు
కలకంఠి ! చూచితె గంధూషమద్యంబు పోయక పూవ దీపొగడమ్రాను
బింబోష్ఠి ! చూచితె బిగియఁగఁ గౌఁగిట బెరయక పూవ దీకురువకంబు
బాలకి ! చూచితె పదతాడనప్రీతి లేకున్నఁ బూవ దశోకతరువు

ఆ. గాన సతులయందుఁ గలసౌఖ్య మెఱుఁగనినరుఁడు మ్రాను గాక ధరణిమీఁద
నబల ! యివ్వి మ్రాఁకు లనవచ్చునే' యని, చెలికిఁ జూపి చెప్పెఁ జెలువ యొర్తు.

చ. ఇలఁ బులినంబుకంటె ఘన మీజఘనం బని చూపుభంగి నూ
రులు వెడలంగఁ దోఁపఁగను రూఢిగ నంబర మెత్తి లీలమైఁ
గొలనికి డిగ్గి యబ్జములు గోయఁ గరాబ్జము సాఁచి యందులో
పలఁ దనచేతినీడఁ గని పట్టఁగఁ బోవుఁ బయోజవిస్మృతిన్. 178

ఆ. తొంటిమొలక నొక్కతొయ్యలి చనుకట్టు,గట్టు టొప్పె రాత్రు లిట్టునట్టు
విచ్చిపోవకుండ నచ్చక్రవాకులఁ, బట్టి మరుఁడు లంకెఁ బెట్టె ననఁగ. 179

క. కలువలఁ జెంగలువలు వి, చ్చలవిడి నొడినిండఁ గోసెఁ జయ్యన నొకకో
మలి మృగమదకుంకుమములఁ, దొలఁచినమరుసాయకములు దొన నిడ్డక్రియన్. 180

సీ. అపాన్నపూఁదేనె లాని యన్నెక్కినఁ గదలనేరని తేఁటికదుపుచేత
నెఱక లొండొంటిపై గిఱిపి రతిశ్రాంతిఁ బడియున్నభృంగదంపతులచేతఁ
గమ్మపుప్పొడి క్రోలి కదలేనియఁబ్బున మిన్నంట మ్రోయుతుమ్మెదలచేతఁ
భోలివోనిమరువంపుఁగలికల నెత్తావిఁ దవిలి సోలెడుషట్పదములచేత

ఆ. మిగుల నంద మగుచు మీనాంకుఁ జేయక, దాఁచి యున్న బాణతతులువోలె
తమ్మివిరులు గోసెఁ దరుణి యొక్కతె కుచ, చక్రవాకరేఖ జాఱి పడఁగ. 181

వ. ఇట్లు పుష్పాపచయాపదేశంబున నారామ లారామం బాతయుఁ దమమయంబగా
విహరించి సరసాలాపంబులు నెఱయ మెఱయుచుండఁ గ్రమక్రమంబున. 182

ఉ. నీరధిఁ గాలకూటము జనించినయ ట్లరుదెంచె గ్రీష్మ మి
ద్ధారుణిఁ గృత్తివాసుఁ డది దాఁ గబళింపఁ గడంగుభంగి నే
పారెఁ బయోదవేళ సుర లంతట సంతస మందినట్టు లం
భోరుహజృంభణం బమరఁ బొల్చె శరత్సమయంబు పెంపునన్. 183

ఉ. వేలుపుటేటిఫేనములు వెన్నునిపొక్కిటితమ్మిరేకు లా
శాలలనాదుకూల మృదుసంవృతసంచలసంచయంబు ది
క్పాలకబాలకేళిపరికల్పితశుభ్రమరుత్పతాకికా
జాలము నాఁగ నొప్పె విలసద్ఘనశారదనీరదావలుల్. 184

క. మడుఁగులు బావులు కొలఁకులు, వడివెట్టినయమృతరసమువడువున నిండా
రెడునిర్మలజలములచేఁ, గడురమ్యంబులయి జగతిఁ గడుఁ బొగడందెన్. 185

వ. అయ్యవసరంబున. 186

క. సలిలవిహారక్రియలకుఁ, దలకొనుమదితోడ నృపసుతారత్నము నె
చ్చెలిపిండుతోడ నాపు, వ్విలుతునిదీపంబు వోలె వెలువడి యొకచోన్. 187

చ. చిగురులపెంపుఁ గ్రొన్ననలచెన్నును బువ్వులసొంపు నై కడుం
బొగడఁగ నొప్పుశాఖల నభోవలయంబు నతిక్రమించి మిం
చగుతరువాటికాతటమునందు మహాత్ములచిత్తవృత్తియ
ట్లొగిఁ గడుస్వచ్ఛమైనకొల నొక్కటి చేరి మహాముదంబునన్. 188

సీ. తొలిఁదొలిఁ జొర నోడుచెలువలచిత్తముఁ దెలిపి యాటలకు మైకొలిపి కొలిపి
యోలోల యని లీల నోర్తోర్తుఁ జేకొని పరువడి చెయ్యాక పాఱి పాఱి
యాదట నితరేతరాస్యపద్మములపైఁ గరయంత్రధారలు పఱపి పఱపి
వికచపద్మపరాగవిసరంబు పుచ్చి చేసాఁచి యొండొరులపైఁ జల్లి చల్లి
ఆ. జలజసక్తమధుపములఁ జోపి చోపి రాయంచపదుపుఁ బట్టఁ బొంచి పొంచి
దరులఁ జెంది చెంది ధవళాయతాక్షు లక్కొలన నట్లు కేలి సలిపి రంత. 189

ఉ. మాళవనందభూపతికుమారుఁడు సద్గుణమండనుండు నాఁ
జాలినరత్నమండనుఁడు సత్యసమన్వితుఁ డేగుదెంచె వా
తూలసమానయానమునఁ దోడికుమారులుఁ దాను సింహశా
ర్దూలభయంకరాటవుల దూఱుచు నేర్పున వేఁగ వేఁటకున్. 190

ఆ. అరుగుదేరఁ జేరి నారాజనందనుఁ, గూడి పాఱ లేక తోడిసఖులు
నిలిచి రంబగమున నిగుడుభానునిఁ గూడి, యరుగ లేని గ్రహచయంబునట్ల. 191

క. ఇవ్విధమున నాపఱు దవు, దవ్వుల దిగఁబడఁగ నింద్రదత్తుం డనువాఁ
డవ్విభునిఁ గూడి నెయ్యము, నివ్వటిలఁగ నడచెఁ దోడునీడయుఁ బోలెన్. 192

వ. అప్పుడు. 193

ఆ. డేగ వేఁటయందు డెందంబు నిలిపి గో,పాలవేష ముడిగి తాలకేతు
సహితుఁడై ధరిత్రి విహరింపఁ జొచ్చిన, నందసుతునిఁ బోలె నందసుతుఁడు. 194

క. అనుచరుఁడుఁ దాను నేక్రియ, విన విస్మయ మైనయట్టివేఁటలతమకం
బున నిది సమ మిది విషమం, బనక చనుచుఁ గనియె నమ్మహాపుర మెదురన్. 195

చ. కని 'యిది యేపురంబు చెలికాఁడ మహోన్నతవప్రశాలియై
ఘనసదనాభిశోభి యయి కంధరబంధురహర్మ్యరమ్యమై
యొనరెడుఁ గంచియో మధురయో మిథిలాపురమో విదర్భయో
తనరునయోధ్యయో శ్రుతిహితంబుగఁ జెప్పుము నాకు' నావుడున్. 196

ఉ. ఆతఁడు రత్నమండనున కాదట నిట్లని చెప్పె నప్డు 'ప్ర
ఖ్యాతిగ నీవు పేర్కొనినయట్టివి యెద్దియుఁ గాదు సుమ్ము సం
పాతి యనంగ నొక్కనరపాలకుప్రోలిది దీనిపేరు వి
న్మా తగఁ బుండరీకము రమాసదనం బిది శబ్దతుల్యతన్. 197

క. ఈరాజు ధర్మవర్తనుఁ, డీరాజ్యములోని ప్రజలు నిందఱు విహితా
చారైకరతులు దురితవి, దూరు లనుచు నెపుడుఁ జెప్పుదురు సత్పురుషుల్.' 198

వ. అని యింద్రదత్తుండు చెప్పునప్పలుకులు విని రాజసుతుండు ప్రీతిచేతస్కుం
డగుచుఁ జని చని తనచేతిడేగ నొక్కమహీరుహంబుపై నున్నవిహంగంబునకు
వైచిన. 199

ఉ. ఉవ్వను మ్రోఁకతో నెదు రెఱుంగనివీఁకఁ బరాక్రమించుచో
నవ్విహగంబు తద్ఘనతరారుణదారుణనేత్రరోచులన్
నివ్వెఱఁగంది కాల్కొనఁగ నేరక మేదినిఁ గూలెఁ గూలినం
జివ్వనఁ దేలిపోయి యొకచెట్టున వ్రాలెఁ గరంబు దవ్వులన్. 200

క. ఆడేగ యట్లు వ్రాలిన, వేడుక నవ్వనమునందు విలసితలీలం
గ్రీడించుబాలికాజనచూడామణి పుష్పగంధి చూచి కడంకన్. 201

క. పట్టెదను డేగ ననుచును, నిట్టలమునఁ జెలుల మొఱఁగి యీక్షణరోచుల్
వట్టములై ముందట వెద, వెట్టినటులు గలయఁ బొలయఁ బెద్దయుఁ బ్రీతిన్. 202

క. అడుగులఁ జప్పుడు కాకుం, డెడునట్లుగఁ గదియఁ బోయి డేగా యిది నం
జూడు గొమ్మని యొకయెలమా, మిడిచిగు రటు చూపుచుండె మెలఁతుక యంతన్.

క. అచ్చపుఁదమకంబునఁ దన, నెచ్చెలి నచ్చోన డించి నృపతితనూజుం
డచ్చెలువ లున్నతోఁటకు, వచ్చెం దనడేగ యెందు వ్రాలెనో యనుచున్. 204

ఉ. వచ్చి యతండు చూచెఁ జెలువంబులప్రోఁక విలాసలక్ష్మికిం
జొచ్చినయిల్లు సౌఖ్యములచోటు వికాసముతానకంబు క
న్నిచ్చలయంక్కిపట్టు కుసుమేషునికారముజన్మభూమి సా
నచ్చగుపువ్వుగంధిఁ జపలాయతనేత్రఁ బయోరుహాననన్. 205

క. ఆతరుణీమణియును నృప,సూతితనూవిలసనాతిశోభాసక్తం
బై తనచూడ్కి నిగుడఁ బ్ర,స్ఫీతగలిందోఁచెఁ గుడ్యచిత్రముభంగిన్. 206

చ. ఇరువురచూపులుం దనకు నింపగుతూపులు గాఁగఁ జేర్చి యొం
డొరువులమర్మము ల్గలఁగ నాఱుటఁ జెందనిహస్తలాఘవ
స్ఫురణ మెలర్ప శంబరనిషూదనుఁ డార్చుచుఁ బింజ పింజతో
నొరయ నిరంతరంబుగ మహోద్ధతుఁడై తెగి యేసె నత్తఱిన్. 207

క. కోరుదు రొండొరుఁ గదియఁగఁ, గోరుదు రితరేతరోపగూహనసుఖముం
గోరుదు రన్యోన్యాధర, సారసుధారుచులు దనివి సనఁ గ్రోలంగన్. ?08

క. ఇట్లియ్యిరువురుఁ దమలో, జట్లువడనికోర్కి లక్కజంబుగ సఖు లీ
చిట్లెల్లెఁగినఁ గార్యము తుది, నెట్లగునో యనుచు నుండ నింతటిలోనన్. 209

చ. కనుఁగొని పుష్పగంధిచెలికత్తియ మాలిని నాఁగ నొక్కయం
గన చనుదెంచి యిద్దఱముఖంబులఁ దోఁచుమనోవికారముల్
తనమది నిశ్చయించి క్రియ దప్పదె యింకిట యేసుపేక్ష చే
సిన నని యాసరోజముఖిఁ జేరి ప్రియోక్తుల గారవించుచున్. 210

ఆ. 'తరుణి!మనము వచ్చి తడవయ్యె నాటలు, చాలవమ్మ ప్రొద్దు వ్రాలె మిగుల
నీకు నెదురుచూచునృపసతీతిలకంబు, పాలి కరుగ నింకఁ బాడి గాదె.' 211

తే. అనిన నయ్యింతి సిగ్గున నవనతాస్య, యయ్యె నేమి సేయుదు నల్లయవనినాథ
తనయుఁడిందుఁ బ్రవేశించెననుచుఁదనదు,హృదయమావయస్యకుఁజూపునదియపోలె.

వ. మఱియు నత్తెఱవ తత్సమయసముచితోక్తులు పలుకుచుఁ జైదండ యిచ్చి యమ్మ
చ్చెకంటి నచ్చోటు గదల్చి తెచ్చునప్డు దచ్చెలుఁవుండు పచ్చవిల్తు నచ్చవిరితూ
పులచే నొచ్చి వెచ్చనూర్చుచుం గూర్చుండంబడి పైపై నివ్వటిల్లునెవ్వగల నొగిలి
మూర్ఛిల్లె నాపుష్పగంధియుం గొంతదవ్వరిగి యరిగి మనోజాతశరస్యూతయై స్రోలి
వ్రాలె నంత. 213

క. అక్కట మనోజవేదనఁ, జిక్కె భవత్సఖుఁడు వానిఁ జేకొను మనున
ట్లొక్కటఁ బలికెడుశుకములఁ, దక్కకఁ గనుఁగొనుచు నింద్రదత్తుఁడు వచ్చెన్. 214

ఆ. వచ్చి యతనియునికిఁ గ్రచ్చఱఁ జూచి డెందమునఁ గొందలంబు దలకొనంగ
'రాకుమారతిలక! హారత్నమండన!, యెట్లు సంభవించె నిట్టియెడరు?'. 215

వ. అని పలికి మఱియును. 216

క. 'పాము గలదొ కాదేఁ బెను, గాము గలదొ యదియుఁ గాక క్షత్త్రియకులజుం
డీమెయిఁ బొలిసినఁ గయికొని, యేమేనియుఁ జేయుంభూత మిచ్చటఁ గలదో. 217

ఉ. ఇయ్యవనీశనందనున కిప్పుడ యీదురవస్థ రాఁ గతం
బెయ్యది యొక్కొ? యే నితని నేక్రియఁ జేకొని తేర్తునొక్కొ? నా
కియ్యెడ నిష్టకృత్యమున కెవ్వఁడు దోడ్పడఁ గల్గువాఁడొకో?
దయ్యమ! యేమి *చేతు'నని తల్లడ మందుచుఁ జేరి యి ట్లనున్. 218

క. 'ధీరోదాత్తగుణోత్తర!, యో రాజకుమార! నీకు నుచితమె యి ట్లీ
దారుణతామసభావముఁ, గూరి వృథా ఖేదమునకుఁ గుమరై యుండన్. 219

చ. ఫణిమయపాశజాలములపాల్పడి యారణశయ్య నున్నరా
వణరిపునిగ్రహం బడుప వచ్చినయవ్వినతాతనూజుల
క్షణమున నున్నడేగ చెసఁ గన్గొను నీదుమనోవికారకా
రణ మెఱిఁగింపు మాకు వివరంబుగ సర్వముఁ జక్క చేసెదన్.' 220

ఉ. అనుచు సఖుండు పల్కుటయు సంకిలి దేఱినచిత్తవృత్తితోఁ
గను దెఱవం దలంచి యధికంబుగఁ గ్రమ్మెడుబాష్పవారితో
నసిసినఱెప్ప లెత్తుటయుం నెత్తి సుఖాసనుఁ జేసి కన్నుల
ల్లన నఱచేత నొత్తి వికలం బగుహారము చక్కఁద్రోయుచున్. 221

వ. తత్సమీపపుష్పితలతాలవాలంబున మకరందబిందుసంవాసితంబు లగునంబువులు కర
పుటంబులం దెచ్చి యందిచ్చి ముఖప్రక్షాళనంబు చేయించి యాతని నవలోకించి.

క. 'నీ కిట్టికడిఁదిదుర్దశ, రాకకుఁ గత మేమి?' యనిన రాజతనూజుం
డాకర్ణింపు'మిచట నొక, కోకిలశుకవాణిఁ బుష్పకోమలఁ గంటిన్. 223

సీ. చిగురుటాకులలోనిజిగిఁ గూర్చి యాబాలయఱకాళ్ళఁ జేతుల నలఁదిరొక్కొ
కుసిడితీఁగెలమీఁదిప్రభ దెచ్చి యాకాంత మెయిఁదీఁగె యంతట మేదిరొక్కొ
చంద్రబింబముకాంతి సవరించి యాలేమ మోమున నునుపుగాఁ దోమిరొక్కొ
క్రొమ్మెఱుంగులమించు గొని వచ్చి యాయింతికలికికన్నులఁ గీలుకొలిపిరొక్కొ

* చేతు! ననునది లక్షణవిరుద్ధము. చేసితని. యని మార్చిన సరిపోవును.

ఆ. యనఁగ సవతులేని యభినవాకారంబు,తోడఁ జెలులఁ గూడి యాడుచుండెఁ
జామ యొత్తు మరుని సామ్రాజ్యలక్ష్మియ, పోలె దానిఁ జూచి బేలుపడితి. 224

ఉ. ఆమదిరాక్షి నేత్రరుచు లావనజాననముద్దునవ్వు లా
భామినిమందమందమృదుభాషితరీతులు డెందమందుఁ జే
రామనియై తనర్చుటయుఁ నంగజు చేతినిశాతసాయక
స్తోమముభంగిఁ గెందలిరుజొంపము నా కొదవించెఁ గంపమున్. 225

ఉ. తోఁకొని పోయె నంత నొకతొయ్యలి యయ్యెలనాగ నప్డు పే
రాఁకలి గొన్నబెబ్బులి రయంబునఁ గృష్ణమృగార్భకంబుపై
వీఁత యెలర్పఁ బెల్లడరి ప్రేయుగతిన్ మరుఁ డుగ్రుఁడై ననుం
దాఁకిన మూర్ఛ నొందితిని దద్దయు నీవలనిప్డు తేఱితిన్. 226

క. అని యిట్లేర్పడఁ జెప్పిన, విని యతఁ డిట్లనియె నొక్కవెలఁదికిఁ గా నె
మ్మన మింత నెగులు పఱుపఁగఁ, జను నే నీయట్టిధైర్యసంపన్నునకున్.' 227

చ. అనవుడు 'నేమి చెప్పుదు వయస్యుఁడ! భానుఁడు తూర్పుఁగొండ యె
క్కిన మఱి యేటిచీఁకటులు కేశవనామము జిహ్వ నుచ్చరిం
చినతుది నేటిపాపములు చిత్తజుపుత్తడి గ్రేణి సేయుఁన
వ్వనితకటాక్షదీధితులు ప్రాలినమీఁదట నేటిధైర్యముల్. 228

చ. విను మటు లుండె నాహృదయవేదన మానుప నోపుదేని నా
కనుఁగవ గెంపొనర్చు సితకంజనిభేక్షణ నాలతాంగిఁ దో
డ్కొని చనుదెమ్ము తే ననువుఁ గూడనిపక్షమునందు నన్ను ర
మ్మనినను వచ్చెదం బిలువ మక్కడికార్య మెఱింగి చయ్యనన్.' 229

చ. అనుటయు నింద్రదత్తుఁడు నరాధిపనందను నంద యుంచి యేఁ
జని యిటు వచ్చునంతకు విచారము నీమదిఁ జేర నీకు మ
వ్వనితకు నీకు నిప్పుడ యవశ్యముఁ బొం దొనరింతు నంచుఁ జ
య్యనఁ జనుదెంచె నాసరసిజానన లేఁగినచొప్పు వెంబడిన్. 230

సీ. ఈరీతిఁ జనుదెంచి యెదురుకట్లను నొక్కమాధవీవనలతామంటపంబు
క్రింద నందఱుఁ గూడి కిసలయశయ్యపైఁ బూఁబోడి నునిచి కప్పురపుధూళి
యఱకాళ్ళఁ దోముచు నఖిలాంగకములందుఁ బాటించి చందనపంక మలఁది
పదను డించినచోటఁ బన్నీరు చల్లుచుఁ గదళీదళంబులఁ గదిసి విసరి

ఆ. తరుణిమేన విరహతాప మగ్గల మైనఁ, గామ సోమఁ గమ్మగాలి నళులఁ
బికము శుకముఁ బేరుపేరఁ బ్రార్థింపుచు, సంభ్రమించుచున్నసఖులఁ గనియె. 231

మ. కని 'మీ రెవ్వరు? మీలతాంగి కిచటన్ గామజ్వరం బేమిటన్
జనియించెన్? శిశిరోపచారములచే శాంతంబు గాదో కదే
వనితారత్నములార! చెప్పుఁ డనినన్ వామాక్షు లారాజనం
దనమిత్త్రు న్వెసఁ జేర వచ్చి వికళద్బాష్పేక్షణాంభోజలై. 232

క. 'అన్నా! యే మని చెప్పుదు, మిన్నగరమురాజుకూఁతు రీవిరహిణి యు
ద్భిన్నసరోజానన యీ, కన్నియ పే రమరుఁ బుష్పగంధి యనంగన్. 233

ఉ. ఈసతి కేము నెచ్చెలుల మీయెలకోఁటకు వచ్చి నిచ్చలో
ల్లాసవిలాసహాసము లెలర్పఁగ వేడ్కలు సల్పుచుండఁగా
నాసమయంబునందు నొక డయ్యలరమ్ములు నిక్షుదండబా
ణాసనముం దొలంగ నిడి యంగజుఁ డొంటియ వచ్చుచాడ్పునన్. 234

మ. మిగులం జక్కనివాఁడు కాంచనరుచిన్ మేదించిన ట్లంగకాం
తిఁగడుంబొల్పగువాఁడు యౌవనమదోద్రేకంబునం దద్దయుం
జిగి సొంపారెడువాఁడు మాకడకు వచ్చెన్ డేగ వేఁటాడుచున్
జిగురుంబోఁడియు వానిఁ జూచి తగిలెన్ జెప్పంగ నింకేటికిన్. 235

క. ఆక న్నెఱింగి యచ్చట, నీకన్నియ నుండ నీక యిట తెచ్చితి మా
రాకొమరుఁ డెందుఁ బోయెనొ, వీకున నిది మూర్ఛవోయె విరహాతురతన్. 236

ఉ. అప్పుడు తల్లడిల్లి చిగురాకులసజ్జకుఁ దెచ్చి బాలకుం
బుప్పొడి రక్షగా నొసల బొట్టిడుచు న్మకరందబిందువుల్
చిప్పిలుపువ్వుమంజరులు చెక్కుల నొత్తుచు ధౌతవస్త్రముల్
గప్పుచుఁ జందనంపుటుదకంబు పయిం జిలికించుచుండఁగన్. 237

క. మిక్కుటమై విరహానల, మక్కన్నియ దేహ మెల్ల నెరియింపఁగఁ బూఁ
బక్కెర గలశుకతురగము, నెక్కిన వెడవింటిరాతు కెరఁగితి మార్తిన్. 238

క. తక్కటిమరుబలములకును, మ్రొక్కితి మే మిటను నెవ్వరును సుముఖులుగా
రెక్కడఁజొత్తు మనఘ! నీ, వెక్కడివాఁడ? విట యెచటి కేఁగెద?' వనినన్. 239

క. 'మీపుష్పగంధి కెయ్యెడఁ, జాపులకును లెప్ప మైనసుకుమారవపు
శ్శ్రీ పెంపునఁ దనరినవసు, ధాపతిసుతుసఖుఁడ నింద్రదత్తాహ్వయుఁడన్. 240

చ. అతఁడును బుష్పగంధిలలితాకృతిజాలమునందుఁ దద్దయున్
ధృతి యెడలంగ మన్స్యముగలెన్ గడు లోఁబడి పంచబాణబా
ధితుఁ డగు టేను జూచి తగఁ దేలుచు మీ కెఱిఁగింప నేఁగుదెం
చితి నిట మీఁదికృత్య మది చెప్పఁగ నేటికి మీ రెఱుంగరే.' 241

క. అనవుడుఁ బనివడి వెదకం, జనవలసినసొమ్ము దాన చనుదెంచినచా
డ్పున విన నబ్బె నితనిముఖమున నిక్కార్యంబు మూలముట్టుగ ననుచున్. 242

చ. రయమున నేఁగి యాసఖులు రాజతనూజకు నత్తెఱఁగు ని
శ్చయముగఁ జెప్ప మున్నసమసాయక సాయకపంక్తి చేత నొ
చ్చియుఁ నొకకొంత యూఱడిలుచిత్తముతో నటు లేచి తా నతి
ప్రియమున నింద్రదత్తుఁ బిలిపించి తదాననదర్శనంబునన్. 243

క. రోగికి సుహృదులఁ గన్గొనఁగా గుణ మెట్టి దగు నట్టికైవడిఁ జేతో
రాగ మెలర్పఁగ నునికికి, సాగోతులు ప్రీతి నొంది యాతనితోడన్. 244

ఉ. 'తమ్ముఁడ! నీవు వచ్చినకతమ్మున మాహృదయమ్ములోనితా
ప మ్మొకకొంత డిందుపడి ప్రాణము నిల్చె భవత్సఖుండు సే
మమ్మున నున్నవాఁడె? యొక మాటయిన న్మముఁ జిత్తగింపునో
నెమ్మది డేగవేఁటకును నెక్కొనుచిత్తముతోఁ జరించునో?' 245

క. అనవుడు 'నాతనివేఁటల, పని యిట యింకేమి చెప్ప భావజుఁ డీభా
మిని దీమంబుగఁ జూపి య,తనిఁ గైకొని వేఁటలాడెఁ దద్దయుఁ గడిమిన్. 246

క. అంతటఁ బోపక మఱుఁ డీ, కాంతారత్నంబు నతఁడు గారణముగ ని
ట్లింతకుఁ దెచ్చె నెఱుంగవె, కొంతవిచారంబు వలనొకో మీకైనన్. 247

క. తోలిఁబోలి రోగనిదానము, దెలియక యౌషధము వేయఁ దివిరెడువెడవె
జ్జులు వోలెఁ బొడఁగి యీతొ, య్యలి నేమిటికమ్మ యింత యలజడి పఱుపన్.'

ఉ. నావుడు నింద్రదత్తువచనంబుల నయ్యెలనాగ లట్ల కా
దే విరహాజ్వరంబు కడతేఱునె యీచలిమందులందు నిం
దీవరనేత్ర చందములు దేవికి మున్నెఱిఁగింపకుండినం
బోవునె ముల్లు ముంటఁ గొని పుచ్చక రోఁకటఁ బుచ్చవచ్చునే. 249

వ. అని తలంచి. 250

క. 'వినవలయు నతనిరాష్ట్ర, మ్మతనిపట్టణ మతనితల్లిదండ్రులపే ర్లా
తనిధామ మతనిప్రియభా, మినియభిధానంబు మాకు మేలుగఁ జెపుమా!' 251

చ. అనిన నతండు 'మాళవసమాహ్వయదేశము వానిదేశ మా
తనినగరంబురత్నపురి దాని కధీశ్వరుఁ డైననందుఁ డా
తనిజనకుండు తత్ప్రియనితంబిని యంబిక వానితల్లి వాఁ
డనఘుఁడు రత్నమండనసమాఖ్యుఁడు పెండిలి లేదు' నావుడున్. 252

క. ఒండొరులఁ జూచి యానన, మండలములఁ దెలివి యొలయ మాకన్నియ కాం
తండు వరుండగుఁ బరువడి, రండని కార్యోక్తిమై మరల్చిరి వానిన్. 253

ఆ. అంతఁ దనదుకోర్కి యబ్బినయట్లుగా, నెమ్మి నుల్లసిల్లునృపతనూజఁ
గాంచుఁ బురికి నరుగుదెంచి రయ్యింతులు, ననియె నతఁడు నధిపతనయుకడకు 254

చ. చనునెడ నంగజన్మశరసంహతిచేఁ బడి బాలుఁ డింద్రద
త్తున కభిలాషతో నెదురుత్రోవలు చూచుచుఁ గమ్మగాలిసో
కునకుఁ జలించుచుం గుసుమకోరకము ల్గని త్రల్లడించుచుం
దనరురసాలపల్లవవితానము చూచి కలంగఁ బాఱుచున్. 255

క. నానాభంగుల నిటు విరహానలపరితప్తచిత్తుఁ డగునట్టిధరి
త్రీనాథసూతిపాలికిఁ, దా నరుగఁగ నతఁడు దవ్వుదవ్వులఁ గనుడున్. 256

క. 'వచ్చెం బో నానెయ్యుఁడు, తెచ్చెనొకో మంచివార్త తేకున్నట్లే
నచ్చెఱుతనగవు మొగమున, నచ్చుపడుట కెద్ది హేతు వన వచ్చునొకో.' 257

క. అని మది నూహించుచు భూతనయాన్వేషణము చేసి తన యెదిరికి వ
చ్చినకపివీరుని: గాంచిన, యినకులజుఁడ పోలెఁ దలఁపు లీరిక లెత్తన్. 258

క. మెలపున నెదురుగఁ జని ప్రస్ఖలితవచనరచన యెసఁగఁ 'గాయో పండో
కలరూపు చెప్పు' మనవుడు, 'ఫలియించును గోర్కి పాఱఁబట్టుము వగలన్. 259

క. సంపాతినృపతిసతియై, పెంపారెడుచంద్రరేఖప్రియసుత దనచే
రింపారఁ బుష్పగంధి నుతింపన తగుఁ జూమ్ము మహిఁ దదీయగుణంబుల్. 260

సీ. ఆయింతి నీకు నిల్లాలు గాఁ దగుఁ జిత్తగింపు నామాట లంగీకరించి
యబల నీవార్త విన్నప్పుడ నిజదేహజనితవియోగాగ్ని బొనుఁగుపఱిచెఁ
దదనురూపంబుగాఁ దత్సఖీజనములు నీయూరుఁ బేరును నెమ్మి నడిగి
రడిగి యాతఁ డొడయఁ డగు మానృపాత్మజ కని కార్యగతి దేరనాడి నన్ను

ఆ. మరల బనిచి రేను నరుగుదెంచితి నింకఁ, జింత దక్కి యాలతాంతగంధి
నఖిలబంధుచయము ననుమతింపఁగఁ బెండ్లి, యగుదు గాక వేడ్క లగ్గలింప.' 261

క. అని యాతనిచిత్తము బోరన నూల్కొనఁ బల్కి నిజపురంబునకుం దో
డ్కొని చనియె నింద్రదత్తుం," డని సర్వటి చెప్పె ననిన నత్యుత్సుకుఁ డై. 262

క. "భోజుఁడు మఱి యే మనియె మహాజననుతచరణ సిద్ధుఁ డతనికి మఱి యే
యోజ వినిపించె నవిరళ, మై జరగెనె తత్కథామహాలత" యనినన్. 263

చ. అనుపమదివ్యతేజ! దివిజార్చితపాదసరోజ! దైత్యభం
జన!భువనైకరంజన! కృశానుశశాంకకుశేశయాప్తలో
చన! ఘనదుఃఖమోచన! ప్రసన్ననృసింహవపుర్విలాస! వే
దనగనివాస! భక్తజనతాపరితోషణ! దోషభీషణా ! 264

క. భవనీరధిబడబానల!, భవగహనాసహ్య దావపావక! దృప్య
ద్భవసామజకంఠీరవ, భవనిబిడతమోనిరాసభాస్కరమూర్తీ ! 265

వనమయూరము. నీలజలదాసితవినిర్మలశరీరా!, తాళతరుసప్తకవిదారణవిచారా!
కాళియమహాభుజగగర్వపరిహారా!, కాలసదృశోగ్రమధుకైటభవిదారా! 266

గద్యము. ఇది వాణీవరప్రసాదలబ్ధవాగ్విభవ తిక్కనామాత్యసంభవ సుకవిజనవిధేయ
అనంతయనామధేయప్రణీతం బైనభోజరాజీయం బను కావ్యంబునందు భోజన
నిమిత్తంబున భోజసర్పవటువులసంవాదంబును వసిష్ఠాగస్త్యోపాఖ్యానం
బును భిక్షాన్నప్రశంసయు యోగిదత్తభిక్షావిశేషంబును నతిథి
పూజావిధియును దదుదాహరణంబుగాఁ బుష్పగంధి
కథ విస్తరించుటయు నన్నది తృతీయాశ్వాసము.



శ్రీ

# భోజరాజీయము

## చతుర్థాశ్వాసము



నాథ! సురక్షితనిఖి
లానాథ! దయామయాంతరంగ! శివావా
ణీనాథసంగ! వీర
శ్రీనిర్జితదైత్యరంహా! శ్రీనరసింహా! 1

వ. అవధరింపుము. 2

క. ఆమహునకు నాత్రేయమ, హాముని యిట్లనియె ''భోజుఁ డట్టులు సిద్ధ
స్వామి తగఁ జెప్పుకథలు మ, నోమోదము గాఢముగ వినుచు నిట్లనియెన్. 3

ఆ. 'ఇంద్రదత్తుఁ డానరేంద్రపుత్రునిఁ గొంచుఁ, బురికి నరుగఁ జెప్పితిరి తదుత్త
రప్రసంగ మేమి క్రమమున వర్తిల్లె, నంతవట్టుఁ దెలియ నానతిమ్ము'. 4

క. నావుడు సర్వటి యి ట్లను, 'భూవర! విను మట్లు రాజపుత్రుఁడు చనినన్
భావజుచేఁతలఁ గోరిక, తీవ లొదవఁ బువ్వుగంధి ధృతిచెడి తనలోన్. 5

సీ. 'చూచినప్పుడ రాజసుతునిపాలికి నన్నుఁ జేరంగ నీదయ్యెఁ జెనఁటిసిగ్గు
నతఁడైనఁ దనలోనియభిలాష మెఱిఁగించి కదిసి కౌఁగిట జేర్పఁ గానఁ డయ్యె
నచట నొకింతసేపైన నిల్వఁగ నీక మాలిని నన్నేల మరలఁ దెచ్చెఁ
దలపోరి యతఁ డింద్రదత్తునిఁ బుత్తేర నేమాటయును జెప్ప నెఱుఁగనైతిఁ

ఆ. గాముశరమువాఁడి కైరవాప్తునివేఁడి, పికముకూఁత తేఁటిపిండుమ్రోఁత
యంతకంత కడరి యెంత గావించునో, యేమి చేయుదాన నెద్ది తెఱఁగు'. 6

మ. అని చింతించు మనోభవజ్వరముచే నశ్రాంతము న్వేఁగు హు
మ్మని నిట్టూర్పు నిగుడ్చుఁ గన్నుఁగవ బాష్పాంభఃకణంబు ల్కడు
న్నినుచు న్మాలిని లోనుగాఁ గలుగునానెయ్యంపుఁబూ*బోండ్లు దగ్
గని భీతిల్లఁగ నంతకంతకుఁ దనూకార్శ్యంబు సంధిల్లఁగన్. 7

వ. అక్కడ. 8

క. రమణీరమణులఁ గూర్చిన, సమదుఃఖం బనుట కేమి సందియ మన నా
రమణిరమణీయరూపము, మమతం దలపోయుచుండి మఱి తనలోనన్. 9

---

* బూఁబోణులం, గని భీతిల్లను.

సీ. 'కామిని నామీఁదఁ బ్రేమంబు గల్గినఁ గనుఁగొన్నయప్పుడ కదియకున్నె
ముద నన్ను నట్లు చూచినతీపు మూపు లంతన త్రిప్పి యచ్చోటు తలఁగి చనునె
యటుపోయి నాయంతరంగంబుఁ గోలఁది విచారించి చూడక యూరకున్నె
యిన్నియు నననేల యే నాత్మసఖుఁ బాపఁ దివిరి కందువకు నే తేరకున్నె
ఆ. తఱిమి నన్ను నింద్రదత్తుఁ డచ్చటు వాపి, తెచ్చుకొఱకుఁ గొన్నియిచ్చమాట
లాడఁబోలుఁగాక యది తథ్యమగునె య,వ్వేలఁదిఁబొంద నాకుఁగలుగునొక్కొ.' 10

చ. అని తలపోసి చిత్తమున నత్తనుమధ్యతనూవిలాసముల్
వెనఁగొని వంతఁ జేయు దురపిల్లుఁ గనుంగవబాష్పపూరముల్
ఘనముగ నించు నూర్పు నెడగాడ్పులు వెల్లి నిగుడ్చు నాసతీ
జనతిలకంబు లేనిపెఱ సౌఖ్యము లేటికి నొల్లఁ బొమ్మనున్. 11

వ ఇవ్విధంబున నహోరాత్రంబు లాహారనిద్ర లెఱుంగక వియోగతాపంబునం బరిత
పించురత్నమండనకుమారు నాకారంబు చూచి యతని బోధించుటకు నయ్యింద్ర
దత్తుం డి ట్లనియె. 12

క. 'కటకట యొకతరుణికిఁ గా, నిటు పటుతరదుఃఖవహ్ని నెరియంట నీయం
తటిచటులవిక్రమాత్యు, ద్భటనటశాటోపమతికిఁ బాడియె చెపుమా. 13

క. మేలై వచ్చిన మెత్తురు, కాలవశతఁ జేసి కీడు గదిసిన నతనిం
గేలి యొనర్చుచుఁ బోదురు, నాలిసతులమాట లంత నమ్మం గలదే. 14

క. ఈయర్థము తెలిపెద్దు విను,మా యొకయితిహాస మొకమహాటవిలో న
త్యాయతసముదంచితశా,ఖాయుత మగునొక్కమఱ్ఱి గల దొకచోటన్. 15

వ. ఆవటవిటపియం దొక్కమూషకమిథునం బభిమతాహారవిహారసౌఖ్యంబు లనుభవిం
చుచు నట్లుండఁ గొండొకకాలంబునకు నమ్మూషకవనిత గర్భిణియై ప్రసవసమ
యం బగుటయు నప్పురుషమూషకంబు. 16

క. తొఱ్ఱలోపల నొకదెస నొక, యఱగా నొనరించి చిగురుటాకు లడుగునం
* బఱచిన నది గడుమెత్తని,పఱుపుగ నచ్చోట నాఁడుఁబట్టిం గనియెన్. 17
క. కని జనని నిండుఁబొదిగిటఁ, బెనుపఁగ నది గారవమునఁ బెరుగుచుఁ దఱితోఁ
గను దెఱచెఁ దనువు జననికిఁ, గను వేఁదుఱు గొలుప ధవముఁ గనుఁగొన్నక్రియన్. 18
వ. మఱియు నచ్చిఱుతయెలుక తనతొఱ్ఱలోనన యుండి వెలుపలికిఁ దనమూతి
సాఁపుచుం దల చూపి మరలం దిగుచుచు నర్ధశరీరంబు దోఁప నిగుడి మగుడుచుఁ
బుచ్ఛంబుం దక్కం దక్కటిశరీరం బంతయు బయలుపడ నించుక సేపు కంపంబు
నొందుచు నుండియుండి మఱచి తలఁచిన ట్లదరిపడి తిరిగి తొఱ్ఱ చొచ్చుచు వెండి

* దుఱిమి యొనరించి (చి. ని. పా.)

యము నుండలేక వెలువడి శాఖామార్గంబునం గొంతద వ్వరిగి పర్ణరవంబులు కర్ణంబులు సోఁకినం బెదరి కోటరద్వారంబునకుం బఱతెంచుచు నిట్లు శైశవక్రీడలు నడిపి తదనంతరంబ యెలప్రాయంబు సొచ్చుపుడు నూఁగుదోసపిందెగతి నందం బగుదేహంబును దరుణశాకినీమూలంబును బోలువాలంబును శాల్మలితూలకంబళంబువిధంబున నత్యంతమృదులం బగునుదరంబును నాఖుకర్ణిపర్ణంబులమాడ్కి ఱిక్కించుకొని యున్నకర్ణంబులును నలంతిపూస లంటించినట్లు దనరుకనుంగవయును నుచ్చింత పువ్వులలోనికేసరంబులక్రియ భాసురం బగు పలువరుసయుఁ దనవయోరూపంబున కనురూపంబు లగుచుండఁ జెలంగి సెలగొమ్మలెక్కి వ్రేలుచుఁ బలిష్ఠంబు లగుతిర్యక్శాఖలపైఁ ద్రుళ్ళిగింతలు వెట్టుచు నాకుజొంపంబులు సొచ్చి దాఁగుచు నిటు బహువిధంబుల విహరించుచుండునమ్మూషకయోషం జూచి యొక్కమూషకతరుణపురుషుండు వివశాంతఃకరణుం డగుచుఁ జుఱచుఱ నామ్రాఁకు ప్రాఁకి వేగిరపడి చెనకిన నది కినుకతోడ. 19

చ. మద మెదవంగ మూషకకుమారసమూహము వెన్నుసమ్మెటై
పొదవినవాల మార్చుచుఁ బ్రబుద్ధవిటుం డురుధైర్యమూలముల్
చెదరఁగఁ ద్రవ్వఁగోళ్ళఁ గొని చెక్కలి వ్రేసిన మూర్ఛవోయి తాఁ
గదలక యుండె కాముబడిగంటఁ దొడింబడి యున్నకైవడిన్. 20

క. భువి నట్లకాదె యువతియుఁ, గవితయు సహజప్రసంగగతి నొందినచోఁ
దివిరి కడు బల్మి చేసిన, నవి సరసత యుడిగి విరసమయి చను టరుదే. 21

వ. ఇట్లయ్యెలుకతొయ్యలివ్రేటున నోముపడియు సిగ్గువడనేరక యమ్మూషకకుమారుండు దానివెంట,విడువక తగులుచుండె నంత. 22

క. ఒకగృధ్ర మెండిపోయిన, యొకచర్మము గఱచికొనుచు నుడుపథమున రా
నొకభంగిఁ బ్రిదిలి పడి యది, యొకయొండినరివటమీఁద నుండఁగ నెలమిన్. 23

చ. కనుఁగొని మూషకాంగన జగంబున నిట్టిపదార్థ మెన్నఁడుం
గనుఁగొని నేనెఱుంగ నెసకంబున నా కది తెచ్చి యిమ్ము నీ
మనమున నున్నకోరిక సమస్తము దీర్చెద నోపుదేనిఁ బో
మ్మనవుడు నట్లకాక యని యాత్మగతంబున నుబ్బెలర్పఁగన్. 24

ఉ. బాలకి నన్నుఁ బిల్చి పనివంచెఁ గృతార్థుఁడ నైతి నంచు న
య్యాలరియెల్క గంతుగొనినంతనె తుత్తుమురయ్యెఁ గాష్ఠ మా
తోలును దానుఁ గూడ మును దూరపథాగతు లైనమానవుల్
ఱాలత వండికొన్నప్రొయిలోఁ బడి రూపఱఁ గాలె వ్రేల్మిడిన్. 25

ఉ. అప్పుడు వానిఁ జూచి యపహాస్యముఁ జేయుచు బొప్పు జాణపో
తప్పఁగఁ ద్రొక్కినం బడక తక్కునె యెట్టిబలిష్ఠుఁడైన నీ
యొప్పున కా ననుం గవయు నుల్లమునం దమకించె దంచుఁ దా
నొప్పము లెన్నుచుం జనియె సుందరుబాలకి యట్లు గావునన్. 26

క. రమణీజనములదెసఁ గడుఁ, దమకించుట నీతి గాదు తత్త్వజ్ఞునకున్
దమకించి కాదె మూషక, మనులమతీ! యిట్లు పొలిసె నని చెప్పుటయున్. 27

ఉ. నవ్వుచు నింద్రదత్తువదనంబునఁ జూక్కులు నిల్పి 'నీవు నాఁ
డవ్వనజాయతాక్షి హృదయంబున నాదెసఁ గూర్చు నంటి నేఁ
డవ్వచనంబు వో విడిచి యాఱడియాకథ చెప్పి తింక నే
నెవ్వరి నమ్మువాఁడఁ దుది నీ విటు లాడుట మిత్త్రధర్మమే.' 28

చ. అనవుడు రత్నమండనునియాననపద్మము చూచి 'నీవు నా
ఘనకుచ లోను గాదనుట కాదు కడుం దమకంబు లెన్నఁగా
దని యిటు లంటిఁ గాని మనుజాధిపనందన! నందధారుణీ
శున కెఱిఁగించి యంతయును సూత్రము చేసెద నూరకుండుమా.' 29

వ. అని యూఱడించి యంతట నింద్రదత్తుండు మెల్లన యత్తెఱంగు నందనృపతికిం జెప్పిన నిప్పుద్రొక్కిన ట్లదరిపడి కొడుకుకడకుం జనుదెంచి యొడ లంటి చూచి విరహజ్వరంబు భరం బగుటకుం గరంబు బెగడి పుత్త్రు నీక్షించి యి ట్లనియె. 30

క. 'నాపట్టి! యోనిధానమ!, యోపుణ్యపుఁబ్రోక! యోమహోజ్జ్వలతేజో
రూపమ! యేఁ గలుగఁగ నీ, వీపగిదిఁ దపింప నేల యితరులభంగిన్. 31

చ. తలఁచిన నింద్రవహ్నియమదైత్యజలేశసమీరవిత్తపే
శులనగరంబులైన వెసఁ జొచ్చి కలంపుదు నీమనంబు ము
చ్చిలి కొనిచన్న యన్నెలఁతఁ జెచ్చెరఁ దోడ్కొని వత్తు నన్న భూ
స్థలిఁ బెఱయల్పదుర్గము లసాధ్యమె నాకరఖడ్గకేలికిన్. 32

క. ఇది యెంతటిపని చెప్పుకు, మదవారణతురగరథసమాజోద్భటమై
కదలి నడతెంచునెడ నా, కెదు రెవ్వరు సంగరమున నివ్వసుమతిలోన్. 33

సీ. న న్నెదుర్కొని మున్ను వె న్నిచ్చి పాఱినకురుభూపతికంటెఁ గొంకణేంద్రు
కంటె మాగధుకంటెఁ గర్ణాటనృపుకంటెఁ బరగునేపాళభూపాలుకంటె
బంగాళవిభుకంటె బర్బరుకంటె నంధ్రక్షితీశ్వరుకంటె ద్రవిడుకంటె
సౌరాష్ట్రపతికంటె సంఘాతి యెంతవాఁ డటు మాడు వానిసప్తాంగములును

ఆ. గెలుతు నశ్రమమున నెలంతఁ దోఁకొని వచ్చి, యిత్తుఁ దనయ నీకుఁ జిత్త మలర
వగవకుండు' మనుచు నొగి నూఱడించి దర్పంబు మెఱయ సైన్యపతులఁ జూచి.

క. 'మీమీబలములఁ గూర్పుఁడీ, భూమి యద్రువఁ బుండరీకపురపతిపై ను
ద్దామగతి నడుత' మనవుడు, నామాటకుఁ జంద్రవర్మ యనువిప్రుఁ డనున్. 35

ఉ. 'ఏను బురోహితుండ ధరణీశ్వర! యుక్త మెఱింగి నీకుఁ బెం
పూనఁగ విన్నవింపఁ దగు నోలి నుపాయచతుష్టయంబు సాఁ
గా నిది నీతివాక్యము జగంబున సామము వెండి భేదముక్
దానముఁ గోల్పకుండినఁగదా మఱి దండన మూర కేటికిన్.' 36

చ. అనవుడు సమ్మతించి విభుఁ డార్యులఁ బంపుడు వార లేఁగి యి
ట్లనిరి 'ఘనుండు మాళవనృపాగ్రణి నందుఁడు మద్విభుండు ద
త్తనయుండు రత్నమండనుఁ డుదారుఁడు వానికి నీదుకూర్మినం
దన నడుగంగ వచ్చితి ముదాత్తచరిత్ర! కళింగభూవరా!' 37

చ. అనిన నతండు నెమ్మనమునం దొగి మోదము ఖేదముం బెనం
గొనఁగఁ బురోహితుం బిలిచి 'కోమలిజన్మఫలంబు మీకుఁ దోఁ
చిన తెఱఁ గంతయుం దెలియఁ జెప్పుఁడు వీరికి వీరు సమ్మతిం
చినయటులైన లెస్స యఱ చేసిన దోషము వచ్చు' నావుడున్. 38

వ. అతం డక్కన్నియ జన్మించిననాఁ డప్పుడమితేఁడు వినంగనెట్లు చెప్పెనట్ల పెండ్లి
దొరలతోడనుం జెప్పి ప్రియోక్తిగా నిట్లనియె. 39

ఉ. 'నందననేంద్రనందనుఁడు నాయకుఁ డౌటకుఁ బుష్పగంధి త
త్సుందరి యౌటకుం బరమశోభనసంపద మద్గృహంబునం
బొందుటకుం బ్రమోదరససింధుతరంగల నోలలాడ మే
యిందఱుఁ బాపజాతివిధి యిట్టియరిష్ట మొనర్పకుండినన్.' 40

క. అని పల్కిన 'నిది యల్పపుఁ బనియె విచారించి చూడఁ బాడియ కాదే
యనుపుఁ డిదె పోయివచ్చెద,' మని జనపతితోడఁ జెప్పి రప్పెండ్లిదొరల్. 41

ఆ. మరలి పోయి నందధరణీశుతోడఁ జెప్పినఁ దలంకి యిట్టులనియె నాత్రఁ
'దద్ది రన్న చచ్చునంతటికల గన్న, నోలి మేలుకొనియె యుండవలయు. 42

ఉ. ఎక్కడిపుష్పగంధి మఱి యెక్కటిమత్సుతుఁ డేమి గాఁగ నీ
మక్కువ లుల్లసిల్లఁ గొఱమాలినదైవము ద్రిప్పి ద్రిప్పి పెక్
జిక్కులఁ బెట్టె నే నెటులు చేయుదు దుఃఖము చూచి చూచి యా
దిక్కటు లుండ నిండు సుగతిం బెఱచోటుల లేరె కన్నియల్.' 43

చ. అనవుడు రత్నమండనుఁ డనంగశిలీముఖపాతభీతుఁడై
జనకునిఁ జూచి 'తక్కుటివిచారము లేటికిఁ బుష్పగంధికై
తను వెటు లైన నేమి వసుధం బెఱరాజతనూజ లేల యి
య్యనిమిషనాథుపుత్త్రి దెస నైన నను సాహ్వానయంబు నిల్పునే. 44

సీ. ఆపద్మముఖిఁ బాసి యేపోఁడిమియు లేక పచ్చవిల్తునిచేతఁ జచ్చుకంటె
నిగ్రహం బేడ పాణిగ్రహోత్సవసౌఖ్య మాపోవఁ దొలితొలి ననుభవింతు
నటమీఁద బ్రతుకు దైవాధీన మెట్లయ్యె నయ్యెఁ గా కేమి సేయంగ వచ్చుఁ
జావు లేకుండ నాజముచేత నాకుఁ దెచ్చినవారు గలరె యీసృష్టియందు
ఆ. నుడుము నడికి యున్న నడుఁకునె బడె పెట్టు, వీరలెల్ల నీలివిదులు గారె
దూరభీతిఁ జేసి చేరువ నగుకీడు, తప్పఁ ద్రోచువెరవు చెప్పఁగలరె'. 45

చ. అని కడుఁ దెంపు చేసి సుతుఁ డాడినమాటకు మాఱు పల్కనే
రనిమొగమోట నానృపతిరత్నము కొండొక వెచ్చనూర్చి నె
మ్మన మెరియంగ భూసురసమాజముఁ గన్గొని దీనభావ మా
ననమునఁ దోఁప మేనఁ జలనంబు గడుం బొదలంగ ని ట్లనున్. 46

క. 'ఓవిప్రవర్యులార! మ, దావాసమునందుఁ జెందునశుభంబులఁ బోఁ
ద్రోవను సంతతశుభములు, గావింపను మీర కారె కర్తలు మాకున్. 47

ఉ. కావున మాకు నేమ మగుకార్యము నేర్పడఁ జెప్పఁ' డన్న నా
భూమిబుధాగ్రగణ్యులు ప్రభూతమతిం దలపోసి చూచి 'దే
వా! వెఱఁగంద నేటికి భవత్తనయుండు గుణాధికుండు మా
దీవనఁ బెక్కువర్షములు తేజ మెలర్పఁగ జీవితుం డగున్. 48

వ. ఇతనివేడుక చెడకుండున ట్లనుసంధింపుదుగాక' యనిన నతండి ట్లను 'రోగి యపథ్య భక్ష్యంబు లపేక్షించినఁ బెట్టవచ్చునె యెఱింగియుండియు లోఁతులేదు చొర మన్నట్లు చేసితి రేమనవచ్చు బ్రాహ్మణులు భోజనసహాయులుగాని కార్యసహాయులు గారనుట తేటపఱచితి' రనినఁ దమమాట వితథంబు గాకుండ విప్రమాహాత్మ్యంబు వినిపింపఁదలంచి చంద్రశర్మ యి ట్లనియె. 49

ఆ. 'విను జనార్దనుండు విప్రవాక్యంబు చే, పట్టి నడుచు నెల్లపనులయందు
విప్రవాక్యమునకు వేదవాక్యమునకు, భేద మేమి లేదు మేదినీశ! 50

క. విప్రుఁడు సాక్షాద్దైవము, విప్రవచన మేల తప్పు విప్రాశీర్వా
దప్రాప్తి నొక్కనరుఁడున్, క్షిప్రమె యొకమృత్యుబాధ గెల్చుట వినవే. 51

క. ఆకర్ణింపుము చెప్పెద, నాకథ నేపాళదేశమందు నుదాత్త
శ్లోకుఁడు భద్రకుఁ డనునొక, భూకాంతాధిపుఁడు వేఁట వోయినచోటన్. 52

ఉ. చేరువఁ బక్షి పల్కె నృపశేఖరుఁ 'డిప్పులుఁ గేమి పల్కెఁ బెం
పారఁగఁ జెప్పుమా' చడిగె నాశకునజ్ఞుని వాఁడు చెప్పెఁ ద
త్కారణమయ్య! నీకుఁ బనిగా దొకశూద్రుఁడు కొండపూరికిన్
బోరనఁ బోవులోన మృతిఁ బొందుఁ బథంబున సర్పదష్టుఁడై 53

క. వాఁ డల్లవాఁడె పోయెడు, నేఁ డతనికి వీడువోలు నిజముగ నీ వా
ప్రోఁడిమి చూచెద వే నొక, నాఁడో నిటు నిల్చి చూడు నరవరతిలకా!' 54

చ. అని యొకకాఁపుఁ జూపి యిటు లాడినపంతపుమాట లేర్పడ
న్విని ధరణీవిభుం డతనినిక్కముఁ గల్లయుఁ జూత మంచు నె
మ్మనమునఁ గౌతుకం బెసఁగ మంత్రులుఁ దానును నవ్వనంబులో
నెసఁగినచూతపోతముల నింపగునీడ వసించి యుండఁగన్. 55

క. కొండొకతడవున కాతఁడు, కొండకసవుఁ జాలఁ గోసికొని రయమున నం
దుండి మరలి చనుదెంచుచు, నుండఁగ శకునజ్ఞుఁ జూచి యుల్లస మెసఁగన్. 56

క. 'చచ్చినవారలు గ్రమ్మఱ, వచ్చుట గడుచిత్ర మల్లవాఁ డదె కంటే
చచ్చినఁ బచ్చనికస విటు దెచ్చుచు నున్నాఁడు వాని తెఱఁ గేదియొకో'. 57

సీ. చంపంగవచ్చినజముని దూతలకు లంచము పెట్టి వచ్చెనో చావ నొల్లఁ
బొమ్మని మోఱకంబునఁ ద్రోచి వచ్చెనో యింటివారికిఁ జెప్ప కిచటఁ జచ్చి
నట్లైన గోపింతు రని చెప్ప వచ్చెనో వీని పెంజెమట నవ్విషము గరఁగి
వడిసెనో సర్వంబు వాతప్పిపోయెనో శకునంపుఁబులుఁగు లీసారి భ్రమసి
ఆ. తప్పఁ జెప్పెనో యితం డేమి విధమునఁ, బ్రతికి వచ్చె' ననినఁ 'బార్థివేంద్ర!
యవధరింపు మింత యణకింప నేల నీ, బంటుపాత' మనుచుఁ బలికె నతఁడు. 58

క. 'ఓకాఁప! యిందు' రమ్మని, సాకతమునఁ జేరఁబిలిచి శకునవిధిజ్ఞుం
డాకసవుకట్టు డించి య, నాకులమతి విచ్చి చూడ నప్పుడు నడుమన్. 59

*క. కక్కులకొడవలిపోలెం, జక్కఁగఁ జెగియున్న క్రూరసర్పమువదనం
బొక్కటి యుండఁగఁ గన్గొని, యక్కజముగఁ బలికిఁ జూపి యతఁ డిట్లనియెన్. 60

ఆ. వీనిఁ జంప వచ్చి విషధరం బీభంగి, తానె పొలిసిపోయె ధరణినాథ
చూడు మితఁ డిఁకేమి సుకృతంబు చేసెనో, కాక దీనిబాఁతిఁ గడచె నిట్లు. 61

క. అని యాకర్షకువదనముఁ, గనుఁగొని యోయన్న నీవు కసవుకుఁ జనుచోఁ
గనినవిశేషముఁ గలదే, యనవుడు వెడచవ్వు నవ్వు చతఁ డిట్లనియెన్. 62

---

*కక్కులకొడవలి పోలెన్. శ. ర. పా. కక్కులకొడవటి కాపయి. చి. ని పా. సూ. ని. పా.

ఆ. 'ఏము కాఁపువార మెద్దుల మే మెఱుఁగుదుము తండ్రి యల్లకొండచెంత
నడుచు బాపనయ్య నా కెదురయ్యెఁ దా, మూఁతకోల చేత మూఁదికొనుచు. 63

క. కనియొకటోహో ర్వెట్టిన, నను దీవించుచును బోయె నాకన్నదిగా
విను మిది యొక్కటి యెయ్యది,యును మఱి లేదనిన నాతఁ డుల్లము వొదలన్.

క. భద్రకుని జూచి 'వింటే, శూద్రుని వచనంబు సద్విజునిదీవన నీ
కౌద్రభుజంగముచేతిగ్రుడ్డువ్రద్రవమునఁ బడక పీఁడు బ్రతుకుట కంటే. 65

ఉ. ఊరక గేలి చేసితి నృపోత్తమ! నాశకునంబు దప్పునే
వారిజసంభవుండు మును వ్రాసినవ్రాఁతయు వమ్ము సేయఁ గా
నేరుపుఁ గల్గి యుండు ధరణీసురకోటికి నెందుఁ గ్రొత్తయే
వారికృపావిశేషమున వచ్చినయాయువు మూవె పీనికిన్. 66

సీ. ఆదిశంభునితోడ వాదించి యఱకాలఁ గన్ను చూపించఁడే గౌతముండు
వైకుంఠనిలయునివక్షఃప్రదేశంబు తెగువమైఁ దన్నఁడే భృగుమునీంద్రుఁ
డంబుధిజల మెల్ల నఱచేతిలోనికిఁ గొనివచ్చి త్రాగఁడే కుంభజుండు
మార్తాండబింబుమాఱుగా నుడుపీథిఁ దనదండ మునుపఁడే ముని వసిష్ఠుఁ

తే. డింద్రుతోసాటిగాఁగఁ బక్షీంద్రుఁ దొల్లి,సృజనసేయఁడేయావిశ్వసృజుఁ డగడఁగి
వాలి విప్రుల గెల్వ నెవ్వరికి నైన, నలవి గా దిది నిక్కువ మవనినాథ. 67

ఆ. అలమృకండుసుతున కల్పాయు వని మున్ను, వ్రాసె బ్రహ్మ యతనివ్రాఁత లెల్లఁ
జెంపు చేసి విప్రుదీవన నతఁ డిట్టి,బ్రతుకు బ్రతికె వినవె పార్థివేంద్ర! 68

వ. కావున బ్రాహ్మణాశీర్వాదం బాసన్నమృత్యునివారణం'బనిన విని సంతోషించి 'యది
యట్టిద కాదె! బ్రాహ్మణులు భూదేవతల కారె! వారివాక్యం బేల తప్పు' నని కొని
యాడి భద్రకధరణిపాలుండు శకునజ్ఞునకుం బసదనం బొసంగి యథేచ్ఛం జనియె
నాశూద్రుండును నాయుష్మంతుండై బ్రతికె న ట్లగుటం జేసి. 69

ఆ. 'విప్రభక్తి గలఁడు వినుము నీతనయుఁ డాతనికి ధర్మదేవతయు సహాయ
మొనరఁ గలదు గాని యొండు గానేర దీ,సంశయంబు విడువు జనవరేణ్య!' 70

వ. అనిన నవ్విప్రోత్తములమాట తనకొడుకుబ్రతుకువృద్ధికిం బూఁటగా మైకొనిరత్నపు
రాధీశుం డాపుండరీకపురాధీశుతో వియ్య మంద నియ్యకొనియె నయ్యవసరంబున. .

సీ. 'మాతండ్రిచిత్త మేమాడ్కియో? మంత్రు లేమని విన్నవింతురో? ఘనులు భూసు
రోత్తము లేమందురో? సఖులు మద్బంధుజనులు నంతఃపురసతులుఁ జిత్త
ముల నెద్ది కర్తవ్యముగ విచారింతురో? వైవాహికోత్సవవైభవంబు
నాకు సిద్ధించునో? నడుమనె పోవునో? కటకటా! యోపుష్పగంధి! నేఁ డిఁ

ఆ. కేమి సేతు నీకు నేమన్న ఘనిచేతఁ, జిక్కువడితి' నంచుఁ బెక్కుభంగు
లందు వనరుచున్నయారాజనందను, వంత యంతయును బ్రశాంతమయ్యె. 72

సీ. అంత నెంతయు వేడ్క నమ్మహీకాంతుఁ డాధరణీశుపాలికిఁ దనదుదొరలఁ
గ్రమ్మఱఁ బనుప నక్కాళింగుఁ డిట్లను 'నిది యేమి చెప్పుఁడా యెఱిఁగి యెఱిఁగి
తగునయ్య తనయట్టిత త్త్వజ్ఞునకు నిట్టిసాహసం బీయింతిజన్మఫలము
వినియును నిక్కార్యమున కిచ్ఛగించుట పులియున్నపొదరింటిపొంతఁ జనుట

ఆ. కీడు సర్పమున్నగృహమున నుండుట, దహనదహ్యమానదావవీథిఁ
దఱియఁబడుటగాదె యెఱుక లేసందమే, మానవేశ్వరుండు మహితయశుఁడు.' 73

క. నావుడు 'మానరనాథుఁడు, గేవలపురుషుండె వాఁడు కీడొందుపనుల్
గావించునె మది బెదరంగా వల' దని చెప్పి దొరలు గైకొలుప్రటయున్. 74

క. విరహాజ్వరోపశాంతికి, నిరుపమకల్యాణకరణనిర్విఘ్నతకున్
హరిహరసూనుల వేఁడెదు, తరుణికి సంతోషరసము దైవాఱె మనిన్. 75

క. ఆవార్త విని ముదంబునఁ, బూవిల్తుని గెల్వఁగంటిఁ బొమ్మని నంద
త్త్మావరపుత్రుఁడు జనకా, జ్ఞావశతఁ బ్రయాణభేరి చఱపం బనిచెన్. 76

చ. కలఁగెఁ బయోనిధు ల్గిరులు గంపము నొందెఁ జలించె భూమి ది
క్కులు వడఁకెన్ వియత్తలము గుబ్బటిలెన్ గ్రహతారకంబు లు
త్తలపడఁ జొచ్చె నచ్యుతపితామహశంభుదిగ్గజ లాత్మకాం
తల నుపగూహనక్రియకుఁ దార్చిరి బెగ్గిలకుండ నాధ్వనిన్. 77

క. పురజనులును బరిజనులును, బరమోత్సవలీలఁ బొదవఁ బయనపుసిరిఁ బొం
పిరి వోవఁ గదలె నతఁ డం,బరచుంబిపతాకికాతపత్రము లమరన్. 78

ఉ. రాజతనూజసేనలభరంబున మేదిని యొడ్డగిల్లె నా
భూజము లెల్లఁ బెల్లొరగి పొల్పువహించె వివాహదర్శన
భ్రాజిమహాకుతూహలపరంపర లాత్మలయందు మిక్కుటం
బై జనియింపఁ బినం గదలి యద్దెసఁ దోఁపఁ గణంగెనో యనన్. 79

క. క్షితిపతిసుతుసైన్యపదా, హతిరేణువు మిన్ను ముట్టె నాత్మీయులయు
న్నతిఁ గనుఁగొనిరండని భూ,సతి సురసంతతికిఁ జెప్పఁ జనియె ననంగన్. 80

క. అతని చమూనినదములకుఁ, బ్రతిధ్వనులు చెలఁగె నఖిలపర్వతములఁ ద
ద్వితతవివాహోత్సవము, చితవాక్యము లెల్లచోటఁ జెలఁగె ననంగన్. 81

వ. ఇవ్విధమున నక్కుమారుం డపారవిభవోదారుం డగుచు నరిగి కాంతం బగుపుండరీక
పురప్రాంతంబు చేరునవసరంబున, 82

చ. నదు లరుదేర నయ్యుదధినాథుఁడు వెన్నెలరేలు సమ్మదం
బొదవ నెదుర్కొనం గడఁగు నోజ నృపాలతనూజసైన్యసం
పదలకుఁ బుండరీకపురభర్త సముజ్జ్వలసైన్యయుక్తుఁడై
యెదురుగ వచ్చి కూర్చుకొని యేఁగెఁ జెలంగఁగ హృద్యవాద్యముల్. 83

క. తేఁకువ యలరఁగ నీగతి, దోఁకొని చని చదల రత్నతోరణదీప్తుల్
ప్రాఁకెడుఘనగృహముల న,మ్మూఁకల విడియించె రాజముఖ్యుం డంతన్. 84

సీ. పుణ్యనిర్మలజలంబులను సుస్నాతుఁడై కడియొత్తి విమలవస్త్రములు దాల్చి
కస్తూరికామిశ్రగంధంబు మై నిండ నలఁది మాణిక్యమయంబు లైన
కంకణాంగదహారకర్ణావతంసాదికలితభూషణముల నలరఁ దొడిగి
యంచితసౌరభోదంచితకించిదుత్ఫుల్లనానావిధపుష్పదామ

ఆ. కములు దసరఁ బూని కళ్యాణచిహ్నలు, గొమరుమిగుల మంచుఁగొండయింటఁ
బరిణయముగ నరుగుపరమేశ్వరుండును, బోలె నొప్పె నానృపాలసుతుఁడు. 85

క. ముందరఁ బురోహితుండు పి,ఱుంద సచివుఁ డాయంధపుమెఱుంగులు మెఱయన్
గొందఱుభటు లిరుగెలఁకుల, దందడి నడతేర వందితతి నుతియింపన్. 86

క. భేరీజయఘంటాదిమ,హారావములును వసుంధరామరవిజయా
శీరుక్తసుశబ్దములును, గౌరీకళ్యాణవిభవగానధ్వనులున్. 87

ఉ. పౌరులసాధువాదములు బాంధవకోటిప్రమోదభాషలుం
వారవధూవిదూషకజనంబులనాగరికంపుమాటలుం
బేరడియై దిగంతములఁ బిక్కటిలంగ నపారవైభవో
దారత యుల్లసిల్లఁగ నతం డరుదెంచె వివాహవేదికిన్. 88

ఉ. అప్పుడు బిట్టుబిర్ర విభుఁ డాతరుణిం గనుఁగొన్నఁ బువ్వుఁదే
రుప్పరవీథిఁ దోలుకొని యుగ్రగతిం బఱతెంచి కాముఁ డే
చొప్పునఁ జూపునో తనప్రసూనశరంబులవాఁడి యంచు వా
తప్పక చాటువెట్టినవిధంబున నత్తెర యెత్తి రత్తఱిన్. 89

చ. ఫలములఁ బుష్పజాతులును బ్రాలును నాడిగఁ బైఁడిపళ్లెరం
బులు నినుపార నించుకొని పుణ్యసతీనివహంబు శోభనం
బలవడఁ జూడఁగాఁ గరతలాత్తపాత్రిక లొప్పఁ గొంద ఱు
మ్మలు లటు చేరి సేస లిడఁగాఁ జెలు వొందుచు నవ్వధూవరుల్. 90

క. ఉప్పొంగెడువేడ్కలఁ గను, ఱెప్ప లిడక తృష్ణ లఱిముఱిం బైకొనఁగాఁ
దప్పక కనుఁగొన నబ్బుట, యెప్పుడొకో మాకు ననుచు నెదఁ గోరంగన్. 91

వ. తదుత్సవానందరసనిమగ్నం బగుతద్వియోగాగ్నిపుంజంబునుం బోలె శుభలగ్నోదయసమయసూచకం బగుచు జలంబులందు మునుంగుతామ్రఘటికాపాత్ర నిరీక్షించి మంగళాశీర్వాదపురస్సరంబుగా సుముహూర్తం బనుచు మౌహూర్తికుండు జయఘంటపై నక్షతలు చల్లిన. 92

ఉ. కంగున ఘంటపైఁ గోడుపు గ్రక్కున వైచుడుఁ దూర్యనాదముల్
నింగియు దిక్తటంబులును నిండఁగ విప్రులవేదనాద ము
ప్పొంగి చెలంగుచుండఁ దెర వుచ్చిన ముచ్చట వోపఁ జూచి ర
య్యంగజుఁ డార్వ నొండొరులయాననపద్మము లావధూవరుల్. 93

క. చల్లపడగొన్నచూపులు, పెల్లున నొండొరులవదనబింబంబులు శో
భిల్లె నెలజేటికదుపులఁ, జల్లికలం గలియువికచజలజములక్రియన్. 94

ఉ. అంతఁ బురోహితానుమతి నక్షతపాత్రలు సేరఁ దేర న
కాంతయుఁ గాంతుఁడుఁ ముఖవికాసము లొప్పఁగ దోయిలించి య
త్యంతపుఁబ్రీతి నొండొరులయౌదలలం దలఁబ్రాలు వోసి రం
తంతకు మేనులందుఁ బులకాంకురజాలము లుల్లసిల్లఁగన్. 95

తే. పోలఁతి ప్రాణేశుతలఁబ్రాలు పోయునపుడు, సిగ్గునెపమునఁ దనదుదోసిలియొకింత
తడవునకుఁగాని వదలదు తచ్ఛిరోజ, కరసరోజసంస్పర్శసౌఖ్యంబు మరిగి. 96

క. తలఁబ్రాలు పోయుచో నవి, తలవెండ్రుక లింత సోఁకి తనదగుబాహాం
గుళములు దక్కటియంగం, బుల కెక్కటి సేయ రాజపుత్రుఁడు మెఱసెన్. 97

క. గుణమణియుత యగుసతిలక్షణ మది ప్రాణేశ్వరునకు శాశ్వతసుఖకా
రణ మని యిటు చేసె ననఁగ, గుణమణియుతఁ జేసె విభుఁడు కోమలి నంతన్. 98

చ. అతనుని గెల్తు నీసతి సహాస్థితి గల్గిన నంచునో పురా
కృతసుకృతోపభోగతతికిం గుదు రీసతి యంచునో యనా
గతఘనదుర్దశం దలఁగఁగా దెర వీసతి గాంచు నంచునో
యతఁ డిటు చేసె నాఁగఁ దరలేక్షణ హస్తముఁ బట్టెఁ బ్రీతితోన్. 99

వ. ఇవ్విధంబున నప్పల్లవపాణిం బాణిగ్రహణంబు చేసి శచీసమన్వితుం డగుశతక్రతుండునుం బోలె ననుపమతేజోవిశేషవిరాజితుం డగుచు నారాజసుతుండు మణికలితకనకాసనాసీనుండై సముచితప్రకారంబున హోమతంత్రంబుదీర్చి విప్రజనంబులం దాంబూలాదిధనసత్కారంబులఁ బరితృప్తులం జేసి తదాశీర్వచననిచయంబు వడసి యుండునెడ నాదంపతులకు నుభయపక్షంబులబంధువులు నంబరాభరణాదుల నిచ్చిరి తదనంతరంబ. 100

శా. జామాతృప్రముఖప్రభూత్తమజనుల్ సంతృప్తి లౌనట్టు గా
హేమాపాత్రములన్ జతుర్విధముత్తై యింపారు నాహారముల్
ప్రేమాధిక్య మెలర్ప షడ్విధరసోపేతంబు గాఁ బెట్టె సు
త్రామానోకహవైభవం బెసఁగ సాధ్వాత్రీశుఁ డత్యున్నతిన్. 101

ఉ. మీఱినయన్నశైలములమీఁద సమగ్రఘృతప్రవాహముల్
పాఱఁగ యానపాత్రములభంగి నపూపము లొప్పె నెవ్వరున్
మాఱిడనీక కందనియుమాత్రగఁ బాత్రలయందు నిండి దై
వాఱెఁ బదార్థసంఘములు ప్రాలిగ నవ్విభు పెండ్లియామె తన్. 102

వ. అయ్యవసరంబున. 103

తే. నేఁటిపట్టునఁ బగ లింత నిడివియైన, సంగసాలింగనోత్సవాభ్యర్థియైన
యానృపాత్మజుఁ డెట్లోర్చు ననుచు నర్కుఁ, డతని కవకాశమిచ్చినయట్లుగ్రుంకె.

క. దంపతులరాగరసములఁ బెంపో మన్మథతమంబు పెంపో యనఁగా
సొం పగుసంధ్యారాగప, రంపరయును జీకువాలుఁ బ్రబ్బెఁ బయిపయిన్. 105

వ తదనంతరసమయంబున. 106

చ. జనఘభవాండ మొప్పెఁ గలశంబువిధంబున నందులోన ను
జ్జ్వల మగుచంద్రికాపటలి సన్నుతి కెక్కెఁ బయఃప్రపూరమై
లలితకలాకలాపసదలంకృతచారుసుధామరీచి యిం
పులగని యై తనర్చెఁ, బయిఁ బొంపిరి గట్టినమీఁగడో యనన్. 107

క. ఆరాత్రి పుష్పగంధికి, గారవమున జలకమార్చి కై సేసి సఖుల్
కోరి నృపాత్మజు శయ్యా, గారమునకు దెచ్చి యతనిఁ గదియించుటయున్. 108

సీ. జలజాక్షిఁ దన్ను నచ్చెలులు పానుపుమీఁద నునుచుచోఁ బెనఁగక పెనఁగుటయును
సెజ్జకువచ్చియుఁ జెలులు నవ్వెద రని మోమెత్తగా నోడుముగ్ధతనము
నొక్కొకపనివెంట నువిద లేఁగినఁ జిత్త మూటాడుచుండంగ నుండుటయును
జిట్టాటుచేతల సిగ్గు కీ లెడలించి పలికింప నల్లనఁ బలుకుటయును
తే. దనువు పులకింప నధరామృతంబుఁ గ్రోలి, కౌఁగిలించిన మర్మంబు కరఁగుటయును
దనకు నత్యంతసౌఖ్యప్రదంబు లగుచు, నలర సురతోత్సవాబ్ధి నోలాడె విభుఁడు.

ఆ. ప్రథమరతమునందుఁ బంచసాయకతంత్ర, మంతవట్టుఁ దనకు నవగతముగ
నభ్యసించె ననఁగ నయ్యింతి భర్తచి, త్తంబు పట్టు బహువిధంబులందు. 110

ఆ. బాహ్యరతులఁ దొలుత బాలకిఁ గరఁగించి, కూటమందు గెలుపుఁ గొందు ననుచుఁ
గదిసి విభుఁడు దాన కరఁగఁ జొచ్చెఁ బరస్పరానురాగమహిమ యడుగ నేల. 111

క. సమకాలసురతతంత్రము, క్రమమునఁ గౌఁగిళ్ళ బిగియ జంపతులకరీ
రము లొప్పె నందుఁ గరఁగిన, కమనీయసువర్ణపుత్రికలచందమునన్. 112

వ. ఇట్లు లబ్ధమనోరథుండై యారత్నమండనుండు కతిపయదినంబులకు సంపాతినృపతి చేత సత్కృతుండై యపారవిభవం బారఁ బుష్పగంధినిం దోడ్కొని తనపట్టణం బున కరిగి నందమహారాజునకు నంబికాదేవికి నమస్కరించి యథాసుఖవిహారంబుల నుండియుండె నొక్కనాఁడు. 113

క. సూరుఁడు రమ్యారామవి, హారంబున మెఱయుమాడ్కి నప్పురిసరకాం
తారమున కేఁగి ధీరో, దారుఁడు రాకొమరుఁ డేకతమున మెలంగన్. 114

ఉ. క్రూరపుఁజూపులు న్నిడుపకోఱలు నుగ్రపుమోము నెత్తుటం
జేరినకోరమీసములు బిఱ్ఱినవెండ్రుకలుం గృశత్వముం
గూరినదేహము న్వెడఁదకుక్షియు ఘోరరవంబు గల్గియే
పారినబ్రహ్మరాక్షసుఁ డుదగ్రబలుం డొకఁ డవ్వనంబులోన్. 115

చ. ఉరుధరణీజశాఖపయినుండి ఘనధ్వనిఁ దన్నుఁ బిల్వ సుం
దరతరవక్త్ర మెత్తి వెసఁ దప్పక చూచి కుమారుఁ డాత్మన
చ్చెరువడి పుష్పగంధికయి చెప్పినయప్పలుకు ల్దలంచి 'యె
వ్వరికిని మీఱరాదు జడుం వ్రాసినవ్రా' లనుమాట దప్పునే. 116

ఆ. అలతాంగిఁ బెండ్లియాడి తొమ్మిదిప్రొద్దు, లయ్యె నేఁటితోడ నది నిమిత్త
మై కదా భయంకరాకృతితోఁ బొడచూపె బ్రహ్మరాక్షసుండు నేఁడు. 117

క. అని కొండొక చింతింపఁగ, ననుమానం బేల నాకు నాహారముగా
నిను నియమించె నజుఁడు రమ్మని వెండియుఁ బిల్చె నాతఁ డాగ్రహ మెసఁగన్.

వ. ఇట్లు నెట్టుకొని పిల్చుచున్న బ్రహ్మరాక్షసునకు ధైర్యగుణమండనుం డగురత్న మండనుండు సవినయంబుగా నిట్లనియె 'నయ్యా! నీయానతి నేనుఁ జేసెద నాకొక్క విన్నపంబు గల దది యాకర్ణింపుము. 119

సీ. మీను బోయినజాడ యెఱుఁగక నాతల్లిదండ్రులు నెంతయుఁ దల్లడిలుచు
నుండుదురో నన్ను నోరంతప్రొద్దును నెత్తి పెంచినదాది యెంత వగచు
చుండునో నాచేయునుద్యోగముల కెల్ల ననుకూలుఁడై వచ్చునాప్తుఁ డింద్ర
దత్తుఁడు దా నెంత తలఁచునో నాకు వోసిలియొగ్గి యేసౌఖ్యములును లేక

ఆ. పుష్పగంధి యెంత పొగలునో యేఁ బోయి, వారి కెల్ల నుచితవచనరచనఁ
జేసి యూఱడించి శిక్షింప వత్తు నీయానతి నన్నుఁ బనుపు' మనిన నతఁడు. 120

తే. 'అపుర!పులిచేతఁ జిక్కినయతఁడు విడిచి, 'పోయి క్రమ్మఱ వచ్చుట బొంకు గాదె
తళియఁ బెట్టినయశనంబు తలఁగఁ ద్రోచి,పిదపఁగుడిచెద ననువాఁడు బేలకాఁడె. 121

క. అది గాక నీవు చని వచ్చెద ననుటయుఁ బిదప నీవు చేరెద వని నే
వదలుటయును నయుక్తంబులు, చదురుఁడ వగుదేని రమ్ము చయ్యనఁ గదియన్'. 122

చ. అనవుడు 'సోమహాత్మ! యిటు లాడఁగ నేటికి నీదుసమ్ముఖం
బున నిటుపల్కి నాకు మఱి బొంకఁగ వచ్చునె సర్వజీవులం
దును మనుజత్వసిద్ధి గడుదుర్లభ మట్టిమనుష్యదేహ మె
త్తినతఁడు గల్లలాడి సుగతిచ్యుతి నొందునె యెట్టినీచుఁడున్. 123

ఉ. కావున నాకు బొంకు పలుకం బనిలేదు వృథా వినాశమై
పోవఁగ నున్నయీచెనఁటిబొంది భవాదృశు లైన పెద్ద లా
పోవఁగ నారగించుటకుఁ బూని సమర్పణ చేయరావొకో'
నావుడు నాతఁ డుగ్రముగ నవ్వి 'యివేటికి నిన్నిమాటలున్. 124

క. ప్రత్యయపరిపాలకుఁ డగు, నత్యుత్తముఁ డెచటఁ గల్లు నప్పటిపనికై
సత్యోక్తులు పచరింపఁగ, నత్యాచారంబు మది ననాచార మగున్'. 125

వ. అనిన నతం డతని కి ట్లనియె. 126

క. 'మనుజుఁడ సత్సంగతి గల, మనుజేంద్రసుతుండఁ గల్ల మాటాడెదనే
మును తిర్యగ్జాతి యనం, జనుధేనువు సత్యనిష్ఠ సల్పుట వినవే'. 127

క. అనవుడు 'నాకథ యెట్టిది, వినవలయుం జెప్పు' మనిన 'విప్రవరేణ్యా!
విను' మనుచు రత్నమాఁడఁడు, డెనయంగా నతనితోడ నిట్లని చెప్పెన్. 128

సీ. 'ఒకవిప్రవర్యునిహోమధేనువు నిత్యసత్యవర్తిని సదాచారమూర్తి
కలహంబునకుఁ బోదు కలిగినంతనె తుష్టి నొందు సందడి కోర్చు నుఱుకువేయ
వలవదు పిదుకుచో వరవృష్టిధారలచెలువునఁ జన్నులు చేఁపి కురియుఁ
దెవు లెఱుంగదు రొమ్ముతీండ్రసాలఁగఁ గల్గి కురుమట్టమై చాలఁ గూడియుండు
తే నిట్టిగోరత్న మొక్కనాఁ డేకతంబ, పోకు మేయుచు నుండ బెబ్బులి యొకండు
దానిఁ గనిపొంచియొకతెల్లదాఁచివాలు, మవనిఁదాటించుచును వ్రేయనదరుటయును.

క. కళవళము లేక యోహో, నిలునిలు మని సురభి యిట్లనియెఁ జయ్యన న
ప్పులితో' నా కొకచన వీ, వలయును వివేకించి నాదు వాక్యము వినుమా'. 130

క. అనినఁ బులి గోవుపై నె, త్తినకేలును భీషణాకృతియుఁ బటమున వ్రా
సినచిత్తరురూపువిధం, బున ఖచరుల కద్భుతంబు పొదలఁగ నుండెన్. 131

చ. పులియటె దీపనానలముపొంగగ మ్రోఁగుచు నున్కి యట్టె యి
మ్ముల నొకపాడిగో వపుడు ముందటికిం జనుదెంచునట్టె పో
నిలు మనినం బయిం బడక నిల్చి కనుంగొనునట్టెబాపురే
కలఁగక యాడుమాట లయకాలుని నైన శమింపఁ జేయదే. 132

వ. ఇట్లు నిల్చి యప్పుండరీకం బాఘేయువున కిట్లను 'నామిషార్థినై వచ్చిన న్నిట్లు వారింపఁ గారణం బేమి? నీ వేమి చెప్పెదు? చెప్పు' మనిన నది దాని కిట్లనియె. 133

చ. 'మునుమును బుట్టె నాకు నొకముద్దులపట్టి యతండు పుట్టి యే
డెనిమిదినాళ్ళపాటి గలఁ డింతియ పూరియు మేయ నేరఁ డే
జని కడుపారఁ జన్ గుడిపి చయ్యన వచ్చెద నన్నుఁ బోయి ర
మ్మని సుకృతంబు గట్టికొనవన్న దయాగుణ ముల్లసిల్లఁగన్'. 134

వ. అని వల్కుచుఁ దనలోన నిట్లని విచారించుచు. 135

క. 'రేపు చను గుడిపి వచ్చితి, నేపున నందంద పరువు లిడి యంతటిలో
నాపుడిసెఁడు నఱిగినఁ గొడు, కేపాటులఁ బడునొ వాని కెయ్యది గతియో. 136

క. ఏ నట్టు నాకుచుండఁగఁ, దా నను నండ గొని చెవులు దాల వయిచుచున్
మే నెఱుఁగక యుండెడు నా, తానకు నెవ్వారు దిక్కొకో యిటమీఁదన్. 137

సీ. నన్నుఁ గానక పోయి నాపుత్త్రుఁ డేయావుపొదుగైనఁ దొడుకంగఁ గుదిలికొనుచుఁ
గొమ్మున నదరంటఁ జిమ్మునో సుడిసిన నడ్డంబు దాఁకునో గొడ్డుటావు
లుగ్రమహోక్షంబు లొండొంటిఁ దొడరుచోఁ ద్రొక్కునో జఠరాగ్నిఁ బొక్కి పడుచుఁ
బొరుగిండులకు నొంటిఁ బోవఁ గుక్కలు దోలికఱచునో గతినాలి యఱచుకొనుచుఁ
ఆ. దిరిగి తిరిగి యధికదీనవక్త్రముతోడఁ, దోఁట దొడ్డి చొరఁగఁ దోలఁబోయి
పడుచు పైద వెంటఁబడి నొవ్వ నడుచునో, యేమి సేతు' నంచుఁ బ్రేముడించు. 138

వ. అంతఁ దనయంతరంగం బంత యెఱింగిన నవ్వాలి సంశయించునో యనుతత్తఱంబు నం జిత్తం బొక్కింత చేసికొని వైవర్ణ్యంబు దోఁపనీక క్రమ్మఱ నమ్మొద విట్లనియె.

ఉ. 'గుమ్మెడుపాల నాసుతునకుం బరితృప్తి జనించుఁగాని మాం
సమ్ము సమస్తముం గొనక చాలదు నీయుదరాగ్ని కైన ని
క్కమ్ముగ నిందులోఁ బ్రథమకార్యవివర్గతి నీ వెఱుంగవే
పొమ్మన వన్న! వ్యాఘ్రకులభూషణ! చయ్యనఁ బోయివచ్చెదన్'. 140

చ. అనవుడుఁ బుండరీక మపహాస్యము చేసి 'యిదేమి గోవ! యి
ట్లనియెదు నన్ను బేల్పఱచి యాత్మజుఁ డున్నెడ కేఁగి సత్వరం

బునఁ జనుదెంతు నంటి నిది పోలునె చెప్పెడువారు చెప్పినన్
వినియెడువారి కించుక వివేకము పుట్టదె యింత యేటికిన్. 141

ఆ. ఎట్టికష్టజంతు వేనియుం దేహంబు, విడుచుచోటఁ బెనుఁగఁబడునకాదె
సమ్మతించి చావఁ జాలదు విను పురావృత్త మొకటి తెలుపు నిత్తెఱంగు. 142

వ. అది యెయ్యది యంటేని. 143

ఉ. ఒక్క మునీశ్వరుండు పరయోగపరాయణుఁ డుత్తమోత్తముం
డెక్కుడుభక్తితోడఁ బరమేశు జనార్దను విష్ణుదేవునిం
దక్కఁగ హృత్సరోజమునఁ దాల్చి తపం బొనరించుచున్న వాఁ
డొక్కదినంబునందు జప మొప్పఁగఁజేయుచు గంగలోపలన్. 144

సీ. సైకతస్థలమున జారుపద్మాసనాసీనుఁడై నిశ్చలధ్యానకలిత
హృదయుఁడై యుండ నయ్యెడకుఁ జేరలుగుంజ నొక్కచాకితయుఁ దానొంటివచ్చి
యామునీశ్వరచంద్రు నందుఁ జూడ్కులు నిల్పి ధృతి దూల నాలుగుదెసలఁ జూచి
మఱి యెవ్వరును లేనితఱిఁ గామభూతంబు ఘూటింప నిటు నటుఁ గాళు లాడ

ఆ. తునికి నతనిఁ జేరఁ జని భక్తి గలయది, పోలెఁ దత్సమీపభూమియందుఁ
జక్క సాఁగి మ్రొక్కి సంభ్రమంబున లేచి, మొగిఁ గరాబ్జయుగము మోడ్చి పలికె.

క. 'ఓపుణ్యుఁడ! నిను వేఁడెద, నీపరమకృపాకటాక్షనిర్మలరోచుల్
నాపైఁ బొలయింపుము నీ, రూపముఁ గనుఁగొంటి మరునిరోషము గంటెన్.' 146

చ. అనవుడుఁ గర్ణరంధ్రముల నప్పలుకుల్ వెడ సోఁకి నెమ్మనం
బునకు నసహ్య మైనఁ బటుబుద్ధి హరిస్మరణంబు సేయుచుం
గనుఁగవ విచ్చి దానిదెసఁ గన్గొని యి ట్లని పల్కు నాతఁ 'డే
ననఘుఁడ సత్తసోధనుఁడ నర్హుఁడనే భవదీయకాంక్షకున్. 147

క. కాఁగానిమాట లాడెదు, రాఁ గూడదు నేఁ దపశ్చరణమై నుండం
గాఁ గోమలి యిటు నిల్వక, యేఁగుము మగనాలి కేల యీదుర్గుణముల్'. 148

క. అని విడనాడిన నమ్ముని, గని యంతటఁ బోక చాకివెలఁది 'కటకటా!
నినుఁ జూచి మరగి వచ్చిన, ననుఁ జేకొన తునికి నీకు న్యాయమె చెపుమా.' 149

క. అనవుడు 'జితకాములమై, వనమునఁ దప మాచరించువారము మముఁ జే
రిన నీకు నింద నయ్యెడు, ననుభవ మేటిది తొలంగు' మని పల్కుటయున్. 150

వ. అతని కయ్యాతివ యి ట్లనియె. 151

క. 'జితకాము లెట్టివారలు, క్షితిఁ బురుషార్థములు నాల్గిఁటివలనఁ ద
ద్గతకాము లైనవారలు, జితకాముల మనిరఁ గాముచే నగపడరే. 152

వ. కావున నీకు జితకామత్వంబు సిద్ధింప దది యట్లుండనిమ్ము నీవలన సంతానంబు
పడయ వేడి నే డిట్లు నిన్నుఁ గదియవచ్చినన న్నియ్యకొనక యెన్నిపోకలం
బోయెద' వనిన నమ్మునీంద్రుండు దాని కి ట్లనియె. 153

తే. 'అతివ! సంతానకాంక్ష నీయందుఁ గల్గె, నేని యొకవర మిచ్చెద నీవు వోయి
సురతతంత్రంబు సలుపునీపురుషునందుఁ, గులము వెలయింప నోపెడుకొడుకు గలుగు.

ఉ. అంతటఁ బోక నీవు మదనాతురబుద్ధివయేని నిట్లు న
న్నింత యలంపనేల విటు లెందఱు లే రటు వోయి తృష్ణ స
న్నంతకు నుండు పొ'మ్మనిన 'నంగజసన్నిభ! నిన్నుఁ బొంది యేఁ
గొంత కృతార్థ నౌదు నని కోరిన నీ విటులాడఁ గూడునే 155

క. జాలిఁ బడి విటుల వెదకఁగ, నే లంజెనె? యిట్లు నిన్ను నిటు తగిలిన ని
ల్లాలితన మెల్లఁ బోయెనె?, యేలా తరితీపు చేసి యిట్లుడికింపన్.' 156

క. అని చెనకుచు నది తనుఁడా, సిన ముని గోపించి యోసి 'చెడుగ! వెఱపు నూ
లి ననుఁ గదియంగ వచ్చెదు, మునుకొని యీమం దె మేలమున కోర్వఁ జుమీ.' 157

వ. అని యమ్మునీంద్రుం డెంత జంకించినం బోక యబ్బోటి లజ్జాభయంబు లుజ్జగించి
వెండియు ని ట్లనియె. 158

చ. 'పురుషులు లేరె లోకమునఁ బుట్టరు గాక భవత్సమాను లో
చిరతరపుణ్య! నిన్ దగిలెఁ జిత్తము మిన్నక పోవఁ డింక శం
బరరిపుఁ డేమి సేతు మగపాడి దలంపవు భామ లేడ ని
ష్ఠురవచనంబు లేడ దయఁ జూడఁ గదే యిదె నీకు మ్రొక్కెదన్.' 159

చ. అని కృప పుట్టఁ బల్కుటయు నమ్ముని దానిఁ బరిత్యజింపఁగాఁ
బొనరెడునట్టిదోషమును బొందఁగ నయ్యెడుదోషము న్మనం
బునఁ దలపోసి కోర్కి వృథవోవఁగఁ జేసిన దోష మంచు లో
ఘనముగ నిశ్చయించి మదిఁ గందఁగ స్రుక్కినఁ గీలెఱుంగుచున్. 160

క తమకమునఁ దానె పైకొని, రమణి తనదుకోర్కి దీర రతితంత్ర ప్రౌ
ఢిమ నెఱపె నమ్మునీంద్రుని, యమితతపస్సత్వ మెల్ల నాఱడిఁ బోవన్. 161

చ. అడవులు చొచ్చి నిస్పృహుల మంచుఁ దపోధనముద్రఁ దాల్చి నా
కడిమికి లోనుగాక తిరుగంబడి యుండిన నుండనిత్తునే
సుడివడ వ్రేతుఁ గాక యనుచు న్మదనుం డిటు చేసె నాఁగ న
ప్పుడఁలిమునీంద్రునిష్ఠకు నపాయ మొనర్చి యథేచ్ఛ మేఁగినన్. 162

క. కలలోపల నైనను స్ఖలితం బగు బ్రహ్మచర్యకర్మము తప్పున్
దలకొని మఱి యొండేదియుఁ, దలఁపనితన కిట్టికష్టదశ వచ్చుటకున్. 163

వ. చిత్తంబున రోసి యత్తాపసోత్తముండు. 164

సీ. 'కటకటా! నాపూర్వకర్మ మీభంగిఁ దపోహాని గావించి పోయెనొక్కొ?
యెవ్వరు రానిచోటిది యంచు నుండ నవ్వనిత యెక్కడనుండి వచ్చెనొక్కొ?
వచ్చెఁ గా కేమి నావలన నయ్యింతికిఁ గామవైకృత మేల కలిగెనొక్కొ?
దానిదుర్భావములు వీనుల వినియు నప్పుడ పోక యేల లోఁబడితినొక్కొ?
ఆ. యింక నేమి సేతు? నేగతిఁ బోదు? నా, కీదురంతదురిత మెట్టు వాయు?'
ననుచు గంగనీట నవగాహనము చేసి, వెడలి వచ్చి ముచ్చముడిఁగియుండె. 165

ఆ. అంత నతనిశిష్యుఁ డత్యంతభయభక్తిహృదయుఁ డొక్కఁ డచటి కేఁగుదెంచి
గురునియునికి చూచి పురపురఁ బొక్కుచు, నతనివనట కేమి గతియొ యనుచు. 166

చ. తనువు వడంక నమ్మునిపదంబులకుం బ్రణమిల్లి నాతఁ డా
తనిఁ గని యమ్మహాత్ముఁ డనుతాపము నొందుచుఁ గన్నునీరు గొ
బ్బున వెడలంగ 'వత్స! యొకపాపపుఁజాతిచేత నాతపో
ధనతతిఁ గోలుపోయితిఁ గదా' యని చెప్పె నెలుంగు దొట్రిలన్. 167

వ. ఇట్లు చెప్పి యప్పాపంబున నతిజుగుప్సాకరం బగుసూకరంబై తాను జన్మింప వలయుంట యెఱింగించి మఱియు నిట్లనియె. 168

ఆ. 'అపరాహ్ణజన్మమం దొక్కనిమిషార్థ, మైన నిల్వ నోర్వ నట్టివేళ
నోప ననక యొక్కయుపకార మొనరింపు, వలయు నంతవట్టుఁ దెలియనిమ్ము 169

క. ఈపురి నున్న కిరాతుని, యాపందికి నుద్భవించునర్భకములలో
రూపింప బొల్లినొసలై, యేపారినపిల్లఁ జూచి యెఱుఁగుము నన్నున్. 170

క. అది జన్మించినయప్పుడె, మది ననుమానంబు లేక మడియింపుము పెం
పు దలిర్పఁగ నంతటితో, నదయుం డగునజుని చేఁత లవి తుద ముట్టున్.' 171

క. అనునప్పలుకులు వీనుల,కును నిశితాస్త్రంబులై నిగుడ మూర్ఛితుఁడై
ముని బోధింపఁగ నతఁ డొ,య్యన తెప్పిఱి బాష్పపూరితాంబకుఁ డగుచున్. 172

క. తలయూఁచి యాతఁ డిట్లను, 'నలఘుతపోమహిమయందు ననదృశుఁడవు నీ
తల మెక్కడ దుర్జన్మముఁ, దలకొను టెక్కడ దురాగతము లిట్టివియే. 173

ఆ. ఎట్టిభంగి నున్న నే నీకుఁ జెయ్యెత్తి, మ్రొక్కువాఁడఁ గాక మొక్కలమున
నీకు హింస సేయ నిష్ఠురక్రియ కియ్య, కొనఁగ నేర్తు నయ్య గురువరేణ్య!' 174

వ. అనిన నతం 'డిది నాకు హితంబు సేయుటగాన హింసగా విచారింపక కైకొమ్మనిన
నెట్టకేలకు నతం డియ్యకొనియె నయ్యతీంద్రుండును గొండొకకాలంబునకు వియో
గంబు నొంది యప్పుడు ద్విగర్భంబునందు రజకాంగనాసంగమంబునం దనకు సంభ
వించినదురితంబు గారణంబుగాఁ బ్రవేశించి పెరుగుచుండె నంత 175

క. ఆవేఁటవానియింటికిఁ, బోవఁడు గనుదినముఁ జనుచు నక్షత లిడుచున్
దీవించుచుండ నొకనాఁ, డావిధమున కతఁడు ప్రీతుఁడై యిట్లనియెన్. 176

క. 'ఓయయ్య! నీవు నిచ్చలు, నీయెడ కిట్లరుగుదేర నేటికి నాచేఁ
బోయెడుపని యేమి వెసం, జేయుదు నది యెద్ది నాకుఁ జెప్పుము తెలియన్.' 177

క. అనవుడు 'విను నీగృహమున, నొనరఁగ నొకచూడిపంది యున్నది దానిం
గొని వచ్చి మద్గృహంబున, నునుప వలయుఁ గొన్నిదినము లొక్కమనసుతోన్.

క. అంతట నది యీనఁగఁ ద, త్సంతతిలో నొక్కపిల్లఁ జండికకు నివే
దింతు మఱి యున్న యన్నిటి, నెంతయు వెసఁ దెచ్చికొను మహీనవివేకా! 179

మ. ఇది నాకోరిక నిన్ను నొం డడుగ నాకీయావి యొక్కండునుం
బదివే లిచ్చినఁ గంటె నెక్కుడుగ నే భావింతు నీ నోపుదే
సదయాంతర్గతవృత్తి' నన్న నతఁ 'డోస్వామి! యొనర్పంగ రా
నిదియే యిప్పుడ యింద కొ' మ్మనుచు దానిం దెచ్చి యొప్పించినన్. 180

తే. అరసికొనియుండ నొక్కనాఁ డవ్వరాహ, లలన యీనుచో నిటలస్థలమునఁ బొల్చు
తెల్ల మచ్చతో నొకపోతుపిల్ల యీడి, పడఁగనిదియె పొమ్మని దాని నడువఁదలఁచి.

ఆ. గుదియ చేతఁ బట్టుకొని మొత్తఁ జేయాడ, కునిక్కి గొంతదడవు కనికరమున
నుండి యుండి యూరకున్నఁ బోదని తెంపు, చేసి వ్రేయఁ బూని చేరుటయును.

క. 'ఓహో! నిలు నిలు వ్రేయకు, మైహికసౌఖ్యానుభవము లందెద నే నీ
దేహమునఁ గొన్నిదివసము, లాహారికృపఁ బరమపదము కరిగెదఁ బిదపన్.' 183

ఆ. అనియె నాకఁ డంత నద్భుతస్వాంతుఁడై, 'యిందుఁ గలుగుసౌఖ్య మేమి' యనిన
సకలజీవులకును సదృశంబు కాదె ఖేదంబు దుఃఖమును సుఖంబు' ననియె. 184

వ. అని యతండు మఱియు నిట్లనియె 'నట్టులం గాక నీవు పుట్టినయప్పుడ వధియింప
వైతివి కొండొక తడవు చేసితివి గావున నాయుఃశరీరరక్షామోహంబు సంభవించె
నిఁక నేమి సేయ వచ్చు సంశయింపక పొమ్మనిన విధికృతంబు కదా యని వగచుచు
నక్కిరాతు పాలికిం జని యీనారెకు నాతలంపు సిద్ధింపదయ్యె మఱి చూచుకొందము
గాని వాని నన్నిటి నీయింటికి దెచ్చుకొమ్మనుచు నతండు నిజేచ్ఛం జనియె నమ్ముని
యును వరాహరూపంబున నాదివరాహధ్యానపరవశుం డగుచు నచ్చోటనే యుండె
నట్లుండ నొక్కనాఁడు, 185

చ. పరమకృపావిధేయుఁడును భక్తజనప్రియుఁడున్ సమస్తదు
స్తరదురితాపహారియును దానవవైరియు నైనవిష్ణుఁ డా
దరమున నొక్కనాఁ డతని దాసుఁడు గావునఁ జిత్తశుద్ధిఁ బొ
ప్పరయుతలంపునన్ శబరుఁడై చనుదెంచె యథోచితంబుగన్. 186

సీ. ఆబోయవాఁడును సాహిల్ల జట్టిగాఁ గొని పట్టుకొనిపోయి కొండచెంపఁ
జాపువాఁడై కత్తి సంధించుకొని 'నీకు నిష్టదైవం బెవ్వఁ డిప్పు డతనిఁ
దలఁపు' మావుడు 'నాకు దామరసేక్షణుం డక్షీణకల్యాణుఁ డక్షరుండు
లక్ష్మీశుఁ డీశుండు సూక్ష్మదృగ్గోచరుం డచలుఁ డచింత్యుఁ డవ్యయుఁ డనంతుఁ
ఆ. డాదిదేవుఁ డభవుఁ డవ్వాసుదేవుఁడు, దైత్యదమనుఁ డిష్టదైవ' మనిన
'సౌర! యితనిడెందమందు నామీఁదితా, త్పర్యబుద్ధి చెదరఁ బోఱ' దనుచు. 187

సీ. అడుగునఁ బ్రభవించునాకాశగంగతోఁ గటి నందమగుపీతపటముతోడ
భూతప్రపంచంబు పుట్టించుశిశువుతోఁ దనరారునాభిపద్మంబుతోడఁ
బదునాల్గు జగములు భరియించుకుక్షితో సిరికి నాస్పద మైనయురముతోడఁ
గన్నులఁ దొలంకాడుకరుణారసంబుతో సుప్రసన్నాననస్ఫూర్తితోడ
ఆ. వైనతేయు నెక్కి పరభూషణప్రభా, జాల మెసఁగ శంఖచక్రకలిత
హస్తుఁ డగుచు నభయహస్తంబుతోఁ బొడ, చూపి నిలిచె దనుజసూదనుండు. 188

వ. ఇవ్విధంబున సన్నిధి చేసి యతనివరాహదేహం బపనయించి బ్రాహ్మణశరీరం బొసఁగిన బిసరుహనేత్రుం జూచి యానందబాష్పాకులనేత్రుండును బులకితగాత్రుండును నగుచు నవ్విప్రుండు సాష్టాంగదండప్రణామంబులు చేసి చేతులు మొగిచి యిట్లని స్తుతియించె. 189

సీ. 'దేవ! లక్ష్మీధామ! దేవ! గోకులధామ! దేవ! సాగరధామ! దేవ! కృష్ణ!
దేవ! భక్తిప్రద! దేవ! ముక్తిప్రద! దేవ! సర్వప్రద! దేవ! విజయ!
దేవ! వేదప్రియ! దేవ! నాదప్రియ! దేవ! భక్తప్రియ! దేవ! యచల!
దేవ! దామోదర! దేవ! లోకాదర! దేవ! పద్మోదర! దేవ! యజిత!
ఆ. దేవ! నిఖిలదురితతిమిరప్రభాకర!, దేవ! సకలయోగిభావనీయ!
దేవ! దివిజగణవిధేయ! దేవ! సమస్త, దనుజనికరవిపినఘనకుఠార!. 190

సీ. జయ! పుణ్యసూచన! జయ! దుఃఖమోచన! జయజయ! గోవింద! జయ! ముకుంద!
జయ! కృపారసపూర్ణ! జయ! పయోధరవర్ణ! జయజయ! మధువైరి! జయ! మురారి!
జయ! కంసదారణ! జయ! మోక్షకారణ! జయజయ! భువనేశ! జయ! రమేశ!
జయ! లోకపావన! జయ! భక్తజీవన! జయజయ! గుణసాంద్ర! జయ! సురేంద్ర!

తే. జయ! సరోరుహాభవపూజ్యచరణకమల! జయ! నిశాకరరవిబింబచారునయన!
జయ! దశగ్రీవఖండనచండశస్త్ర!, జయ! విభీషణరాజ్యసంస్థాపనాంక!. 191

క. ప్రస్తుతవిభవ! నమ'స్తే, దుస్తరదురితాంధకారదూర! నమస్తే
హస్తిహృదయభయహరణ! నమస్తే' యని యిట్లు బహునమస్కృతు లొదవన్.

చ. గొనకొని ప్రస్తుతించుమునికుంజరుభక్తికి మెచ్చి కృష్ణుఁ డా
ననమున సుప్రసన్నత ఘనంబుగఁ దోఁపఁగ 'వత్స! యిందు ర'
మ్మని తనుఁ జేరఁ బిల్చి మృదుహస్తసరోజము మస్తకంబుపై
నునిచి 'యభీష్ట మైనవర మొక్కటి వేఁడుము నీకు నిచ్చెదన్.' 193

తే. అనిన 'నే నీకు దాసుండ నగుదు నట్టి, నీవు నామీఁద వాత్సల్యభావ మెసఁగ
నిట్లు ప్రత్యక్ష మగు టిది యింతకంటె, వరము నాకెద్దియూహింప వనజనయన!'

వ. మఱియు నప్పురాణపురుషుతో నప్పుణ్యపురుషుం డిట్లను 'దేవా! భవదీయదివ్యనామం
బులు సకృదుచ్చారణానల్పఫలావహంబు లట్లయ్యునుం దదేకాసక్తచిత్తుండ నగు
నాకుఁ గష్టజన్మంబు వాటిల్లునట్టిదురితం బేమికతంబునం బ్రాపించె నానతి' మ్మనిన
నవ్వాసుదేవుం డి ట్లనియె. 195

క. 'ఆదేవత లాదానవు, లాదిగఁ గలభూతకోటులం దెవ్వరికిన్
నా దాసులఁ జెనకఁగ రా, దేదురితము నేమి చేసి యేక్రియ నున్నన్. 196

వ. ఏ నొక్కవిశేషంబు చెప్పెద నాకర్ణింపుము. 197

ఉ. ఎవ్వఁడు నన్నుఁ గోరి భజియించుటకై మదిఁ గాంక్ష సేయు నే
నవ్విహితప్రయత్నమది యాఱడిఁ బోవ ననేకవిఘ్నముల్
నివ్వటిలంగఁ జేసి యతనిం గడుఁ గాసి యొనర్తు నేమిటన్
నివ్వెఱపాటు లేనిచిరనిష్ఠఁ గనుంగొని యాదరింపుదున్ 198

వ. ఏ నొనర్చువిఘ్నము లెయ్యవి యంటేని. 199

సీ. కామాతురునిఁ జేసి కాఱించు నొండేని ధనహీనుఁ గావించి దైన్యపఱతుఁ
బుత్రమిత్త్రాదులఁ బొరిపోరిఁ బెడఁబాపి బహుదుఃఖములపాలుపఱతు నొండె
కుజనసంగతి కియ్యకొల్పుదు నొండె నత్యంతదూషకునిఁ గావింతు నొండె
వేదమార్గము దప్పి వేఱొండుమతములఁ జిత్తంబు చెదరిపోఁ *జేతు నొండె

తే మఱియు నేవెంట నైనను మనసుఁ గలఁచి, యతులవైష్ణవధర్మంబునందుఁ జొరవ
యీకపోఁ ద్రోచుచుండుదు నెవ్వఁడైన, నిందు సుడివడుఁ గాని నన్ జెందలేఁడు.

ఉ. కావున నీవు మచ్చరణకంజము గాంచితి భక్తి నూని యే
త్రోవలఁ బోనినెమ్మనముతో నెడ త్రిప్పనిపూన్కితో జగ

* చేతు నను ప్రయోగ మసాధువు.

త్పావన మైనయీపరమధర్మముఁ గైకొని యంతరాయముల్
వావిరి నెన్ని వచ్చినను వానికిఁ జిక్కక పెక్కుభంగులన్. 201

క. నను సేవింపఁగ నేమిట, నిను భేదింపఁగ లేక నీచపుజన్మం
బొనరించితి నట్లైనను, మనసు గలఁగి నన్నుఁ గొంత మఱతువొ యనుచున్. 202

ఉ. ఏమిటఁ జిక్కువైతి నను నేమఱ కెప్పుడు నట్ల కాదె యే
భూమిని నన్నుఁ గొల్చుఘనపుణ్యుఁ డవాంతరపీడఁ బొందినం
బో మఱి నక్కఁ బోలబడునె భద్రగజేంద్రము నుక్కుత్రాళ్లచే
నోమునినాథ! కట్టువడి యుండునె యింకిట వేయునేటికిన్. 203

చ. ఇతరు లనేకజన్మముల నేనియుఁ బోఁగలేనిపాపముల్
చతురుఁడు మత్పరాయణుఁడు సర్వము నొక్కభవంబునంద య
ద్భుతముగ నిస్తరించు మఱి పుట్టఁడు గాన బుణాయమానమై
క్షితి నొకయించు కైన నఘశేషము నిల్పుట కోర్వకుండుటన్. 204

వ. అది యెట్లంటేని పెక్కుతరంబులనుండి పెరడిగొనుచు ననల్పం బగుచునప్పులు బలువు గలవానిం జొచ్చి కొంచెపుధనంబునన తీర్చునట్లు మదీయదాసుండును మత్సత్వంబునం జేసి జన్మాంతరసహస్రంబులం గల్గు నశేషదోషంబు క్షణంబు లోనన నిరవశేషంబు చేసి ధూమరహితం బగువహ్నియుంబోలి నిష్కళంకుండై తేజరిల్లు చుండు నిది నీయడిగినప్రశ్నంబునకు నుత్తరంబు నీవింకఁ దడవుసేయక నావెంట వైకుంఠపురంబునకు రమ్మనుచు నమ్మహానుభావుండు పరిజనసేవ్యమానుండగుచు విజయం చేసెఁ దదనంతరంబ. 205

ఉ. మానితధర్మనిర్మితవిమానముపై బహుమాన మొప్ప న
మ్మానివగేణ్యుఁ డుల్లసితమానవతీకరచామరోత్థమం
దానిలలీల మెచ్చుచు వియచ్చరు లచ్చరపిండుతోఁ బ్రస
న్నాననులై యెదుర్కొనఁగ నబ్జభవాదులు సంస్తుతింపఁగన్. 206

క. సురలు సుమవృష్టి గురియఁగ, మొరయఁగ గంధర్వనియతి మురజంబులు కి
న్నరమిథునంబులు పాడఁగ, హరిపురమున కరిగె నాతఁ డధికప్రీతిన్. 207

చ. మునివరుఁ డట్టి జ్ఞానియటె మున్ను జగంబుల మేలుఁ గీడునుం
గనుఁగొనియున్నవాఁ డటె యకంపితచిత్తుఁడు నట్టి యట్టివాఁ
డును నొకదుష్టజన్మము కడుక్ సుఖదం బని యుండెఁ గాక నె
ట్టన మృతిఁ బొందువానికి నొడంబడ నోపెనె పల్కునట్లకాన్. 208

క. అటుగాన సురభి! విను నీ, వటు పోయి 'యుపాయయుక్తి నడకించితిఁబో
కుటిలనఖచటులదంష్ట్రోత్కటశార్దూలంబు' ననుచుఁ గౌతుక మెసఁగన్. 209

ఆ. గుండె నిమురుకొనుచుఁ గొడుకు పాలికి నేఁగి, కడుపునిండఁ జన్ను గుడిపి నీవు
నెమరు వెట్టుకొనుచు నెమ్మది నుండు గా, కిచటి కేల వచ్చె దెలిఁగి యెఱిఁగి. 210

క. *త్రఱకలచొప్పయ చాలును, మఱచియుఁ దలపోలముదిక్కు మసలెడిపనికిన్
వెఱతు నని పికిలికితనమున, నెఱి విఱుగుదు గాక సత్యనిష్ఠఁ దలఁపుదే. 211

క. ఆఁకొని యఱచెడిఁ బ్రేవులు, నేఁకట వో నమలవలయు నీమాంసము న
ట్టాఁక యిడి యిబ్బిథంబునఁ, దేఁకువ చెడి పల్కుఁ దగునె ధేనువ! నాతోన్‌. 212

వ. అనిన నప్పుండరీకంబునకు వివేకంబు లేదుగదే యని శోకంబు నొందుచు నాగో
కులరత్నంబు తనమనంబున ని ట్లని విచారించు. 213

చ. 'నను నిది యెన్ని చెప్పినను నమ్మదు దీనిమనంబులోపలం
బనుపడియున్న సంశయము పాపక పోవఁగ రాదు పోక చి
క్కినఁ దన యుండు నావలన గీఱిన ప్రేముడిఁ బ్రాణబాధఁ గూ
రినఁ గడుదోష మేఁ బరిహరించుట యెట్లొకొ వీని నన్నిటిన్.' 214

వ. అని విచారింపుచు నావ్యాఘ్రంబునకు ధేను వి ట్లను 'నే నిన్ను నొకకొన్ని వేష
భాషలం బ్రమోషించి యట పోయి క్రమ్మఱ రాకుండుదు నని నను నమ్మనేర విది
సాధులక్షణంబె? యే నసత్యవచనురాలనె ? 215

క. ఒకయితిహాసము చెప్పెద, నకలంకత వినుము సూనృతాత్ములచరితల్
సకలాఘక్షయకరములు, సుకృతనిధానములు కర్ణశోభితలీలల్. 216

వ. అయ్యితిహాసం బెట్టిదనిన మగధదేశంబునందు శంబరుండను నొక్క మహీపాలుండు
పెద్దకాలంబు తనకు సంతానంబు లేక భూదేవతల రప్పించి పుత్రకామేష్టి
సేయింప నయ్యగ్నికుండంబువలన నొక్క తేజోమూర్తి యగుకొడుకును నొక్క
యధికస్వరూపిణి యగుకూఁతురుం బుట్టిన నయ్యిద్దఱకుం గ్రమంబునఁ బావకలో
ముండును మదనరేఖయు ననునభిధానంబు లొనరించి పెనుపుచుండ. 217

ఉ. పున్నమచంద్రుతోడ సరిపోల్పఁగ నయ్యెడు మోము లొప్ప ను
ద్భిన్నసరోరుహాంబకలగతిం జెలువొందెడికన్ను లొప్ప సం
పన్నవిలాసలక్ష్ములకు బాసటయై తనురోచు లొప్ప న
య్యన్నయుఁ జెల్లెలు న్నెఱసి రయ్యెలప్రాయపుసోయగంబులన్. 218

వ. అంత నయ్యిరువురు తండ్రినియోగంబున విద్యాభ్యాసంబు సేయుచు. 219

చ. సదమలయుక్తిఁ జేసి గురుసన్నిధిఁ బావకరోముఁ డోలిఁ బ్రాఁ
జదువులు ధర్మసంహితయుఁ సామజశిక్షయు నశ్వశాస్త్రముం

---

* పఱకలమేఁతయె-పాఠాంతరము.

* పఱకడ పొలమే చాలును, మఱచియుఁ దలపోలము దిక్కు మసలెడు పనికిన్; పఱకడి మేఁతయె చాలును. అనియుం ఛి. ని. పాఠాంతరము.

బోదలెడున స్త్రసాధనయుం భూపతినీతియు గానవిద్యయుం
మొదలగువిద్య లెల్లఁ దుదిముట్ట నెఱిఁగెఁ బరిస్ఫుటంబుగన్. 220

క. అతనిసహోదరి యగున, య్యతివయుఁ దగఁ గావ్యనాటకాలంకార
ప్రతతు లొగి నభ్యసించుచుఁ, జతురతమై నుండె నొక్కసమయమునందున్. 221

సీ. నూఁగారుదీఁగెకు నూతనావాలమై తనరారునాభిరంధ్రంబుఁ జూచి
సుభగత్వలక్ష్మికి సోపానమార్గమై రమణీయ మగువళిత్రయముఁ జూచి
యౌవనశబరుచే నమరుమారెడుపండ్లక్రియ నంద మగుకుచద్వయముఁ జూచి
ముఖచంద్రమండలంబునఁ దోఁచునమృతపూరముభంగి మధురాధరంబుఁ జూచి

తే. గురుతనూజుండు మనమునఁ గోర్కె నిగుడ, దోడిశిష్యుల నందఱ వీడుకొలిపి
వనిత నేకాంతమందిరంబునకుఁ దెచ్చి, కదియ వచ్చిన నది వానికళ లెఱింగి. 222

చ. 'ఇటు తగునయ్య! విప్రుఁడ వహీనగుణాఢ్యుఁడ వీవు నీకు నే
మిటి కిటువంటిదౌష్ట్యము శమించునె మజ్జనకుండు విన్నఁ ద
క్కటిజను లేమి యండ్రు మదిఁ గాంక్షయె కల్గిన నగ్నిసాక్షిగాఁ
జిటికెన వట్టి కాక వృథ సేయుట ధర్మమె కన్యకాత్వమున్. 223

క. పడఁతికిఁ గన్యాధర్మం, బెడలినఁ గొఱ యగునె వెండి యెవ్వరికైనం
గడివోయినపువ్వులు మఱి, ముడుచునె రసికుఁ డగువాఁ డమోఘవివేకా. 224

ఉ. కావున నీవు న న్నదియఁ గారణ మేమి తొలంగు' మన్న నా
భూవిబుధుండు 'నీవు ననుఁ బొందక పోయెద వన్న మైమెయిం
బోవఁగ నేల నిత్తు' నని పూని నృపాత్మజ నంటఁబట్టి వ
స్త్రావరణంబుఁ బుచ్చుటయు హస్తము చాఁచి విదల్చివైచుచున్. 225

చ. 'తలతల మంచివాఁడవు గదా! గురుపుత్త్రుఁడ వంచు నిన్ను నోఁ
బలుకకయున్న నీగతిని బాడి తొఱంగెదు చాలుఁ జాలు మా
టలపని యేల వేగిరపడం బనిలే దబలుండ! యింటివా
రల నెఱిఁగించి నీచెనఁటిరంతులు సర్వముఁ జక్కఁ జేసెదన్.' 226

క. అని పలికిన మఱి యేమియు, నన నేరక మోము వంచి యవ్విప్రుఁడు దాఁ
బెనువ్రేల నేల వ్రాయుచుఁ, దనకొంగును విడువకున్నఁ దత్సతి మఱియున్. 227

క. 'కొం గేటికి విడువుము మును, ముంగలి వెడలంగ వెఱతు ముగ్ధుఁడ! నీ కీ
వెంగలితన మె ట్లొదవె న, నంగవికృతి సూప నర్హమా నాయెదురన్.' 228

చ. అని కడుఁ దూలఁబోఁ బలుక నగ్గురుపుత్త్రుఁడు మూర్ఛ నొంది మే
దిని కొఱగంగ నవ్వనిత దిగ్గనఁ బట్టి నిజాంకపీఠ మా
తని కుపధానమై వెలయఁ దా నొనరించి మొగంబు చూచి ము
క్కున: బవనంబు లేమికి దిగుల్పడి కుత్తుక యంటి చూచుచున్. 229

క. 'అక్కట! నాగురుపుత్త్రుం, డెక్కలిఁ గోల్పడితి నెద్ది తెఱఁగో విప్రుం
డెక్కడి కెక్కడఁ దలఁచెను, దుష్కరణోన్మాద మింత తీవ్రం బగునే. 230

క. గురుపత్నిఁ జంద్రుఁ డమ్ముని, వరపత్నిఁ ద్రివిష్టపైకవల్లభుఁడు పరా
శరుఁ డోడరేవుపడఁతిని, మరుగుటఁ గనువేఁ దితరమర్త్యులవశమే. 231

తే. నాకుఁగా నీతఁ డిట మరణంబు నొందె, నేని నా కెంతపాపమో యిప్పు డితని
కోర్కి దీర్చితి నేని నాకులములోన, నెంత హీనత వచ్చునో యేమి సేతు. 232

వ. అని చింతించి యొక్కయుపాయంబు గావించి, 233

క. తొడ చఱచి పేరఁ బిల్చుచు, నొడికంబుగఁ గరసరోజ మురమున నిడుచున్
వెడఁగదలు తెప్పపోడగని, పడఁతుక యొకకొంత డిందుపడియెడువగతోన్. 234

క. 'అనఘా! యిది యెంతటిపని, విను నాదెస నీకు నింత వేడుక గలదేఁ
గను దెఱచి చక్కఁ జూడుము, మనలో మన కింత గలదె మతిహీనుఁడవై. 235

క. నవ్వితి వైనను గాకే, నివ్విధ మిట్లెఱుఁగుదును మహీసుర! నిను నే
నొవ్వంబలికితిఁ గరుణకు, దవ్వగుపని సేయ నేను ధర్మేతరనే.' 236

చ. అనిన నతండు నావలన నాదరణంబు తలంచి యిట్లు పే
ర్కొనియెదు గంటి మంటి నని గొబ్బునఁ గన్నులు విచ్చి చూచి పై
కొనఁగఁ దలంచినం గుసుమకోమల తత్తఱపాటులేని నె
మ్మనమున విప్రుఁ జూచి 'యిటు మానుము నీ కిఁక వేగ మేటికిన్. 237

క. ఏ నొక్కటి నిను వేఁడెద, దానిం గాదనక నీవుఁదలకొని చేయం
గా నోపిన విద్వద్వినుతా! నీచిత్తంబుఁ బట్టుదానఁ బ్రియమునన్.' 238

వ. అనిన నవ్విప్రుండు దమకించి. 239

క. 'ధన మైనఁ బ్రాణ మైనను, వనజానన! యేను నీకు వంచింతునె యే
పని యైన నడుగు మిప్పుడ, యొనరించెద' ననిన నప్పయోరుహముఖియున్. 240

క. 'ధన మడుగఁ బ్రాణ మడుగ, న్వను పరిణయ మైనపిదప నే నీయెడకుం
జనుదెంచి కాని మఱియుం, జెనయఁగ నేఁ బొంద నాకు నీవర మీవే.' 241

చ. అనుటయుఁ 'బాపు బాపు నను నాసలపా లొనరించి నెమ్మదిం
జనువెర వెట్లెఱింగితి విచారవిమూఢున కైన నీవు ప
ల్కినపలు కియ్యకో లగునె? లేమ! వనంబున జున్ను రేఁచి తి
య్యనిమధుపాన మొల్లక రయంబున నొందులపాలు సేయునే. 242

చ. అది యటు లుండె నీ విచటి కప్పుడు వచ్చెద నంటివా నినుం
గదలఁగ నిచ్చునే విభుఁడు కాని ప్రసంగము లేల నీవు నా

తుది నఱలేక వచ్చుటకుఁ దొయ్యాలి యెవ్వరు ఫూట యంతకుం
బదిలము నిల్వ లేను మఱుబారికిఁ ద్రోవక నన్నుఁ గావవే. 243

క. అని గురుపుత్త్రుఁడు పలికిన, విని యానృపపుత్త్రి యింత వెఱ్ఱివి గలవే
యనుమాన మేల నీతోఁ, బనివడి యిటు పల్కి బొంకఁ బాడియె నాకున్. 244

వ. అనిన నతం డ య్యింతి కిట్లనియె. 245

క. 'నుడివినయట్టులు దప్పక, నడుచుట యిది పిన్నపనియె నాతులమాటల్
వడగండ్లగుండ్లు జలనిధి, కడళ్ళ మొత్తములు భిన్నఘటులోయంబుల్. 246

ఆ. వర్షధార లెన్న వచ్చు గంగావాలు, కలు గణింప వచ్చు గగనవీథి
వెలుఁగుతారకములుఁ గొలఁది వెట్టఁగ వచ్చుఁ, గాని సతులమనసుఁ గానరాదు. 247

క. యాదృచ్ఛికసురతంబును, జూదంబున గెల్వఁబడినసొమ్మును నుతో(క్రా)
శాదులు నప్పటికప్పుడ, కాదే మఱి దుస్సిపోవుఁ గాక నిలుచునే. 248

క. ఈవేళ తప్పిపోయిన, నావల నొకనాఁడు వత్తు నను నది నిజమే
నీ వెంత చెప్పినను మ, ద్భావము నమ్మ' దని యతఁడు దాఁ బల్కుటయున్. 249

సీ. 'నారాక సిద్ధము నమ్ము నీ' వని పెక్కుభంగుల శపథముల్ పలికి యబల
'విను మిదె యామ్నాయవిదుఁ డైనవిప్రుఁడు ధర్మప్రజార్థమై తగినకన్య
నరసి పెండిలియాడ నరుగుచో విఘ్నంబుఁ గావించుపాపానఁ బోవుదాన
నప్పుడు రాకున్న' నని పల్కఁ 'బోఁబోలు' ననియె నాగురుపుత్త్రుఁ డట్ల పలికి
ఆ. యరిగె రాజపుత్త్రి మరుసాయకము గుఱిఁ, దూఱ నాఁటి తిరిగి దొనకు నేఁగు
నట్లు నిర్వికారయానంబుతోఁ గీర్తి, సదన మైనతండ్రిసదనమునకు. 250

వ. అంత నయ్యింతికిం దంత్రి యనురాజకుమారుండు వరుండై ప్రథమసంగమోత్సవ
సముత్సుకం బగుమనంబున దూతికాజనంబులం బనుప వార లచ్చెలువం బిలువం
బోయిన. 251

ఆ. ఆనృపాలపుత్త్రి యాదటఁ గైనేసి, యతనుపాలి కరుగుఁరతియ పోలె
నరిగి యరిగి మున్ను గురుతనూజునితోడఁ, బల్కినట్టికడిఁదిబాసఁదలఁచి. 252

చ. మదిఁ దలపోసి' యాగురుకుమారునితో నలనాఁడు మత్పతిం
గదియుటకంటె మున్ను నినుఁ గానఁగ వచ్చెద నమ్ము మంటి నీ
యదన నితండు నన్నుఁగవయ న్గుతుకంబునఁ బిల్వఁ బంచె నా
కదియుం నవశ్య మిప్పనియుం నర్హమ యెయ్యది యాచరింతునో. 253

సీ. విప్రుపాలికిఁ బోయి వేగ వచ్చెద నన్న నృపదూతికల నాకు నిల్పరాదు
మగనికోరికి దీర్చి మఱివత్తు నని యేను జనిన నసత్యదోషంబు వచ్చు

నీపూట దప్పించి యెల్లి చూచెద నన్నుఁ బతివేడ్కఁ జెఱచుట పాడిగాదు
పతితోన చెప్పి యీపని యొనర్చెద నన్న నెఱుఁగరా దాతనిహృదయసరణి

ఆ. ధర్మసూక్ష్మ మెవ్విధము దుర్బలప్రబ, లంబు లెఱిఁగి నిశ్చయంబుసేయు
వార లెవ్వ రిచట వాక్రుచ్చి యొకరితోఁ, జెప్పరాదు త్రోపు సేయరాదు'. 254

వ. అని డోలాయమానమానస యగుచు నమ్మానవతి ధర్మస్థితికిం బతియనుమతియ ముఖ్యగతిగాఁ దనమతి నిశ్చయించి యంద యరుగుదెంచిన. 255

సీ. స్మరచాపముక్తమై చనుదెంచినట్టి మోహనసాయకంబొ యీవనజగంధి
హరుజూటముననుండి యరుగుదెంచినయట్టిచంద్రబింబమొకొ యీజలజనయన
యంబరస్థలినుండి యరుగుదెంచినయట్టి క్రొమ్మెఱుంగొక్కొ యీకోమలాంగి
యుద్యానతరులలోనుండి వచ్చినయట్టియెలదీఁగయొక్కొ యీయిగురుఁబోఁడి
తే. యనఁగ నత్యంతసౌకుమార్యమునఁ బేర్చి, చిత్తమున కింపు నింపునచ్చెలువఁ జూచి
నయనకరసంజ్ఞ నానరనాథతనయుఁ, డెగిచి తనపాన్పుమీఁదికిఁ దిగిచికొనియె. 256

క. పతితల్పంబున నిట్లాసతి నిడి దూతికలు తొలఁగి చనిరి ప్రమోద
స్థితవదన లగుచు నొక్కొక్కతె నల్లనఁ బఱటికొనుచుఁ గడురభసమునన్. 257

తే. అంత నయ్యింతి తనయాంతరంగమందు, నతఁడు తనుఁ బొందఁ బైపడునంతకంటె
మున్న యీమాట వినిపింప కున్నఁ గార్య, మనవు పఱచుట దుస్తర మని తలంచి.

ఉ. చెప్పఁగఁ జూచి సిగ్గువడుఁ జెప్పఁగఁ జెప్పకయున్నఁ దీర దేఁ
జెప్పెదఁ గాక యంచుఁ దగి చెప్పఁ దలంచు నిదేమి మాటగాఁ
జెప్పుదుఁ జెప్పినం బతియుఁ జిత్తమునం గలుషించునో పరుల్
చెప్పెడువార్త కా దనుచుఁ జెప్పఁగఁ బూనును జెప్పఁ గాదనున్. 259

క. అప్పడఁతి యివ్విధంబున, ముప్పిరిగొనుసంశయంపుముంపునఁ బతి కేఁ
జెప్పక యిది మఱియెవ్వరు, చెప్పెదరని చెప్పఁజూచుఁ జెప్పఁగ వెఱచున్. 260

ఆ. అట్లు కాదె ముగ్ధ యటె క్రొత్తపెండిలి, కూఁతు రట్టె మగఁడు లాఁతి యట్టె
యదియుఁ బ్రథమసంగమాసన్న వేళటె, సిగ్గుపేర్మి వేఱ చెప్పనేల. 261

క. అవి యన్నింటిని మిగులదె, భువి నెందును లేనియితరపురుషప్రారం
భవిచారము పతియెదురన, యవమానపుఁబనిని నాలు కాడునె తడవన్. 262

వ. ఇట్లు విచారించి యెట్టకేలకుఁ దెంపు చేసి. 263

క. సజ్జ దిగి దిగక నొగడెడు, లజ్జకడఁక యుజ్జగించి లంబాలకయై
యజ్జనపతి యెదుటను యో, షిజ్జనరత్న మిది యేమి చిత్రం బనఁగన్. 264

వ. సాష్టాంగనమస్కారంబు చేసి ముకుళితకరాంబుజరై యున్న యత్తెఱవ తెఱం గెఱుం గక వెఱఁగుపడి తనకెంగేలం బట్టి లేవనెత్తి యాలింగనంబు సేయుచుఁ దల్పం బుమీఁదికి రాఁ దిగిచి యతం డి ట్లను 'మృగాక్షీ! యేను భవదీయలక్షణపరతంత్రుం డ నగుట యెఱుంగక కదా యిట్లు చేసితివి. 265

ఉ. ఏనుఁగు లశ్వముల్ సురభు లింతులు సద్భటకోటి రత్నసం తానము ధాన్యహేమరజతంబులు వస్త్రము లాదిగా నిజా ధీనము లైనవస్తువులు దేజ మెలర్పఁగ నీవశంబకాఁ బూని యొనర్తు సేవనికిఁ బుచ్చినఁ జెచ్చెర నిర్వహింపుదున్. 266

గీ. అడుగు' మనవుడు 'నితఁ డిట్టు లనుటయుపుడు, నాదుభాగ్యాతిశయమునఁ గాఁజకలిగె' ననుచు వార్షించి యబ్బాల యానృపాల, తిలకుమీఁదఁ గటాక్షదీధితులు వొలయ.

వ. 'దేవా! యే నొక్కవిన్నపంబు చేసెద నదియుక్తం బైన నయుక్తం బైన నీ కనుగ్ర హింపక పోరా దవధరింపు' మని యతనిచిత్తంబునకుఁ గినుక వొడమకుండునట్లుగా నల్లనల్లనం జెవికిఁ జల్ల నగునట్లు మృదుభాషావిశేషంబుల నగ్గురుపుత్రు నభిలాష యుం దనదగుసరోషప్రతిభాషలకు నోడి యతండు వాతాహతభూజంబునోజ నేలం గూలుటయుం నకారణంబున బ్రహ్మహత్య సిద్ధించె నే నేమి సేయుదు నని తల్లడించి యతని బోధించుటకునై తత్సమయసముచితవచనంబుల నుపచరింపం బెద్దయుం బ్రొద్దునకు నతండు దైవాధీనంబునం జైతన్యంబు నొంది క్రమ్మఱఁ దనతోఁబరిచర్య సేయందలంచినప్పు డప్పాపు దప్పింప నొండువెరవు దొరకొనమిఁ దా నట్లాడంబడి యొడపల్కనవిధంబునుం జెప్పి యప్పొలంతి మఱియు ని ట్లనియె. 267

సీ. 'సుదతి కన్యాత్వవిచ్యుతి పొందు టపకీర్తిగాని పత్యనుమతి నైనకర్మ మట్లైన మేలని యే నప్పు డతనికిఁ బరిభాష చేసితిఁ బార్థివేంద్ర! యిప్పు డాపరిభాషఁ దప్పిన దోషంబు ప్రాపించు నతి కైనపాతకంబు పతిఁ బొందు నని చెప్పఁబడు నట్లుగావున వినిపింపవలసె నీవివర మెల్ల

తే. నింక నిటమీఁద నీచిత్త మెట్టులుండె, నటుల చేసెద నానతి' మ్మనిన నాతఁ డుల్ల మత్యంతచింతాపయోధి మునుఁగ, శిరము గంపింపఁ జేసి యచ్చెరువు నొంది.

క. అతివలు సాహసకర్మిణు, లతిమాత్రము వారిబుద్ధి యట్లై యునికిం జతురాననునకు నైనను, సతుల గెలువరాదు సహజసామర్థ్యమునన్. 270

క. ఎఱిఁగి యెఱిఁగి యొరుపాలికిఁ, దెఱవఁ బనుచుపనికి సమ్మతింపదు చిత్తం బఱిముఱి లసత్యదోషము, పఱతెంచుట సిద్ధ మెట్లు పనుపక యున్నన్. 271

క. ఎయ్యది కర్తవ్యమొకో, యియ్యెడ నాలోచనమున కెవ్వఁ డొకో తో
డయ్యెడువాఁ డీకార్యము, నయ్యము గాకుండఁ జేయవలయుం వెరవుతోన్. 272

చ. అని తలపోయుఁ భర్తకుఁ బ్రియంబున ని ట్లను 'నింత సీమనం
బున ననుమాన మేమిటికిఁ బుచ్చఁ దలంచిన నన్నుఁ బోయిర
మ్మను మటు కాక నీవు వలదన్నను మానెద సత్యనిష్ఠతో
నెనయఁగ రాదు సుమ్ము మఱి యెన్నితపంబులు నీజగంబునన్. 273

క. ధల మెల్లఁ బొలియునంతటి, పని పుట్టిన నాలి బిడ్డఁ బాసి నిరాశన్
జనునట్టినెడరు పుట్టిన, జనుఁ డేమఱకుండ వలయు సత్యవ్రతమునన్. 274

క. తొల్లి హరిశ్చంద్రమహీ, వల్లభవల్లభుఁడు సత్యవాక్యము ధరణిం
జెల్లించె నతనివర్తన, మెల్లజగంబులఁ బ్రసిద్ధ మెఱుఁగమె కథలన్. 275

వ. అది యట్లుండె నింక నొక్కవిశేషంబు. 276

క. అతివలమాయలు పెక్కులు, పతుల మొఱఁగఁ దలఁచిరేని పట్టఁగ వశమే
పతిభక్తినిరత లగున, య్యతివలు సైకొనరు గాక యాదుర్గుణముల్. 277

క. పతి దన కేడుగడయగాఁ, బతియానతి మీఱఁ బూని పతిచిత్తం బే
గతి నుండు నట్ల మెలఁగెడు,సతి గల్గినఁ బుణ్యగతి సుసాధ్యము పతికిన్. 278

వ. ఇట్లు నడవక.

చ. పెనిమిటిఁ దిట్టుచున్ సతులఁ బ్రేల్చుచుఁ బందులు గీటుకొంచు స
జ్జనుల నిరాకరించుచు నసత్యము లాడుచుఁ గన్నవారితో
డన కలహించుచున్ జారనితావులు చొచ్చుచు విందు వీడు వ
చ్చినఁ దలయంటఁ గట్టుకొని జిఱ్ఱునఁ జీఁదుచు బిట్టు మూల్గుచున్. 280

చ. తనకడుపార మున్గుడిచి తా నొకనాఁడును గూటిపాంతఁ బో
వనియదివోలె మోము దిగవైచుచు నూరకె కాళ్ళ లీడ్చుచున్
వసరుచు నింటివాకిటికి వచ్చినవారలముందటం దగం
బనివడి లేమి చెప్పుచు నభాగ్యుఁడు వీఁడని భర్త దూఱుచున్. 281

ఆ. భాండశుద్ధిలేక పరగ దేవాతిథి, పూజనములపొంతఁ బోక నీచ
వర్తనమున మెలఁగువనిత ప్రాణేశున, కుభయలోకహాని యొనరఁ జేయు. 282

క. కావునఁ బురుషుల కెందును, భూవల్లభ! మేలుఁ గీడుఁ బొందించుటకున్
భావింప ముఖ్య హేతువు, లావనితాజనుల కాక యన్యులు గలరే. 283

ఆ. అధిప నానిమిత్తమై నీకుఁ బాపంబు, సంభవించుపనికిఁ జాలఁ గాన
నింత చెప్పవలసె నింక నీతలఁ పెట్టి, దట్ల చేయుదాన నానతిమ్ము.' 284

చ. అనవుడుఁ బాపభీతుఁ డగు నానరనాథుఁడు నాతిఁ జూచి 'నీ
కనితరసాధ్య మైనపరమార్థ వివేకము కల్గఁజేసి యె
ట్లనినను జెల్లు నీపలికినట్టుల పంతము దీర్చి రమ్ము పొ'
మ్మనుడు నమస్కరించి గృహ మల్లన వెల్వడి నిర్వికారతన్. 285

చ. అనిమిషకన్యయో దితిసుతాన్వయకన్యయొ వీడు చూడవ
చ్చినవనకన్యయో యనఁగఁ జెన్నెసలారుచు నిండి సాంద్రమై
ఘన మగుచీకటిం గుసుమగంధి నిజాభరణప్రభావలుల్
దన కటు త్రోవ చూపఁగ ముదంబున నొంటియె యేఁగుచుండఁగన్. 286

సీ. మింటికి నేలకు నొంటికంబము నిల్పిన ట్లూర్ధ్వకాయ మత్యద్భుతముగఁ
బరగుదిగ్భిత్తులపైఁ జేవదూల మెత్తినభంగిఁ జేబార యనువుపడఁగ
ఘనమేఘమున వానకాళ్ళు ప్రేలినమాడ్కి ముక్తకేశంబులు ముసుఁగువడఁగ
నుఱుముచుఁ దళతళ మెఱచుచందంబున గర్జతో మిఱుమిట్లు కడలఁ దోఁప
ఆ. నంధకారమునకు నధిదైవమో యన, బొగ్గురాచి కలయఁ బూసినట్లు
నల్లచాయతోడ నాలికిఁ బొడచూపె, రాచవీథి నొక్కరాక్షసుండు. 287

క. ఆరాక్షసుఁ గట్గొనియును, నారాజీవాక్షి యంతరంగమునఁ బతిం
గోరి తలంచుచు వెఱవక, బోరనఁ జనుచుండ దనుజపుంగవుఁడు మదిన్. 288

క. వెఱఁగుపడి యెట్లొకో యిటు, వెఱవనిచందంబు దీనివిధ మేర్పడఁగా
నెఱుఁగ వలయు నని వెస డ,గ్గఱఁ జని వస్త్రాంచలంబు కరమునఁ బట్టెన్. 289

ఉ. పట్టిన నేమియుం దిగులుపాటు మదిం బొరయంగ నీక యా
కట్టిఁడిదైత్యుఁ జూచి 'యనఘా! తగువాఁడవు కావె నీవు నన్
బట్టుట ధర్మ మయ్యా! పరభామఁ బతివ్రత నేను నన్ను తోఁ
బుట్టువుగాఁ దలంచి వెసఁ బోవిడు మంకిలి సేయ నేటికిన్.' 290

ఆ. అనిన నాతఁ డప్పు డమ్ముగ్ధపలుకువి,దగ్ధభాష లద్భుతంబుఁ జేయ
నర్థరాత్ర మెచటి కరుగుచున్నది దీని,వర్తనంబు దెలియ వలయు ననుచు. 291

ఉ. 'ఎవ్వరిదాన వీవు? కుల మెయ్యది? యెయ్యది నీదు పేరు? నీ
కెవ్వఁడు భర్త? యొంటి నిటు లెవ్వనియింటికి మధ్యరాత్ర మీ
వెవ్వరుఁ గానకుండ వెస నేఁగెదు? నా కెఱిఁగింపు' మన్నఁ దా
నవ్వుచు నిర్వికారవదనంబున వాని మొగంబు చూచుచున్. 292

సీ. 'మాతండ్రి యంబిరుఁ డాతనిసతి యైనకుంభిని మాతల్లి గుణగరిష్ఠుఁ
డైనపావకలోముఁ డన్న రాచకొలంబు మాయది నా పేరు మదనరేఖ

నాభర్త తంత్రిభూనాథుండు నేఁ జనుపనియును జెప్పెద వినుము తెలియ'
నని తన్ను గురుపుత్రుఁ డాసించుటయు వాని కపుడు దాఁ బల్కినశపథగతియు

ఆ. భర్తచే ననుజ్ఞ వడసి యిప్పుడు వానిఁ, గానఁబోవుచున్నదాన ననియు
విచ్చి చెప్పె వెలఁది విని దైత్యుఁ డి ట్లని, పలికె నతికఠోరభాష లెసఁగ. 293

ఉ. 'ఎక్కడిపేదపాఱుఁ డిల నెక్కడినీపరిభాష నేఁడు ని
న్నక్కడి కేఁగు మంచు వెలయాలినిఁ బోలె వివేకహీనుఁడై
తక్కక యేమిగాఁ బనిచెఁ దంత్రివిభుం డిది యట్టు లుండె నేఁ
జిక్కినవాఁడ నాఁకట భుజింపఁగ నిమ్ము భవచ్ఛరీరమున్.' 294

వ. అనిన విని బెదరు గదురనిమదితో నమ్ముదిత యాయదయహృదయున కి ట్లనియె.

తే. 'కడఁగి యుదరాగ్ని యార్చుటకంటె నెక్కు, డైనసుకృతంబుగలదయ్య యసురవర్య
యోర్చియుండుము నీయాఁకలి దీర్చుదాన,నరిగి యిచ్చటనున్నట్ల తిరిగి వచ్చి.' 296

ఉ. నావుడు 'మేలుమే లబల! న న్నిట వెట్టులఁ బెట్టి నెమ్మదిం
బోవఁగఁ జూచె దీ వగునె బుద్ధివిహీనుఁడఁ గాను మోసపోఁ
బో విబుధు ల్సహాయ మయి పూని కడంగిన సంగరంబునన్
జేవ యడంచి పుత్తు నిను జెండి భుజింతును మాంసఖండముల్.' 297

క. అని దనుజుఁడు ధట్టించిన, వనజానన పల్కె 'నంతవాఁడవు గాదే
నిను నిప్పుడు గాదంటినె, విను యుక్తాయుక్తపదవివేకము వలదే. 298

క. ఆరయఁ బెద్దలు దుష్టా,హారము గొన రెట్టిచోట నవ్విప్రునితో
నారీతిఁ బల్కి బొంకిన, నీరోఁతశరీర మెట్టు లింపగుఁ జెపుమా. 299

ఉ. ఆతనిపాలి కేఁగి యనృతావ్యయదోషముఁ బొందకుండ సం
ప్రీతునిఁగా నొనర్చి సుచరిత్రత యొప్పఁగ నిందు వచ్చి ని
ష్పాతక మైనమే నొసఁగఁ బంచిన వేడ్క భుజింతు గాక ధ
ర్మేతరునట్లు నీ కిచట నేటికి నిట్టివృథావివాదముల్.' 300

చ. అనవుడు దైత్యుఁ డి ట్లనియె 'నాడినయట్టుల చేయువారలుం
బనివడి మున్ను గొన్నటుల పైకొని యప్పులు దీర్చువారలుం
బొనరినమేలుగీడులకుఁ బొంగక క్రుంగక యుండువారలున్
మనుజులలోన నుత్తము లమర్త్యులు మెత్తురు తచ్చరిత్రముల్. 301

ఆ. అట్టిమనుజు లుర్విఁ బుట్టరు పుట్టిన,యేని నెందుఁ దఱచు గానఁబడరు
వెల యెఱుంగరాని విపులార్ఘరత్నము, లుదధియందు నొదిగియున్నయట్లు. 302

వ. కావున సూనృతవ్రతనిరతు లగుట దుర్లభం బదియును గాక. 303

క. బొంకుల కెల్లను మూలము, పంకజముఖు లట్టినిన్నుఁ బాటిగఁ గొనినన్
గ్రుంకిడి యరుగుదు గాకే, వంక మరలి చూచి చేర వాలాయంబే,' 304

వ. అనినం జిఱునవ్వు నవ్వుచు నవ్వనిత యి ట్లనియె. 305

చ. 'ఒకఘటికాద్వయంబుపని కూరక యింతవిచార మేల? యిం
చుక యిటు నిల్చి నానిజము చూడు నిశాచర! భూమి తోయపా
వకపవనాంబరంబులు దివంబులు రాత్రులు సాక్షి నాదుమా
టకు నిది గాక నీమన సొడంబడ నే శపథంబు సేయుదున్.' 306

వ. అనిన నమ్మగువకు రక్కసుండు వెక్కసపడి యి ట్లనియె. 307

క. 'నడిరేయి నిదురముంపున, నొడ లెఱుఁగక యున్నయతని నుగ్రగతిం బై
పడి పొడుచు క్రూరనరుఁ డేఁ, గెడుగతి కేఁగెదు సుమీ మగిడి రా కున్నన్.' 308

చ. అనవుడు నట్ల కాక యని యాసతి విప్రునియింటి కేఁగి య
ల్లన నతఁ డొంటి యున్కిఁ బదిలంబుగఁ జూచి సమీపమందు ని
ల్చినఁ గని బిట్టుబిట్టుఁ దనచిత్తము జల్లన మోముఁ దేఱకోఁ
గనుఁగొని 'యింత ప్రొద్దిటకుఁ గామిని రాఁ గత మేమి?' నావుడున్. 309

క. 'విను మెఱిఁగి యెఱిఁగి నీ వి, ట్లనఘా! న న్నడుగ నేల యలనాఁటం గో
రెను నీకోర్కికి మీఁదె, త్తినసాయకావనము నుద్ధృతిం గనుఁగొన వే.' 310

చ. అనవుడు నద్దిరన్న మగనాలవు రాజతనూజ వీవు మ
జ్జనకునిశిష్యురాలవు పొసంగునె యెంతకు నెత్తికొంటి యో
వనిత! నమశ్శివాయ తగువారలబిడ్డలు నిట్టినీచవ
ర్తనముల కియ్యకొందురు గదా యిటువంటివెపో ప్రమాదముల్. 311

క. కులహానియుఁ గులవృద్ధియుఁ, గులవనితలు మెలఁగునట్టికుచరిత్రములం
బోలు పగుసుచరిత్రములం, దలకొనుఁ గాక మఱియెవ్విధంబునఁ గల్గున్.' 312

చ. అనవుడు నవ్వధూటి హృదయంబునఁ గొండొక లజ్జ నొంది యా
యన యొకశిష్టువోలె నిటు లాడెడు వీనికి మాఱు పల్కకుం
డినఁ దగ దంచు ని ట్లనియె డెందము చందము నీకు నెట్లొకో
కనుఁగొన వల్లనాఁడు తమిగాంచి ప్రబుద్ధుఁడ వైతె యింతలోన్. 313

క. ఎఱుఁగనివారియెదుర బలె, నఱిముఱి మెఱమెచ్చుమాటలాడఁగ నేలా
నెఱవాది వగుదు నీలా, గెఱుఁగమె మునిముచ్చుఁదనము లేమిటి కింకన్.' 314

చ. అనిన నతండు 'నీవు మనుజాధిపనందన పెట్లు పల్కెన
న్నినఁ గలవాఁడఁ గాక మఱి నీ కెదు రుత్తర మేనుఁ జెప్ప నే

ర్తునె యిటులైన మమ్ము నృపతుల్ తగువారలు నాదరించు టె
ల్లను వృథ గాదె నామదిఁ గలంపక పొమ్మని పల్కెఁ బల్కినన్. 315

క. విని యిత్తఁ డెయ్యదియుఁ దెలియంగనిముగ్ధుఁడు వోలెఁ బల్కఁగాఁ దొడఁగె మనం
బున నింతయేవ గల్గిన, నను మును బాసగొనఁ గారణం బేమి యొకో. 316

తే. ఉక్కు దగురూప మెక్కించుకొనినపిదప, మొఱుఁగకుండినఁ బోవ దిత్తఱి నితండు
తొడఁగి తా నొకధీరచిత్తుండ వోలె, నన్నుఁ జులుకఁ గాఁ బలుకుచు నున్నవాఁడు.

వ. నాఁటిభాషాపాశంబులం దగిలి యత్తగులు దీర్చుకొనవచ్చిన నిచ్చపలస్వాంతుం డెంతయుఁ దెలియంగఁ దయ్యె నే నింతయుఁదాసీనంబున కోర్తునే యెట్టివాఁడును నీను పుట్టింపక కలంగఁడు కలంగినంగాని కార్యంబు లేల దని యూహించి వాని కవ్వనిత యి ట్లనియె. 318

సీ. 'సన్న్యస్తచిత్తులసంసర్గఁ గరకకాయలు కొన్ని నమలితో యంతకంత
కళసంబు దఱిఁగి దేహము క్రొవ్వు చెఱచితో యిల్లాలికన్నుల కింత వెఱతొ
యిటునటుఁ బోసని యేయింతి కైనను బాసలు చేసితో బలిమిగాను
వీథులఁ దిరుగంగ వెసఁ దలారులు పట్టి కొజ్జాను జేసిరో సజ్జవారి

ఆ. యూర కేల నన్నుఁ జేర వింత విరక్తి, పరుఁడ వెట్లు నన్నుఁ బట్టి పెనఁగి
తల్లనాఁడు నాఁటియుల్లంబుపోగరు నేఁ, డెందుఁ బోయె మదనుఁ డేమి యయ్యె.

క. అటుగాక దుష్టనిగ్రహ, పటుబాహాబలుఁడు నాదుభర్త యగుట న
న్నిట నీవు గదియ నోడెదొ, కటకట మగతనము లేదుగా నీయందున్. 320

క. వెఱవకు మల్ప్రియునకు ని, త్తెఱఁగెఱిఁగించి మఱియరుగు దెంచితి నీ పీ
పిఱికితన ముడిగి నను డ, గ్గఱుమా పోవలయుఁ నాకుఁ గడుఁ దడ వయ్యెన్.' 321

ఉ. నావుడు సాధ్వియిండు 'మును నా కటు చేసినబాస దప్ప కి
ట్లీవనజాక్షి వచ్చి తగ నిప్పుడు నెట్టుకొనం దొడంగె నే
నేవిధిఁ ద్రోచువాఁడఁ బరమేశ్వర! మారవికార మెత్తి యా
త్రోవకుఁ జొచ్చితి న్మొదల దోషముగాఁ గొని యిప్పు డోడెదన్.' 322

చ. అనుచు నృపాలపుత్త్రి పదనాబ్జము గారవ మొప్పఁ జూచి 'మ
జ్జనకుఁడు నీగురుం డగుటఁ జామ సహోదరి వీవు నాకు నే
రనిపని చేసి నాఁ డటులు రాఁగ మెలర్పఁగ నిన్నుఁ గొంగు ప
ట్టినదురితంబువాయుటయె డెప్పర మైనది యంత చాలదే. 323

క. నీపంతము చెల్లించితి, నీపతికడ కేఁగు మింక నీమాన్యతని
ష్ఠాపారీణత జగమున, దీపించుం గాక సంస్తుతికిఁ బట్టగుచున్.' 324

క. అని దీవించిన నవ్వుచు, వినయంబున మ్రొక్కి యతని వీడ్కొని వేడ్కన్
జను దెంచె బాల యేలొకొ, చనిరాదని దనుజుఁ డాత్మ సంశయపడఁగన్. 325

వ. అట్లు చను దెంచినయారాజపుత్త్రి నిర్వికారభావంబు నిరీక్షించి యారాక్షసుం
డి ట్లనియె. 326

ఆ. 'తావి గొననిపుష్పదామంబువిధమున, జిడుముఁ బడనిమావిచిగురు భంగిఁ
ద్రావఁబడనినవసుధాధారపగిదిని, జెలువఁ జూడ సురతచిహ్న లేదు. 327

క. ఇతరు లెఱింగినఁ దిరిగితొ, యతఁ డచ్చట లేఁడొ నీకు నతనికి మాటల్
గలిగూడక యుండిన వృచ్చితొ యంతయు నున్నరూపు చెపుమా నాకున్.' 328

వ. అనిన నయ్యసురకు నబ్బిసరుహనేత్ర యిట్లను 'నీ విప్పుడు చెప్పిన యంతరాయంబు
లెయ్యవియు లేవు మద్భాగ్యనిమిత్తంబున నతనిచిత్తంబు ధర్మాయత్తం బగుటయు
నావెట్టి దిరిగి సహోదరింగా నన్ను మన్నించి మరలించిన నీయాఁకలితీర్చుటకు
నతిత్వరితంబున నిటకే తెంచితి. 329

గీ. ఇంకఁ దడవు సేయు నేటికి నసురేంద్ర!, జిహ్వా తృప్తితో భుజింతు గాక
నాశరీర' మనుచు నాతి యాతనిసమ్ము, ఖమున నిల్చె ముఖవికాస మెసఁగ. 330

క. నిలిచినఁ గని వెఱఁగందుచుఁ, దల యూఁచి కరాంగుళంబుఁ దనముక్కుపయిం
జెలువుగ నిడుకొని 'దానవకులమున నేఁ బుట్టి చనఁటికుక్షికిఁ గాఁగన్. 331

ఉ. చంపితిఁ బెక్కుజంతువులఁ జాన! భవత్సము లైనసత్యవా
క్సంపదఁ గల్గు వారిఁ బొడగాన దురాత్ముఁడ నైననాకు సి
ద్ధింపక యున్న దుర్గతి సుదృష్టి యెలర్పఁగ శుద్ధదేహిఁ గా
వింపఁ గదమ్మ!నన్ను' నని వేగమ వ్రాలెఁ బదద్వయంబుపైన్. 332

వ. ఇట్లు వ్రాలిన. 333

క. 'అన్నన్న! యేలయిటువలె, నన్న! మిగులఁ బ్రొద్దు వోయె నాఁకొని కృశమై
యున్నాఁడ' వనుచు నెత్తెఁ బ్రసన్నవదన యగుచు హస్తజలజాగ్రమునన్.

క. ఎత్తిన లేచి కరద్వయి, మెత్తి లలాటమున మోపి యిందుముఖి య
త్యుత్తమధర్మపథమునకు, నుత్తునిఁ గావించి కార్యయుక్తిఁ దెలుపవే. 334

క. విను నీసూనృతనిష్ఠయుఁ, ఘనుఁ డగునీమగనిపెంపుఁ గడపట నవ్వి
ప్రునివైరాగ్యంబును నా, మనమునకుఁ బ్రమోదరసనిమగ్నతఁ జేసెన్. 335

వ. కావున నాకు ధర్మోపదేశంబుచేసి పురాకృతదుష్కృతంబులకు నిష్కృతి గావింపు
మనిన నవ్వనిత యిట్లను 'నీవిప్పుడు తృప్తిపడితుఁడవై యున్నవాఁడ వస్మదీయదే
హంబు బాహారంబుగాఁ గొని తృప్తుఁడవై మఱి నీ వెవ్వరిచేతనైనను నుపదేశంబు
గొనుము శరీరమాద్యంఖలు ధర్మసాధనం బనుట వినవే' యనినఁ జెవులు మూసికొని

యతండు 'తల్లీ!నీ విట్లానతిచ్చుట యుచితంబె భవత్సాన్నిధ్యంబు నాభాగ్యవిశేషం
బునం బొడమె నాయొక్కకలీఁగె సుడివడకుండ నీవిమలవాక్యజాలం బనుప్రాకు వెట్టి
ప్రోదిసేయుదు గాక యుపేక్షించుట రక్షకులలక్షణంబె' యనిన నాదనుజేంద్రు
నకు మనుజేంద్రనందన యి ట్లనియె. 336

క. 'రక్కసు లెక్కడ ధర్మం, బెక్కడ మేయూరి కరయ నేత్రోవ మనం
బెక్కడికి నీడ్చె నీడ్చిన, యక్కడి కరుగంగ నైన యట్లయ్యెఁ దుదిన్. 337

క. అది గాక ధర్మమార్గము, వదలక చనుబుద్ధి నీకు వాలాయంబై
యొదవిన నెట్టనఁ దగఁ జె, ప్పెద విను' మని చెప్పఁ దొడఁగె బింబోష్ఠి యొగిన్.'

ఉ. 'బొంకకు మెన్నఁడున్ దనుజపుంగవ! శాంతి వహించి యుండు మే
వంకను జీవబాధ లగువాని నొనర్పకు శౌచివై గతా
హంకరణుండవై ఘనదయామతివై విజితేంద్రియుండవై
పంకజనాభదివ్యపదపంకజభక్తిపరాయణుండవై. 339

ఉ. నెమ్మది నుండు నీకు నిది నేమ మిహంబుఁ బరంబుఁ గోరువా
రిమ్మహి నెవ్వరేనిఁ బరమేశు రమారమణీశు యోగిహృ
త్సమ్మతు సర్వలోకహితు సచ్చరితు న్మదిఁ గొల్వ రట్టివా
రెమ్మెయి నైనఁ గానఁ గలరే కలదే మఱి దిక్కు వారికిన్. 340

క. హరిభక్తివిరహితుం డగు, నరుఁ డసురాంశంబువాఁ డనంగను విందుర్
హరిభక్తి గల్గెనేని న్నసుర యైనను దేవతాంశజుం డనఁ బరగున్. 341

వ. తొల్లి ప్రహ్లాదవిభీషణాదు లగునసురపుంగవులు హరిభక్తినిరతు లగుటంజేసి
యెంతెంత వారైరి వా రిప్పుడు రాక్షసు లనవచ్చునె వైష్ణవధర్మంబునకు సాత్త్విక
గుణంబు ప్రధానం బగుఁ గాని కులంబు ప్రధానంబు గాదిది పరమరహస్యం బని
యుపదేశించి నాయొద్దఁబాటు చెల్లెఁ బొమ్మని మరలించి యతని వీడ్కొని చూ
డ్కులు దళుకొత్త నత్తన్వి నిజేశుపాలికిం జనియె నయ్యసురయుం నదిమొదలుగాఁ
గ్రూరకర్మంబులు విడిచి హరిచరణస్మరణంబ శరణంబుగాఁ దపంబు చేసి వైకుంఠ
ప్రాప్తుం డయ్యె నయ్యింతి యిట్లు సని తంత్రిభూనాథునకుఁ దనపోయివచ్చిన వృ
త్తాంతం బంతయుం జెప్పిన విని యతండు దనయతిపసూనృతోక్తియుం బ్రాహ్మ
ణునివిరక్తియు నసురవరునిభక్తియుం దలపోసి సంతోషించుచుండె నంత నయ్యిరు
పురయంతఃకరణశుద్ధికి మెచ్చి శ్రీవిభుండు. 342

సీ. ఉభయపార్శ్వంబుల నొగిఁ జంద్రబింబంబు సూర్యమండలమును శోభితముగ
నొక దొడ్డచుక్కయు నొకయింద్రధనువును నేక దేశంబున నిం పెలర్ప

నిడుపారి వెడలుపై నెఱిఁ జుట్టి వచ్చిన సౌదామనీసముచ్చయము దనరఁ
దనరున నీలాంబుదం బుర్వి కేలొకో చనుదెంచె నన శంఖచక్రములును
తే. కౌస్తుభంబును వనమాలికయును మెఱయఁ, బీతవస్త్రంబుతోఁ బురుహూతనీల
కాంతిఁ దనువొప్పు నత్యంతకరుణ నంబుజాక్షుఁ డాదంపతులకుఁ బ్రత్యక్షమయ్యె.

గీ. ఇట్లు ప్రత్యక్ష మగుటయు హృదయపీఠములందు భయభక్తిసంభ్రమహర్ష రసము
లంతకంతకు నుప్పొంగ నవనతాంగులై నమస్కృతు లందంద యాచరించి

చ. కరములు మోడ్చి హర్షపులకంబులప్రోవు లనూనగద్గద
స్వరములపుట్టినిం డ్లనఁ బ్రవర్ధిత బాష్పజలంబు కాలువల్
భరితవిలాసవల్లికలపాదులు నా నతిరమ్యమూర్తులై
పరగుచు నవ్వధూవరులు ప్రస్తుతి యి ట్లని చేసి రవ్విభున్. 345

సీ. 'ధూర్జటిమౌళికిఁ దొడ వైన పన్నీటియే యంఘ్రితలమునఁ బాఱె నేని
భువనైకకర్తయై పొల్చుబాలునిఁ గన్న వెలిదమ్మిబొడ్డున మొలిచె నేనిఁ
బరిగణింపఁగరాని బ్రహ్మాండనికరంబు నుదరదేశంబున నుండె నేని
సంపత్ప్రదంబులై సొంపారుచూడ్కులయెలనాగ యురమున నిలిచె నేని
తే. ధ్రువు విభీషణుఁ బ్రహ్లాదు ద్రుపదపుత్రిఁ, గాచినట్టి ప్రభావంబు గల్గె నేని
గాక నినుఁ బోలువేల్పు లేలోకమందు, నూర కేల కల్గుదురు పయోరుహాక్ష ! 346

క. నీకంటెఁ బరము లేదు వి, వేకింప ముకుంద ! వేదవేద్యులు నీది
వ్యాకృతి ప్రతిదివసము నా, లోకింపుదు రంతరంగలోచన శక్తిన్. 347

క. నినుఁ దలఁప నెల్లదురితము, లునుఁ బొలియు దవానలంబులో వైచినమె
త్తనిదూది పోలె నిన్నుం, గనుఁగొన్నఫలంబు చెప్పఁగా నేల హరీ ! 348

క. కోరికల కెల్ల నెక్కుడు, కోరిక యగు మోక్షలక్ష్మిఁ గోరక యైనం
జేరుచు భవదీయపదాం, భోరుహములు నమ్మియున్న బుధులకుఁ గృష్ణా !' 349

చ. అని కొనియాడుదంపతుల కాజగదేకగురుండు ప్రీతి ని
ట్లను 'మహి నేరికిం బడయ నబ్బనిసూనృతనిష్ఠ మీమనం
బునఁ జలియింప కున్కిఁ గృప పుట్టె వరం బొక టిత్తు వేఁడుఁ డీ'
రనిన మహాప్రసాద మని యచ్యుతలోకము వేఁడి రిమ్ములన్. 350

ఉ. వేఁడిన నట్ల కాక పృథివిం జిరకాల మభీష్టసౌఖ్యముల్
పోఁడిగ మీరు గాంచి మఱి పొందెద రుద్ధతి' నంచుఁ జెప్పి యా
వేఁడివెలుంగు లోలిఁ బదివేలసహస్రము లున్నభంగి నె
వ్వాఁడు వెలుంగు నట్టిబుధవత్సలుఁ డేఁగె నదృశ్యమూర్తియై. 351

క. ఆరమణీరమణులు నిం,పారఁగ బహువత్సరంబు లైహికసుఖముల్
గోరి యనుభవించి తుదిన్, జేరిరి హరియందు సుప్రసిద్ధము గాఁగన్. 352

ఉ. కావున సత్యవాక్యము జగంబున నెక్కువ యండ్రు సర్వథ
ర్మావళియందు నిట్టిసుమహాత్త్వమునం గలసూక్ష్మధర్మ మేఁ
బ్రోవఁగఁ ద్రోతు నయ్య చెడఁ బొందికగాఁ గ్రియమాలి' యంచు న
గ్గోవు ప్రియంబునం బులికిఁ గొంకక చెప్పినచంద మంతయున్. 353

చ. గొనకొని బ్రహ్మరాక్షసునకున్ మనుజేశ్వరనందనుండు చె
ప్పె ననుచు సిద్ధపుంగవుఁడు ప్రీతి జనింప నుపన్యసించె భో
జున కని యత్రిపుత్రుఁడు విశుద్ధచరిత్రుఁడు విస్తరించినన్
విని మహుఁ డంతరంగమున వేడుక తీఁగె లెలర్ప నిట్లనున్. 354

ఆ. "ఇంత యొప్పునయ్య యితిహాసచాతురి, శ్రుతిసుఖంబు నాత్మహితము నగుచు
. జాదులును హరిప్రసాదంబు నైన నేఁచంద మిదియు నట్టిచంద మయ్యె." 355

వ. అని కొనియాడి 'తదనంతరకథా ప్రసంగం బెట్టి'దని యడిగిన. 356

ఉ. కారణసింహవక్త్ర! యలికస్థితచారునిమీలితాక్ష! శృం
గారరసాధినాయక! యఘప్రకరాంధతమోనిరాసనీ
రేరుహమిత్ర! దానవసరీసృపభంగవిహంగరాజ! వృ
త్రారిముఖాష్టదిక్పతినదార్చితపాదసరోరుహద్వయా! 357

క. అద్వంద్వ! యప్రతర్క్య! జగద్వంద్య యనాదినిధన! గర్వితదితిపు
త్రద్విపసింహకిశోర! నిమద్వరజదళాయతాక్ష! సన్మణివక్ష! 358

తోటకవృత్తము. ధరణీధర! నిర్జితదైత్యవరా!, శరణాగతరక్షణ! చారుగుణా!
సురయూథసమర్చిత! సూరియుతా!, పురుషోత్తమ! శాశ్వతపుణ్యతమా! 359

గద్యము. ఇది వాణీవరప్రసాదలబ్ధవాగ్వైభవ తిక్కనామాత్య సంభవ సుకవిజనవిధేయ అనంతయనామధేయ ప్రణీతం బైనభోజరాజీయం బను కావ్యంబునందుఁ బుష్పగంధి రత్నమండనులవిరహతాపంబును 'మూషకోపాఖ్యానంబును బ్రాహ్మణమాహాత్మ్యంబును రత్నమండనువివాహంబును బ్రహ్మరాక్షసగ్రహణంబును గోవ్యాఘ్రసంవాదంబును రజకాంగనాసంగమంబును వరాహజన్మప్రాప్తియుఁ దన్నిష్కృతియును మదనరేఖ సత్యవ్రతనిరతియుఁ దదుపదేశంబున దైత్యుండు ధర్మచిత్తుండై వైకుంఠప్రాప్తుం డగుటయు నన్నది చతుర్థాశ్వాసము.

శ్రీ

# భోజరాజీయము

## పంచమాశ్వాసము



దేవీహృత్సరసిరు
హాదిత్య! సమస్తదేవతార్చితవిలస
త్పాదాంబుజ! శ్రీమత్తుల
సీదళదామాభిరామ! శ్రీనరసింహా! 1

వ. అవధరింపుము దత్తాత్రేయమునీశ్వరుం డానరేశ్వరున కిట్లనియె నట్లా భోజరాజు నకు సర్పటిసిద్ధుండు వినిపింప రత్నమండనకథాలతకుం బాయుగొన యగుగోవ్యాఘ్ర సంవాదంబునందు మదనరేఖచరిత్రం బిప్పుడు చెప్పంబడియెఁ దదనంతరప్రసంగం బాకర్ణింపు మయ్యితిహాసంబు చెప్పి యప్పశురత్నం బాపులివక్త్రంబు చూచి 'నీవు 'నన్ను నమ్ము' మనికిం జేసి యిట్లు సత్యవ్రతోదాహరణంబు చేసితి నింక నేమి సేయుదుఁ జెప్పు మనిన. 2

చ. అనితరసాధ్యసత్త్వ మగునవ్వనసత్త్వము గోవుఁ జూచి యి
ట్లను 'నిపు డీవు చెప్పినమహామహిమం గలపుణ్యురాలికిన్
దనరఁగ నగ్రజన్ముఁ డగుధన్యుఁడు పావకలోముఁ డెట్టివ
ర్తనములవాఁడు? వానిసతి దా నది యెట్టిది? నాకు జెప్పుమా!' 3

చ. అనవుడుః జెప్పెద న్వినుము మృగాధిప పావకలోముతండ్రి కిం
జనవరిప్రియైనమంత్రి జనసన్నుతుఁ డొక్కసువర్ణకారకుం
డనయము వానికిం దనయుఁడై గుణహీనుఁ డొకండు కుంభి నాఁ
జనునతఁ డగ్నిలోమునకు జానగునిష్టసఖుండు మేదినిన్. 4

క. ఒకనాఁ డయ్యిరువురు నుది,తకుతూహలవృత్తిఁ జేసి ధనువులు నస్త్ర
ప్రకరములు దాల్చి నగరాం, తికవనవాటికలఁ గేలిఁ దేలుచు నుండన్. 5

క. హయములు గరులును రథసం, చయమును వివిధాతపత్రచామరములు నై
పయనపుసిరి యుజ్జ్వలముగఁ, బయి తెరువున నరుగుభూమిపాలశ్రేణిన్. 6

వ. కని తద్వనప్రాచీనోపాంతంబున నిల్చి సమీపవర్తు లగుజనంబులం బిలిచి 'వీర లెవ్వ రేపని కెట పోయెద రెఱింగింపుఁ' డనిన వార లిట్లనిరి. 7

చ. 'వనధిగభీరుఁ డొక్కఁ డజవత్సుఁడు నాఁ గలఁ డాతఁ డున్కి నా
ట్యనగర మానరాధిపుప్రియాంగన మేఖల దానికూఁతు పే
రనుమతి తత్స్వయంవర మహోత్సవనిరీక్షణకౌతుకంబునన్
జనియెద రిమ్మహీపతులు సైన్యసమన్వితులై రయంబునన్. 8

చ. అరయఁగ నెల్లి సూర్యుఁ డుదయంబుపయిన్ ఘటికాద్వయంబునం
బరిణయలగ్న మేతఁడవుఁ బట్టము తద్విభవంబు చూచి వే
మరలఁగ వచ్చు మీరును గుమారవయస్కుల రివ్వనంబులోఁ
దిరుగఁగ నేమి సిద్ధి యరుదెం డిది యుక్తము గాదె' నావుడున్. 9

క. రాకొమరుఁడుఁ గుంభిసుతుఁ డా భూకాంతులతోడ నాట్యపురి కేఁగిరి భూ
లోకవిహారముఁ గోరి దివాకరశశధరులు గూడి వచ్చి రనంగన్. 10

వ. అప్పు డప్పురంబునందు. 11

సీ. వజ్రదీధితులు భాస్వద్వారి పూరంబు భూషణోత్థితరజఃపుంజ మిసుక
ధవళనీలారుణాతపవారణములు సితాబ్జనీలోత్పలహల్లకములు
నింద్రనీలపుఁ జేరు లిందిందిరశ్రేణి శస్త్రాస్త్రరుచులు మత్స్యవ్రజంబుఁ
జలితచామరములు కలహంసములు మణిద్యుతులు రక్తాబ్జసంతతులు గాఁగ
తే. నెలమిఁ దత్స్వయంవరమున కేఁగుదెంచి, యున్న రాజన్యసమితిచే నొప్పు మిగిలి
యుండె నారాజమార్గంబు నిండుఁగొలని, భంగిఁ గలమంజులాలాపబహుళ మగుచు.

వ. అయ్యవసరంబున. 13

సీ. అజవత్సుఁ డొకయంత్రహంసంబుఁ దెప్పించి యాహంసయుక్త మనర్ఘ్యరత్న
మయ మైనపదకంబు నయమునఁ గీలించి యొక సౌధవేదిపై నునిచి తనదు
తనయ శృంగారించి కొని వచ్చి యాపక్షిమీఁద నెక్కింప నామృదులహస్త
హస్తాబ్జమునఁ దారహారంబు శోభిల్ల నఖిలమర్త్యులకుఁ బ్రత్యక్ష మైన
ఆ. వాణివానికీరవాణి: బిసశ్రోణి, నలినినీలవేణి నలరుఁబోణి
నట్టు లెత్తి చూచి రందఱుఁ దమతమనయనవిస్తృతులు లాగి బయలుపడఁగ. 14

క. ఆవేళ నమ్మహీపతు, లీవనజదళాయతాక్షి యిఁక నెవని కగున్
భావింప నతఁడ తగుఁ బో, భావజసామ్రాజ్యపట్టభద్రుఁడు గాఁగన్. 15

క. అనువారు నవ్వధూమణి, తనక తనక యబ్బు ననుచుఁ దత్పరులై క
న్గొనువారు మనుజలోకం, బున కిచ్చెలువంబు క్రొత్త పొమ్మనువారున్. 16

వ. ఇత్తెఱంగునం దమతమచిత్తంబుల కెట్లు దోఁచె నట్ల పలుకుచున్న యన్నరనాథ
లోకంబు నాలోకించి సారాసారవివేకదక్షుం డగు నజవత్సుండు సకలమహీభార

ధిరణసమర్థం బగు తనహస్తం బెత్తి కలకలంబు వారించి వారి కి ట్లనియె. 17

ఉ. 'అంబరవీథి నీకృతకహంసిక వాఱఁగ నీనికంఠభా
గంబునఁ బొల్చురత్నపదకం బొకదివ్యశరంబునందు లీ
లం బడినేసి యాత్మీతితలంబుపయిం బడకుండఁ బాణిప
ద్మంబునఁ బట్టు నేనృపుఁ డతండు వరుం డగు మత్తనూజకున్.' 18

క. అని పలికినంత విప్రులు, మును పెట్టినపుణ్యలగ్నమున హంసం బా
వనితావతంస మగున, య్యనుమతి మోచికొని పాఱె నంబరవీథిన్. 19

చ. తడఁబడ నప్డు డొండొరులఁ దాఁకుచు దిగ్గన లేచి విండ్ల నె
క్కిడియెడువారు నెక్కిడక యేయఁ దొడంగెడువారు నెద్దియుం
దడవక విండు లెత్తి బెడిదంబుగ మీఁదికి వైచువారు సం
దడిఁ బడ లేక పాసి యుచితస్థితిఁ జూచుచు నుండువారలున్. 20

క. మిడుతలగతి సురగరువలిఁ, బొడమినకాకాకుగములపోలికి జెక్కల్
వడసినభుజగంబులకై, వడిఁ దఱచుగ నమ్ము లేయువారును దివికిన్. 21

చ. గొనకొని రాజు లేయుశరకోటి పరస్పరఘట్టనంబులం
దునుకలు వ్రక్కలీనెలు చిదుర్పలు తుత్తుమురై పడంగ నె
వ్వనికిని నిల్వరాక నలువంకలఁ బాఱెడువారు వారణం
బును దురగంబుఁ జాటుగొనఁ బోయెడువారును భీతచిత్తులై. 22

క. ఈతఱచుటంబగము లా, నాతిఁ దగులకుండ ము న్నొనర్చినగేహీ
భూతరచన గడుమెఱసెం, బో తిరముగ ననుచు మెచ్చి పొగడెడువారున్. 23

క. వడి గల్గి హంసగతికిం, గడవఁ బఱచువారు నదియ గతిగా నాసల్
విడిచి తమతమపురంబుల, కెడపక చనువారుఁ దిరిగి యేసెడువారున్. 24

సీ. అజనతుఁ డేమిగా నఖిలభూపతుల రప్పించి మాయలు పన్ని బేలుపఱచె
నరపతుల్ సింహాసనస్థులై యుండఁగ నోలి నొక్కొక్కనియూరుఁ బేరుఁ
గులమును బలమునుఁ దెలియఁ జెప్పఁగఁ దనమనసు వచ్చినవాని మగువఁ గోరు
నీది స్వయంవరమార్గ మిటు సేయ నొల్లక యందఱ నడకించె నౌర వీఁడు
ఆ. వీనిఁ జుట్టుముట్టి వీనిప్రాణంబులు, గొనక పోవ మనుచుఁ గినియు వారు
నింత సేయ నేల యిది రాచపాడిగా, దనుచుః బ్రాధవమున నరుగువారు. 25

వ. ఇవ్విధంబున నవ్వసుధేశు లందఱుం దమతమకన్నుగలింబోవనటపోవుహంసంజూచి
రాచఠనంబునకు నీచత ఘాతుండ నింతట నాఘోరుషంబు నెఱపవలయు నని సమద

సామజగమనంబున సతి గడవం బోయి విక్రమాభిరాముం డగుపావకలోముండు.

సీ. ధనువుక్రిందటికొమ్ము ధరణిపై మోపి మీఁదటికొమ్ము వామహస్తమునఁ బట్టి
తత్తఱపడక తద్దండమధ్యంబు దక్షిణజానుకరములఁ జేసియొత్తి
యపసవ్యకరమున నయ్యెక్కుఁ గదియించి ప్రియమున నారి సారించి చూచి
ధరణియు నభము దిక్తటములు నొక్కటఁ దల్లడపడ గుణధ్వని యొనర్చి

తే. శరము సంధించి దృష్టి లక్ష్యమునఁ గూర్చి, సీలఁ బుచ్చినలీల నక్కీలు ప్రిదుల
నేసి నేలపైఁ బడకుండ నెయిది పట్టి, పక్షమునఁ దాల్చెఁ బదకంబు నాక్షణంబ.

క. ఆలీలాహంసమునకుఁ, గీ లప్పదకంబ యనఁగ క్షితితలమునకుక్
వ్రాలె నది యతనిదృగ్రుచి, జాలంబున కింపుఁ బెంపుచాతుర్యగతిన్. 28

ఉ. అంబరవీథి నాఁడు ఝషయంత్రము నేసినక్రీడిఁ దొల్లి మో
దం బలర స్వరించు ద్రుపదక్షితిపాత్మజభంగిఁ బ్రీతిపూ
ర్వంబున నగ్నిలోమజనవల్లభునిం దగఁ జేరి వానికం
ఠంబున వైచెఁ గాంతినిబిడం బగుహారము రాజపుత్రియున్. 29

గీ. అంత నక్కుంభి తనయాత్మ నింత లేసి, రాజు లిట్లైరి తనశరమా జయంబు
గొనఁగ వ్యర్థుఁడై పోయెఁ గాకనుచుఁగొంత,తడవునకువచ్చెనారాజతనయుకడకు.

ఉ వచ్చి కృతఘ్నుఁ డప్డు నిడువాలికకన్నులు ముద్దుమోము నే
యొచ్చెము లేనిదేహలతయుం గలకోమలిఁ జూచి లోలుఁడై
యెచ్చట మోసపుత్తునొకొ యీనృపపుత్తుని నెప్పుడొక్కొ యే
నిచ్చపలాక్షి నెత్తుకొని యేఁగుదు నా కిర వైన-చోటికిన్. 31

క. అని యూహించుచు మిథ్యా, వినయంబును రిత్తనగవు వెడమ్రొక్కులపె
ల్లును డక్కరిమాటలతఱి,చును నాఱడిసంభ్రమంబుఁ జూపె సఖునకున్. 32

చ. అతఁ డవి కృత్రిమంబు లని యాత్మ నెఱుంగక నిత్యసౌహృద
స్థితిఁ జెలికానిఁ జూచి 'యిటు చేకుఱె నాకు ననర్ఘ్యరత్నశో
భిత మగునవ్విభూషణముఁ బ్రేమరసోదయహేతువైన యీ
యతివయుఁ' నంచుఁ జెప్పె దరహాస మెలర్పఁగ నెమ్మొగంబునన్. 33

క. చెప్పిన విని 'దేవా! నీ, కిప్పుడు రాఁ బ్రాప్త మైనయివి యెవ్వనికిం
దప్పింప వశమె బ్రాతిగఁ, జెప్పుదు నిచుఁ గూర్చి యేమి చిత్రము చెపుమా.' 34

చ. అని కొనియాడి యిప్పు డితఁ డాదట నప్పురి కేఁగె నేనిఁ ద
జ్జనపతియుం బ్రధానులును సర్వజనంబులు వీనియూరుఁ బే

రు నెఱిఁగిపోదు రప్పు డొకరుండును గైకొనకుండు నన్ను మ
న్మనమున నున్న యిప్పని యొనర్చుటకు న్మతి సందు లేదగున్. 35

క. అటుగాన యీకుమారునిఁ, గుటిలాలకఁ జొప్పు దప్పఁ గొనిపోవక యుం
డుట కార్యము గా దనుచుం, జొటచొటఁ గన్నీరు దొరఁగఁ జుట్టమపోలెన్. 36

ఉ. పావకలోముఁ జూచి పెనుఁబాటు మొగంబునఁ దోఁపఁ గుంభి శో
కావిలచిత్తునట్ల మెల పారఁగ నిట్లను 'రాచవారలుం
దేవులు నిందు నీవు చనుదెంచు టెఱుంగరు చెప్పి రాము వే
పోవకయున్న నెవ్వగలఁ బొందరె నీపొడగాన కుండుటన్. 37

క. కొలఁదిపడదు పెండిలివే,డ్కలతో నిట్లుంటి మేని కడుఁదడవౌనున్
వెలికి వెలియఁ బోద మనుచుఁ, దొలఁగఁగఁ గొనిపోయెదంపతులఁ బెడత్రోవన్. 38

క. పులు లెలుఁగు లడవియేనుఁగు, లలరెడుసింహంబు లాది యగుమృగములచేఁ
దలచూపరానివిపినం,బుల ని ట్లడ్డంబు గాఁడిపోవఁగ నొకచోన్. 39

చ. అతివకు నీరువ ట్టయిన నంతరభేదకుఁ డొటఁ గుంభి ద
త్సతినొక మ్రానినీడ నిడి శైత్యజలంబులు దెత్త మంచు భూ
పతిసుతు నొక్కదిక్కునకుఁ బంపుచుఁ దా నొకదిక్కు వోయె నా
కృతకమతంబు లెల్లఁ బరికింపఁగ నెన్నటి కింకఁ దక్కెఁ బో. 40

ఆ. రాచకొడుకు తిరిగి రాకుండ మున్న నా, నేర్పు మెఱయ వలయు నీళ్ళపట్టు
దయ్యె మెఱుఁగు ననుచుఁ దా నెందుఁ బోవక, మగిడి వచ్చి కుంభి మగువతోడ. 41

ఉ. 'అల్లదె కంటె యొక్కజలజాకర మేమియు దవ్వు లేదు నీ
వల్లభుఁ డెంత ప్రొద్దునకు వచ్చునొ చెట్టులఁ జిక్కుఁ గాని నీ
యుల్లము రాఁ జరించుటకు నోపెడునంతటివాఁడు గాఁడు నీ
వల్లన రమ్ము నావెనుక నచ్చటఁ జూపెదఁ బెక్కుతోయముల్.' 42

మ అని గర్భోక్తులు పల్కి యాతరుణి ను గ్రారణ్యమార్గంబునం
గొనిపోవంగ 'నదేమి? కుంభి! యిట నాకుం ద్రావ నీ రెద్ది? యా
యన యేపోకలఁ బోయెనో? తడవ వేలన్నా! కడుం దూర మి
ట్టు ననుం దెచ్చితి కల్లఁ జేసి' తనుచున్ డోలాయమానాకృతిన్. 43

క. అమ్ముగ్ధ సొలసి పల్కిన, 'నమ్మకు నీ రేమి భ్రాంతి యటు నాల్గడుగుల్
రమ్మా డస్సితి ననక ధృ,వమ్ముగ నీమనసు పట్టువాఁడ లతాంగీ!' 44

క. అని కైదువుఁ బరిఁజించుచు, ననువరి గదరన్న కుంభి యని నీతిజ్ఞుల్
విని మెచ్చ వలదె వదకముఁ, గొనియె నతఁడు నాకు దీనిఁ గొను టనుచితమే. 45

తే. నాకు బాలకి రెండును నాఁచికొనిన, నేల పోనిత్తు నెట్లైనఁ బాలు గొందుఁ
గాక యని మల్లచఱచుచుఁ గసరుముట్టఁ, బలుకనక్కుంభిఁజూచి యాజలజనయన. 46

ఉ. గమ్మన కన్నునీ రొలుకఁగా నపు డిట్లనుఁ 'బాపకర్ముఁడా !
నమ్మితిఁ గాక నీ విటులు న న్నదకించుట యె ట్లెఱుంగుదుం
బొమ్మని యాతనిం దొలఁగఁ బుచ్చితి నీకుల పేరు చెప్పి నకొ
బిమ్మటఁ దెచ్చి కాఱడమిఁ బెట్టితి నీకిది మిత్త్రధర్మమే ?' 47

వ. అని శోకాకులచిత్తయై పలుకఁగా నక్కుంభి 'యేలమ్మ ! న
వ్వీన నీవీక్రియ నెగ్గుపట్టెదవు నే విశ్వాసిఁ జుమ్మమ్మ నీ
వనుమానింపక వేగ రమ్మనుచు మిథ్యాలాపము ల్పల్కఁగాఁ
గని యత్యుగ్రపురక్కసుం డొకఁడు వీఁక న్వచ్చె నచ్చోటికిన్. 48

ఉ. వచ్చి యనర్గళస్ఫురితవైర మెలర్పఁగఁ 'బోకు పోకు నీ
వెచ్చటి కేఁగె దింక నిను నిప్పుడ యుక్కడఁగింతు' నంచు వా
పుచ్చి యదల్చుచుఁ గనవభూజమునం దనుజుండు వ్రేయఁగాఁ
జొచ్చినఁ గుంభి దా మరలి చూడక పాఱె మహారయంబునన్. 49

వ. అట్లు పాఱిన. 50

ఉ. పోటరులే నరుల్ బెదరిపోయినఁ బోయెను గాక వాఁడు నా
కోటకు వచ్చునో మిగులఁనో సతి వచ్చినఁ జాలు నల్పుఁ డే
కాటికిఁ బోయె నేమి యనుకైవడిఁ దా నటు పోక దైత్యుఁ డా
పాటలగంధి నెత్తుకొని పాఱె నభశ్చరుఁడై రయంబునన్. 51

ఉ. రావణుబారిఁ జిక్కినధరాసుతచాడ్పున భీతి నొంది వా
పోవుచుఁ బోవుచో నృపతిపుత్త్రునకుం దనపోక చెప్ప భూ
దేవికి లంచ మిచ్చినగతి న్సురవైరి యెఱుంగకుండ రా
జీవదళాక్షి యప్డు వయిచెం దనమైతొడవుల్ గ్రమంబునన్. 52

సీ. అంతఁ బావకలోముఁ డటపోయి నిర్మలోదకపూర్ణమై యొప్పు నొకమహాత
టాకంబుఁ గని తనడప్పి యంతయుఁ బోవ జలపాన మొనరించి సరభసమున
నచ్ఛిద్రసరసీరుహచ్ఛదంబునఁ గొంత యుదకంబు నినిచి యయ్యువిద కనుచుఁ
గొనివచ్చి మున్ను దా నునిచిపోయినచోటఁ దరళాక్షిఁ గానక తల్లడించి

ఆ. దెసలు కలయఁ జూచి తిరిగి వచ్చియుం లతా, కుజము లరసి యెల్లగుహలయందు
వెదకి యోలములు వివేకించి చఱుల ఘ్రా, ణించి గొల్లములకుఁ బంచె దృష్టి. 53

క. ఎందునుఁ గానక తద్దయు, వందురి యెలుఁగెత్తి పిలిచి 'వనజముఖీ! నీ
వెందున్నదానవే? యీ, చందంబునఁ బిల్వఁ బల్కఁ జనదే నీకున్. 54

మ. ఉదకంబు ల్వెసఁ దేక యేఁ దడవుగా నున్నంతఁ గోపించి యొ
క్కెడ సందాఁగితొ? నాదుచిత్త మరయంగా నీరము ల్దూఱితో?
పొదలం బువ్వులు గోయఁ బోయితొ? మృగంబుల్ సంచరింపంగఁ జూ
చి దిగు ల్వొచ్చి తొలంగఁబాఱితొ? ననుం జింతింప వేలే మదిన్?' 55

వ. అని యనేకప్రకారంబులం బ్రలాపించి తన యరణ్యరోదనంబునకు నొండుగతి లే
కునికిం జేసి తన్నుందా నుపశమించుకొని నాచెలికాఁడును రాఁడయ్యె నట పోయి
వానిం గూర్చుకొని కార్యాలోచనంబు సేయవలె నని యూహించి యారాజనంద
నుండు. 56



చ. పడఁతుకఁ గానలే కునికిఁ బాయని నెవ్వగఁ జేసి యెంతయుం
సుడివడి తాఁకుచుం దగులుచుం గడుదూరములందుఁ జొచ్చి పో
యెడు నెడఁ గుంభి వచ్చె నొడ లెల్లఁ జెమర్పఁగ మల్లుకంపలం
బడి తలచీర చీరఁబడి పాఱినభావము దప్పకుండఁగన్. 57

ఉ. వచ్చిన 'నెంతద వ్వరిగి వచ్చితొ నీళులు గానవో కదే
యొచ్చెల! నిన్నుఁ జూచి వగ నొందెదుఁ జిత్తము త్రావు' మంచు దాఁ
దెచ్చిననీళ్ళు వానికి నతిత్వరితంబునఁ బోసి 'చూచితో
యొచ్చటికేఁగెనో యబల యేఁ బొడగానను దొంటిచక్కటిన్.' 58

క. అని గద్గదకంఠంబున, వినిపించినఁ గుంభి దాను వికవిక నగుచుం
'గనుతిరుగలి గా కాసతి, మనపెట్టినచోట లేక మఱి యెం దరిగెన్. 59

ఉ. కందువ దప్పినాఁడ వతికాముకభావము నీకుఁ గల్మి నే
పొందు నెఱుంగ వైతి వనభూములఁ గామిను లొంటిఁ బోదురే
మందవివేక! నీవు పదమా వెడమాటలు మాను నీకుఁ ద
త్సుందరిఁ దొంటిచోన తగఁ జూపెదఁ బాపెద నీమనోవ్యథన్.' 60

క. అని యతని భ్రమయ నడపుచు, మును దత్సతి నిల్పి చనినభూజముకడకుం
గొనిపోవ నచట నది లే, కునికిఁ బునశ్శోకవహ్ని నుల్ల మెరియఁగన్. 61

ఉ. 'ఓచెలికాఁడ! నీవు నను నూరక తెచ్చితి గాక మున్ను నా
చూచినచోటు గాదె యిది చూడఁగఁ జాలక యాలతాంగిఁ బోఁ
ద్రోచెఁ జుమీ విధాత' యని దూలెడుపావకజోమునఁ జూచి యా
నీచు మనంబులో నగుచు నిక్కమ యాప్తుఁడ పోలె నిట్లనున్. 62

ఆ. 'ఇంక వగవ నేల యిది నానిమిత్తమై, వచ్చినట్టిదుర్వ్యవస్థ గాదె
నెలఁతయొద్ద నిన్ను నిలిపి నీళ్ళకు నేను, బోనితప్పు గలిగె భూపతనయ! 63

ఆ. చిత్తగింపు మబల చేతప్పిపోయిన, యపుడె పోయెఁ గాక యడిచిపడిన
నెచటనుండి వచ్చు నీగతోదకసేతువులఁ బ్రయోజనంబు గలదె తండ్రి!' 64

చ. అనిన నతండు 'నీకు నిటు లాడుట యుక్తమె కుంభి! నాదు నె
మ్మనమున మర్త్యులందును నమర్త్యులయందును నిట్టికాంత లే
దని తలపోతు నట్టిసుభగాకృతి యే మఱవంగ నేర్తునే
చని పరికింపఁగా వలయు శైలగుహాగహనాంతరంబులన్.' 65

క. అని యతఁడు వెదకఁ దొడఁగినఁ, గని కుంభియు నంతనంతఁ గా ళ్ళీడ్చుచుఁ బి
ల్చినఁ బదియెలుఁగుల కొకమఱి, మునుకుచు పలసియునునొల్ల ములుసను దెంచున్. 66

క. తనచేఁత నృపతిసుతుఁ డెఱిఁ, గినఁ బై వచ్చునని పుల్లగిలి పోఁ జూచున్
వనసత్త్వము లత్యుగ్రం, బున మెదలఁగఁ జూచి పాఱిపోవను వెఱచున్. 67

ఆ. అతనిఁ దిరిగి చూచి యకట నావెనువెంట, నితఁడు తిరిగి తిరిగి యెంత డస్సె
ననుచు నిల్చి చూచికొనుచుఁ బావకలోముఁ, డతివ వెదకుచుండె నడవులందు. 68

చ అరయఁగ దండకాటవిఁ బ్రియాంగనఁ గోల్పడి శోకతప్తుఁడై
తిరిగెడురాముఁ బోలె గణుతింపఁగఁ బావకలోముఁ డప్పు డ
ప్పురిసరవర్తియై పరగుపాపచరిత్రు సుమిత్రపుత్రుతోఁ
సరి యిడ రాదు గాని సతి జానకితో నెనవచ్చు నెంతయున్. 69

వ. ఇట్లక్కుమారవరేణ్యుం డరణ్యమధ్యంబునం బరిభ్రమించుచు నొక్కయెడ నయ్యింతి
యంతకమున్న దిగవైచిపోయినవిమలాభరణంబు లవ్వనలక్ష్మికిం గనకకుసుమోప
హారంబు గావించినచందంబున నందంబై చాలుపడియుండ నొండొండ పుచ్చుకొని
తనమనంబున ని ట్లని వితర్కించు. 70

క. శార్దూలాదిమృగంబులు, మర్దించిన నిచట రక్తమాత్రము వలదే
దుర్దముఁ డగుదనుజుఁ డొకఁడు, నిర్దయుఁడై యెత్తికొని చనియెఁ గా వలయున్.

క. అని యాందోళింపుచు న, వ్వనితాభరణములచొప్పు విడువక చనుచుం
గనియె నెదురుకట్టుల నొక, ఘనగండశిలానిబద్ధగహ్వర మొకచోన్. 72

మ. కని యాగుండు దొలంగఁ ద్రోవఁగ నశక్యం బైన నుద్వృత్తుఁడై
కనుఁగొం చుండఁగ నానగేంద్రముపయిం గప్పూరి ధూమంబు దోఁ
చిన నాచక్కటి కేఁగి చూచుడును దచ్ఛిద్రంబులో దవ్వులన్
వినిచెన్ మానవభాషణంబులు గడున్ విస్పష్టమై వీనులన్. 73

క. వినిచినఁ బావకలోముఁడు, మనమున నాశ్చర్య మంది మనుజులొ పాతా
ళనివాసులొ చూడవలయుం, నని తద్గమనేచ్ఛ దోవ నరుగఁగ నొకచోన్. 74

ఉ. సన్నపుగండి యొక్కటి రసాతలమార్గము పోలె నిమ్నమై
యున్న నతండు కుంభి వెలి నుండఁగఁ దా నసహాయశూరుఁడై
మిన్నక యందుఁ జొచ్చి చని మేడలఁ జారునికేతనంబులం
జెన్నగునొక్కప్రోలు గని చేరఁగఁ బోవఁగ నందులోపలన్. 75

క. సరిలేనియంజి సొగటా, లరు దగుజూదంబు నెత్త మచ్చనగండ్లన్
దిరమగునోమనగుంటలు, సరసత మెయి నాడుచున్నసతులం గనియెన్. 76

మ. కని యానిష్పురమంపుఁజోట నిటు లీకాంతాజనంబు ల్సుఖం
బున నేచింతయుం లేక వేడ్కలు మదిం బొంగార ని ట్లాడుచు
న్ననిమిత్తం బిది యేమియొక్కొ యనుచున్ భావించుచున్నంత నా
తనియే తెంచుట బిట్టుబిత్ఛ్కు గని కాంత ల్విస్మయాక్రాంతలై. 77

క. లేచి యెదురేఁగి లోచన,రోచు లలర నతనితోఁ దరుణు లిట్లని 'రే
లా చనుదెంచితి వుగ్రని,శాచరుఁ డొకఁ డిచట నునికి చర్చింప వొకో. 78

క. నిన్న నొకతరుణి నిచటికి, ని న్నీచుఁడు దెచ్చి తోలఁగ నిడి నెమ్మదితో
నున్నాఁడు నిదురవోవుచు, గన్నుదెఱవఁ డాఱునెలలు గడచనకున్నన్. 79

తే. కలదు వీనికి నొకచమత్కార మనఘ!, యితరపురుషుఁ డిచ్చోటికి నేగుదెంచె
నేని యొకజాములోనన మాను నిదుర, వాఁడు వధియించు నెంతటివానినైన. 80

క. కావునఁ బదివేలైనను, నీ వీయెడఁ దడవుగాఁగ నిలువవలదు పొ
మ్మా వెస' ననవుడు ని ట్లనుఁ, బావకలోముండు కార్యబంధురుఁ డగుచున్. 81

ఉ. 'చెచ్చెర నాకు నీవెఱపు చెప్పకుఁ డేను స్వయంవరంబునం
దెచ్చినకన్య నీయసుర దెచ్చె వెస న్ననుఁ గానకుండ నే
వచ్చితిఁ దన్నిమిత్తమయి వాని వధింపక రిత్తవోవ మీ
రిచ్చట నిట్టు లుండఁ గత మెయ్యది చెప్పుఁడ నాకు' నావుడున్. 82

ఉ. ఖేచరుఁడై నిశాచరుఁడు కేవలసాహసుఁ డొంటి వచ్చి మా
యాచణభావ మేర్పడఁ ద్రియామల నిద్రిత లైనరాజక
న్యాచయముం గ్రమక్రమమునం గొనివచ్చి దురాత్ముఁ డిందులో
నైచినవాఁడు తానటె వివాహము గాఁ గలఁడట్టె మీఁదటన్.' 83

క. అని తమ తెఱఁ గంతయుఁ జెప్పి 'నరోత్తమ! యిందు వచ్చి పెక్కండ్రు నృపుల్
సని రిట మున్ను యమాలయ,మున కిద్దానవునిచేత బుద్ధిరహితులై. 84

ఉ. కావున బుద్ధిఁ జెప్పెదము గైకొనుమీ యసురాధముండు దా
లేవకమున్న నీ వితని లేమ వధింపుము భార్య చచ్చినం
జేవ యడంగు నీ పటులు సేయక మూర్ఖుని పోరి తేని నా
దేవత లైన వీనిఁ గడ తేర్పఁగ లేరు భుజాబలంబునన్.' 85

మ. అనినం బావకలోచనుం డాసతుల మోమర్థి న్నిరీక్షించి మే
దినిఁ బ్రాణేశులు చచ్చినం గులసతుల్ తెంపారఁ బ్రాణంబు లి
చ్చినచోటు ల్గనుఁగొందుఁ గాని యెచటన్ సీమంతినుల్ భావఁ దో
డన తారున్న ఎతిఁ బొందుపల్లభులఁ జూడ న్వింత లీవాక్యముల్. 86

ఉ. కూరిమిఁ జేసి వీఁడు తనకోమలి చచ్చినఁ జచ్చునంటి రా
కారణ మేదియోఁ గల దగ్గిగ నా కెఱిఁగింపుఁ డన్న నం
భోరుహనేత్ర లి ట్లనిరి 'భూపతనూభవ! చిత్తగింపు మీ
క్రూరనిశాచరుండు మును ఘోరపుఁగానల వేఁటలాడుచున్. 87

క. తనచేత వ్రేటుపడి యొక, వనకరి పాఱంగ వీఁడు వాతూలరయం
బున దానివెనుకఁ దగులుచుఁ, గనియె రతిక్రీడ సలుపుకపిదంపతులన్. 88

మ. కని యాచక్కటిఁ దేలిపో నొకబృహత్కాండంబుఁ దా నేసి నే
సిన నయ్యస్త్రము దీవ్రమై మృతి యొనర్చెన్ మర్కటస్త్రీకి దా
ని నిరీక్షించి తదీయభర్త విరహాగ్నిన్ వేఁగుచుం జెల్లఁబో
దనుజుం డి ట్లపకీర్తి గట్టుకొను నే దర్పంబు పెంపొందఁగన్. 89

క. మృగములు పదివే లుండఁగ, మృగయారతిసొంపు దెంపుమెయి నొకశాఖా
మృగవనితమీఁదఁ జూపుట, తగవే దీన నగుదొడ్డతన మేదియొకో. 90

ఆ. సురతవేళ నీనుచో నిద్రవోయెడు, నెడలఁ గ్రేపు చన్ను గుడుచుతఱిని
దప్పి వచ్చి నీరు ద్రావెడుచోటఁ గ్రూరంపు మృగము నైనఁ జంపరాదు. 91

ఆ. జిహ్వ కింపు గానిచేఁదుకాయలు ద్రెంప, నేల పాఱువైవ నేల పిదపఁ
గుడువఁ దినఁగ లేనికోఁతిమాంసముతోడి, దేమి వేఁటలాడ నెడము లేదె. 92

వ. అని దూఱుచు నలుదిక్కులుఁ దిరిగి చూచుచు. 93

చ. తనులత యుచ్చి పోవ బెడిదంబుగఁ గొన్న నిజాస్త్రవేదనన్
వనచరకాంత బె ట్టులికి నాథునికౌఁగిలి వాసి కీచుకీ
చని కడు జమ్మరించుచు రయంబునఁ దత్తరుశాఖనుండి మే
దినిఁ బడి చచ్చుచో నసుర దేరకొనం గనుఁగొంచు నుండఁగన్. 94

ఉ. వానిమొగంబుఁ జూచి 'బలవంతపుఁబాపము దెచ్చుకొంటి వే
లా నగుఁబాటు కోర్చి యబలం బడనేసితి నీకు నేమి కీ
డేని యొనర్చెనే మృగయుఁ డెవ్వరు నిట్టియధర్మవృత్తికిం
బూనరు నీకు నీతలఁపు పుట్టుట చిత్రమురా నిశాచరా ! 95

సీ. ఏఁ దపోధనుఁడ నీయింతి నాయింతి యిద్దఱము నీరూపముల్ దెలియఁ దాల్చి
కేళి సల్పుచునున్నకీ లెఱుంగక క్రియాహీనుండవై చావ నేసి తబల
నీపాపమునఁ జేసి నీపత్ని కాయుధమరణంబు రాఁగ నత్తరుణిచావు
విని నీవు దానితోడనె కూడఁ బితృభర్తసదనంబుఁ జొరు' మని శాప మిచ్చి
ఆ. వనితఁ దొడలమీఁద నునిచి నెమ్మొగము చూచుచు నితాంతదీనవచననిచయ
మెసఁగఁ బనవి పనవి యసువియోగము నొందె, వనచరాంగుఁ డైనమునివరుండు.

క. కావున వీనికి సతితోఁ, జావు నవశ్యంబు నీవు జాణఁడ వైతేఁ
గావింపు మవ్విధం' బని, వేవేగమ చెప్పి రంతవృత్తాంతంబున్. 97

ఉ. చెప్పిన నాఁడుఁగోఁతి దెగి చేసినపాతక మిట్లు సేయ కే
నిప్పుడు వీనిఁ దాఁకి వధియించెద నన్న నసాధ్య మంటిరే
చొప్పున గెల్తు వీని నెటు చూచిన దెప్పర మైన దిండులో
నెప్పని సేయఁ బాడియొకొ యెవ్వరుఁ గా దనకుండునట్లుగన్. 98

చ. అని తలపోయుచో నసుర కంతియ కాలము గాన దానిఁ జెం
దినకపిరూపసంయమిసతీవధపాపము ప్రేరకమ్ముగా
మనమునఁ దెంపు పుట్టుటయుఁ మారశరంబులపాలు చేసె మ
ద్వనితను వీఁడు వీనివనితం బడనేయక కోప మాఱునే. 99

మ. అని యాతాటకిమీఁద నట్లు రఘురామాకార మేపారఁ బా
వనుఁ డప్పావకలోముఁ డాతనిగృహద్వారంబు వే చొచ్చి య
ద్దనుజుం జెందినభాగ్యదేవతక్రియం దన్వీసమూహంబుతో
ఘనసింహాసన మెక్కి యున్నయసురిం గన్నారఁగాఁ జూచుచున్. 100

చ. దనుజుఁడు మాయలాఁడు మృదుతల్పమునం బవళించి నిద్రవో
యినక్రియ నందఱ న్మొఱఁగి యిక్కడ నెమ్మది నున్నవాఁడు వా
ని నెలవు గంటి నన్నటులు నిష్ఠురబాణము నంది దానిహృ
ద్వనజము నాఁట నేసెఁ బెఱవామవినేత్రలు విచ్చి పాఱఁగన్. 101

ఉ. ఏసిన నింతి నొచ్చి నెలుఁ గెంతయు రాల్పడఁ గోపజృంభణం
జేసి ముఖాబ్జ మొప్పఁగ 'నిసీ ! మగవాఁడవె నీవు నీదుబా

ణాసనము న్మహాస్త్రనిచయంబును గాల్పుము గొంచుఁబోయి నేఁ
జేసినతప్పు లేదు ననుఁ జెన్నఁటి! నీ విటు లేయఁ గూడునే. 102

తే. బ్రాహ్మణులు గోవు లతివ లర్భకులు వీర, లేమి త ప్పొనరించిన భూమియందు
శాస్త్రమతమునఁ దగినశిక్షయ యొనర్పఁ,టుచిత మగుఁగాని చంపఁగాదుగ్రగతిని.

ఉ. నాదెసఁ దప్పు చెప్పఁబడినం బదిలంపుఁబరీక్షమీఁద నాఁ
గా దనువాఁడు నామగఁడు గాక నరాధమ! నీవు కర్తవే
యీదురుపక్రమం బిచట నెవ్వరు నీ కుపదేశ మిచ్చి రే
లా దయ లేక యిందు నగులాభము చెప్పిరె యెద్ది యేనియున్. 104

క. వేడుక పుట్టినఁ జని నీ, యీడున్నృపాత్మజులతోడ నెక్కటికయ్యం
బాడఁగ రాదె పగఱపై, దాడి యిడఁగ రాదె బలవితానముతోడన్. 105

ఉ. ఓరిదురాత్మ! నీభుజబలోద్ధతి యింతటఁ దీఱదేని ని
ద్రారతుఁ డైనమత్పతిఁ దిరంబుగ మేల్కనఁ జేసి వానితోఁ
బోరఁగ రాదె య ట్లగురుఁబోఁడుల నేమఱిపాటఁ జంపినం
బేరును బెంపునుం గలదె పృథ్వి నెఱుంగవె వీరధర్మముల్. 106

క. అట యెట యేనియుఁ గొనిపో, చటులాహవకేళి కేను శరచాపము లం
దుట యెదురు పడుట గని మఱి, యిటు చేసితొ కల్ల చేసి తేలా మాటల్.'

తే. అనిన నారాజనందనుం డల్ల నగుచు, 'నతివ! నినుఁ జేర వచ్చిన నడిచి పడియె
దన్యవనితలఁ జెఱదెచ్చునపుడు బుద్ధి, చెప్ప వలవదె నీభర్తఁ 'జేరి' యనియె. 108

సీ. కర్ణరంధ్రముల నీకరణి నసహ్యవాగింధనంబులు నిండ నిడుటఁ జేసి
యంతరంగంబున నంతటఁ గలయఁ బ్రవృద్ధమై మీఁదికి వెడలునట్టి
కోపాగ్నిశిఖలు పెక్కువగాఁగఁ దీక్ష్ణంపుఁజూపులు నిగుడ నసురవధూటి
విస్ఫులింగంబులవిధమునఁ జూరచురఁ దాఁకుబింకంపుటదల్పు లెసఁగ

తే. నోరి పాపాత్మ! నన్ను నీ వూర కిట్లు, పొరిగొనుటఁ జేసి కరములుఁ జరణములును
నఱకఁబడియుండఁ బొమ్ము నీకఱకు లెల్లఁ, జక్కనగు నంతదా' నని శాప మిచ్చె.

వ ఇట్లు శపించినం దపించుడెందంబుతో నృపనందనుం డసురసుందరికి నభివంద
నంబు చేసి 'నాచేసినయపరాధంబు సహింపుము శాపావధి యెవ్విధంబున నగు నను
గ్రహింపు' మని ప్రార్థించినఁ బ్రసన్నచిత్తయై. 110

క. దనుజసతి యతని కిట్లనుఁ, 'బొనరఁగ భువి కేఁగుదెంచి పుష్పాపచయం
బొనరించుగిరిజయడుగులు, నినుఁ జోఁకిననాఁడు శాపనిష్కృతి గల్గున్.' 111

వ. అని మఱియు నతనిపశ్చాత్తాపంబు చూచి తదుపశమనార్థంబుగా నతని కిట్లనియె.

క. 'నీ వేమి సేయు దిది మును, దేవాహితుఁ డైనమత్పతికి వాసరనా
రీవధశాపనిమిత్తం, బై వచ్చినతీవ్రశాప మది వృథ యగునే. 113

క. బాణము పెఱుకుము తనువునఁ, బ్రాణంబులు నిలువ' వనిన రాసుతుఁ డదియున్
శోణితముగఁ బెఱుకఁగ నలి, వేణి తదుత్థితదురంతవేదనవలనన్. 114

వ సురసుర స్రుక్కుచు నాత్మగతంబున. 115

క. దానవవిభునంతఃపుర, మానిని యట యునికి దుర్గమస్థల మట య
చ్చో నట నరపాలధను, ర్జ్యానిర్గతబాణనిహతి యట బాపు విధీ. 116

క. అని తనచావున కెంతయుఁ, మనమున నాశ్చర్యపడుచు మ్రాఁగన్నిడుచుం
దనసఖు లాక్రందింపఁగ, దనుజాంగన ధర్మదేవతాపురి కేఁగెన్. 117

వ. అంత నప్పావకలోకమందు తీవ్రధాముండునుం బోలెఁ బ్రతాపదీప్తుం డగుచు నచ్చోటు వాసి వచ్చి కుంభకర్ణుండువోలె నిద్రించియున్న యసురకు దీర్ఘనిద్ర గావింపం బూని కదిసి యిట్లున్న యునికిన వధియించుట పౌరుషంబుగా దని యమదండంబు వోనియంఘ్రిదండంబున వానియెదురురొమ్ము దన్నినఁ దన్ను మైసఱచి మేల్కని పినపాటిగా నల్లన నీల్గుచు వాఁ డవ్వలి ప్రక్కయైనఁ జూచి కోపంబునఁ జాపంబు విసరి పీఁపు వ్రేసిన నులికిపడి పెడచేత్రం గన్నులుసిమికొనుచు లేచి కూర్చుండి తప్పక చూచి 'యోరీ! నీ వేయూరివాఁడ? విచటి కెట్లువచ్చితి? గుహాగేహగోళంబున విశ్రమించి యున్నసింహంబుతోడఁ జెనకుసారంగంబుభంగి నానిదుర చెఱిచితి వింక నెందుఁ జొచ్చెద?' వనుచు దంష్ట్రాధరోష్ఠదష్టుం డగుచు జంకించిన నతం డేమియు శంకింపక 'నీపెడబింకంబు లేల? నిశావేళయందుఁ గొంద ఱిందుముఖులం దెచ్చి ముచ్చేదనంబున నిచ్చో ముచ్చమఁనింగి యున్న నిన్ను మెయిమెయి నుండ నిత్తునే చెండి వైతుం గా' కనియె నాకడిందిరక్కసుం డతనిదిట్టతనంబు చూచి 'నీదగువీరాలాపంబులకు మెచ్చు వచ్చెం బిన్నవైన నగుదు గాకేమి యనన్యభేదనం బగునాపుటభేదనంబు సొచ్చి వచ్చితి కావున నీ వెట్లు పల్కినం గా దనక వినియెదం గాక నీ వేమి యంధకాసురభయంకరుం డగుశంకరుండవో మధుకైటభమర్దనుం డగుజనార్దనుండవో వృత్రవినాశనుం డగుపాకశాసనుండవో తలమాటు చాలని మనుజబాలుండవు నీవెంతవాఁడవు? నీపంతంబు చెల్లె నంతియుం చాలుం గ్రమ్మఱి నెమ్మదిం బొమ్మంతట నీ క్రొవ్వరుగ దేని నాలావు చూచెదవు గాని మంచిబంటవై నిలువుము పరిజనబాలురం గూడి యుండవిండ్లు పట్టుకొని పిట్టలనేసి యాడెడు విధంబు గాదు నాతోడికయ్యంబున కియ్యకొనుట యసిముసలకుంతక్షురికాదుల యందు నేయాయుధంబు నీకుం బరిచితంబై యుండు నది సవరించుకొని నాతో

డం దఱపడుదు గాని రమ్మనియె నమ్మాటకు నమ్మేటివిల్కాఁడు వీఁడు నిరాయుధుండై యున్న నే నాయుధంబునకుం జొచ్చుట యొచ్చెం బని తలంచి 'యస్మదీయబాణోరగం బింతకమున్న నీప్రాణేశ్వరిప్రాణవాయువులం గ్రోలి తృప్తినొంది యున్నయది నీతోడియుద్ధంబునకు నాబాహుదండంబు చాలు లేచి రమ్మనుచుం దనచేతివిల్లును నంపపొదులును నొకచో నిలువంజేర్చి భుజాస్ఫాలనంబు సేయుచుం బ్రతిఘటించినిల్చిన నతండదియ తనకుంగాలావధియని యెఱింగి పిఱుతివియక నివ్వటిలుకోపాటోపంబునం జేసి దిగ్గనలేచి కట్టాయితంబై విక్రమోపక్రమణంబుశోభిల్ల మల్లసఱచికొనుచుం బఱతెంచి భీమసేనుంబొదవుసింహబలుండనుచుంబోలె నతనిపైఁ గవిసె నయ్యవసరంబున హస్తాహస్తింబోరుహస్తియుగంబుపగిది నొండొరులం దెరలం ద్రోచుచుఁ జిందఱ రేఁగినపొగరుటాఁబోతులరీతి నొండొరులభుజంబులువీఁకం దాఁకించుచు మహరుకవిసినవనలులాయంబులపోలికం జిట్టుముట్టాడుచు సరోషమేషంబులపరుసున విడిచివిడిచి తలపడుచు బిరుదుగలకోడిపుంజులవిధంబున నొండొరుల శిరంబుల గొడియుచు మసగంబునకుఁ బెనంగుకొదమనాగులభాగున మేనులు సుట్టి నెట్టుకొని పెనంగుచు నుదకప్రవాహాగతకాష్ఠయుగ్మంబుపగిది నందంద క్రిందుమీఁదై పొరలుచుఁ బాదబాహాచతుష్టయంబులు నుత్తమాంగద్వితయంబునుం గలశరీరం బొక్కటియ కాని రెండుదేహంబు లని భేదింప సందు లేకుండునట్లుగా నంటఁ బట్టుకొని సమకాలపరిశ్రమంబునఁ గొండొకసేవు భూశయ్యపైఁ గన్ను మోడ్చుచు నాలోనన తెలిసి యదల్చుకొనుచుఁ బెలుచ నెగసి నిల్చుచు నోహటింపక దేహంబులు గొబ్బున నుబ్బించుకొని పిడుగు పిడుగుం దొడరువడువున బెడిదంబు లగు కడిందిపిడికిళ్ళకడిమి యదరించుచు నెక్కువతక్కువలు లేక యొక్కటి పోరు నమ్మేటిమగలయాటోపంబునకుం బాటిగా నస్త్రహస్తు లై రేని రామరావణులప్రతాపంబులు చెప్ప నొప్పుగు గదాదండపాణు లై రేని భీమదుర్యోధనులపరాక్రమంబులు పొగడం దగు నట్లు గాక సహజవైరంబులు విడువక కంసకంసాంతకులు క్రమ్మఱ జన్మించిరో శంబరశంబరాంతకులు పుట్టిరో యని యనుమానించునట్లుగా నసమానవయస్కు లయ్యును సమానబలులై పోరు నెడ నధర్మవర్తి యగుటం జేసి యసురయుసుఱు తోడుతోడన తఱుగఁ దొడంగిన నక్కుమారకంఠీరవుం డకుంఠితసత్త్వంబున వానిఁ గ్రిందవైచుకొని జానుముష్టిఘట్టనంబులచేత నచేతనావస్థకుం దెచ్చి సత్త్వహీనం బగుమూషకంబు నెగురవైచి యాడుమార్జాలంబునుం బోలెఁ గొంతదడవు వీరవినోదంబు సలిపి యధికరోషంబున నాదోషకారిం గడకాలు వట్టి ఖేచరప్రీతిగా బడిసెవైచుచొప్పునం ద్రిప్పి చట్టుమీఁదఁ జొనిపిముద్దవైచునట్లు చిద్దుదు

పలై చెదరునట్లుగా నేలతోఁ బైచి యఖర్వగర్వంబున నప్పర్వతంబు ప్రతిధ్వానభీ
కరఘోరం బగునట్లుగాఁ జేర్చి యార్చిన. 118

క. రక్కసుఁ డీబాలునిచేఁ, జిక్కెర మాకోర్కి నేఁడు సిద్ధించెర మా
మ్రొక్కెడుమ్రొక్కులు వేల్పుల, కెక్కెర యిన్నాళ్ళ కనుచు నింతులు ప్రీతిన్.

ఉ. గ్రక్కున నేఁగుదెంచి తనుఁ గాంచిన నందఱ నాదరించి యా
చక్కటి మున్ను దా నిడినచాపము నస్త్రసముచ్చయంబు నిం
పెక్కఁగఁ జేరి పుచ్చుకొని యెప్పుడొకో పతిఁ గాంతు నంచు నల్
దిక్కులుఁ జూచునయ్యనుమతిం గని పావకలోముఁ డి ట్లనున్. 120

చ. 'తనులత వాడె మాసె ముఖదర్పణ మొప్పగుమీననేత్రముల్
ఘనవిరహాశ్రుపూరములఁ గాంతివిహీనత నొందె నూర్పుగా
డ్పును వెదచల్లుచున్నది కఠోరమనస్కుఁడు బ్రహ్మ వాని నే
మని యిట దూఱువాఁడ వినుమా! యిటు సేయుట మానినీమణీ! 121

క. అమృతమయుం డగుచంద్రుని, యమలతనువు నాఁడునాఁటి కఱుఁగం బెరుగం
గమలఁగఁ జేసినబ్రహ్మకు, రమణీ! ని న్నెట్లు సేయ రాకుండెడు నే. 122

క. విను మది యట్లుండె నిఁకం, బనివడి కొనివచ్చినట్టిఫలము గుడువ న
ద్దనుజుఁడు గళత్రయుతముగఁ, జనియెను జముపురికి మద్భుజాప్రేరితుఁడై'. 123

వ. అని యుపలాలించి తనతోడనె కూడ మంగళస్నానంబు సేయించి విమలాంబరా
భరణశోభితంబు గావించి గాఢాలింగనంబున నయ్యంగన నపగతక్లేశం జేసి. 124

చ. నరకునిఁ జంపి వానిసదనంబున నున్ననృపాలకన్యలం
దిరముగఁ దెచ్చుకృష్ణునిగతిన్ శిఖిలోముఁడుఁ దత్సతీతతిన్
వరుస లెలర్ప ముంద రజవత్తునిపూఁతురు నిర్గమించినం
దరమునఁ గాచి యుండినప్రధానిసుతుండు మనోగతంబునన్. 125

మ. ఒకభంగిన్ నృపపుత్రుఁ గన్గొనఁగి యే నుగ్రాటవుల్ ద్రొచ్చి యా
సుకుమారిం గొనిపోవఁగా దనుజుఁ డచ్చోఁ నన్నుఁ బోఁదోలి యు
త్సుకరీతిం గొనిపోయె దీనిఁ దుది మత్పూర్వార్జితోదాత్తస
త్సుకృతం బీక్రియఁ దెచ్చి యిచ్చెఁ దరుణీచూడామణిం గ్రమ్మఱన్. 126

క. అనుచుఁ దదీయద్వారం,బునఁ బెనుగుం డొకటి ద్రోచి పూర్ణేందుముఖిం
గొనిపోయెఁ గుంభి యపు డవ్వనితారత్నంబు శోకవహ్ని నెరియుచున్. 127

ఉ. ఈమనుజాధముం డను నను నెయ్యెడ కీడ్చునొ వీని గెల్వ నా
కేమిమతంబు గల్గు నని యిచ్చఁ దలంచి యశీకవాసము

లోకమునఁ దోఁప నిట్లనియె 'ముద్దియ చేకుఱె నీకుఁ గోర్కి ర
మ్మా! మన మెట్టు లున్నఁ బెఱమర్త్యు లెఱుంగరు చన్న సన్నయున్. 128

ఉ. కావున నీవు మజ్జనకుఁ గాంచి స్వయంవరలబ్ధ యయ్యె నా
కీవనజాక్షి యంచు జనులెల్ల నెఱుంగఁగ నన్నుఁ జూపి యా
భూవిభుమన్నన ల్గనుట బుద్ధియె ముచ్చులు వోలె నొక్కెడన్
బోవుట మేలొ మత్పురికిఁ బోదము రమ్ము వికార మేటికిన్.' 129

వ. అని వెడ్డువెట్టిన నతండు చెల్వడి యట్లు చేసె నయ్యాజవత్సుండు మహోహార్ష చక్షుం డగుచు వానికి నున్నతాసనంబు వెట్టించి సభాసదులం గలయ నవలోకించి యి
ట్లనియె. 130

ఉ. 'వాలుమగ ల్మహామకుటవర్ధను లాఢ్యులు శస్త్రహస్తు ల
వ్వేళ నొకండు నాగగనవీథినిబాఱెడుహంసయక్కునన్
వ్రే లెడురత్నభూషణము వ్రేలను జూపఁగ లేక పాసి రీ
లాలితకీర్తి నిత్యశుభలక్షణుఁ డొక్కఁడు దక్క నందఱున్. 131

ఉ. వానికి నవ్వధూమణి వివాహము సేయ నుపక్రమింప న
మ్మానిని తండ్రిఁ జూచి 'వినుమా! యొకవిన్నప మప్పు డెవ్వరుం
బూని యొనర్పలేనిపని బోరనఁ దా నొనరించె మద్వరుం
డైనయతండు వేఱ యితఁ డాతనిఁ గొల్చినబంటు భూవరా!' 132

క. అని యప్పావకలోముఁడు. దనుఁ జేపట్టినది మొదలుఁ దా నచటికి వ
చ్చినయది తుదయుం గా దొరకొని యన్నియుఁ జెప్పెఁ బూసగ్రుచ్చినభంగిన్. 133

ఉ. చెప్పినఁ గూఁతుమాటలకుఁ జిత్తము ఘూర్ణిలఁ గుంభిదిక్కు దాఁ
దప్పక చూచె భూపతి యతండు గరంబులు మోడ్చి 'దేవ! యేఁ
జెప్పెద విన్ము నీతనయ చెప్పినమాటలజాడ యంతయుం
దప్పదు నన్నుఁ గాదనుటఁ దావినఁ బోలదు గాని యందులోన్. 134

క. మొదలం దను నేఁ బడసితిఁ, దుదిఁ దనుఁ గొనిపోయినట్టిదుష్టాసురునిం
గదనమున నేనె గెల్చితి, సుదతి భ్రమసెఁ గాని రాక్షసులమాయలచేన్. 135

చ అది మది నమ్మవే నచటి కల్పులు వోవఁగ లేరు సైన్యసం
పద మెఱయంగ నావెనుకఁ బార్థివశేఖర!నీవ రమ్ము చూ
పెదఁ గొనిపోయి యానెలవు భీషణమూర్తులు దైత్యు లాజికిం
గదిసిరయేని నాకుఁ బని గాదు సుమీ! మునుముట్టఁ జెప్పితిన్. 136

ఆ. సతులు ముగ్ధలైన జననాథ! మీరును, ముగ్ధులయ్యె యెట్టిమూఢుఁ డైనఁ
దగిలి యొడ్లచేత తనచేతగాఁ జెప్ప, నయ్య రిత్తపంది యుంబు లేల?' 137

సీ. అనిన నయ్యజవత్సుఁ డనుమతి చూచి 'యీయమృతంబు లేమిగా ననియె?' దనియె
నబల 'యెయ్యది దృష్ట మనియెః దజ్జనకుండు కల్పితహంసికాగళసమర్పి
తాకల్ప మేమయ్యె?' ననియెఁ దత్సుత రాజు దిరిగి క్రమ్మఱ గుంభినిక్కు చూచె
మొగ మెత్తి కొండొక నగియె నాతఁడు 'దీని కేమి మోసము గదా భూమియందు
ఆ. నిట్టిపనులు పుట్టునే యుండెనేఁ జూపఁ,గాదె?' యనియె నృపతి కల్ల కోపఁ
బడక మాఱి నెచటఁ బడియెనో వెలఁ జెప్పఁ దుచు నిమ్మవాఁడ ననియెఁగుంభి.

ఉ. నావుడు నయ్యసత్యవచనంబులకుం గలుషించి వీఁడు దో
షావిలమానసుం డెఱుఁగ రన్యులు వీనిమనంబు వీనిదు
ర్భావము చూచుచున్కిఁ గడుపాపము సుమ్మని నేత్రపట్టె మా
భూవరపుత్రి దాల్చె పగఁ బొందఁగ బంధుజనంబు లందఱున్. 139

మ. అజవత్సుం డిది పోలుఁ బోల దని కార్యాకార్యనిష్పత్తికిన్
నిజ మూహింప నశక్తుఁడై యపుడు వానిం జాప నొంపు బరి
త్యజియింపన్ మది నోడి తద్దయు నివాతం బైనచో సద్భట
వ్రజముం దోయము చేసి యున్న సుఖియై వర్తింపుచుండెం బురిన్. 140

వ. అంత నప్పావకలోముండు. 141

క. తలయెత్తి చూచి తనతో, య్యలిఁ గానక యెదుర నడ్డమై యున్నమహా
శిలఁ గని మది నద్భుతసం, చలములు దలకొనఁగ బహువిచారవివశుఁడై. 142

చ. 'దనుజునివంకవాఁ డొకఁడు డాఁ బగ నీఁగఁ దలంచి పొంచి యేఁ
జనుపథ మిట్లు చేసెనొకొ చంపెనొకో గుణశాలిఁ గుంభి నే
మనఁ గల దాసుమిత్రసుతుఁ డన్నపిఱుందఁ జరించువట్లు నా
వెనుకను వచ్చుచుండుఁ దది వీఁడును నేమయి పోయెనో కదే?' 143

వ. అని యతని నుద్దేశించి మఱియును. 144

చ. కవలును బోలె నొప్పుచును గౌతుక మందఁగ నీస్వయంవరో
త్సవ మను పేరు చెప్పి కడుదవ్వుగఁ దెచ్చె కృపావిహీనుఁడై
తివిరి దురంతదుర్దశలఁ దెచ్చె విరించి భవద్వియోగసం
భవపరితాప మేమిగతిఁ బాయునొకో యని విహ్వలింపఁగన్. 145

ఉ. ఆతనియార్తిఁ జూచి మనుజాధిపనందన లందఱున్ మనః
ప్రీతిగఁ దద్గుణావళులు పేర్కొని యి ట్లని పల్కె 'లేల యీ

రీతి నధీరున ట్లవధరించెదు తాల్మి వహించి లెమ్ము నీ
యాతతభాగ్యసంపదకు నడ్డము గల్గునె యెందు నెన్నఁడున్. 146

క. ఆపదలు గాఁపు లుండవు, చూపులకుఁ గులాద్రియట్లు చుట్టుకొనుఁ దుదిన్
రూ పేది విరిసి పోవు మహాపవనాహతపయోధరావలిభంగిన్. 147

వ. కావున నిశ్చింతుండవై మమ్మింతవట్టువారిని నీవారినఁగాఁ బరిపాలింపు' మనిన నీవేళ
కిదియ కార్యం బనుచు నతం డంద యుండె నంత నొక్కనాఁ డొకకిరాతుండు
వేఁటమెయి వచ్చి యచ్చేరువ మెలంగుచుండి మున్ను కుంభి యనుమతింబట్టి
బలాత్కారంబునఁ దిగిచి తోఁకొనిపోవునప్పు డప్పుడంతికరంబుననుండి యూడిపడి
తత్ప్రాంతం బంతయుం దనమయంబ కాఁ బ్రజ్వలించు నొక్క యనర్ఘరత్నంబు గని
పుచ్చుకొని యాశాబద్ధుండై మఱియు నే మేమివిశేషంబులు గందునో యని
పరికించుచు వాఁ డెదుర నగ్గుండు గని యెట్టకేలకుఁ దిరుగం ద్రోచి యామార్గంబున
బిలంబు సొచ్చి చని ధనుర్ధరుం డగుపావకలోముం గని వెఱచి పఱవం దొడంగిన.

చ. కనుఁగొని వానిభీతి యుడుగ న్మృదురీతి నెలుంగు సూపి గ్ర
క్కునఁ గదియంగ వచ్చి యిటకుం జనుదేరఁగ నేమి కారణం
బనవుడు నక్కిరాతుఁడు యథార్థము చెప్పుచుఁ జేరి మ్రొక్కి త
ద్ఘనమణి వాని కీయఁ దన కామినిరత్నముగా నెఱుంగుచున్. 149

చ. పొరిఁబొరి నొత్తుఁ గన్నులఁ గపోలయుగంబున నప్పళించుఁ జె
చ్చెర నధరప్రసక్తముగఁ జేయు గళంబునఁ గూర్చు గోర్కి చే
నురమున నుంచుఁ దుడ్చుఁ గడునొప్ప మనోభవభూతశాంతికై
యరుదుగ రతుపూస యఖిలాంగములం దిగమోపుచాడ్పునన్. 150

క. 'ఓరత్నమ! నాఁ డాత్రరు,ణీరత్నము నన్నుఁ బాసి నీవిచటను నే
పారఁగ నుండితి వే మన, మారాజీవాక్షిఁ గందుమా యింక?' ననున్. 151

వ. మఱియు ని ట్లని వితర్కించు. 152

క. అనితరసన్నిభ యగుమా,నిని నాకచ్చోట దొరక నేఁ దెచ్చెదుచో
ననుచితహేతుగుణంబులు, ఘనవిఘ్నచయంబు లగుట గానఁగ నయ్యెన్. 153

చ. అని తననాలిపోకకు నిరంతరచింత మునింగియు న్మనం
బునకును ధైర్య మూంచి పువుఁబోఁడుల కందఱకుం దగం బ్రసా
దనము దగంగ నిచ్చి వనితాసహితుండయి తత్పురస్సరం
బునఁ దనపట్టణంబునకుఁ బోయి ప్రణామ మొనర్చెఁ దండ్రికిన్. 154

వ. ఇట్లు ప్రణామ మొనర్చినకుమారుం గౌఁగిలించుకొని కరుణారసమిశ్రంబు లగు నశ్రులు కన్నులం దొఱుంగ గద్గదకంఠుం డగుచు నతని కి ట్లనియె. 155

క. 'ఇన్నాళ్లు నిన్నుఁ గానక, కన్నులు గల్గియును లేనిగతి నుండితి నే
నన్నా! నీ కిటు సేయఁగఁ, జన్నే నీయట్టిసుగుణసంపన్నునకున్. 156

క. పోయెదువాఁడవు తదభిప్రాయ మెఱుఁగఁ జెప్పి పోవరాదే నీకై
రేయును బగలును జింతాతోయంబులు వెల్లిఁబొరియఁ దోఁగితి పుత్రా! 157

చ. అది యటు లుండె దైవము దయం జుదెంచితి చాలు నింక నా
బ్రదుకు ఫలించెఁ గుంభి యట రాఁ డెట పోయెఁ దనూజ! యప్సర
స్సుదతులఁ బోలుపీ రెవటిసుందరు? లిచ్చటి కెట్లు వచ్చి రే
మి దయను? జెప్పు' మన్నఁ దమమిత్త్రునిపోకకు వెచ్చ నూర్చుచున్. 158

క. అనుమతి ప్రసంగ మెయ్యెడ, యనుఁ దడవక గుహకుఁ జనుటయును నచ్చో నీ
వనితలఁ గనుటయుఁ గుంభిని, ఘనగుహావాకిటను నిలువఁగా నుంచుటయున్. 159

ఉ. చెప్పి 'నృపాల ! యే నటులు చేసి గుహాంగ్గమనంబు సేయుచో
నప్పుడు మత్పదంబునకు నడ్డముగాఁ బెనుగుండు ద్రోచి యే
చొప్పుననొక్కొ యెవ్వఁడొకొ చొప్పడ నేమివిధంబొ యయ్యెమో
చెప్పఁగ జెట్ట లే నపటఁ జిక్కితిఁ గుంభియు నెందుఁ బోయెనో. 160

క. అచ్చోటఁ గొన్నిదివసము, లిచ్చెలువలు నేను నుండ నీ యర్జునకుం
డచ్చటికి వచ్చి వెలువడఁ, దెచ్చిన వచ్చితిమి భాగధేయము పేర్మిన్.' 161

క. అని చెప్పి తదనుమతి నృపనజాతుల నందఱకు వివాహంబై నూ
తనమన్మథుఁ డనఁగ నతం డనుదినమును మదనకేలి నలరుచునుండెన్. 162

చ. దితిజవధూటిభావమునఁ ద్రెక్కొనుదుఃఖము లెల్లఁ బోవఁగా
నితనికి నైనదిక్కొను నహీనదయామతిఁ జేసి మేనకా
సుతకును గల్గులాంఛనము చొప్పడఁగా ఘనయోగవైభవో
న్నతి నొకయోగికాంత నృపనందనుపాలికి వచ్చె వేడుకన్. 163

సీ. బాలారుణద్యుతిఁ బరగుజక్కువలలాగునఁ గావి బట్టబోఁగుచము లమర
నంగజుతురగంబునంకపన్నెలభంగిఁ జెలువంబులై వ్రేలుఁజెవులు మెఱయ
మరుఁ గన్నతల్లికి మందిరం బగుతమ్మివిరిలీల నెమ్మోము విలసితముగఁ
గాముఁ జంపినవేఁడికంటిక్రొవ్వడఁగించుచలిగంటిక్రియ ఫాలతిలక మమర

తే. నతనుఁ గ్రమ్మఱఁ బుట్టించునౌషధముల, చిప్ప నాఁగ భిక్షాపాత్ర యొప్పుమిగులఁ
జెలఁగి తన మ్రోల నిలిచినసిద్ధవనితఁ, జూచి నృపసూతి గొబ్బున లేచి మ్రొక్కి.

వ. అక్కాంతచేతం గృతాశీర్వచనుండై సబహుమానంబుగాః దెచ్చి కూర్చుండం బెట్టికొనిన. 165

క. వెనవులు గదలెం గదలవు, రదనంబులు గాన వచ్చె రా వనుపాటిన్
మృదువచనరచన లెసఁగఁగ, ముదిత యతనిహృదయకమలముం గరఁగించెన్. 166

వ. ఇవ్విధంబునం బూర్వరంగంబు లగుప్రసంగంబులు చెల్లెం దదవసరంబునఁ బావక లోముండు. 167

తే. 'ఎచటనుండి వచ్చి తిందుల?' కనిన నయ్యగ్నిలోమునకును ననియె వనిత
'సకలభూములందుఁ జరియింతు నే నిక్కడక్కడనఁగఁ గలదె యొక్కచోటు.'

క. అన విని 'నీవు చరించుచుఁ, గనినట్టివి వింత లేమి గల?' వని యడుగన్
గను మట్టు లైనఁ జెప్పెద, నని యి ట్లని చెప్పెఁ దాపసాంగన ప్రీతిన్. 169

చ. అనుమతి నాఁగ నాట్యనగరాధిపుఁ డయ్యజవత్సుకూఁతురా
కనకలతాంగిఁ దక్కమలగంధిని మున్ను స్వయంవరోత్సవం
బున వరియించినాతఁ డెట పోయిననో మఱి యొక్కఁ డేను బొ
మ్మని కొనివచ్చి తల్పితృసమక్షమున న్మదిరాక్షి నుంచినన్. 170

ఆ. వార లియ్యకొని వివాహంబు సేయ నుపక్రమింపఁ గొన్నివక్రభావ
లుచ్చరించి వీని నొల్ల వీఁ డెక్కడి, భర్త నాకు వీఁడు పాతకుండు. 171

క. నా పెళిమిటెఁ గనునంతకు, నీ పాపాత్మకునిఁ జూడ నే నిది మొదలం
చాపాలంతి నేత్రపట్టం, బేపారఁగఁ గట్టియున్న దెవ్వఁడు పతియో. 172

ఆ. రాతిబొమ్మ కైనఁ జైతన్య మొనరించి, కరఁగఁ జేయ వచ్చుఁ గాని మఱియు
రమణిదైన యంతరంగంబు గరఁగింప, నంగభవున కైన నలవి గాదు.' 173

క. అని చెప్ప నాతపస్విని, విని రాజతనూభవుండు వెఱఁ గందుచు న
య్యనుమతి నెవ్వఁడొకో తోడ్కొని చని కడుదుఃఖపఱిచెఁ గుత్సితవృత్తిన్. 174

చ. అని తలపోసి నెమ్మనమునందు జనించువియోగశోక మ
వ్వనితకుఁ దోఁప నీక మృదువాక్యపురస్సరవస్తుసంపదల్
తనరఁగ నిచ్చి పంపి త్వరితంబున నయ్యజవత్సుపోషకిం
జని కనియెన్ ద్వితీయనృపుచాడ్పున సద్భటకోటి గొల్వఁగన్. 175

ఆ. అందలంబుమీఁద నాతపత్త్రము పట్టు, వీరచామరములు వీవఁ గాను
నంబరానులేపనాకల్పదీప్తులఁ, దేజ మెసఁగ నరుగుదెంచువాని. 176

చ. కని యతఁ డెవ్వఁ డంచు నడుగం బ్రజ లయ్యజవత్సునల్లుఁ డం
చును దగఁ జెప్పఁగా నుఱక శ్రోత్రపుటంబులఁ జొన్పి తేరకోఁ

గనుఁగొని కుంభిగాఁ దెలిసి 'కానలలో నలనాఁడ యీదురా
త్ముని మృతుఁ గాఁ దలంచి పగఁ దూలితి నిట్లగు టెట్లెఱుంగుదున్.' 177

క. ఈతని నిట్టిగుణంబీ, నాతివలనఁ గల్గెఁ గాన నా కిచట నప
ఖ్యాతి పడ దయ్యెఁ గాకీ, పాతకుఁ డిదె కంటె యెంతపనికిం దొడఁగెన్. 178

ఆ. నమ్మఁ దగదు పరుల నమ్మినే సేజాతి, వాని నైన నమ్మవచ్చుఁ గాని
స్వర్ణకారకుండు సర్వజగద్రోహి, కాన వాని నమ్మఁ గాదు తెలిసి. 179

క. మాతండ్రి కిష్టసచివుం, డై తగఁ జరియించు నీదురాత్మకుజనకుం
డాతనికిఁ గలగుణము గా, కీతని కొకగుణము వచ్చునే యని తలఁతున్. 180

ఉ. కావున మున్ను వీనికొలఁగామి యెఱుంగక పెద్దఁ జేసి యే
తావున విశ్వసింతు నకటా తన కీమన సెట్లు పుట్టె నిం
కేవిధ మాచరింతు నని యిచ్చఁ దలంచుచు నుండఁ గుంభియుం
బావకలోముఁ గన్గొని సుపర్ణునిఁ గాంచినపాముకైవడిన్. 181

తే. తల్లడించుచుఁ బెదవులు దడపుకొనుచు, బిలము వెల్వడఁ ద్రోవఁ జూపినదురాత్ముఁ
డెవ్వఁడొక్కొ యిచ్చోటికి నేమి గుడువ, వచ్చెఁ గ్రియమాలిపిఁ డంచు వెచ్చనూర్చి.

చ. హరహర మున్ను నాదగుమహాశ నిరాశముఁ జేసి లోకభీ
కరుఁ డగుదైత్యుఁ డడ్డపడి కామినిఁ దాఁ గొనిపోయెఁ గ్రమ్మఱన్
వెరపునఁ దెచ్చుకొంటి వెనువెంటనె వీఁ డిదె వచ్చె వీని నేఁ
బొరిగొనకున్న దక్క దనుబుద్ధి నిజాప్తులఁ బిల్చి యిట్లనున్. 183

క. 'ఈతఁడు మాతండ్రిపగతుఁ, డీతనిఁ గొనిపోయి యూరి కేడ దవ్వగుచోఁ
జేతులఁ గాళ్ళను నఱకుం, డీతఁ డిచట నున్న మనకు నెగ్గొనరించున్.' 184

వ అని యల్లన చెప్పి యప్పావకలోముం దనవ్రేలం జూపి పొండు పొం డని వారిం
దఱిమినం బోయి యంటంబట్టి కట్టికొని పట్టణంబు వెడలంగొని పోయి దుష్క్రు
తారంభి యగునక్కుంభి చెప్పినట్ల ఖండించి వైచిపోయిన. 185

క. బాపురె దైవమ నన్నల, శాపఫలము గుడుచుకొఱకు జనకుని సతులం
బాపి యిటు లొంటిఁ దెచ్చితె, శాపావధి యెవ్వరింక సమకొల్పెదరో. 186

వ. అని యక్కుమారుండు శోకించుచుండు నంత. 187

ఉ. చేరువతోఁటవాఁ డొకఁడు శీఘ్రగతిం జనుదెంచి వానియా
కారముఁ జూచి యాత్మ ననుకంప జనింపఁగ రక్త మంతయున్
బోరనఁ బాఱ నెత్తికొనిపోయి లతావృతశాఖినీడఁ ద
న్నా రెడుపర్ణతల్పమున నల్లనఁ బెట్టి క్రమక్రమంబునన్. 188

ఆ. కాచి మందు వెట్టి కడుపార నశనంబు, దెచ్చి యిడుచునల్పదినము లందుఁ
బుండు లెల్ల మాన్చి పూఁదోఁటలోనన, యొక్కయిల్లు గట్టి యునిచె నతని. 189

చ. అతఁడు నతండు తండ్రియుఁ దదంగన తల్లియుఁ గాఁ దలంచుచున్
హితయుతబుద్ధి నవ్వన మనేకవిధంబులఁ గాచియుండు సం
తతకుసుమప్రవృద్ధిని లతాతతి ప్రస్తుతి కెక్క నీగతిం
గలిపయమాసము ల్వడలఁగాఁ గనుచాటు జనించెనో యనన్. 190

ఆ. ఆకసంబు చుక్క లర్కోదయంబున, కడఁగి రూపరేఖ లడఁగునట్లు
కొండఱేనికూఁతు కుసుమాపచయకేళిఁ, బోవుఁ బ్రతిదినంబుఁ బువ్వులెల్ల. 191

ఉ. పోవఁగఁ జూచి మాలకరి భూపతనూభవుఁ జేరి 'పుత్ర! నీ
కావలి నెప్పుడు న్వెలితి గావు ప్రసూనము లానిమిత్తమై
జీవనభార మెల్ల నడచె న్నన కిప్పు డిదేమి పాపమో
పూ వను పేరు మందు నకుఁ బోయినఁ జొప్పడ దివ్వనంబునన్. 192

వ. అని పల్కుచుం బోయిన నమ్మాట మఱవక మనంబునం బెట్టుకొనియుండి. 193

చ. పనివడి పుష్పచోరకులఁ బట్టుదు గట్టిగ నేఁటిరాత్రి యే
యనువున నైన నంచు నతఁ డల్లన నొక్కెడ డాఁగియున్నచో
ననిమిషకామిను ల్గొలువ నంబిక వచ్చె నిజాంఘ్రినూపుర
ధ్వను లెసఁగంగఁ బుష్పితలతల్ రభసంబున నెక్క కోయఁగన్. 194

ఆ. త్రొక్కియున్న తీఁగె ప్రక్కవాసిన జాఱి,పడియె గౌరి వానియొడలిమీఁదఁ
దత్పదాబ్జయుగము దాఁకి శాపము వీడి, వచ్చెఁ బాణిపాదవనరుహములు. 195

క. వచ్చిన నానృపపుత్రుఁడు, మ్రుచ్చుఁదగులువడియె ననుచు ముద్దియయడుగుల్
గ్రచ్చుఱఁ బట్టిన భయపడి, యచ్చెలువ నిజేశు నీశు నభవుం దలఁచెన్. 196

చ. తలఁచిన నార్తరక్షకుఁడు దా నగు టేర్పడఁ జూపుమడ్కఁ జే
తుల డమరుత్రిశూలములతో నిటలంబున మోడ్పు ఱెప్పతో
గళమునఁ గప్పుతో ముఖవికాసముతోఁ దరుణేందురేఖచేఁ
బొలు పగుమౌళితో నతివిభూతి మెయిం జనుదెంచె శంభుఁడున్. 197

వ. అంత నప్పావకలోముండు తనకరచరణంబులు వచ్చుటకు నచ్చెరువు నొందుచు నన్నితంబిని యఖిలజగదంబ యగునంబికగా నెఱింగి సంభ్రమించుచు దిగ్గన లేచి యవాఙ్మానసగోచరు లగుపార్వతీపరమేశ్వరులు దనకు దృష్టిగోచరు లగుటయుఁ బరమానందంబున సాష్టాంగదండంబులు సమర్పించి చేతులు మొగిడ్చి యిట్లని స్తుతియించె. 198

సీ. 'శమదమప్రభృతు లాచారముల్ గాఁ గలఘనతపోవీథులఁ గ్రాలువారు
యమనియమాదు లంగములు గాఁ గలయోగవిద్యలం దధికులై వెలయువారు
భయభక్తు లూఁతగాఁ బరగెడుదాస్యకర్మంబుపైఁ జిత్తంబు మరపువారు
సత్యశౌచంబులు సత్సహాయంబుగాఁ బొలుచునిశ్చలబుద్ధి గలుగువారు
తే. నిన్నుఁ గననేర రనెడుచో నెన్నిభవము, లందు నినుఁ గాన నేర్తురే యన్యజనులు
నిట్టినీమూర్తిఁ గనుఁగొంటి నిపుడు నాదు,భాగ్య మే మని చెప్పుదుఁ బార్వతీశ!
ఉ. నెయ్యపుఁగయ్య మైనతఱి నీవు హిమాద్రిజఁ దేర్పఁ బూని మే
నొయ్యన వంప జూటమున నుబ్బుమహానదిస్రోత కోడి యా
తొయ్యలి దాన ము న్నొగి నెదుర్కొనఁ జేర్కొనరానివేడ్కతోఁ
జయ్యన నెత్తునీదునెఱజాణతనంబుఁదలంతు శంకరా! 200
ఉ. ఆఱుమొగంబు లాతఁడు మదాత్మజుఁ డాతని ముద్దు సేయఁగా
నాఱుమొగంబులు న్వలయు నంబిక యేనును నీవుఁ గూడఁగా
నాఱుమొగంబులౌ నతి రయంబున రమ్మని నీవు నవ్వుచుం
జీఱుట యోగివర్యులకుఁ జింత్య మగున్ ముఖపంచకోజ్జ్వలా! 201
క. ఒకభాగమున సతీత్వము, నొకటఁ బతిత్వమును దాల్చియుండుట నిన్నుం
బ్రకృతిపురుషాత్మకుం డగు,సకలేశ్వరుఁ డండ్రు పరమసంయములు శివా!' 202
వ. అని మఱియు జయజయపూర్వశబ్దకంబుగా నయ్యాదిమదంపతుల దివ్యనామంబులు
పేర్కొని ప్రస్తుతించిన నమ్మహాదేవుండు ప్రసన్నభావుండై 'వత్సా! నీ కొక్కవ
రం బిచ్చెద వేఁడు' మనిన నతం డి ట్లనియె. 203
క. 'ఓ పార్వతీశ! వరమద, యాపర! నేఁడు నినుఁ జూడ నబ్బుటచే నా
పాపము సుకృతం బయ్యెను, శాపము వర మయ్యె జన్మసాఫల్యముగన్. 204
ఉ. కావున నింక నాకు నడుగ న్వర 'మెయ్యది మత్కరాంఘ్రి)రా
జీవము లేని బొమ్మనినఁ జెప్పెర రమ్మనినం గ్రమంబునం
బోవను రా నొనర్పుము ప్రభూతమతిన్ భవదీయభవ్యసం
సేవ యొనర్చుచోట ననుఁ జెందఁగఁ జేయకు మంతరాయముల్'. 205
క. నావుడు నీయడిగినటుల, కావించెద నుండు మనుచు గంగాధరుఁ డా
దేవియుఁ దాను సమరకాం, తావళి గొలువంగ రాజతాద్రికి నేఁగెన్. 206
క. ఆసమయంబునఁ బువ్వు, ల్గోసి నృపాత్మజుఁడు దండలును నెత్తులఁ గా
వేసఱక కట్టి కడు సం,తోసము నివ్వటిలఁ బొడివి తొలఁగఁగఁ బెట్టెన్. 207

ఉ. ఇన్ని దినంబు లంఘ్రికరహీనత నొందియు నిష్ఠఁ దా జగ
త్సన్నుత యైనపార్వతి ప్రసన్నతఁ బూర్ణత నొంద భాగ్యసం
పన్నుఁడు వో యితం డనుచుఁ బావకలోమునిఁ జూడ వచ్చున
ట్లున్నతపూర్వశైలశిఖరోపరిఁ దోఁచెఁ బయోజబంధుఁడున్. 208

వ. ఇట్లు సూర్యోదయం బగుటయుఁ బుష్పలావికుండు వచ్చునప్పు డప్పావకలోముం డెప్పటియట్ల విగతకరచరణుం డై పడియుండి 'తండ్రీ! మనతోఁటపువ్వులు చోరులపాలు గాకుండ నేఁడు నాసంగడీలచేత నన్నియుం గోయించి యాయితంబు చేయించినవాఁడ నవిగో కొనిపొ'మ్మని చూపిన సంతోషించి నాయన్న! కంటివె బొమ్మని కొనియాడుచుఁ గొనిపోయె నిట్లు ప్రతిదినంబును గొనిపోవుచుండ నొక్కనాఁ డతనిభార్య వచ్చి వాత్సల్యం బెసంగ నవ్వసుధేశనందనుడగ్గఱఁ గూర్చుండి తల నివిరి యుపలాలించి మఱియు నిట్లనియె 209

సీ. 'సుతుఁడ! నీ వొక్కప్రొద్దుఁ జూడరా నెడలేదు మనయింట నెప్పుడుఁ బనులుగలవు
ప్రొద్దున నశనంబు పుత్తెంతుఁ గడుపారఁ గుడుతె దింపవు గదా గుడిసెలోన
నొడ లుమ్మలించిన నొకపూట వెలుపట నుండుమీ చనుదెంచి యూరుపోక
యన్న! నీమనికి మాయన్న దా నేతంటయును లేక నెమ్మది నున్నవాఁడు
ఆ. నాకు నీవె దిక్కు నాబుద్ధి వినుము నీ, సంగడీలలోన స్వర్ణకార
కుఁడు లేఁడుగా యతం డుండెనేని నేవంకనైనఁ గీడు వచ్చుఁజుమ్ము. 210

ఆ. అనినఁ 'దల్లి! వాఁడు మనుజుండు గాఁడే యనర్హుఁ డేల యయ్యె నాప్తతకును
నివ్విధంబు నాకు నెఱిఁగింపవే' యని, యడిగె నగ్నిలోముఁ డతివఁ జూచి. 211

చ. అడిగిన నవ్వధూటి 'తనయా! విను చెప్పెదఁ బెద్దవారిచే
నడరఁగ మున్ను విన్నయితిహాసము కోమలభాస్కరుం డనం
బడునతఁ డొక్కనాఁడు తనబాలసఖుండును దానుఁ గూడి చే
రడవిఁ జరించుచో రుధిర మగ్గిరినుండి స్రవించుచుండఁగన్. 212

క. ఈరక్త మిట్లు దొఱఁగం, గారణ మేమియొకో తెలియఁ గన్గొనవలయుం
బోరనఁ బోదము రమ్మని, వారిరువురుఁ గొండ యెక్కి వచ్చుచు నెదురన్. 213

మ. కని రశ్వత్థకపిత్థబిల్వబదరీఖర్జూరపున్నాగచం
దనచించామ్రతమాలతాలవటహింతాలార్జునాశోకకాం
చనజంబీరకదంబనింబముఖవృక్షశ్రేణిచేఁ జూడ నొ
ప్పినఋష్యాశ్రమముం సశీతలజలోపేతాంబుజాగారమున్. 214

క. కని కదియఁ బోవునప్పుడు, వనమంతయు హోమధూమవాసితముగ నె
క్కొని వెల్గు భవ్యతేజం,బున శిష్యులు గొల్వ నున్నమునిఁ గౌండిన్యున్. 215

క. అల్లంత నెదురుకట్టుల, నుల్ల మలరఁ గాంచి భక్తియుక్తు లగుచు ను
త్ఫుల్లముఖాంబుజములు తో,భిల్ల నమస్కృతు లొనర్చి పేర్చినవేడ్కన్. 216

చ. కదియఁగఁ బోవ నప్పరమకారుణికోత్తముఁ డాదరించి 'నే
మ్మదిని భవత్సమాగతసముచితసౌఖ్యము మాకు నబ్బెటన్
సుదివస మయ్యె నేఁ' డనిన 'సూరిజనోత్తమ! యిట్టు లానతి
చ్చెదరు భవత్పదంబులకు శిష్యుల మంతియ కాక వింతయే.' 217

చ. అని యుచితప్రసంగముల నచ్చటఁ గొండొకసేపు నిల్చి 'యో
మునివర! యీమహాగిరిని మున్కొని పాఱెడురక్తధార యేఁ
గనుఁగొని తన్నిమిత్త మడుగం జనుదెంచి భవత్కటాక్షముల్
గని కృతకృత్యతం బొరయఁ గంటిఁ బురాకృతపుణ్యసంపదన్. 218

వ. కావునఁ దద్రక్తపూరం బట్లు పాఱుటకుం గారణం బెయ్యది చెప్పుం' డనిన నతని
కతం డి ట్లనియె. 219

సీ. 'కలదు విశాల నాఁ గమనీయ మగుప్రోలు రాజు దానికి శంబరక్షితీశుఁ
డత్యంతధార్మికుం డాతనిపుత్త్రుండు సౌందర్యవంతుండు శాంభుఁ డనఁగ
నెగడువాఁ డొకనాఁడు మృగయార్థ మడవికి నేతెంచి మృగముల నేసి యేసి
యలసి మదీయాశ్రమాగతుం డగుటయు నతనికి నన్నపానాదు లొసఁగ
ఆ. నతఁడు తృప్తిఁ బొంది కతిపయదివసముల్, చెంది యస్మదీయసేవ చేసి
యేది యిష్ట మనిన నిలఁ బరకాయప్ర,వేశవిద్య తనకు వేడ్క యనియె. 220

క. పృథివీపతిసుతుకోరిక, వృథ సేయక యే నొసంగి వీడ్కొలిపిన నా
ప్రథనపరాక్రముఁ డరుగుచుఁ, బృథుగహ్వర మొకటి గాంచి ప్రియపడి చొచ్చెన్.

ఉ. చొచ్చి చనంగ భోగవతిచొప్పున నొప్పు స్రవంతి యుండఁగా
నచ్చటఁ గ్రుంకు వెట్టి వెస నవ్వలి కేఁగి బలీంద్రువీడు నా
నచ్చుగుప్రోలు గాంచి వెఱఁ గందుచు నం దొకపేదరాలియిల్
చెచ్చెరఁ జేరి యుండఁ జెవిఁ జెందె వధూమృదుగీతనాదముల్. 222

చ. విని తలయెత్తి చూచి పృథివీపతినందనుఁ 'డవ్వ! యివ్విధం
బునఁ జెలరేఁగి రాగరసపోషణ చూపెడుకీరవాణి యె
వ్వనిసతి నామ మెయ్యది ధ్రువంబుగ నా కెఱిఁగింపు' మన్న ని
ట్లనునది 'యిప్పురంబు వనజాసనుచేతఁ దపోబలంబునన్. 223

తే. పడసి విక్రమకేతుఁ డన్వాఁడిదియసుర, శుక్రశిష్యుండు సమరపరాక్రముండు
దనుజుఁ డనుమాట గాని సద్ధర్మరతుఁడు, వానియిల్లాలు చరితాభిధాన గలదు.

సీ. ఆయింతికూఁతు రీతాయంబు సేయులతాంగి యాంగిరస యనంగఁ బరగు
నిటమున్న పెండ్లి లే దిది రూపయౌవనోద్రేకంబు పెంపున స్వేఁగ లేక
చెలికత్తియలఁ గూడి పలుమాఱు నీరమ్యహర్మ్యంబుమీఁద నొయ్యార మెసఁగఁ
బాటల నాటలఁ బరిహాసరచనలఁ బూని వినోదించుఁ బ్రొద్దు పోక

ఆ. యనిన శాంభుఁ డంగజాధీనమానసుం, డగుచు దనుజతనుజయందుఁ గాంత
యగ్గలింప నెవ్వఁ డబ్బునొకో నాదు, కోర్కి దీర్పఁ జాలుగుణయుతుండు. 225

క. అని తలఁచునంత రుదిత, ధ్వని వినిపించె నొకచోట ధరణీపసుతుఁ డే
ధ్వనియింటిదేడ్పు లని య,వ్వనిత నడుగ నదియుఁ జూచి వచ్చి యిటు లనెన్.

క. ఈపాడెడుపూఁబోఁడికి, రూపింపఁగ దాది యగుశరణి మృత యైనన్
వాపోయెద రనవుడు నతఁ, డీపరకాయప్రవేశ మెన్నటి కింకన్. 227

సీ. ఒకనికి నీవిద్య యొసఁగ నాతఁడు పోయి దాదిదేహంబునఁ దగ వసించి
మొదలింటి యట్టుల మెదలుచు వెరవుతో నామీఁదిప్రేమంబు నాఁటుకొలుప
నప్పుడేఁ గదిసి గాఢాలింగనాదుల నలరించి యాముగ్ధ నతివిదగ్ధఁ
గావించి నెయ్యంపుఁగయ్యంబు లాదవించి చయ్యనఁ దెలిసి ప్రసాదచిహ్నఁ

ఆ. గని సుఖాబ్ధిఁ దేలి కాక నామదిలోని, తృష్ణ యూర కేల తీఱు ననుచు
వనరి వనరి యొక్కస్వర్ణకారకుపొందు, గాంచి వాని కట్ల కఱపి పుచ్చె. 228

చ. అతఁడును నేఁగి దాదియొడ లాదటఁ జొచ్చి యథోచితంబుగా
నతివకు నప్పటప్పటికి నానృపపుత్రునిరూపవైభవో
న్నతి వినిపించుచుండఁ గను దా వినుచుండఁగ దానిచిత్తమ
య్యతనునిచేత నోటుపడి యాటలుఁ బాటలు వీటిఁ బోవఁగన్. 229

తే. గోర నేల వ్రాయుఁచును కన్నీరు నినుపఁ, బెరిగి యదియేఱుగాఁగను ధరణిఁబాఱ
నార గోర వ్రాయంగ నేఱయ్యె ననుచుఁ, బలుకు నానుడి యిదియని తెలుపునట్లు.

క. ఆయబలయుఁ నిక్కఁ గని పర, కాయస్థుం డగుసువర్ణకారకుఁడు నిజో
పాయము తుదిముట్టె ననుచుఁ, బోయి యెఱింగించె రాజపుత్రున కెలమిన్. 231

చ. అతఁడును నవీథంబునకు నచ్చెరు వందుచు నవ్యరూపశో
భితుఁ డగునెయ్యునిం గదియఁ బిల్చి కవుంగిటఁ జేర్చి 'యన్న! నీ
కతమున మన్మథుఁ గెలువఁ గంటిఁ దదుత్తరకార్యసిద్ధి యే..
గతి నొడఁగూడు నట్టిగతి గాంచి యొనర్పుము శీఘ్ర' నావుడున్. 232

ఉ. చయ్యన దైత్యరాజసతిసన్నిధి కేఁగి భవత్తనూజ కే
దయ్యము సోఁకెనో మిగులఁ దాపము నొందుచు నాఁడునాఁటికిన్
దయ్యెఁ దొడంగె నావుడును దద్దయుం భీతిలి సెజ్జ డిగ్గి తాఁ
బయ్యెదకొంగు జాఱఁ గచభారము వీడ మహారయంబునన్. 233

క. చని తనకూఁతుముఖాకృతి, గనుఁగొని యిది యొండు గాదు కామవికారం
బని తెలిసి సముచితోక్తులు, దనర ననునయించి మఱియుఁ దగ నిట్లనియెన్. 234

తే. 'సఖుల నైన ముందలయెత్తి చక్కఁ జూడ, నేర వభిమానశీలవు నీరజాక్షి!
యట్టి నీచూడ్కి యెవ్వని నైన నిపుడు, తగిలినట్టుల పొగిలెదుఁ దగునె తగుల.

వ. అంతియ కల్గెనేని నింత చింతింప నేల నాతోడఁ జెప్పరాదే' యనిన నది లజ్జావనత వదనాబ్జయై కనికరించి దాదిదెస వీక్షించినం దద్దేహగతుం డగునతండు వాతప్పక యిట్లనియె 'మేము దాదుల మస్మదాదులమాట లంత విశ్వసించెద రెట్లు ప్రకారాంతరంబునం బరామర్శింప నవధరింపుదు గాక' యనిన 'నోహో! యిట్టు పలుకందగునె తెవులు దీఱినం జాలుఁ గాక వెజ్జు కామదేవుండు గావలయునె యదియునుం గాక నాఱునులకత్రాళ్ళ గూడి యొక్కమోకు గానేర్చునే మాకు నీకంటె నవశ్యు లెవ్వరు దీనివలన నాకు నవమానభారం బొక్కటియ కాని తక్కటిభారం బు లెల్ల నీయదియె కావే' యనుచు దనుజమాత ప్రియంబులు చెప్పిన 'నింత చెప్ప నేల నవ్వటాల కంటెం గాక నాకన్నంత చెప్ప కేల యుండుదు నిది యెవ్వరి యింటిశోభనంబు తల్లీ! యాకర్ణింపు' మని యారాజకుమారుం డప్పురంబునకు వచ్చుటయు వానికి నమ్మగువ దగులువడుటయు నెఱింగించి మఱియును. । 236

క. 'తల్లి గలఫలము కూఁతుకు, నుల్లము రంజిల్లఁ జేయ నోపెడివరునిం
దల్లముగ నరసి తఱితో, నిల్లు నిలుప వలదె' యనుచు నేర్పడఁ జెప్పెన్. 237

క. చెప్పిన నది తనమగనికిఁ, జెప్పి నృపాత్మజుని రూపజితమనసిజునిన్
రప్పించి తనతనూభవ, నిప్పించినఁ గూడి యుండి రిరువురుఁ బ్రీతిన్. 238

క. తదనంతరంబ దాదిని, వదలి ప్రథమతనువు చొచ్చె వాఁడును మఱి కొ
న్నిదినంబులకు నతఁడు తన,ముదితం గొని జన్మదేశమునకుఁ బయనమై. 239

క. పోవఁగ నయ్యగసాలెయుఁ, వావిరిఁ దోడరుగ నొక్కవనమధ్యమునన్
గేవల పక్వఫలంబుల, ప్రోవై యొకవెలగ యుండఁ బొడగని వేడ్కన్. 240

ఉ. భామిని గోరె నావెలగపండులు గోయ నుపాయ మేది యా
భూమిపనందనుండు దలపోసి పథంబునఁ జచ్చియున్న శా
ఖామృగమందుఁ జొచ్చి తమకంబున వృక్షము ప్రాఁకె నంతలో
నామనుజాధముం డతనియంగము సొచ్చి కృతఘ్నచిత్తుఁడై. 241

క. ఆకపి రాల్చు ఫలంబులు, పీకునఁ గొని వచ్చి యిచ్చి 'విమలాబ్జముఖీ!
యీకాననలో మృగము ల,నేకంబులు గలవు మనకు నేలా తడయన్. 242

ఉ. పోదము రమ్ము రమ్మనుచుఁ బొల్తుకఁ దాఁ గొనిపోవ దాని నొఁ
గా దన లేక శాంభుఁడు జగంబునఁ దిట్టనితిట్టు క్రోఁతియై
గాదిలిపత్నిఁ గోలుపడి కష్టదశం బడఁ భ్రాంత మయ్యె నిం
కేది తెఱంగొకో యనుచు నింతను నంతను గూడి పాఱఁగన్. 243

ఆ. అతివ క్రోఁతిఁ జూచు నతనిదిక్కును జూచు, మర్మకర్మ మైనమాట యతని
యందుఁ గల్గ కునికి సందేహపడు నిశ్చ, యించ లేక మోము వంచి నడచు. 244

వ. మఱియు నిట్లని వితర్కించు. 245

చ. తెరువున మమ్ముఁ గూడి చనుదెంచినమానవబాలుఁ డొక్కఁ డా
తరువులనీడ నప్పుడు ముదంబున నిద్రితుఁ డయ్యె వానిచొ
ప్పరయక వచ్చె నీతఁ డిది యారసి చూడఁగ నేమి మాయయో
నరపతి గాఁ డనంగ నగునా కనరాదు విచార మయ్యెడిన్. 246

క. కానిమ్ము పొ మ్మది యెవరి, దైన శరీరంబు నృపతి యదియ కదా యే
మానినియుం మగఁడు చచ్చిన,చో నాతని మేనితోన చొరదే వహ్నిన్. 247

వ. అదియునుంగాక యొక్కయితిహాసంబు గలదు. 248

సీ. మును బావమఱఁదు లిమ్ముల నంబికకు గండదల లీయ నిరువురతరుణు లపుడు
ప్రార్థింప నద్దేవి ప్రత్యక్షమై వీరిప్రాణంబు లిచ్చెదఁ బాసి యున్న
బొందులఁ దలలను బొందింపుఁ డనిన నాసతులు వీడ్వడఁ గూర్చ నతని నతని
సంజీవితులఁ జేసి చనియె నవ్విపరీతధర్మంబుఁ జూచి పెద్దలకుఁ జెప్పఁ
తే. దనువునకు నెల్ల శిరము ప్రధాన మనుచు, భర్తృముఖులఁ దత్సుతులకుఁ బతులఁజేసి
రంతకంటెను నిది దేహ మంతవట్టు, తొంటియట్టుల యున్నది దోష మేమి. 249

క. శుద్ధపశువ యీనరుఁడు ని,షిద్ధసుఖము గల్గినపుడు చేకొనె నేనిన్
శుద్ధపశువు సూ నరుఁడు ని,షిద్ధసుఖము గల్గినపుడు చేకొనఁ డేనిన్. 250

చ. అని నృపదేహధారి యగు నయ్యగసాలెను గూడి యుండె న
వ్వనిత వసుంధరాధిపుఁడు వానరదేహము నొందియు న్మదిన్
బనువడియున్నదైత్యసుతఁ బాయఁగఁ జాలక యిందు లెక్కఁ దాఁ
గనుఁగొనుచుండ వాఁ డతనిఁ గాంచి మనంబున భీతి పుట్టినన్. 251

క. కడు నలిగి యూరిలోపలి, పడుచుల రావించి యాయుబద్ధపుఁగ్రోఁతిన్
బడుకుల వైచుచు నిప్పుడ, వెడల నడిచి రండు నిలువ విడువకుఁ డిచటన్. 252

మ. అనిశన్ బొబ్బలు పెట్టుచుం దగులఁగా నాక్రోఁతి యింటింటికిం
జను గొందు ల్బోరఁ బోవు నొంటి చనినఁ జంకించుఁ బె న్మ్రాకఁ గ
న్గొని భీతిల్లు నగళ్ళ ప్రాఁకుఁ దరు లెక్కుం దిగ్గు నడ్డంబు వ
చ్చు నటంచుక్ మఱి వెక్కిరించుఁ గికురించుక్ డాగురించుం బోరిన్. 253

క. పాడగానము లే మర్కట, మడఁప ననుచు వెదకి వెదకి యలసినయెడ నె
క్కడనుండియేని గానం, బడుఁ గో యని యార్చి వెంటఁబడ వడి తోలఁగున్. 254

క. ఇవ్విధమునఁ బుర మంతయు, నివ్వల నవ్వలను రేఁగి యెప్పటిరాలక్
రుష్వంగ బెగడి రయమున, నవ్వనచర మేఁగె దట్ట మగుకానలకున్. 255

ఆ. అచటి నీరు ద్రాగి యారణ్యఫలముల, జాఠరాగ్నిఁ గొంత జక్కఁ జేసి
విరహావహ్ని చేత వెచ్చుచు నిట వచ్చి, యొక్కశుకశవంబు నొసరఁ గాంచి. 256

ఆ. ఆనరాధముండు వానరాకృతి నుంటి, నేని నన్నుఁ జూచి యెఱుఁగుఁ గాని
యితరరూప మైన నెఱుఁగఁడు పక్షినై, పోదు ననుచుఁ జిలుకబొంది సొచ్చి. 257

ఉ. మక్కువ యెట్టిదో తనదుమానినిఁ గన్నుల నైనఁ జూతు నం
చొక్కటఁ బాఱెఁ గీరతను వొంది వియద్గతి నాత్రఁ డప్పు డా
చక్కటిఁ బచ్చ తోరణముచాడ్పున నింద్రశరాసనంబున
ట్లక్కజమై తనుద్యుతిచయంబు జనావలి కింపుఁ బెంపఁగన్. 258

క. అతనునకు నోడి శరణా, గతుఁడై తత్సేవఁ గోరి కాకున్న మహీ
పతిసుతుఁ డీగతిఁ గీరా, కృతిఁ గైకొనియె నని బుధులు కీర్తింపంగన్. 259

చ. చెలఁగుచుఁ బాఱి తత్సదనసీమఁ జరింపుచు నుండ వాఁడు న
న్నెలఁతయుఁ బన్నిదంబునకు మేషములం దలపెట్టఁ జూచుచో
నెలఁతుక మేష మాఖలుని మేషముఁ దాఁకి వధించెఁ జూచి మొ
క్కలమున నాత్రఁ డాతగరుకాయము సొచ్చె జయాభిలాషియై. 260

క. ఆతెఱపి గాంచి శాంభుఁడు, జాతిగఁ గీరత్వ ముడిగి శారీరస్థుం
డై తీవ్రఖడ్గమున నా, పాతకునిశిరంబు దునిమెఁ బాయనికినుకన్. 261

ఉ. అంతటఁ గోప మాఱక రయంబునఁ గాళ్ళను బట్టి వాని న
త్యంతబలంబున న్విసరి యంబరవీథికి వైచె వైచినం
గొంతుక క్రిందుగా నిచటికొండపయిం బడె నాఁటనుండియుం
వ్రంతలు గట్టి పాఱు రుధిరంబు విస్ఫూర్తి గైరికాకృతిన్. 262

క. ఆరక్తపూర మడుగక, కారించుట మాన రవనిఁ గాలునిబంటుల్
ఘోర గళద్ధ మిత్రద్రోహాగంభులు ఘనుఁగునట్టియఘవారిధికిన్. 263

క. అనిన విని కోమలార్కుఁడు, మునినాథునిచరణపద్మముల కెరఁగి ముదం
బున సఖుఁడుఁ దాను గ్రమ్మఱి, చనె నిది పూర్వోదితప్రసంగము కొడుకా! 264

సీ. కావునఁ గంసాలి కష్టుఁ డాతనితోడిచెలిమి గీడ్పఱచు నెవ్వలన నైనఁ
జెలులు చుట్టలు నాక చెఱుపంగఁ జూచు నెవ్వని నైన నించుక ప్రణము గనిన
నన్న! నీ వెన్నఁడు నాజాతివానితోఁ బొత్తొనర్పకు వానిపొంతఁ జనకు
వాఁడ తాఁ బైకొని వచ్చెనేనియుం నీవు గను విచ్చి చూడకు కదియ నీకు

తే. మనిన మున్నిది కుంభి చేసిన యనర్థ, మెఱిఁగి యిటు పల్కెనో బుద్ధిగఱపవలసి
చెప్పెనో యెట్లుచెప్పినఁ జెప్పెఁ గాక, నాకుఁ దార్క్యాణ యయ్యె నీనాలిపలుకు.'

క. అని తనకుఁ గుంభి యొనరించి, చినకీడు దలంచి వానిఁ జెఱుపక యిట్లుం
డిన నేపురుషార్థం బగు, నని యూహింపంగ మఱియు నది యిట్లనియెన్. 266

చ. 'మనపురి యేలు నాతనికుమారిక సజ్జనురాలు దానిపే
రనుమతి పేదసాదులకు నారసి యన్నము పెట్టుచుండు నో
తనయుఁడ! నాకు నవ్వనితధర్మ మొకండు గొఱంత లేదు న
న్ననుఁగొనఁ దల్లితోడు క్రియఁ గైకొని ముచ్చట లాడు నెప్పుడున్. 267

క. అవనితారత్నము మన, పూవులు గొనుఁ గాని యొండ్లపువ్వుల దెసఁ బో
దేవేళ నైనఁ బ్రియపడి, రావించును దానివలన బ్రతికితిఁ జుమ్మీ!' 268

క. అనిన విని దీనివెరవున, ననుసంధింప నగుఁ గార్య మన్యోపాయం
బున సాధ్యము గా దని య,వ్వనజాననఁ జేరఁ బిల్చి వాఁ డిట్లనియెన్. 269

ఉ. 'పంతము పల్కెద న్వినుము పార్థివపుత్త్రికి నాదుమాట యొ
క్కింతయుఁ బీనులం జొనుపు మింతియ చాలును మున్ను నీకుఁ దా
నెంత ప్రియంబు సేయు నది యున్నడి ముమ్మడి యైనఁ గాని నీ
వింతటనుండి నాపలుకు లెన్నఁడుఁ బాటి యొనర్పకుండుమా!' 270

ఆ. అనిన 'నద్దిరన్న! యది మాట గాదు నీ, వెవ్వ రాలతాంగి నెవ్వ రిట్లు
పలుకఁ దగునె యిందుఁ బ్రాపించులాభ మెం,తైన నొల్లఁ జుమ్ము రన్న! వడుగ!'

వ. అనిన నతం 'డే నింత యవివేకినే? మనకుం గీడగుపనికి నిన్నేల పంపుదు? నేనుం గొంచెంబ పలికితిం గాని యీప్రసంగంబు విన్న నది నీకు నతిప్రసాదంబుగాఁ గట్టి నిచ్చు ముమ్మాటికి నామాటఁ ద్రోపుసేయక చేయవలయు' నని యొక్కసవరం బిచ్చి యిది గొనిపొమ్మని యిట్లనియె. 272

క. 'కొనిపోయి నీవు వెఱవక, యనుమతి నేకాంతవేళ నల్లనఁ గదియం
జని కల దొకవిన్నప మని, మును చిత్తము సావధానముగఁ జేసి తుదిన్. 273

ఉ. ఎప్పటియట్ల పువ్వు లిడి యీసవరం బటు చూపు చూపినం
జెప్పెడిదేమి యారమణి చెడ్డధనం బడి చేరినట్లుగా
నప్పుడు సంతసిల్లి యిది యవ్వల నెవ్వరు దెచ్చి రన్న నా
జెప్పుము పోయి రాఁ దడవు సేయకుమీ ఫలసిద్ధి గల్గెడున్'. 274

వ. అనిన నది యట్ల చేసె నారాజనందన తనమనంబున నద్భుతశోకహర్షంబులు
ముప్పిరిగొన ని ట్లని వితర్కించు. 275

క. 'ఇది నాతలసవరం బగు, నుదితార్కనిభుండు మత్ప్రియుండు ప్రియమున నాఁ
డిది దాన పుచ్చుకొనియెఁ ద,నదుసవరము నాకు నిచ్చె నచ్చినప్రేమన్. 276

మ. గహనాంతంబునఁ గుంభిఁ దోలి నను నాకాశాధ్వగుండై దురా
గ్రహబుద్ధిం గొనిపోయినట్టిదనుజుం గాంతాసమేతంబుగాఁ
బ్రహరించె న్విడిపించె నన్నుఁ దుది నప్పాపాత్ముచెద్దయి న్గటా
గుహలోఁ జిక్కె నతండు వెల్వడియెనొక్కో నాదుభాగ్యంబునన్. 277

క. వెలువడి వచ్చి యతం డీ, చెలువ గృహము గూఢవృత్తిఁ జేరెనొ కాదే
నిల నీసవరం బీకో,మలితనయునిఁ జేరు టేమి మార్గ మగునొకో. 278

వ. అని చింతించి యాయింతి యిట్లనియె. 279

క. 'ఆపాపఁడు నీతనుజుఁడొ, నీ పెంపుడుబిడ్డఁడో' యనిన నిట్లనుఁ 'ద
ల్లీ! పఱగడుపున బొంకఁగ, నోప నతనిఁ దెచ్చుకొంటి నొకచందమునన్. 280

క. పెంపుడుఁగొడు కైనంతనె, పెంపు దఱగె నెట్లు జగదభేద్యుఁడు కృష్ణుం
డింపారఁగ నందునకుం, బెంపుడుకొడు కగునొ కాఁడొ పెక్కేమిటికిన్. 281

ఉ. పెద్దయుఁ గాల మేను మును బిడ్డలఁ గానక పెక్కు నోము లే
ప్రొద్దును నోఁచి నోఁచి సురపూజ లొకప్పుడుఁ జేసి చేసి నే
నెద్దియుఁ గాన నైతిఁ దుది నేమి తపంబుననో యితండు మా
యొద్దకుఁ జేరె వానిఁ గని యూఱట గాంచితి మెల్లవెంటలన్. 282

ఉ. మమ్ము నతండు చేరినక్రమంబును జెప్పెద నంచుఁ గుంభి కో
పమ్మున వానిహస్తములఁ బాదములు న్నఱకించు టాదిగా
నమ్మదిరాక్షికిన్ వరుస నంతయుఁ జెప్పిన నన్నిలోముగా
నెమ్మది నిశ్చయించి చెడునే యిటు గార్యమపాత్రసంగతిన్. 283

క. కుంభి యఁట రాజు తెఱఁగున, దంభంబున మెలఁగఁ గటకటా! ఖండితుఁడై
కుంభినిఁగొడు కఁట పొరలెడి, నంభోరుహభవుని నేర్పు లాఱడిఁ బోవన్. 284

క. అని మదిఁ బొగులుచు దానికిఁ, గను తనియఁగఁ గట్ట నిచ్చి 'కాంతా! విను నీ
తనయుఁడు సద్గుణశీలుఁ డతనిఁ జూడఁగ మాకు నెవ్విధంబున నబ్బున్'. 285

వ. అని పలికి తత్క్షణంబ. 286

ఉ. జాతర పేరు చెప్పి రభసంబునఁ దల్లియుఁ దాను గూడి యా
నాతుక త్రోవ చూపఁగ వనంబునకుం జని యగ్నిలోమపృ
థ్వీతలనాథు నవ్వికృతవేషిఁ గనుంగొని వృక్ష మెక్కి యిర్
చేతులు వ్రేల్చినట్టు లవశీకృతమానసయై వణంకుచున్. 287

ఉ. 'హా! జగదేకవీర! భవదంఘ్రికరాబ్జము లెందుఁ బోయె నే
రాజులు నోర్వ లేనిబలురక్కసు నోర్చినయట్టినీవు ని
స్తేజము నొంది యల్పవిగతిం గొఱమాలినక్రుక్కిమీఁద నీ
రోజ ననాథుపాటు వడ నోగిత మైతె మదీయవల్లభా! 288

క. ఘనసమరవిజయపటుగ, ర్వనిరూఢుని గాఁగ మున్న వ్రాసినచే నె
ట్టన నిను బఱమొండెము గన్మని వ్రాయఁగఁ జేతు లెట్టు లాడెనొ విధికిన్. 289

చ. కటకట! కుంభి నీకుఁ జెలికాఁ డని నీ వెనువెంటఁ ద్రిప్పఁగా
నిటువలె నయ్యె నింక నిటు లేటికి మాటలు నిన్నుఁ జూడఁ గాం
చుటఁ గృతకృత్య నైతి' ననుచున్ వెస దగ్గఱ నేఁగి వానిఁ గాఁ
గిటఁ గదియింపఁ దజ్జనని క్లేశము నొందుచుఁ జేరి యిట్లనున్. 290

క. 'అమ్మమ్మ! యేల భ్రమసితి, యిమ్మనుజాధముఁడు వీఁడు నెక్కడిమగఁడే
యమ్మలిక యుండిగి రమ్మా, కొమ్మ! వినియె నేనిఁ గుంభి కోపించుఁ జుమీ'. 291

ఆ. అనినఁ దల్లిఁ జూచి యరయుక లేనిరాజ్యంబు గాక పాపజాతి యైన
కుంభిఁ బెద్దఁ జేసికొని యుత్తమక్షత్రవంశజాతు నితని వదలఁ దగునె. 292

క. నీమగని యుపేక్షఁ గదా, నామగనికి నింత పుట్టె నాఁ డాతనితోఁ
నేమంటి నేను జెప్పిన, నామాటలు నమ్మఁ డయ్యె నను జంకించెన్. 293

క. నావచనము తెలియఁ గప్పుడు, నీ వెఱుఁగవె కల్లతోను నిజ మోపునె పా
పావేశితుఁ డగుకుంభికిఁ, దా వెఱచి గదమ్మ రాజు ధర్మము వదలెన్. 294

క. మర్యాద లేనిరాజ్యము, నార్యజనులు లేనిసభయు నద నైన తఱిన్
గార్యముఁ గొననిసచివుచాతుర్యమ్మును వ్యర్థ మండ్రు తొల్లిటిపెద్దల్. 295

క. పో నున్నఁ బోక మానునె, రా నున్నది మున్ను నాపురాకృత మిట్టుల్
కానున్న దేల తప్పును, నే నెవ్వరి నింక నెగ్గు లెన్నఁగ నేలా! 296

క. నా కింక నితనితోఁ డిద, లోకము నీ వరుగు' మనిన లోలాక్షి మదిన్
శోకించుచుఁ జని చెప్పె మహీకాంతున కంతవట్టు నేకాంతమునన్. 297

ఉ. చెప్పిన నమ్మహీశ్వరుఁడు 'ఛీ! కొఱమాలినమొండివాని కే
చొప్పునఁ జిక్కెనో తరుణి చుట్టలలోఁ దలవంపు చేసె నా
చెప్పినమాట మున్ సరకు సేయక కుంభిఁ దొఱంగి యుండఁగాఁ
ద్రిప్పి విధాతృఁ డీదెసకుఁ దెచ్చెనె మెచ్చనివారిముందటన్. 298

క. ఇప్పని యుక్తము గాదని, యప్పడుచుకు బుద్ధి చెప్పి యదలుప కున్నన్
ముప్పగు' నని యడిచిపడుచు, నప్పుడ చని కూఁతుతోడ నజవత్సుఁ డనున్. 299

ఉ. 'ఆడిక దెచ్చుకొంటి తగునమ్మ! తనూభవ! యిట్టు లైన నీ
తోడికుమారికల్ నగరె? ఘాతకళంకుని గుంభి నొల్ల కీ
మ్రోడున కీవు గూర్చు టిది మోసము గాదె తలంచి చూడ నా
తోడు మదీయబుద్ధి విను దుఃఖము గట్టకు మాకు ముప్పునన్. 300

ఆ. అనినఁ దండ్రిఁ జూచి యనుమతి యి ట్లను, 'నేటిమాట లాడె దెఱుక మాలి
నీకుఁ గుంభి గాని నాకు వాఁ డయ్యె మే, ధ్యంబులోని క్రిమివిధంబు సుమ్ము. 301

క. ఈరాజకుమారుఁడు దనుఁ, గారవమునఁ బెచుపఁ బెరిగి కడుఁ గ్రొవ్వి కడే
వారక వాఁ డిటు చేసెను, మీరీమొన లెఱుఁగ రిదియె మీదువిమర్శల్. 302

క. మీతో నాఁడును జెప్పనె, పాతకుఁ, డగుకుంభిమాట పాటిగఁ గొని మీ
రాతని నుపేక్ష చేసితి, రాతఁడు నఱికించె నితని నన్యాయమునన్. 303

తే. రాష్ట్రమున నైనపాపంబు రాజుఁ బొందు, క్షితిపుపాపంబుమతిపురోహితునిబొందు
మగువ చేసినపాపంబు మగనిఁ బొందు,శిష్యపాపంబు గురుఁ బొందు సృష్టియందు.

ఉ. కావున వాఁడు చేసినయఘంబు భవత్కృత మయ్యె నింక నే
లా విరసోక్తు లూరక తొలంగుము భర్తయ సూవె భార్యకున్
దైవము వెట్టివాఁ డయినఁ దామసుఁ డైనను నంగహీనుఁడై
చేవ యడంగి యున్న నిరసింతురె భర్తఁ బతివ్రతాజనుల్.' 305

క. అని తన్నుఁ దూలఁ బల్కిన, యనుమతిమాటలకుఁ గలఁగి యజవత్సుఁడు ము
న్నును నిది యిట్టులు పల్కె ని,తనివలనం దెలియవలయుఁ దత్కథ యనుచున్.

ఉ. అవ్విభుఁ డగ్నిలోమఁ గదియం జని తేకువ యుల్లసిల్ల 'నీ
వెవ్వఁడ వన్న? నీజనకుఁ డెవ్వఁడు? మత్పురి నున్నకుంభి దా
నెవ్వఁడు? నీకు నీవనిత యే మగుఁ? జెప్పఁ గదన్న! కాన లే
కివ్విధిఁ జిక్కు దుల్పెద మనేకదినంబులనుండి నావుడున్. 307

వ. తన పేరు తాను జెప్పవలసె నని విషాదంబు నొందియుం గాలస్వభావంబు గదా యేమి సేయ వచ్చు నని తలంచి యి ట్లనియె. 308

క. 'పావకలోముఁడ నే నో,భూవర! యంభీరనృపతిపుత్త్రుఁడ నస్మ త్సేవకుఁడు కుంభి యనుమతి, నావనిత స్వయంవరంబునం బడసితి నేన్.' 309

క. అని తనకు కుంభి యొనరించిన ద్రోహము లెల్లఁ దెలియఁ జెప్పిన విని య జ్జననాయకుఁ డాకష్టుని, గొనిరం డని పనిచె సుభటకోటిఁ గినుకతోన్. 310

చ. పనిచినఁ గాలకింకరులభంగి రయంబున నేఁగి ముచ్చుఁ బ ట్టినక్రియఁ జుట్టుముట్టి 'చెనఁటీ! చెడుకాలము వచ్చె నీకు ర' మ్మని వెసఁ బట్టి తెచ్చిన నరాధిపుఁ డాతనిఁ జూచి 'చెల్లురా! కనికరమేది యీ ప్రభువుకాళులుఁ జేతులు నిట్లు సేయుదే.' 311

మ. అనినన్ 'శత్త్రుఁడు వీఁడు నాకు మృతుఁ జేయం జాల కి ట్లేను జే సినఁ దప్పా? ననుఁ బట్టి తెచ్చి సభలో సిగ్గంతయుం బుచ్చె దే మనవచ్చున్ నృపు లెందు ముగ్ధులు గదా యజ్ఞానినే నేను స జ్జనులన్ ద్రోహములేక చేయుపనికిన్ సైరింతునే యెన్నఁడున్.' 312

క. అని యాడి నడచుకుంభిం, గనుఁగొని కోపించి రాజు కడఁ జన 'కోరీ! నిను నంతవానిఁ జేసిన, జనపతిసుతుఁ డితఁడు నోరు సావదె యింకన్. 313

క. నీ వెంత రోసి యాడినఁ, బో విడుతుమె నిన్నుఁ బట్టి పోరిగొందుము గా కీవదరుటలు పులింకీ,తావున నెల సేయ వేమిటను గెల్చెదురా? 314

తే. చావుకల నైన నించుక సత్యవాక్య, ముగ్గడింపుర నీ వన్న నూరకుండె *గారుడికుచేతఁ జిక్కిన ఘనతరోర, గంబుచాడ్పున ముఖరికానంబు దఱిగి. 315

సీ. అప్పుడు గొంద ఱీయన్యాయశీలునిఁ బట్టి కొట్టిక్కింపఁ బాడి యండ్రు
కొంద ఱీతని నందుసందులు చక్కగా బాదిద నఱకింపఁ బాడి యండ్రు
కొంద ఱీతనికండ లందంద దిగఁజెక్కి భక్షింపు మని పెట్టఁ బాడి యండ్రు
కొంద ఱీతనిఁ దలక్రిందుగాఁ గట్టించి పైచర్మ మొలిపించఁ బాడి యండ్రు

ఆ. కొంద ఱితనిఁ బచ్చిగుడియల మోఁదించఁ,బాడి యండ్రు మఱియు బహువిధములఁ బలుకుపౌరజనులకలకలం బుడిపి యం,భీరసుతుఁడు కుంభిఁ జేరఁ బిలిచి. 316

క. 'తమ్ముఁడ! యేమియు వెఱవకు, నమ్ముము ప్రాణమున కలుగ నాదెస నపరా ధ మ్మేమి కలిగె బొంకక, యిమ్మనుజాధిపునియెదుర నేర్పడఁ జెపుమా.' 317

తే. అనిన 'సర్వాపరాధి నే నధిపతనయ!, నీవు పుణ్యాత్ముఁడవు నీకుఁ దప్పు మోప నే నెంతవాఁడ నాపాపమునకుఁ, గడమ లేదంచుఁ జాఁగిలఁబడియెఁ గుంభి.

* గరుడునకుఁ జిక్కినట్టియా... చి. ని. షా.

క. కనుఁగొని యజవత్సునితో, ననుమతి 'యిది చూడు నీకు నల్లుఁడ నని వ
చ్చిన ద్రోహిమాట నిక్కం, బని ననుఁ గోపించి తిప్పు డైనఁ జెలిసెనే? 319

క. అనవుడు ముడివడుబొమ్మలుఁ, గనలెడుకన్నులును నదరుకటములు సెగఁబా
ఱినమీసలునై యతఁ డీ, ట్లను భటులం గుంభిఁ జూపి యోడు గఱచుచున్. 320

సీ. 'ఈపాపకర్ముని నిప్పుడ కొనిపోయి భూరివెంటులు చుట్టి పురముచుట్టుఁ
ద్రిప్పి తోఁకొని వచ్చి తెకతెక నుడికెడి యుడుక్కకంబముతోడ నొత్తిపట్టుఁ
డినుపరాగోలల నిఱికించి యంతతో నన్యకాంతోపగూహనసుఖంబు
పైఁబడి కోరినఫలము చేసేఁతన మనసారఁ గన్గొను' నని నళని

ఆ తెగువఁ జూచి యనుమతీవల్లభుఁడు 'వీని, నిట్లు సేయకున్న నేమి దప్పె?
ధరణిపతులు చేయుదండనంబునకంటెఁ, దక్కవయ్యె జమునిదండనంబు. 321

సీ. చేసినపుణ్యంబు చెడు మాఱు పల్కిన నండ్రు పెద్దలు వీనియఘము కొంత
వెలితిగా నల్పశిక్షలు చేసి యది పంచికొన నేల? యింతియ కోప మైన
వీని మీదేశంబు వెడలఁ దోలింపు పంపంగ నీ నని నమ్మఁ బల్కినాఁడ'
- నని నట్టిద కార్య మని యజవత్సుండు శ్వానపాదాకృతిగానురంబుఁ

ఆ. గాల్చి వీథు లెల్లఁ గలయంగఁ ద్రిప్పి పో, ననుపుఁ డనుచు నర్హ జనులఁ బనిచె
వారు నట్ల చేసి వచ్చి ర ట్లగుటఁ గం,సాలజాతివాఁడు చాలఁ గీడు. 322

ఉ. అంతఁ బతివ్రతాగుణమహత్త్వముఁ జూచి సురల్ ప్రమోదిత
స్వాంతత యొప్పఁ గ్రొవ్విరులవాన గురించిరి భామమీఁద ది
గ్దంతిసమానబాహుబలగర్వితుఁ డాశిఖిలోముమీఁద ని
శ్చింతులునై కనుంగొని రశేషజనంబులు నవ్విశేషమున్. 323

తే. అప్పు డజవత్సుఁ డిరువుర నందలముల,మీఁద నెక్కించుకొని యప్రమేయవిభవ
మొనరఁ గొనిపోయి యొక పుణ్యదినమునందుఁ,బెండ్లి సేయుడు నిశ్చలప్రేమతోడ.

క. అనుమతి పావకలోముని, యనుమతిఁ జరియింపుచుండె నఁట యొకనాఁ డ
జ్జనపతిసతిసుత నల్లునిఁ, గనుఁగొని కన్నీరు దొఱుఁగఁ గాఁ బలితోడన్. 325

క. ఎల్లకుమారికలును దమ,వల్లభుల ననంతరూపవంతులఁ గన్నుల్
చల్లఁగఁ జూతురు దీనికిఁ, జెల్లంబో యిట్టిమగఁడు చేకుఱె ననఁగన్. 326

సీ. అజవత్సుఁ డతివ కి ట్లను 'విధికృతము దప్పింప నెవ్వరు లేరు పృథివియందు
సెట్లన్నఁ జెప్పెద నితిహాస మొక్కటి సౌవీరమేదినీశ్వరుకుమారి
యతులితసౌభాగ్యవతి సుశీల యనంగఁ బరగుఁ దత్సతి పెండ్లి ప్రాయ మైనఁ
జెలియలికొడుకు కీఁ దలఁచు నాతఁడు దనయన్నపుత్త్రున కిత్తు మను వధూటి

తే. యిట్లు తమలోన జగడించి యింతి నెఱుఁగ,నీక మేనల్లునికి నిచ్చునిచ్చ నాతఁ
డతనిరప్పించియితరగేహమునఁ బెట్టె,నదియుఁదనయన్నసుతుందెచ్చి యట్లయునిచె.

క. హరిహరవిరించు లయ్యవ,సరమున నాకాశవీథిఁ జనిచని యచ్చో
నిరువురఁ గని యిక్కన్యకు, వరుఁ డిం దెవ్వఁ డని శివుఁడు వనజజు నడిగెన్.

చ. అడిగినఁ బద్మజుండు దరహాసవిలాసముఖారవిందుఁ డై
'యిందుకలిజూట! యీతరుణి యొద్దులపా లగుఁగాని యిందులో
నడరఁగ నబ్బ దెవ్వనికి' నన్న మహాద్భుతచిత్తుఁ డౌచు 'నీ
పడఁతుక యింక నేనరునిపా లగు నాతని మాకుఁ జూపుమా.' 329

ఆ. అనిన నూరిలోన నెనుపోతుపై నెక్కి, వచ్చుచున్న యొక్కపిచ్చుగుంటుఁ
జూపి యితఁడు సుమ్ము సుదతికి మగఁ డన్న, నగుచు విష్ణుదేవు మొగముఁ జూచి.

క. 'వింటి కదా నీతనయుని, కొంటెతనము వీరి మాని కుటిలాలక న
క్కుంటునకు నిత్తు రఁట యిటు,వంటివిపో పెక్కునోళ్ళవారల మాటల్.' 331

క. అనినఁ జతుర్వదనుం డిట్లను 'రమ్మా! పంచవదన! యనృతంబులు ప
ల్కునె బ్రహ్మ నన్నెఱుంగవె, విను మిది బొంకైన నీకు విఱిగినవాఁడన్.' 332

క. అనిన నిది నిజమొ కల్లయొ, కనుఁగొందము గాని నీదుగరుడునిచే న
వ్వననిధి యవ్వల నీపంగుని విడిపింపు మని చెప్పె గోవిందునితోన్. 333

క. చెప్పిన నది యట్టే యగుఁ, దప్ప దితనిసృష్టిచిత్రితానైపుణ మే
చొప్పొ పరికింత మనుచు, నప్పక్షిప్రభునిఁ బనిచె హరియును బ్రీతిన్. 334

క. పనిచిన మహాప్రసాదం, బని యతఁ డాక్షణమ వార్ధి యవ్వల నొకకా
ననమధ్యంబున వైచె న,తని వాఁడును నచట నుండి దైన్యం బెసఁగన్. 335

ఆ. ఎంత ప్రొద్దు కైన నే నాఱుగృహముల, కేఁగి పుణ్యకాంత లిడినకూడుఁ
గూరఁ గడుపుఁ బ్రోచుకొనుచున్నకపటి ని,చ్చోటి కేల తెచ్చె మేటిఖగము. 336

ఉ. తెచ్చిన నేమి సర్వజగతీభరణక్షముఁ డైన యచ్యుతుం
డచ్చుగ నెల్లజీవులకు నారసి యన్నము వెట్టుచుండు నే
నిచ్చట నొంటి నున్నతఱి నేల తలంపఁడు జాఠరాగ్నిచే
వెచ్చుచు నున్ననన్నుఁ దగవే తన కింత యుపేక్ష సేయఁగన్. 337

క. అని కడు నాక్రోశించున,తనిహృదయము నెగు లెఱింగి దామోదరుఁ డా
తనియాఁకలి దీర్పవనా, వినతాసుత నీకుఁ బోదువే పొ మ్మనినన్. 338

వ. అతం డరిగి పరికించుచు నప్పురంబున రాజసదనాభ్యంతరంబున ఘృతపాయసాపూపాదివివిధసౌరభంబులం గలబోనకావడి యొకటిం గని దానిం గొనిపోయి యాపిచ్చుకుంటు మ్రోల నిడి నీ వీయశనంబు భక్షింపు మనుచుం బల్కి పక్షీశ్వరుండు క్రమ్మఱి పోయిన నతండును. 339

ఆ. బోనపుటికఁ దెఱవఁ బుష్పాస్త్రశౌదిలోని, మోహనాస్త్ర మనఁగ ముగ్ధ యొకతె
యందులోన నుండి మందస్మితానన, ద్యుతులు దృఢ్మరీచితతులు వెరయ. 340

క. గ్రక్కున వెలువడి తనచేఁ, జుక్కలగుదివోలె నున్నసురుచిరహారం
బక్కడిపియఱుత వైచుచుఁ, దక్కక చేతండ్లఁబ్రాలు తలపైఁ బోసెన్. 341

ఆ. అంతఁ బోక కాంచనాపాత్రమునఁ బెక్కు, రుచులు గల్గుభోజ్యనిచయ మిడినఁ
గంటి మంటి ననుచుఁగడుపారఁ గుడిచి య,వ్వనితఁ జూచి యిట్టు లనియెనతఁడు.

క. 'ఏ నెవ్వరు? నీ వెవ్వరు, మానిని! యిటు సేయు టేమి మత?' మనవుడు న
బ్జానన యి ట్టనుఁ జెప్పెద, వీను లలర 'వినుము నాదువృత్తాంతంబున్. 343

సీ. మాతండ్రి సౌవీరమండలాధీశుఁ డాతని పేరు ధాత మాతల్లి పేరు
ధాతి నన్నారాజు తనతోడఁబుట్టినయతివపుత్త్రున కిత్త మనిన నీక
తనయగ్రజునితనూజున కిత్తు నని పూని కైసేసి నాచేత సేసఁబ్రాలు
నీము త్తియపుఁబేరు నిచ్చి యీబోనపుట్టికఁ జేరి తెఱచుఁ గౌతుక మెలర్ప

ఆ. నెవ్వఁ డతఁడు నీకు హృదయేశుఁ డతని వ,రింపు మని రహస్యరీతి నిట్లు
పనిచె నతనిపీడుపట్టుకు' నిది నాప్ర,సంగ మనిన నాత్మఁ బొంగి యతఁడు. 344

క. అవ్వల నెయ్యది తలఁపఁగ, నివ్వల నెట్లయ్యెఁ గార్య మిట్టిద సుమ్మీ
యవ్విధి యెవ్విధిఁ బఱచిన, నెవ్వరికిని దొలఁగ రామి యెఱుఁగఁగ వచ్చెన్. 345

చ. చరణవిహీనుఁ డట్టె ఘనసాగరభీకరవీచికాసము
త్కరపరిఖాంత మైననడుగడ్డకు వచ్చి నిజోదరాగ్నిచే
నెరియుచు నున్నయట్టితుది నెవ్వరికిం బడయంగరానిసుం
దరి యిది పత్ని యయ్యెడిని దైవముచేఁతల కడ్డ మున్నదే. 346

వ. అని తలంచి యతండు యాదృచ్ఛికప్రాప్తవిపత్సంపదల కచ్చెరువందుచుండె నంత
నిక్కడ. 347

ఆ. లగ్నవేళ యైనలలనాలలామంబు, నరసి కాన కానరాధినాథుఁ
డింతిమీఁదఁ గినిసి యెచ్చోట దాఁచితి, పాపఁ దెచ్చి నాకుఁ జూపు మనిన. 348

క. గరుడుఁడు గొనిపోవుట య,త్తరుణి యెఱుఁగుఁ గానఁ దనకు దప్పించుకొనన్
వెరవు దలఁచి యతనిముఖాం,బురుహాముఁ గోపించి చూచి బోమముడి వడఁకన్.

క. 'భూవల్లభ! నాకూఁతుకు, నీ వేమిటిదాన వనుచు నిష్ఠురభాషల్
నీ వల్లనాఁడు పలికితి, కావున నది మొదలుదానిగతి యే నెఱుఁగన్. 350

క. ఆలసి మగఁడని యున్నెడ, నాలిపలుకు సరకుసేయఁ డట తా మగఁడే
యూలే మఱి వానికి నది, జాలిం బడనేల పట్టిసామ్యంబునకున్. 351

క. నీ వెఱుఁగవె నీజీవన, మేవారికి నిన్ను వాల్లయింపఁగ నేలా
నీ వట నీపుత్త్రిక యట, యేవిధి యట పొమ్ము మమ్ము నేలా తడవన్'. 352

క. అని దగ్గఱమా టాడిన, విని మార్పలుకంగ లేక విఘటితకార్యుం
డును విగతోపాయుండునై, చనియె నతఁడు సతుల గెల్వ శక్యమె యెందున్.

క. ముద్దియ చేతప్పి చనిన, నెద్దియుఁ జేయునది లేక యెల్లరు నగఁగా
నిద్దఱు పెండిలికొడుకులు, ప్రొద్దు గలుగ నూరు వెడలిపోయిరి లజ్జన్. 354

ఉ. అవ్విధ మంతయుం గని మురాంతకుఁ డంబుజగర్భుఁ జూచి వీ
రెవ్వరితోడఁ జెప్ప కిటు లేఁగెద రన్నఁ జతుర్ముఖంబులన్
నవ్వుచు 'నోమహాత్మ! నృపనందన నీభటుఁ జేరె నింక వా
రెవ్వరివారలై నిలుతు రిచ్చట నొచ్చెము గాదె యుండినన్'. 355

మ. అనినన్ వింటె గదా పినాకి మనతో నబ్జాననుం డప్పు డా
డినమాటల్ నిజ మయ్యె మెచ్చఁదగుఁ జుండీ యంచు విష్ణుండు ప
ల్కె నటే నాతనిఁ జూడఁ బోద మని పల్కెన్ ఫాలనేత్రుండు రం
డనియెం బద్మజుఁ డట్లు మువ్వురును నుద్యత్ప్రీతి సంధిల్లఁగన్. 356

వ. బ్రాహ్మణరూపంబులు గైకొని పోయి యాదంపతులపరస్పరానురాగంబును వార
దమకు నొనరించునతిథిసత్కారంబునుం జూచి మెచ్చి తమనిజరూపంబులు చూపి
విష్ణుదేవుండు వానికి నున్నతపదంబులతోన పదంబు లొసంగె బ్రహ్మదేవుండు
దానికి నైదువతనంబు చాల నిచ్చె మహాదేవుండు వానికిఁ బరమజ్ఞానంబు ప్రసా
దించె నట్లు వరంబు లిచ్చి పైన తేయుఁ చేత నయ్యిరువుర సౌవీరనగరంబునకుం
బనిచి చతుర్ముఖుచాతుర్యంబు గొనియాడుచు నతని వీడ్కొని మురాంతకపురాంతకులు
యథేచ్ఛం జనిరి సుశీలయుం దనపోయివచ్చిన తెఱంగు తల్లిదండ్రులకుఁ జెప్పి తన
మగనిం జూపిన సంతోషించి ధాత్రుభూనాథుండు వానికి దండనాయకపట్టంబు
గట్టిన నింద్ర సేనాధిపతియైన సేనాని తెఱంగున మెఱయుచుండె నట్లు గావున. 357

చ. వగవకు బ్రహ్మకల్పిత మవారిత మెందును నన్న నిట్లను
న్నగువ సుశీల భర్తకు జనార్దనశంభుసరోజగర్భు ల
చ్చుగ వర మిచ్చిన ట్లితనిఁ జూచి మదిం గృప పుట్ట వార లీ
జగమున లేరొకో కడు నసాధ్యమొకో యిది యంచు నుండఁగన్. 358

వ. అవ్విధంబుఁ జూచి భావజ్ఞుం డగుపావకలోముండు వీరి నింక వగపింప నేల సకల
జనంబులమనంబులఁ బరికించుటకు నిన్నిదినంబులు నిట్లుండితి నింతట నానిజరూ
పంబు చూపవలయుం. 359

చ. అని యటు లున్నయున్కి నవిజాంఘ్రికరద్వితయంబు లొప్పఁగా
ననుపమలీల నొప్పి యతఁ డత్తకు మామకుఁ జేతు లెత్తి మ్రొ

క్కినఁ బరమాద్భుతంబు మదిఁ గీలుకొనంగను బెక్కుదీవనల్
మునుకొని యిచ్చి కోర్కి తుద ముట్టెఁ గదే యని సంభ్రమించుచున్. 360

క. అజవత్సుఁ డతని కి ట్లను, 'నిజస్వరూపంబుఁ దెలియ నేరము గడు న
క్కజ మైనది నీచందము, భుజచరణాగ్రంబు లెట్లు పొడమెను నీకున్. 361

క. నరుఁ డనఁగరాదు నినుఁ గిన్నరుఁడవొ యక్షుఁడవొ త్రిదివనాథుఁడవొ సుధా
కరుఁడవొ మరుఁడవొ నీ వెవ్వరు నా కెఱిఁగింపు మనిన వాఁ డి ట్లనియెన్ 362

చ. 'నరుఁడనె కాని నేను నరనాయక! యన్యుఁడఁ గాను నీకుఁ జె
చ్చెర నిదె సర్వముం దెలియఁ జెప్పెద వి' న్మని చెప్పె నమ్మహీ
శ్వరతనయుండు దైత్యపతిశాపముచందము శాపమోక్షముం
బొరసినలాగు నన్నిదినముల్ నిజరూపము చూప కున్కియున్. 363

వ. ఇట్లు సెప్పిన. 364

మ. అజవత్సుం డలరెం దదీయసతి యాహ్లాదించెఁ దద్బాంధవ
వ్రజ మానందముఁ బొందె భృత్యతతి భావప్రీతి సంధిల్లె న
క్కజ మీరాజతనూజభాగ్య మనుచుం గైవారము ల్చేసె ని
ట్టిజగద్రోహి గలండె కుంభి యని తిట్టెం బౌరలోకంబు దాన్. 365

క. ఒడలు పులకింపఁ గన్నుల, నడరఁగ బాష్పములు వదన మలరఁగఁ గోర్కుల్
గడలుకొనఁగ ననుమతి యప్పడ పెన్నిధిగన్న పేదపోలిక మెఱసెన్. 366

వ. ఇట్లు తత్సతీద్వితీయుండై యతండు రతిసమేతుం డగుమీనకేతుండునుంబోలెఁ బొలుపొందుచు నాట్యనగరంబునందు కొన్నిదినంబు లుండి యొక్కనాఁడు తన మామచేత ననుజ్ఞాతుండై భార్యయుం దాను నిజపురం బగుదివిజపురంబునకుం జని యంభీరమహారాజునకుం గుంభినీమహాదేవికిం దండప్రణామంబు చేసి యనుమతిం జూపిన నారాజపుంగవుండు నిజాంతరంగం బాశ్చర్యతరంగంబుగా నతని కిట్లనియె.

ఉ. 'ఏలర ముద్దుకూన! నను నెప్పుడుఁ గన్న మొఱంగి పోయె ద
వ్వేలుపుటింతులట్టియరవిందదళాక్షుల మున్నుఁ దెచ్చి తీ
బాలిక దెచ్చి తిప్పు డిదె భావజుదేవియుఁ బోనిదాని నీ
లీల దలంప నచ్చెరువు లేమలఁ గందువఁ బెట్టి తెచ్చెదే.' 368

క. అనిన నతఁ డింక దాఁపఁగఁ, బని లే దంతయును జెప్పఁబడు నని చెప్పెన్
మును గుంభియుఁ దానును నటు, చను టాదిగఁ గల్గుతత్ప్రసంగము లెల్లన్. 369

ఉ. చెప్పినఁ గుంభినీతలకుఁ జిత్తమునం గలుషించి వాఁడు నీ
కెప్పుడు నాప్తుఁ డంచు తుది నింత యొనర్చెనె వేయుఁ జెప్పినం

దప్పా నె జాలిదోషము ప్రధానిపదంబున నిల్పినాఁడ మా
త్రిప్పరితంత్రి నిం కతనిఁ ద్రిప్పకయుండిన వాని పుట్టదే. 370

క. అని యతనిగ్రహంబునఁ గల, ధనధాన్యాదు లగువస్తుతతు లన్నియుఁ జే
కొని పదహీనునిఁ జేసినఁ, జని యాలును దాను నొక్కజనపదమందున్. 371

ఆ. కుడువఁ గూడు కట్టుకోఁగ నోకయును లేని, యధమవృత్తి నుండి రట్ల కాదె
గుణవిహీనుఁ డైనకొడుకుచే నాపద, దనక కున్నె తల్లిదండ్రులకును. 372

వ. ఇవ్విధంబున వాని నపగతతేజుం జేసి యారాజు గుణధాముం డగుపావకలోము భూమిపాలనంబునకు నభిషేకంబు చేసి తాను దపోవనంబునకుం జనిన నతండు సింహాసనస్థుండై దుష్టజననిగ్రహంబును శిష్టజనానుగ్రహంబును దనకు నిత్యకృత్యంబులుగా ననేకవర్షంబులు రాజ్యంబు చేసి పూజ్యం బగుశివసాయుజ్యంబు వడసె నని యప్పుశురత్నంబు పుండరీకంబునకుం జెప్పె నని. 373

ఆ. బ్రహ్మరాక్షసునకు రత్నమండనుఁడు చె, ప్పాట యుపన్యసించె భోజపతికి
సిద్ధుఁ డంచు నిట్లు చెప్పిన విని తద, నంతరప్రసంగ మడుగుటయును. 374

చ. ప్రణమదశేషకల్మషపరాగనిరాసపయఃప్రపూర! మా
ర్గణగణనిర్గతానలశిఖాపరిశోషితసింధురాజ! భీ
షణదశవక్త్రవక్త్రజలజప్రజచంద్ర! సమస్తలోకర
క్షణపటువీక్షణస్ఫురణ! గర్వితదానవమానమర్దనా! 375

క. దుగ్ధాబ్ధిశయన! యదుకుల, దుగ్ధాంభోరాశిచంద్ర! దుగ్ధమరాళ
స్నిగ్ధయశ! యశోదాస్తన, దుగ్ధప్రియ! గోపసదనదుగ్ధసుచోరా! 376

భుజంగప్రయాతము.

రమాహృత్సరోజాత రాజీవమిత్రా!, తమాలాభసీపుష్పధా మాబ్జనాభా!
యమూసంతతస్తోత్రయోగ్యాభిధానా, సముద్యత్ఖగాధీశశైలాగ్రధామా! 377

గద్యము. ఇది వాణీవరప్రసాదలబ్ధవాగ్వైభవ తిక్కనామాత్యసంభవ సుకవిజనవిధేయ అనంతయ నామధేయప్రణీతం బైనభోజరాజీయం బనుకావ్యంబునందు వ్యాఘ్రంబునకు ధేనువు పావకలోముచరితం బుపన్యసించుటయుఁ దదనంతరవ్యాపకంబు లైనశాంభోపాఖ్యానంబును బంగుండు రాజకన్యాసంగమం బగుట చెప్పంబడుటయుం నన్నది పంచమాశ్వాసము.

శ్రీ

# భోజరాజీయము

## షష్ఠాశ్వాసము



యువతీమృదువచనర
సాయనపరిపూర్ణకర్ణ! శశినిభవర్ణా!
మాయాతీత! సువర్ణ
స్తేయాద్యంహోవిఘాత! శ్రీనరసింహా! 1

వ. అవధరింపు మమ్మహామతి యమ్మహీపతి కి ట్లనియె నట్లు రత్నమండనుండు చెప్పు గోవ్యాఘ్రసంవాదకథావిశేషంబునఁ బావకలోమచరిత్రంబు విని 'చిత్రకాయం బెటు వోయె నక్కథ విని బ్రహ్మరాక్షసుం డేమి చేసె నెఱింగింపు' మని భోజుం డడిగిన సర్వటి యి ట్లని చెప్పె నాప్రసంగంబు విని. 2

క. తా నెఱిఁగినకథ చెప్పితిఁ, బోనీకుండెడునె యింకఁ బులి యని మదిలో
నూసినసంతసమున నా, ధేనువు డాఁ జనవు మెఱసి ధృతి ని ట్లనియెన్. 3

క. 'పావకలోమునిచరితము, భావ మలర వింటి వింకఁ బనుపుము నన్నున్
రా వలయుఁ దిరిగి వేగమ,' నావుడుఁ బులి గోవుఁ జూచి నగి యి ట్లనియెన్. 4

క. 'ఏమిటికి నెట్టుకొనియెదు, నీమాటల నాకుఁ గడుపు నిండునె పుత్ర
వ్యామోహ మేల విడువవు, నాముందటఁ బ్రిదుల వచ్చునా నీ కింకన్. 5

ఆ. అకట నీవు నన్ను నడకించి పోఁ జూచె, దేను మోసపోను గాని గోవ!
యడవిలోన నున్నయంతనె పులి యింత, యెఱుక లేని దయ్యెనే తలంప.' 6

ఉ. నావుడు ని ట్లనుం గపిల 'నావచనంబు లనర్థకంబులే?
నీవు వివేకశీలుఁడవు నీ కిటు లాడుట యుక్తమే? నసుం
బోవిడు మాట ని న్నొఱఁగి పోవుటకే? పదివేలు చెప్పినన్
భూవలయంబులోఁ బలికి బొంకుటయుం బ్రతుకే తలంపఁగన్. 7

తే. ఆడి తిరిగినఁ జండాలుఁ డండ్రు గాని, కులము చండాలుఁ డైనను గొఱఁత లేదు
బొంక కున్నఁ జండాలుఁడె పోధరిత్రిఁ, బాఱుఁడనుమాట వినవయ్య! పులులరాజ! 8

ఉ. అచ్చటి కేఁగి మత్సుతుని నర్థిఁ గనుంగొని కుక్షి నిండఁ జ
న్నిచ్చి మనంబునం బొదలు నేఁకటిఁ బాపి శరీర మంతయున్
ముచ్చట వోవ దువ్వి తగుబుద్ధులు చెప్పి కృతార్థనై వెసన్
వచ్చెదఁ గాదు కూడ దనిన న్మతి యడ్డము చెప్ప నేర్తునే. 9

తే. అతిథిసత్కారమునకంటె నధిక మైన, ఫలము లే దండ్రు పెద్ద లీపట్టునందు
నీవ యతిథివి నాకు ని న్నిచట డించి, పోయి రాకున్నఁ బాపంబు పొరయకున్నె. 10

ఆ. కన్నకడుపు గానఁ గడుఁ బిన్న గాన నే, నతనిఁ బాసి దూర మరుగనట్టి
వేళ గాన వాని వీక్షించి రాకున్న, వగపు మాన దనిన వదల వైతి. 11

క. నీ కిష్ట మైనఁ జాలుం, గాకట్టులు సేయు మనినఁ గారుణ్యరసో
త్సేకంబై తనచిత్తము, వే కరఁగుడుఁ బుండరీకవిభుఁ డి ట్లనియెన్. 12

చ. 'కొడుకుఁ దలంచి నీవు గడుఁ గొందల మందఁగఁ జూచి గోవ! ని
న్విడిచిన నాకటం దనువు నిల్వదు నాకు గృహంబు కేఁగి యే
కడవుకుఁ గాని రావొ శపథంబులు పల్కక నమ్మఁజాల' నా
వుడుఁ బులిఁ జూచి గోవు 'వినవో మదిలో నసుమాన మేటికిన్. 13

సీ. ఇంటికి నేఁగి నే నిచటికి రాకున్న వెలఁదులసంసర్గ విడువలేని
యతి వోవుగతికి మధ్యస్థుల మని కూడి పాడి చెప్పెడిచోటఁ బక్షపాత
మతిఁ బల్కునాతనిగతికి నిల్లడసొమ్ము నడగొలు గని త్రోచునతనిగతికి
జట్టియుఁ బెండ్లియు సంఘటించినచోట విరియఁ దన్నినదుష్టనరునిగతికి
తే. మిత్రుఁడై పొత్తు గుడిచి యమిత్రభావ, మాచరించి లో నిచ్చినయతనిగతికి
గోవు లుపవాస ముండంగఁ గుడిచినతనిగతికిఁ జనుదాన ఘోరాలగణవరేణ్య! 14

ఉ. గోవులఁ దప్పు లేకయును గొట్టిన తిట్టినయాతఁ డేగతిం
బోవుఁ బరాంగనారతికిఁ బొంచినపాతకుఁ డెందుఁ జొచ్చు మున్
జీవిత మంది రాచపని చేయక పాఱినపంద యేఁగు నే
త్రోవున కిన్నిచోట్లను బడం గలదాన నసత్య మాడినన్. 15

ఉ. ప్రల్లద మాడి పెద్దలకు బాధ యొనర్చునతండు తండ్రికిం
దల్లికి మాఱు పల్కెడునతండును నాఁకొని వచ్చి యొద్దచే
నుల్ల మెలర్ప మేయఁ జనుచున్నవృషంబు నదల్చునాతఁడుం
ద్రెళ్ళెడునట్టిదుర్గతులఁ ద్రెళ్లుదు నే నిటురాక తక్కినన్. 16

క. ఇల విప్రులకు నసేవ్య, స్థల మొనఁగెడునతఁడు పూర్వదత్తము లగువృ
త్తులు ద్రోచునతఁడుఁ జనుపద, ములు నా కగుఁ బోయి వేగమున రాకున్నన్. 17

సీ. అపరాహ్ణవేళయం దతిథి యేఁగొని వచ్చి యడిగినఁ బెట్టక కడపువాని
గతికి నర్థాపేక్షఁ గన్నియఁ గొనిపోయి ముసలికి నిచ్చుతామసునిగతికిఁ
బాపంబు లేకయె పత్నిఁ బరిత్యజించినవానిగతికి నాశ్రితచయంబు
గ్రాసంబు లేక దుఃఖముల నొందఁగ నసద్వ్యయ మాచరించినవానిగతికి
తే. ధారవోసినధన మీక తప్పి తిరుగ, హితఁ బలుమాఱు నడిగించుదాతగతికి
బోవుదాన నింటికిని నేఁ బోయి మరలి, రాక తక్కితి నేఁ బుండరీకవర్య!' 18

క. అని శపథంబులు పలికిన, విని వ్యాఘ్రము 'నీవు ధర్మవిదురాలవు నీ
కెన యెవ్వరు ధేనువ! యే, నిను నమ్మితిఁ బోయి రమ్మనినఁ బటుబుద్ధిన్. 19

చ. పులికిఁ బ్రదక్షిణించి తలఁపుం బలుకుల్ సదృశంబు గాఁగ న
స్ఖలితవిలాసయాన మెసఁగం బురికేఁగెఁ జతుస్స్తనంబులుం
బలసి పొదుంగు ప్రేఁగు పఱుపంగ గభీరరవంబుతోడ వీ
థుల నడయాడుబాలకులు దోరపుభీతిఁ దొలంగి పాఱఁగన్. 20

ఉ. ఆయతరీతిఁ దద్ధ్వని రసాయనమై చెవి సోఁక నప్పు డం
బే యనుచుం బ్రతిస్వనము పెల్లుగఁ జూపుచుఁ బాఱి ధేనువున్
డాయఁగఁ బోయి వేడుక నొడ ల్గదలింపుచు వాలమార్చుచుం
బాయక గుప్పుచుం గుడిచె బాలవృషంబు నిజాంశదుగ్ధముల్. 21

తే. కొడుకు చను గ్రోలుచున్నంతదడవుఁ దల్లి, యడుగు దిరుగక కదలక యన్యచిత్త
గాక పై నీఁగ సోఁకినఁ గదల కుండె, నెమ్మిఁ బాషాణధేనువు నిలిపినట్లు. 22

చ. కనుఁగొని యప్పు డాగృహిణి కౌతుక మందుచు వచ్చి తద్ఘన
స్తనములచాయఁ జేతికలశం బటు సాఁచిన దాని నిండెఁ బొ
మ్మని కొనియాడ నర్హ మగునట్లుగ నుబ్బును దాయి లేక చ
య్యనఁ బితికెన్ సుధాసమసమంచితసారపయఃప్రపూరముల్. 23

వ. అయ్యవసరంబున- 24

సీ. పొట్టపొంగునఁ దల్లిపొది వాసి వీథికిఁ బాఱి క్రమ్మఱఁ బెద్దపరువుతోడఁ
దలయెత్తి చూచుచుఁ బలుమాఱుఁ దనుఁ దల్లి పిలువంగ నిటనటఁ బొలసియాడు
నిలమీఁద మో మిడి యే మేని మూర్కొను: బసివెట్టికొనుచుఁ దత్ప్రాంతమందు
నంతంతఁ బసిబిడ్డ లడ్డంబు సుడిసిన జంకించి మిన్నంటఁ జౌకళించు
తే నిట్లు శైశవక్రీడల నెసఁగుచున్న, కొడుకుఁ బసఁ జూచి కన్నీరు గ్రుక్కుకొనుచుఁ
'గటకటా! యిట్టినెత్తురుఁగందు నిచట, వైచి పోవంగ వలసెనే నీచగతికి. 25

ఆ. తల్లు లరుగుదేరఁ దనయాడుకోడెలు, సదమలానురక్తి నెదురువాఱఁ
దాను గూడ పాఱి తనమాతృహీనతఁ, దెలిసి బిడ్డఁ డంతదలఁగకున్నె?' 26

వ. అని శోకించుచు మఱియును. 27

ఉ. 'ఏఁ దనుఁ బాసి పోవుతెఱఁ గెద్దియుఁ గానఁడు వీఁడు నెమ్మదిం
దాఁ దిరుగం దొడంగెఁ బులి తద్దయు నాఁకొని యోర్వలేక నా
మీఁద నసత్యదోష మిడి మిన్నక పోవునొ యింక నాకు ని
చ్చోఁ దడయంగ రా' దనుచు సూనుని డగ్గఱి ధేను విట్లనున్. 28

క. 'నిన్నుఁ గని యిన్నిదినములు, చ న్నిచ్చితి నేను ఋణవశంబున నిఁక నీ
వెన్నఁడు నన్నుఁ దలంపకు, మన్న! మమత్వంబు విడువు మన్న! మనమునన్. 29

క. మమకారంబు నహంకారము సంసారానుబంధరజ్జువు లని చి
త్తముల వివర్జింతురు సం, యము లీవును నడుపుమా తదాచారంబున్. 30

క. ఆడకు మసత్యభాషలు, కూడకు గొఱగానివానిఁ గొంకక యొరు లె
గ్గాడిన నెదు రుత్తర మీఁ, జూడకు విని విననివాని చొప్పునఁ జనుమీ. 31

క. ఒంటి చరింపకు పొలమున, నింటికిఁ గడుఁబ్రొద్దు గలుగ నేతెంచుచు రా
వెంటఁబడి పొడుచుగోవుల, జంటఁ జనకు క్రయ్యఁబడకు సందడి యగుచోన్. 32

క. అంగజకేళికిఁ దివిరెడు, పుంగవులను మసరు కవిసి పోరాడకు వీఁ
కం గాలు ద్రవ్వువృషభము,లం గదియకు తెవులుగొంటులం గూడకుమీ. 33

క. తోడుకు దినఁ బోవుపసరము, బడిఁ బోకుము తురగ గార్దభద్విరదాదుల్
నడచుపథంబున కడ్డము, సుడియకు దుర్జనులు మెలఁగుచో నిలువకుమీ. 34

క. నూతులదరులను లోఁతగు, పాతటికసవులను నెట్టిపచ్చిక యున్నన్
బ్రాలిపడి మేయఁబోకుము, మూతి నిడకు మృగసత్త్వములు గలనీటన్. 35

క. ఏను గలిగి యుండఁగ నెవ్వానికి నిను ముద్దుసేయ వాలాయ మగున్
గాని యిటమీఁద నెవ్వఁడుఁ, గానికిఁ గైకొనక చుల్కఁగాఁ జూచుఁ జుమీ. 36

క. చులుకన జలరుహతంతువు, చులుకన తృణకణము దూది చుల్కన సుమ్మీ
యిల నెగయుధూళి చుల్కన, చులుకన మఱి తల్లిలేనిసుతుఁడు కుమారా! 37

ఉ. కావున నిట్టిలాఘవము గానుపకుండఁ బ్రభుత్వముల్ గుణ
శ్రీ వెలయంగ సజ్జనులఁ జెంది తదీయహితోపదేశముల్
నీ విమలాంతరంగమున నిల్పుము కాని నిరర్థగోష్ఠికిం
బోవకు మయ్య దుర్గములఁ బొందకు మయ్య వివేకహీనతన్.' 38

చ. అని తగ బుద్ధిఁ జెప్పెడునిజాంబఁ గనుంగొని తత్తనూజుఁ డి
ట్లను 'నిది యేమి తల్లి! యిటు లాడెదు విప్రుఁడు నిన్ను నర్థకాం
క్ష నొకని కమ్మెనో తనదుగాదిలిపుత్రికి నీఁ దలంచెనో
యొనయఁగఁ బుణ్యకాలమున నెవ్వరి కేనియుఁ ధారవోసెనో? 39

ఉ. నీ వెట పోయె దేను నట నీవెనుకం జను దేరఁ జాలనే
గోవును గ్రేపుఁ దల్లి మఱుఁగుల్ల నొనర్చు వివేకహీనుఁ డే
తావునఁ గల్గునే! కటకటా! నను డించి యథేష్ట బుద్ధిమైఁ
బోవుతలంపు నీ కెటులు పుట్టె విచారము చాలదో కదే.' 40

వ. అనినఁ గ్రేపుమాటలకు మిక్కుటం బగునక్కటికంబు మనంబునం బొడమ నగ్గో
విట్టనియె. 41

క. 'ఇవ్విప్రవరేణ్యుఁడు నను, నెవ్వరికిని నొసఁగఁ డేన యేఁగెద వినుమం'
చవ్వివరము సర్వంబును, నవ్వత్సముతోడఁ జెప్ప నది కడుభీతిన్. 42

క. పిడుఁగడిచిన క్రియ నీటెం, బొడిచినగతి గుండె పగిలి భూస్థలిమీఁదన్
బడి పొరలుఁ దన్నుఁ గొను ను, గ్గడువుగఁ గన్నీరు నించు గడగడ వడఁకున్. 43

క. 'ఛే' యనుఁ 'దల్లీ! నీ వెట, పోయెద?' వను 'నన్ను డించి పులివాతఁ బడన్
బోయెదవే?' యనుఁ 'జెల్లం, బో!' యను 'నింకేటి బ్రతుకుపో నాకు' ననున్. 44

క. ఇవ్విధమున శోకింపఁగ, నవ్వత్సశిరంబుమీఁద నానన మిడి 'నీ
వెవ్వరికిఁ గాఁగ వగచెద, విప్పులవనిజాలిపడఁగ నేటికిఁ బుత్రా! 45

చ. అరుదుగ సత్యవాక్యము సహాయముగాఁ బులిచేని వక్త్రగ
హ్వర మను పెద్దతోవను రయంబున స్వర్గసుఖంబుఁ జూఱకో
నరుగుచు నున్నదాన నిది హర్షము నొందెడువేళ గాక దు
స్తర మగుశోకముం బొరయుదానికిఁ గారణ మేమి చెప్పుమా. 46

క. పుట్టినపిమ్మటఁ జావును, గట్టి వృథా మరణ మొందుకంటె బుధులకున్
దట్టమగుకీర్తిసుకృతము, లిట్టులముఁగఁ గల్గుచావు లింపులు గావే. 47

ఉ. శోకము దక్కి లెమ్ము గుణశోభిత! నీ' వనఁ దల్లివాక్యముల్
సైకొని తత్తనూభవుఁడు కంపము నొందుచు లేచి 'యక్కటా!
గోకులభూష! నీకు సమకూరెడుశాశ్వతపుణ్యలోకముల్
నాకు నగమ్యదేశములె? నన్నును దోఁకొనిపొమ్ము' నావుడున్. 48

క. 'సంతతి యెడ తెగినంతన, నెంతటిపుణ్యాగతు లైన నెడ తెగు నని సి
ద్ధాంతము విను నాత్మజుఁడ!, చింతింపకు మొక్క తెలివి చెప్పెద నీకున్. 49

క. సుతుఁడు మహిఁ దల్లిదండ్రులఁ, బ్రతిదినమును బ్రోచు నన్నపానాదులచే
మృతు లైనపిదపఁ బితృదే, వతపూజలఁ జేసి వారి వదలక ప్రోచున్. 50

ఉ. కావునఁ బుత్రజన్మము జగంబున భుక్తికి నిత్యముక్తికిం
ద్రావల మండ్రు నిన్నుఁ గని ధన్యత నొందితి మత్పవిత్రవం

శావళి సీకరంబున నిరంతరమై కొనసాఁగెనేని నా
దేవనివాస మాది యగుదివ్యపదంబులు నాకుఁ జేకుఱున్. 51

ఆ. ఇంకఁ బెనఁగ వలవ దిచట నేఁ దడసిన, నచట ననృతదోష మావహిల్లు
దాన జేసి యగు నధమలోక మంత సేయంగ నేల పనుపవయ్య నన్ను.' 52

చ. అని యిటు లెట్టకేలకు నిజాత్మజుశోకదవాగ్నికీల లో
య్యన వచనాంబువర్షమున నాఱఁగఁ జేయుచు దాని నచ్చటం
గొనకొని యుండఁగా నిలిపి కూరిమితోఁ బులి యున్నయట్టియ
వ్వనమునకుం రయం బెసఁగ వచ్చుచు నుండఁగ నంత నక్కడన్. 53

వ. అప్పులి యిట్లని వితర్కించు. 54

క. 'పాటి గలదె పసరమునకు, ప్రేటలవిం గదిసినపుడె విఱువక నేన
మ్మాటల బేలుపడితి మొగ, మోట దరిద్రత్వమునకు నోఁగిఁ బొత్తయ్యెన్. 55

క. తా నొకనిజమరిపోలెం, బూని పలికెఁ బెక్కుశపథములు కడపటఁ దాఁ
గానియదిపోలె నాఁకొని, యే నిచ్చట నున్కిఁ దలఁప దెటుపోయెనొకో. 56

క. పోఁ దడవు లేదొ క్రమ్మఱి, రాఁ దడ వది లేదొ యీసురభి యణకించెన్
మీఁ దెఱుఁగ నైతి నటమట, నీఁదించి యథేచ్ఛఁ జనియె నింకే మందున్. 57

క. పులిచేతఁ జిక్కి యొకయి, మ్ముల విడివడిపోయి దానిముందటి కేగో
వులు మరలి వచ్చు నేలా, తలపోఁతలు నోరికండ తప్పెం దప్పెన్. 58

క. ఏ దానితోడిచలమున, నేదినమున నైన నొక్కయెడ నడరి గళ
చ్ఛేదము సేయక యూరక, పోదునె యిటు గాక యున్నఁ బులినే నేనున్.' 59

చ. అని యుదరాగ్నిచేఁ బరవశాత్మకయై ధృతిమాలి నెమ్మనం
బునఁ దలపోయుచున్నపులిముందటి కప్పుడు వచ్చి నిల్చెనో
యనఁగ మహాద్భుతం బగురయంబునఁ దాఁ బఱతెంచి ధేను వి
ట్లను 'నిది ప్రొద్దదాఁకఁ గడునాఁకొని యేక్రియ నుండితో కదే. 60

ఆ. ఇంతతాల్మి లేక యిల నిట్టిసుకృతంబు, లెట్లు సంభవించు నేరికైన
నీనిమిత్తమై కదా నాతనూజుని, బుజ్జగింపఁ గంటిఁ బురికి నేఁగి. 61

క. నామన సొక్కటి యయ్యెను, నీమనసారఁగ భుజింపు నీ కే నధిక
ప్రేమమున సమర్పించితి, నామే నిదె పుణ్యగతికి ననుఁ బుచ్చవనా.' 62

ఆ. అనిన దాని తెగువ కద్భుతస్వాంతుఁడై, పుండరీక 'మేను బుట్టి పెరిగి
యింతవాఁడ నైతి నింత నిష్కపటుల, నిట్టిధీరమతుల నెఱుఁగ నేను. 63

ఉ. ఇట్టిమహానుభావులకు హింస యొనర్చి దురంతదోషముల్
గట్టికొనంగఁ జాల మఱి కల్గదె మాంసము లొండుచోటఁ? నీ
పుట్టువునందు నన్ను మును పుట్టఁగఁ జేసినయట్టిదైవ మీ
పట్టునఁ బూరి మేపెడినె? ప్రాణము లింతనె పోవుచున్నవే!' 64

మ. అని యాధేనువుఁ జూచి 'నీవిమలసత్యప్రౌఢికిన్ మెచ్చి వ
చ్చె నినుం జంపఁగఁ జాల నీదుతల గాచెన్ ధర్మ మీప్రొద్దు పో
మ్ము నిజావాసము చేర నీసఖులు సమ్మోదంబునుం బొంద నీ
తనయుం డత్యనురాగముం బొరయఁ జిత్తప్రీతి మై నొందఁగన్.' 65

వ. అనిన నప్పులికి నమ్మొదవి ట్లనియె. 66

క. 'మెత్తనిమనసే నాయది, యొత్తి యిటులు చూడ నేల యోపుణ్యుఁడ? నే
నిత్తనువు నీకు మును వాగ్దత్తము చేసినది కాదె కథ లేమిటికిన్. 67

ఆ. చనువు చెఱుప వైతి ననుఁ బోయి రానిచ్చి, తదియ చాలుఁగాక యుదరవహ్ని
వేఁగుచున్న నిన్ను విడిచి యే మని పోదు, గెలుచునంతదాఁకఁ గలదె పాడి. 68

సీ. ఉదరాగ్ని పెల్లున నొడలెల్ల కుమ్మమై వాతెఱ వరువట్టు వట్టఁ దొడఁగె
సకలేంద్రియంబులు వికలభావంబు చేకొనియె వీఁపున నంటుకొనియెఁ గడుపు
ప్రాణంబు లాతురపడఁ జొచ్చె నిట్టూరకుండుదే ప్రొద్దు భానుండు గ్రుంకెఁ
బగలింటియుపవాసభారంబు దీఱ మద్రక్తమాంసముల నక్తమ్ము సేయు

ఆ. మంతఁ బుణ్యురాలనై యేను దివ్యవి, మానయానమున నమానమహిమ
తనర నిన్నుఁ దలఁచుకొనుచు నెమ్మదిఁ బోదు, నూర్ధ్వలోకమునకు నోమృగేంద్ర!'

క. అని గంగడోలు బిగియఁగఁ, దనమెడ యెత్తుకొని కపిల దగ్గఱఁ జనుదెం
చినఁ జూచి పుండరీకము, వెనువెనుకకె పోవుఁ గాని విఱుపదు దానిన్. 70

సీ. 'కుడువంగ' రమ్మని తొడరి చుట్టముఁ బిల్వ 'నాఁకలి గా దొల్ల' ననుచుఁ బెనఁగు
నతఁడును బోలె వాతతశోభనాంగియై తనరు సాధేయరత్నంబు దన్ను
భక్షింపు మని పట్టుపఱుప సద్యోజ్ఞానశాలియై పరగుశార్దూలవిభుఁడు
దా నొల్ల నని పల్కఁ దమలోన నొకకొంతదడవు ముహుర్భాషితంబు లిట్లు

ఆ. జరుగుచుండ గోవుసత్యవాక్శుద్ధికిఁ, బులికృపానమగ్రబుద్ధికిని బ్ర
సన్నులైరి సురలు సాధువాదము లుల్ల, సిల్లె గగనవీథి నెల్లయెడల. 71

వ. అయ్యవసరంబున. 72

సీ. పవిచేత నఱుకుడు పడియున్న యెఱకలు మగుడఁ గాంచినమేరునగ మనంగఁ
బవనుచేఁ దూలక ప్రకటప్రభావంబు వడసినమేచకాభ్రం బనంగఁ

బొలసి యదృశ్యమై పోవక శృంగారమిశ్రమై యున్న క్రొమ్మెఱుఁ గనంగ
నుడువీథిఁ జరియించు టుడిగి భూలోకంబుఁ జూడ వచ్చినదొడ్డచుక్క యనఁగ

ఆ. వైనతేయుఁ డలర వానిపైఁ దనదివ్య, కాయ మమర మణియుఁ గౌస్తుభంబు
నురమునందు నొరయ మురవైరి ప్రత్యక్ష, మయ్యె ధేనువునకు వ్యాఘ్రమునకు. 73

వ. ఆదివ్యరూపంబుఁ గన్గొని యత్యాహ్లాదంబునం బొదలుహృదయంబులతోన మ్మొదవును నవ్వ్యాలియును నప్పురుషోత్తము చరణసరసిజంబులు తమశిరంబుల ధరియించిన నప్పు డవ్విహగవాహనుండు త్రివాహనుం డైనట్లుండె నవ్విశేషంబు చూచి యనిమిషు లిట్లని స్తుతియించిరి. 74

చ. 'కలువలఁ దమ్ములన్ సమవికాసము నొందఁగఁ జేయుక్రాలుఁగ
న్నులు గలనీకుఁ బాన్పును మనోజ్ఞరథంబును నాగతద్విరో
ధు లయిననీకు నారయఁ జతుర్భుజ! చేయఁగ రాద గోవునుం
బులియును శత్రుభావములఁ బోనిడి మైత్రి యొనర్చునట్లుగన్. 75

క. దైవం బాదిగఁ దిర్య, గ్జీవులు తుది గాఁగఁ గలయశేషము నీయా
జ్ఞావిలసితవర్తనములు, గావే నీమహిమఁ దెలియఁగలరే యితరుల్.' 76

వ. అని కొనియాడుచుండి రంత నయ్యనంతుండుఁ దద్గోవ్యాఘ్రంబులఁ గారుణ్యదృష్టి నీక్షించి 'మీసచ్చరిత్రంబులకు మెచ్చితిం త్రైలోక్యవరం బిచ్చెద వేఁడుం' డనినవి 'దేవా! భవద్దివ్యలోకంబు మాకుఁ బ్రసాదింపవలె' నని ప్రార్థించిన. 77

క. ఇచ్చితి ననుచుం జనియె వి, యచ్చరతతి పొగడ విష్ణుఁ డవియును జనియెన్
జెచ్చెరఁ దమతమ నెలవుల, కచ్చుగఁ దుది నొదవెఁ గోర్కు లయ్యిరువురకున్. 78

వ. ఈగోవ్యాఘ్రసంవాదంబు విన్న నరులు మృగపన్నగాదిబాధలం బొరయరు వెన్నుండు వారికిం బ్రసన్నుం డగు' నని చెప్పి మఱియును. 79

క. పసరం బంద్రు వివేకము, పస చాలనినీచు నట్టిపసరమ కాదే
వసుధపయి సత్యవాక్యం, బసదృశముగ నిర్వహించె' నని కడుఁ బ్రీతిన్. 80

ఉ. మానుగ రత్నమండనకుమారుఁడు పల్కఁడు బ్రహ్మరాక్షసుం
డానరనాథపుత్రువదనాబ్జము చూచి 'యటేనిఁ బొమ్ము ము
న్నీనిజ మే నెఱుంగ నిట నిక్కము రా నొకమాట పల్కు మి
చ్చో నుదరాగ్ని నేను గడుశోషిల కుండఁగ రమ్ము గ్రమ్మఱన్.' 81

వ అనిన విని యతం 'డేమి పల్కుఁదు?' ననిన వాఁ డి ట్లనియె. 82

క. 'కుడువఁ దొడఁగునెడ నాఁకటఁ, గడుఁ దూలుచు నతిథి వచ్చి గ్రాస మడిగినం
గడపునతఁడు పడుపాట్లుల, బడుదు ననఁము పోయి ఘురలఁ బడి రాకున్నన్.' 83

ఉ. నావుడు నట్ల పల్కుచుఁ బ్రణామ మొనర్చి పురంబు కేఁగి నం
దావనినాథుతోడ నతఁ డంతయుఁ జెప్పినఁ దల్లడిల్లుచు౯
‘దైవమ! యెంత చేసి తిది తప్పఁగఁ ద్రోయ నుపాయ మెద్ది వి
ప్రావళిమాటలుం జెనఁటి యయ్యెనె కార్యము తప్పెనో కదే. 84

చ. పిలువుఁడు చంద్రశర్మ’ నని భీతి యెలర్పఁగఁ బిల్వఁ బంచి ‘యో
యలఘుఁడ! పుష్పగంధియుదయంబుఫలం బిది తాఁకె’ నంచు మూ
ర్ఛిలిన నతండు శైత్యజలసేచన నాతని సేదఁ దేర్చి ‘బె
గ్గిలకు నృపాల నేఁ డితనికిం గ్రహముల్ శుభదంబు లన్నియున్.’ 85

చ. అనవుడు ‘మున్ను మీవచన మాదట నమ్మి కదయ్య! యట్లు చే
సినఁ దుది నింత పుట్టె నరసేయక చెప్పఁగదయ్య! నాఁడు న
జ్జనపతిచేత నాతనికి సత్యనిరూఢి యెఱింగి యుండియుం
జన దని మాన్పలేని యఱజాలికి శోకము నేఁడు పెద్దయే.’ 86

చ. అని తనుఁ దాన దూఱుకొను నాత్మజు గౌఁగిటఁ జేర్చు బాష్పముల్
నినుచుఁ ‘దనూజ! నీ దయినసిద్ధపు మేనికి నెట్టిపాట్లొకో’
యనుఁ దల యూఁచు ‘బాపు విధియా’ యను ‘నింతకుఁ దెచ్చితే’ యను౯
‘వనరుహసంభవుండు మును వ్రాసినవ్రాఁతలు దప్పునే’ యనున్. 87

సీ. ‘అదె కంటె భవదంబ యంబికలోనుగాఁ గల్గునంతఃపురాంగనలవంత
మనబంధుజనులయమ్మలికంబు వీక్షించితే చూచితే నన్నుఁ దేటపడఁగ
మమ్ము నందఱ శోక మగ్నులఁ గావించి యరుగంగఁ బాడియే యన్న! నీకు
నందుఁ బోవక మాను మాబ్రహ్మరాక్షసుం డేమి గోరినఁ దెచ్చి యిత్తుఁ గాని
ఆ. నిన్నుఁ బనుపఁ జాల నీవు నాయొద్దనె, యుండ వన్న!’ యను ‘నితండు లేని
పిదప నాకు నేటిబ్రదు?’ కనుఁ ‘బుత్రకో, కంబ పొమ్ము మిగులఁ గడిఁది’ యనును. 88

క. ఇవ్విధమునఁ బలవింపఁగ, నవ్వక నవ్వినటు లాననద్యుతులు గదు౯
నివ్వటిల రత్నమండనుఁ, డవ్వసుధాధిపునితోడ నలరుచుఁ బల్కెన్. 89

ఉ. ‘ధీరత లేనివానిక్రియఁ దేజము పెంపఱ ని ట్లలందురం
గారణ మేమి యస్థిరము గాదె తలంప శరీర మిట్టిచో
నూరకపోవుకంటె నొకయోగ్యుఁడు కోరి భుజించు టొప్పదే
బోరనఁ బాపు నేఁ బలికి బొంకఁగఁ జాల నృపాలశేఖరా! 90

తే. కులము వెలయింపఁ బుట్టినకొడుకు కొడుకు, గాక కులనాశనుఁడు కొడుకా తలంప
వసుధ నేకల్మషము లేనివంశమునకుఁ, గల్మషముఁ బొందఁ జేయ యుక్తంబె నాకు.

క. శతతపాపాధిక దీర్ఘిక, శతవాప్యధికంబు గ్రతువు శతయజ్ఞసమ
స్నృతుఁ డొక్కసుతుఁడు దత్సుత, శతకంబున కెక్కుడొక్కసత్యోక్తి నృపా.

వ. కావున నీకు నస్మాదృశు లైనకొడుకుల నెందఱ నైనం బడయవచ్చుఁ గాని సకల జగదుద్ధారకం బగుసత్యవ్రతంబు ఘటియింప వచ్చునే న న్నింక సంకిలి సేయక నిష్కలంకచిత్తుండ వై యుండు మేఁ బనివినియెద' ననిన నజ్జనవిభుండు. 93

క. పొమ్మనఁగ మనసు రాక మొగమ్మటు దిగవైచి పలుక గద్దించిన కం
ఠమ్ము గడుగద్గదంబుగఁ, బిమ్మటి గొనుఁ గన్నునీరు వెల్లుగ నించున్. 94

ఉ. అంతట రత్నమండనుఁ 'డహర్పతి పశ్చిమదిగ్ధరాధర
ప్రాంతము సేఁగెనేని దనపంతము దప్పు నసత్యవాదినై
యంతకుప్రోలి కేఁగి బహుయాతనలం బడఁ జాల' నంచు భూ
కాంతునిఁ దాన వీడుకొని క్రక్కున నంబికఁ జేరి యి ట్లనున్. 95

తే. 'తొయ్యలికిఁదల్లిదండ్రులుఁ దోడఁబుట్టుగులును సుతులును గారు సు మ్మలఘుచరిత!
పతియె యిహలోకమందును బరమునందు, గాఢసౌఖ్యంబు లొసఁగెడుక ర్తసుమ్ము 96

వ. కావున నీరాజోత్తమునిచిత్తంబునకు వచ్చునట్లుగా మెలంగు మమ్మ!' యని చెప్పుచు నచ్చోటు వాసి యట పోయి. 97

ఉ. నవ్వుచుఁ బుష్పగంధివదనంబు గనుంగొని 'యోలతాంగి! ము
న్నెవ్వఁడు చెప్పె నీవు జనియించిన నాఁటిఫలంబు నేఁడు నా
కవ్విధ మంతవట్టు నిజ మయ్యె మహాపురుషుండు వానికై
యవ్వనభూమి కేఁగెద రయంబునఁ బొమ్మను చెప్ప వచ్చితిన్.' 98

చ. అనిన 'ననిష్టము ల్గని యుపాయబలంబునఁ ద్రోచుఁ గాక స
జ్జనుఁ డధముండువోలెఁ గనుసన్నను జావ నుపక్రమించునే
విను నృపనందనుండవు వివేకివి చక్కనివాఁడ వార్తయా
వనుఁడవు నేఁడు నీకుఁ దగవా యిటు పల్కఁగ సాదుసన్నిధిన్.' 99

వ. అని పుష్పగంధి పలికిన నారాజనందనుం డిట్లనియె. 100

క. 'ఇదె వచ్చెదఁ జన నిమ్మని, సదమలమతి, బలికినాఁడ శపథ మతని కే
మొదలనె బొంకెదు బ్రతుకుచు, బ్రదుకే పూఁబోఁడి! వక్రభావ లుడుగుమా.' 101

క. అనవుడు 'నేమని పల్కితి, వినవలయుం జెప్పు' మనియె వెలఁది యతం డా
తనితోడఁ దాను మును పల్కినశపథక్రమము దానికిఁ వినిపించెన్. 102

క. విని నృపకన్యారత్నము, తనమదిఁ దలపోసి చూచి దానికి నొక కీ
ల్గనియెను బుద్ధి చతుర్గుణ, మనుటఖ సతులయందు నిశ్చితార్థ మనంగన్. 103

వ. ఇట్లు గని యయ్యుపాయంబువలనఁ దనమగనియుపాయంబు పాయు నని నిశ్చ
యించి. 104

ఉ. 'బొమ్ము నృపాలపుత్ర ! తలపువ్వులు వాడక యుండ నెమ్మనిక్కా
ర మ్మనుపుష్పగంధివచనంబులకుం దరహాసభాసురా
స్యమ్ములరంగ నాతఁడు వెసం జనుచుండఁగఁ బౌరకాంత లో
'యమ్మరొ! చూచితే యతనియాలికి సారయ సెట్టిగుండెయో. 105

ఆ. రోగయుతుఁడు గాఁడు రూపహీనుఁడు గాఁడు, వృద్ధు గాఁడు దుర్వివేకి గాఁడు
పడయరానిరాచపట్టి నేమని పుచ్చె, బ్రహ్మరాక్షసునకు భక్షణముగ.' 106

క. అనువారు 'తల్లిదండ్రులు, మునుకొని చెప్పంగ వినియు మొఱకుండై వ
చ్చినపిదప నిల్వఁగను నం,గన వశమా చనినఁ జనియెఁ గా' కనువారున్. 107

క. నాఁ డెల్లవారు 'నీపూఁ,బోఁడి వలదు మాను మనఁగ బుయిలోడక తాఁ
దూఁడరియై తఱియఁబడిన,వాఁ డితనికి నేఁడు వగవ వల' దనువారున్. 108

సీ. 'పుట్టినప్పుడె యింత పుట్టు మీఁదట నని యిట్టు చెప్పితె పురోహితులరాజ!
యిది సుమ్ము నాపుత్రియుందయంబుఫల మని తప్పక చెప్పితే ధర్మనిరత!
మూలంబు వినియును మొగ మిచ్చమాటల కేల బేల్పడితి భూపాలతిలక!
కడఁదిమృత్యువు పుష్పగంధియై చనుదెంచి నీమన్ని గొనియె నే నృపతనూజ!'

ఆ. యనుచు నల్లబ్రాహ్మణునిఁ బుండరీకాధి,పతిని నంధవిభుని నతనిసుతునిఁ
బేరు గ్రుచ్చి పలుకువారు 'వా రేమి సే,యుందురు ప్రాప్త' మనుచు నుందువారు.

వ. ఇత్తెఱంగునం బెక్కండ్రు పెక్కువిధంబులం బలుకుచుండ నారత్నమండనుండు
వివాహగమనోన్ముఖుండునుం బోలె సుముఖుం డయ్యును నింద్రదత్తప్రముఖులగు
సఖుల వీడ్కొలిపి చంద్రశర్మాదు లగు మేదినీసురులకు నమస్కరించి నిలిపి తదాశీ
ర్వాదంబులు తోడుగా నొక్కరుండును వెడలి యరుగునప్పు డప్పురంబు కౌసల్యా
నందనుం డరణ్యప్రవేశంబు సేయ నరుగునప్పటియయోధ్యాపురంబునుం బోలి
యుండె నప్పు డాపుష్పగంధియుఁ దనయుపాయంబు నెరపం బూని వానివెనుక నె
యొక్కతెయ యింత నంత నరుగుచుండె నంత నిక్కడ నమ్మహాపురుషుండు 110

చ. 'అదె యపరాబ్ధిఁ గ్రుంకె నినుఁ డాఁకలి మిక్కుట మయ్యె నాకు వాఁ
డిదె యరుదెంతు నంచుఁ జని యిప్పుడుఁ జేరఁడు రాక తక్కినం
బ్రిదులఁగ నీక రాజును బురిం గలమర్త్యుల నెల్లఁ బట్టి మ్రిం
గుదు' ననుచుండ నయ్యెడకు గొబ్బున వచ్చె నృపాలపుత్రుఁడున్. 111

ఉ. వచ్చిన నమ్మహాత్ముఁడును వానిరిఁ దత్తరుశాఖ డిగ్గి వే
వచ్చి నృపాత్మజుం గదిసి వానిశిరోరుహరాశి యొక్కచేఁ
జెచ్చెరఁ జుట్టి పట్టి యొకచే మొగ మెత్తి గళంబుచాయకుం
దెచ్చి మొగంబు దంష్ట్రికలు దీటుచు నుత్కటసంభ్రమంబునన్. 112

వ. అంత నయ్యతివ తనపతిప్రాణభయంబు తప్పింప నిదియ యవసరంబని యూహించి.

క. 'భిక్షాం దేహి' యనుచుఁ గమ,లాక్షి యతనియెదుర నిల్చి హస్తము లెత్తన్
వీక్షించి యతఁడు 'నీ కే,భిక్ష' మనినఁ 'బెట్టు పురుషభిక్షం' బనినన్. 114

చ. విని యతఁ డాత్మఁ జోద్యపడి వీఁ డిటఁ గ్రమ్మఱ వచ్చునట్లుగాఁ
బనిపడి యేను గొన్నపరిభాషయె నాకు మరల్చి యివ్విధం
బున నను గెల్చె నీసతి ప్రబుద్ధలు లే రనవచ్చునయ్య భూ
మి ననుచు నాతని న్విడిచె మెచ్చి నుతించిరి మువ్వురిన్ సురల్. 115

వ. అయ్యవసరంబున. 116

సీ. అదె ప్రభాకరబింబ మది ప్రభాకరబింబ మైన రాతిరి యేల కానవచ్చు
నదె చంద్రమండలం బది చంద్రమండలం బైనఁ గలంకంబు గానఁ బడదె
యదె రోహణాచలం బది రోహణాచలం బేని వియద్వీథి నేల మెలఁగు
నదె తటిత్సముదయం బది తటిత్సముదయం బేని నదృశ్యమై యేఁగకున్నె

ఆ. యనుచు జనులు విస్మయము నొందఁ దనదివ్య,తేజ మఖిలదిశలఁ దీటుకొనఁగ
మహికి నేఁగుదెంచె మహనీయువై భవ,స్థాన మైనవరవిమాన మొకటి. 117

వ. అప్పుడు బ్రహ్మరాక్షసుండు తనవికృతరూపంబు విడిచి దేవరూపంబు గైకొని 'మీ నిమిత్తంబై కదా నాకుఁ బుణ్యలోకంబులు సిద్ధించె' నని యారత్నమండనపువ్వుగంధుల దీవించుచు నద్దివ్యవిమానం బెక్కి యప్సరోగణంబులు గొలువ నింద్రసభకుం జనియె నవ్వధూవరు లిరువురు నిజపురంబునకుం జని నందమహీనాథునకు బంధుయూథంబునకుః దమగమనాగమనంబుల క్రమంబు చెప్పిన విస్మితులై వీని కిది పునర్జన్మంబు పొమ్మని వీఁ డెవ్వరిచేతను దిట్టువడనికాలంబునకు నిట్టియాపద తరియించె నని పరమానందంబునుం బొంది విప్రవాక్యంబు నిక్కంబుగదే యని కొనియాడుచుండి రటు గావున. 118

క. కుడుపుతటి నతిథి గ్రాసం,బడిగినఁ దనకుడువఁదొడఁగునశనం బైనన్
వడినొసఁగంగా వలయుంట,యడర మహాపురుషుచేత నభినుత మయ్యెన్. 119

చ. అనవుడు భోజుఁ 'డిట్టియుతిహాసము నే నెఱుఁగంగ నేర నిం
కనొకటి నాకు నిన్నడుగఁగా వలయున్ గృహమేధి కర్హమౌం

అని సదనాగతాతిథిసపర్యయ కా తెలివొందఁ జిత్త మో
మునివర! యందుఁ గల్గు ఫలము న్వివరింపఁ గదయ్య' నావుడున్. 120

క. 'భోజనృపా!విను మతిథికి, భోజన మిడునతని కొదవుపుణ్యమహిమ యం
భోజభవుఁ డైన నెఱుఁగఁడు, నాజగమున నింత నంత నా నెచ్చోటన్. 121

సీ. ఈయర్థమున నొక్కయితిహాస మేను జెప్పెద నొక్కవిప్రుఁడు సదమలాత్ముఁ
డతనికి ముప్పురు సుతు లుత్తములు వారు పితృమాతృభక్తులై పేర్చి యుండు
రగ్రజన్ములఁ గొల్తు రనుజు లగ్రజులను ననుజులఁ బాటింతు రనుదినంబు
నందులోఁ జిన్నవాఁ డతిధర్మశీలుఁడై విప్రుల కశనంబు వెలయఁ బెట్టు
ఆ. నట్లు జరుగుచుండ నమ్మేలు చూడఁ జాలక విధాత దుదిఁ గలంచె ననఁగఁ
గతిపయాబ్దములకు మృతుఁడయ్యె నవ్విప్రుఁ, డతనియతివ తోన యనుగమించె.

క. తల్లియుఁ దండ్రియు నీక్రియఁ, జెల్లినఁ బరలోకవిధులు చేసినతుది న
య్యిల్లు చెడకుండఁ దమలోఁ, నుల్ల మలరఁ గలసి మెలసి యుండిరి కొడుకుల్. 123

క. అప్పుడు నయ్యనుజన్ముఁడు, తప్పక యతిథులకు నన్నదానము వినయం
బొప్పఁగ నిడు నది గారణ, మెప్పుడు సిరి గదల దతనియింట నృపాలా! 124

వ. ఇట్లు జరుగుచుండ నొక్కనాఁ డాతనివదినెలుఁ దమమఱఁది ప్రియవాదితనంబు చూచి కనుకుట్టుఁదనంబున నతనిధర్మంబునకు విఘ్నంబు గావింపఁ దలంచి తమపురుషులం జేరి సఖేదంబుగా ని ట్లనిరి. 125

ఉ. 'అత్తకు నేము మార్పలుక మాయమచిత్తములోనివారమై
వత్తుము పెద్దవారు గలవారికి నన్నియుఁ జెల్లుఁగాక నేఁ
డిత్తఱి మమ్ముఁ బుచ్చి పని యెవ్వరు గొందరు మిమ్ముఁ జూచి నో
రెత్తఁగ నోడి యేపలుకు లెన్నఁడుఁ జెప్ప మెఱింగి యుండియున్. 126

క. ఇంతట నెఱిఁగెద రొండే, నంతట నెఱిఁగెదరు గాక యని యుండఁగ మీ
రెంతట నెఱుఁగరు బ్రతికెము, వంతమె యిది మీకు నేము పగవారలమే. 127

క. ఒకనాఁ డైనను మాతోఁ, నొకయాలోచనముఁ జేయ కూరక మోమె
త్తికొనుచుఁ బోదురు మీ రాం, డ్రకు మగలకు నిట్టివేఱడంబులు గలవే. 128

క. మగఁ డెఱుఁగ వలయుఁ గాదే, మగువ యెఱుఁగ వలయుఁ గాకమనుగడ తెఱఁగ
మ్మగువయు మగఁడును వెలిగా, జగమున సంసార మెట్లు జరగును జెపుఁడీ'. 129

వ. అని పలికి తమతోడికోడలిం బ్రసంగించి. 130

క. 'పని పంప వెఱతు మాబిడ, పని యెప్పుడు చేసి చేసి పాయవడితి మె
వ్వని రాజ్య మని యొఱుంగదు, తనచేతకుఁ దోఁడు మమ్ముఁ దప్పులు పట్టున్. 131

క. తా మాకు నత్త యైనది, యామఱదియు మాకు మామయై వర్తించున్
మే మయ్యిరువురచేతను, బాములఁ బడలేము *నాతిపాపులభంగిన్. 132

ఉ. పాఱుల పేరు చెప్పుకొని బానెఁడుపప్పునుఁ బాయసంబు నై
దా ఱుపసంట్లవంటకము నాజ్యముఁ గమ్మనికూరగాయలున్
జాఱిలు దించు వారసతిచొప్పున గోళ్ళను మీఁటుకొంచుఁ †మా
తో బొదగొట్టు నీదగరతోఁ బడఁజాలము వేయి చెప్పినన్. 133

ఉ. ఏతరిలాగు మానఁ డతఁ డెవ్వరి నైనను బిల్చి పెట్టు మీ
రాతని కొక్కమాటయును నడ్డము చెప్పఁగ లేరు జీవనం
బీతెఱఁ గైన నేమి గల దింతయుఁ నిప్పుడు గాసి కాదె మీ
రాతనితోడియంశమున కర్హులు గారె విచార మేటికిన్. 134

క. తనగడన లేదు మీ తెచ్చిన యవి తోడ్తోన వ్యయముచేసెడి నింకీ
తనితోడిపొత్తు పదివేలును వచ్చె మనకు విభక్తులును గావలయున్. 135

క. కావున్నను జీవనరుచి, మీకుఁ గలుగునంతదాఁక మీపెట్టినచో
నేకరణి నైన నుండెద, మీకష్టులఁ బడఁగఁ జాల మెన్నాళ్ళైనన్. 136

ఉ. ఉమ్మడి సొమ్ము గానఁ దనయోపినయంతయుఁ నన్ని వంకల
న్నెమ్మదిఁ బాఱఁ జల్లుచును నీట్లెడఁ దాన ప్రదాత నంచు ని
క్కమ్ముగ వేఱు పడ్డతుదిఁ గానఁగ రాదె యతండు పొందులా
భమ్ముల కెల్ల మూల మనుపాటిగ నాలును దాను నుండఁగన్. 137

క. తనయాలును దానును గుడు, వను గట్టను నిట్టియాయవస్థలఁ బడ నే
మును మీరును నటె చాలుం, దనిసితి మీబ్రతుకుపట్టు దయ్యె మెఱుంగన్'. 138

క. అనవుడు 'నది యట్టిద యగు', నని యొండొరు మోము చూచి యన్నయుఁ దమ్ముం
డును నైకమత్యమై తమ, యనుజాని వేర్పట్టఁదలఁచి రట్టిద కాదే. 139

తే. అన్నదమ్ములు దమలోనఁ జిన్న పెద్ద, వరుస లెఱిఁగి యథోచితవర్తనముల
మెలఁగుచుండుట తమయాంధ్రసొలపుమాట, లోలిఁ జెవిఁబడ్డపిమ్మట నేల జరుగు.

వ. ఇట్లు కృతనిశ్చయులై యొక్కసమయంబున నాద్విజులు నిజానుజాం బిలిచి దేశ
కాలవిశేషోపన్యాసంబు మొదలుగా సముచితప్రసంగంబులు తొలుత సలిపి తద
నంతరంబ యి ట్లనిరి. 141

ఉ. 'ముండటిభంగి గాదు కడుమూర్ఖతనంబులు పెద్దయింటిలో
నిండఱయోజయుం జెఱుచు నేపని కైనను బొడ్డు వంప లేఁ

* పాఠా:—నారిపాముల భంగిన్. † పా, మాఱులుపల్కు.

దందురఁ దోడు చీమ చిటుకన్నను వాదుకు వచ్చుచుండు నీ
సుందరిలాగు లేవలనఁ జూచిన లెస్సలు గావు తమ్ముఁడా! 142

క. నీవును మనకలిమి యెఱుఁగు, దేవారికి నైనఁ బెట్టు టెదిబుద్ధియె నీ
కావిద్య యెన్న తోఁడిది, గావున వల దన్న మానఁగా నేర్చదవే. 143

సీ. చుట్టాలు డలలెత్తి చూడంగ మనలోన జగడించుచుండుట తగవు గాదు
చెప్పెద నొకబుద్ధి చెవియుఁ జెప్పకు నెఱుంగకుండఁ బైతృక మైనయొడమె గలది
పంచి యిచ్చెదము నీపాలేర్పడినమీఁదఁ బిలిచి యెవ్వరికైనఁ బెట్టుకొనుము
నీవును నీయాలు నెమ్మదిఁ గడుపారఁ గుడువుఁడు కట్టుఁడు తొడుఁగుఁ డిట్లు

ఆ. గాక యున్న మేము కడిపెడుబిడ్డల, వార మెట్లు బ్రతుకువార మనుజ!
నీ వెఱుంగ కుండ నేవంక నైనను, గలుగురశ్మి గలదె తెలుపు మాకు.' 144

చ. అనవుడుఁ జిన్నఁబోయి యతఁ డానన మించుక వంచి వీర లి
ట్లనుట మహీసురావలికి నన్నము వెట్టుట మాన్పఁ గాదె యే
మనినను మానఁ జాల నని యాత్మఁ దలంచుచు వారిమోము గ
న్గొని యొకకొంతసేపటికిఁ గొంకక బింకముతోడ నిట్లనున్. 145

ఉ. 'ఇంతకుమున్ను నావలన నేయపరాధమునైనఁ గంటిరే
యింతటిలోనివారలు కదే మహి మీరును నన్ను మున్ను మ
న్నింతురు గాన మీకతన నిల్చితిఁ గా దనునంత గర్గె నే
మంతన మేల వే ఱిడుఁడి మాటికి మాటికి మాటలేటికిన్. 146

క. ఎప్పుడు సహజన్ము లగుట, దప్పెడునే వేఱు వడుట తప్పే మున్నీ
చొప్పిలఁ గలదియ కాదే, యిప్పుడు నిర్ణయము సేయుఁ డీ' రని పల్కెన్. 147

వ. ఇట్లు తమలో సంవాదించి యయ్యన్నదమ్ములు మువ్వురు విభక్తులై పిన్నాతని నొంటిచేసి పెద్దవా రిద్దఱు నొద్దికయై కలసి యుండి రట్లుండియుఁ గుటుంబ భారంబునందు బ్రుంగుడుపడి దానమానంబుకందువ లరసికొని తిరుగనెపోయెంగాని పరోపకారంబునకు నవకాశంబు లేదయ్యె నతం డొంటి యయ్యును దొంటియట్ల తనపట్టిన వ్రతంబు వదలక యన్నదానంబు సేయుచుండె నంతనా పెద్దవారియందు.

చ. శిశువులు కూడు కూ డనుచుఁ జిందఱ వందఱ సేయ నాఁడువా
రశనము లేక క్రొవ్వుచెడి యంటలు గట్టి చరించుచుండ దు
ర్దశలకు నెల్ల మూల మయి తా రొకయప్పుడు నీరెలుంగుతో
మశకము లట్లు తూలుచు సమర్థుల మోముల వ్రేలుచుండఁగన్. 149

తే. పిన్న యయ్యును గుణములఁ బెద్ద గాన, వానిజీవన మేమియు హీనపడక
యుండె నయ్యున్కి గన్గొని గుండె లెల్లఁ, గుళ్ళుచుండంగ వది నెలు కుంది కుంది.

చ. మగల మొగంబు చూచి యణుమాత్రయుఁ బేదఱికంబు లేక ఖ్యా
తిగ మనుచున్నవాఁడు భవదీయకనిష్ఠుఁడు వానిఁ బట్టిపా
లు గొనఁగ రాదె మున్నతఁడు లోన నడంపఁగఁ బోలు సొమ్ము మీ
కగపడ కున్న రాజునకు నైన మొఱో యని చెప్పఁ జాలరే. 151

వ. అని పల్కుచు నతనియతివ నుద్దేశించి యాకన్నులకల్కికి ధన మెట్టు గూడెనే యని గుసగుసలు వోవుచుండుదు రీకుటిలప్రసంగంబు లెఱుంగ కతండు సౌజన్యధనుండుగావున విశేషతిథులయందు సపుత్రకళత్రుఁబుగాఁదనయగ్రజద్వితయంబు రావించి తనపంక్తి నశనంబు వెట్టుచుండు నమ్మగువయు మగనిమనసులోనిదయై మెలంగుచుండు బ్రాహ్మణోత్తములు ప్రతిదినంబును నతనిగృహంబున నాహారంబు గొని దీవించుచుం బోదు రిట్లు చెల్లుచుండ నొక్కనాఁ డాగృహస్థునితో గృహిణి యి ట్లనియె. 152

క. 'మీరెల్లప్పుడు విప్రసమారాధనతత్పరాత్ములయి వారల కా
హారములు పెట్టుచుండుదు, రారయ నందు నగుసిద్ధి యది యెద్దియొకో.' 153

క. అనవుడుఁ 'దత్ఫల మింతింతని యేనును మున్ను విన్నయది లే దబలా!
నను నీ విపు డడిగితి గావునఁ జెప్పెద విప్రపుంగవులు రానిమ్మా.' 154

చ అని తనయింటి కద్దివసమం దరుదెంచినవిప్రజాతి క
య్యనఘుఁడు షడ్రసాన్వితము లైనపదార్థచయంబుతోడ భో
జన మిడి వారు తృప్తులయి చల్లనినీడ వసించి యుండ న
వ్వనితయుఁ దాను వారలకు వందన మొప్పఁగఁ జేసి యి ట్లనున్. 155

క. 'ఊహించి మాకు నొకసం, దేహము వాపుటకు నరుగుదెంచితిమి మహో
త్సాహమున విప్రవర్యుల, కాహారము పెట్టుసుకృత మది యెట్టిదియో. 156

క. మా కేర్పడ నానతి యీ, రే కృపతో' ననుడు వార లిందఱు మది నా
లోకించి కొలఁది గానక, మూకత్వము దాల్చి రపుడు మూఢులభంగిన్. 157

ఉ. వారలఁ జూచి 'విప్రు లిటువంటిమహాత్ములు మీ రెఱుంగరే
యూరక యుండు టేతెలివి యుక్తివిహీనులభంగి' నావుడు
న్వారలలోన మేటి యగువాఁ డొకవిప్రుఁడు 'విప్రజాతి నా
హారము పెట్టినట్టిఫల మన్యు లెఱుంగరు భూసురోత్తమా! 158

చ. వరదుఁడు కాశికాపురనివాసుఁడు నాఁ దగువిశ్వనాథుఁ డే
తరుణి వరించు నట్టిహిమధామనిభానన శీతసానుమ
ద్వరజ యెఱుంగుఁ బొమ్మనిన వాఁ డది తీర్థము స్వార్థముం గదా
యరిగెద నంచు గ్రక్కునఁ బ్రయాణము సైకొని భార్య కి ట్లనున్. 159

క. 'కాశికి నేఁగెద నని పర,దేశం బనుతలఁపు నీమదిం జొనుపకు మ
క్లేశగతిఁ దిరిగి వచ్చెద, నోశశధరవదన! యోడకుండుము నెమ్మిన్. 160

క. ఆఁకొని వచ్చినవిప్రులఁ, దాఁకింపక యశన మిడుము తత్పరమతి న
ట్టాఁకలి సేయకు కుడువం, దోఁకొని రా సర్వ మగుతిథుల మనవారిన్.' 161

వ. అనిన విని 'యన్నియుం మీరు చెప్పినట్లు చేసెద నది యట్లుండనిండు. 162

క. సోలయక యన్నం బిడుమీ, జలజభవాన్వయుల కనుట చాలదె యట్టాఁ
కలి సేయకు మని యేలా, పలికితి'రని యడుగ సతికిఁ బతి యి ట్లనియెన్. 163

శా. 'ఆహారాధిక మైన మందు నిలలో నయ్యగ్నిదేవుండు స్వ
ల్పాహారంబున మందు విప్రుఁడు మనుష్యశ్రేణిచే నాఁటఁ ద
త్స్వాహాధీశునిమంట భూసురశిఖిం జల్లార్పఁగా లేరు హ
వ్యాహారాదులు దానఁ బో షాలియుం నల్పాన్నప్రదుం డెయ్యెడన్. 164

వ. కావున గృహస్థుం డతిథికి నల్పాశనంబిడుట యొప్ప దీప్రసంగంబున నొక్క యితి
హాసంబు గలదు చెప్పెద నాకర్ణింపుము. 165

ఉ. తొల్లి నృపాలుఁ డొక్కఁడు చతుర్జలరాశిపరీతభూతలం
బెల్లను ధర్మమార్గమున నేలినవాఁడు యథోక్తదక్షిణల్
పెల్లుగ నిచ్చి యాగములు పెక్కు లొనర్చినవాఁడు ధీజనో
త్ఫుల్లసరోజమిత్త్రు లగుపుత్త్రులఁ గాంచినవాఁడు నల్వురన్. 166

క. ఎన్నఁడును రోగ మాతని, యున్నూరను లేదు వానియొడ లొప్పుఁ బనా
ర్వన్నెపసిఁడిచందమ్మునఁ, గన్నులు వెలిదమ్మివిరులగతిఁ జెలువొందున్. 167

వ. ఇట్లు రాజపుంగవుండు జగదేకసుందరుండై రాజ్యంబు సేయుచుండఁ గొంతకాలంబు
చనినపిదప జరాభారంబు తోరం బగుటయు. 168

ఆ. కలయ నరసె వెండ్రుకలు స్రుక్కెఁ జర్మంబు,వీఁపు వంగె బొమలు వ్రేలఁబడియెఁ
గన్ను లనువు దప్పెఁ గదలె దంతంబులు, కణఁక లడఁగె శిరము వడఁకఁ దొడఁగె.

వ. మఱియు నమ్మన్నుజేనికి మజ్జనభోజనాదివ్యవహారసంచారంబును శయనాసనా
ద్యారోహణావతరణంబునుం బరాయత్తం బై కాని జరగ నేరనిపాటిగా నపాటవంబు
పాటిల్లె నంత. 170

క. అదురవస్థకు నోర్వక, 'యోదైవమ! మరణ మేల యొసఁగవె' యనుచున్
వేదించునృపతియొద్దకు, నాదరమతి నారదుఁడు రయమ్మున వచ్చెన్. 171

ఉ. ఆతనిరాక భృత్యనిచయం బెఱిఁగింప నెఱింగి భక్తితోఁ
జేతులు మోడ్చి 'యోభువనసేవిత! వార్ధకదుఃఖ మేదఁ బ్ర
స్ఫీతగతిం ద్రివిష్టపముఁ జెందెడుమార్గముఁ జెప్పు' మన్న నా
భూతలనాథుఁ జూచి మునిపుంగవుఁ 'డొక్కమతంబు చెప్పెదన్. 172

క. అవనీసురులకు నన్నం, బవనీశా! పెట్టు నెవ్వఁ డట్టాఁకలిగా
నవనిపయి నతఁడు పద్మో, ద్భవుఁ డైనను బోలియుఁ జుమ్ము తత్క్షణమాత్రన్. 173

చ. పలసిన నీవు నోధరణివల్లభ! యట్టుల చేయు' మంచు నా
జలజభవాత్మజుం డరిగెఁ జయ్యన నానరనాథుఁడట్ల వి
చ్చలవిడిఁ జేయుచు న్మఱియుఁ జావక యుండె ననేకవత్సరం
బులు మునివాక్యముల్ వృథయ పోయెఁ గదే యని యుగ్గడించుచున్. 174

ఆ. క్రమ్మఱంగఁ బద్మగర్భసంభవుఁ డేఁగు, దెంచె నంతఁ గొన్నిదివసములకు
నతనిఁ జేరి పల్కె నవనీశుఁ 'డయ్య! మీ, చెప్పినట్ల యేను జేసి చేసి. 175

క. వేసరితిఁ జావు రాదట, చేసెడి దేమి?' యని పలుకఁ జిఱునవ్వు ముఖో
ల్లాసముఁ జేయఁగ నిట్లను, నాసంయమివర్యుఁ డతని కాదర మెసఁగన్. 176

"శ్లో. యస్యస్మృత్యాచ నామోక్త్యా, తపోయజ్ఞక్రియాదిషు
న్యూనం సంపూర్ణతాం యాతి, సద్యో వందే త మచ్యుతమ్." 177

క. ఇమ్మంత్రపఠనశక్తిఁ ద,పమ్ములు యజ్ఞములు మొదలు బహువిధవిధులన్
బమ్మినకొఱఁతలు పరిపూ, ర్ణమ్మగు నది నీదువాక్యనకుఁ దేవ గదా!' 178

క. అనినఁ బఠింపుదు ననియెను, జనపతి విని 'విష్ణుమంత్రసామర్థ్యము ద
ప్పునె యదియె సువ్వె తద్దో,షనివృత్తి యొనర్చె దానఁ జా వేల యగున్. 179

ఆ. హరుఁడు విషము మ్రింగునప్పుడు నామత్రయము జపించి కాదె యమరుఁ డయ్యె
నందులోన మొదలి దగునచ్యుతాఖ్య నీజిహ్వ నుండె జముఁడు చేరఁ గలఁడె. 180

వ. అగ్నిస్తంభనంబు పట్టుకొని మద్దు దివిచిన ట్లయ్యె నయ్యా! నీవు చేసినచేఁత' యని
పలికిన నవ్వసుధేశునకు మునిమి యింత యసహ్యంబు గదే యని మనంబునం గృప
పుట్టి యతనికి మగుడఁ బ్రాయంబు ప్రసాదించి విరించిసుతుండు విజయంబు చేసె
నట్లగుటం జేసి విష్ణుపరాయణత్వంబును సత్పురుషసందర్శనంబును నేమేమి మేలొనర్ప
వని చెప్పి విప్రుండు వెండియు ని ట్లనియె. 181

ఆ. అతఁడు మంత్రశక్తి నణఁగఁ బోయెఁ గాక కాఁచుకున్న మృత్యుబాధ నొందకున్నె
కాన కుడువఁబెట్టి కంచ మాఱడిఁ గొను, కంటె మిగులఁ బాతకంబు లేదు.' 182

క. అని చెప్పి యాతఁ డరిగిన, వనితారత్నంబు విప్రవరులకు నన్నం
బనుదినము పెట్టుచుండఁగఁ, గని విష్ణుఁడు దానిచిత్తగతి యరయంగన్. 183

క. సర్వదరిద్రతఁ జేసిన, నుర్వీసురకాంత యేమియును బెదరక దాఁ
బూర్వగతి దప్పకుండ న, ఖర్వాశనపాకయత్న కౌతుకవృత్తిన్. 184

ఆ. గాదె తెఱచి చూచి కలవియ్య మన్నియుఁ, దెగిన నందుఁ జొచ్చి తిరుగువారఁ
దుడిచి నులిపి యొక్కదోసెఁ డుండినఁ దెచ్చి, వారిజాక్షి వండి వారమోపె. 185

మ. హరి యవ్వేళఁ బతివ్రతాహృదయసారాసారసంశోధకుం
ధరలో నిట్టివిధంబువా రగుట తథ్యం బంచు సూచించున
ట్లురుపీడాపరితప్తదేహుఁ డయి నిట్టూర్పుల్ జనింపంగ దు
స్తరయానంబునఁ గోల యూఁత గొనుచుం దా వచ్చె నచ్చోటికిన్. 186

వ. ఇట్లు వచ్చి కూర్చుండంబడి కంఠగతప్రాణుండు వోలెం దద్గృహాభిత్తి నొత్తిగిలి యున్న యన్నీరజనాభుకపటవేషంబు చూచి కేవలవిప్రుండు గా వగచి యితం డెంతదవ్వులనుండి వచ్చెనోకదే కడు డస్సియున్నవాఁ డని తత్తఱించుచు నతని యడుగులు గడిగి తాలవృంతానిలంబున సేద దేర్చి 'తండ్రీ! నీ వెవ్వ రెందుండి వచ్చి తెటపోయె దేమి యిచ్చ' యనిన నతం డయ్యతివ కిట్లనియె. 187

సీ. 'ఒకచోటఁ గాదు నాయునికి యెచ్చట నైన నుండుదుఁ జా మ్మనాథుండ నేను
నన్నుఁ బ్రీతి నిందు రమ్మని పట్టెఁ డశనంబు పెట్టుధర్మప్రాణి పుట్టునొక్కొ
యని యెందుఁ జరియించు నతివ నేఁటిప్రయాణమున మహాతపముచే ముట్టఁబడితి
నేమి సేయుదు నింక నీయస్థిరపుదేహ మెట్టు గా నున్నదో యీయవస్థ
ఆ. కేది గతియొ నాకు నేఁడయు నిచ్ఛగాఁ,' దనుచు మాటమాట కధరపుటము
దడుపుకొనుచు డప్పి వడుచు నీరెల్గుతోఁ, జెప్పె దైన్యరసము చిప్పిలంగ. 188

క. విని కరుణాయత్తం బగు, తనచిత్తమునందు నతని దైవము గాఁగం
గొని తైలాభ్యంగాదులఁ, దనుశోషణ ముడిపి భక్తి దైవాఱంగన్. 189

క. 'కడు నాఁకొంటిరి లెం'డని, వడిఁ గదళీదళము పఱచి వనితారత్నం
బొడికముగఁ గూడుగూరలు, నిడునంత ననేకవిప్రు లేతెంచుటయున్. 190

వ. అప్పు డప్పవిత్రరూపశోభితుం డగువిష్ణుం డవ్విప్రవనితం జూచి యి ట్లనుఁ 'మీ
రన్నదానంబు సేయుదు రని విని యిందు వచ్చి పెట్టెవాఁడ నైతి నాదేహం బడిచి

పడియెదు నీచేసినయన్నం బల్పం బీవచ్చినమహానుభావులం జూచితి గదా వీరల దీపనాగ్నులు దావాగ్నిబడబాగ్నులకంటె నతిశయించి యున్నయవి నీ వేమిట నార్చెదవు చెప్పు' మనిన నవ్వనిత 'తండ్రీ! నీప్రసాదంబున నన్నియు సమకూరెడుం గాక కొంచెపడియెదునే వారిపని కింత చింతింప నేల మీ రారగింపుఁ' డనిన నతం డి ట్లనియె. 191



క. 'క్షుత్పీడితులై వచ్చిన, సత్పురుషులఁ గనియుఁ గుడువఁ జాఁగునె హస్తం
బుత్పలలోచన! న న్నిటు, తాత్పర్యవిహీనుఁ జేయు టా యిచ్చోటన్.' 192

క. అని యతిచేతనె యాపో, శనముం బట్టుకొనియున్న చలమరిఁ గని య
వ్వనిత చలింపనినెమ్మన,మున విప్రుల కర్ఘ్యపాద్యములు దగ నిచ్చెన్. 193

చ. అసదృశలీల నవ్వనిత యంబుఘటావళి క్రింద నున్నయ
య్యసు కటు చేటలం జెరిగి యిం పగుబియ్యము చేసి పేడ్కతో
నెసరులఁ బోసి వండి వెర వేర్పడ నయ్యశనంబు భూదివౌ
కసులకుఁ బెట్టెఁ గ న్దనిసి క్రక్కున నాఁకలి దీఱునట్లుగన్. 194

క. క్షితి నిట్టిది కాదె పతివ్రత లెటు గమ్మనినఁ గాదు వారికి నలదై
వతమునకు వేఱు గలదే, పతివ్రతామహిమ కెద్ది ప్రతి యూహింపన్. 195

సీ. ఉదయపర్వత మెక్కకుండ భానునిఁ ద్రొల్లి వారించినది పతివ్రతయ కాదె
హరిహరాబ్జజుల ముగ్వురఁ దనూజులఁ జేసి పాలినయది పతివ్రతయ కాదె
జముఁ బట్టి మగనిప్రాణము మామకన్నులు రావించినది పతివ్రతయ కాదె
ప్రజలెల్ల మ్రొక్కంగఁ బతిఁ గూడి వినువీథి వర్తించినది పతివ్రతయ కాదె
ఆ. సత్యశౌచములకు జన్మదేశము పతివ్రతయ కాదె శాస్త్రమతమునందుఁ
గాన మహిఁ బతివ్రతానుభావము పేర్మి, నభినుతింపఁ గలరె యన్యజనులు. 196

వ. ఇట్లు పతివ్రతాతిలకం బావిప్రసమూహంబునకు నాహారంబు వెట్టిన. 197

ఉ. ఆసతిచిత్తశుద్ధికి ననాకులబుద్ధికి మెచ్చి విష్ణుఁ డ
బ్జాసనుఁ గన్నతమ్మికి నిజాలయమై చెలువొందు నాభితో
శ్రీసతి కుక్కిపట్టనఁగఁ జెన్నగువక్షముతోఁ గృపామృతా
వాసకటాక్షశోభి యగువక్త్రముతోఁ బొడచూపె నయ్యెడన్. 198

తే. అట్లు పొడచూపి 'యతివ! నీయంతరంగ, మరయుతలఁపున వచ్చి నీయందు నేమి
కొఱఁతయును గానలేనైతి గుణగరిష్ఠ, రాల వీవు ని న్నితరులు పోలఁగలరె. 199

క. మెచ్చితి నీ కే నొక వర, మిచ్చెద వేఁడు' మని యానతిచ్చె విభుఁడు 'మీ
రిచ్చువర మెందుఁ గోరెదు, నచ్చపుఁగృప నారగింపుఁ' డనియె వనితయున్. 200

మ. అనిన 'న్విష్ణుఁడఁ గాని మానవుఁడఁగా నబ్జాక్షీ! గ్రాసార్థమా
ర్తుఁడఁగాఁ జూచితి నన్ను' నావుడును జేతుల్ మోడ్చి యాసాధ్వి యి
ట్లను' నభ్యాగతు లెల్ల విష్ణులని యే నన్నంబు వెట్టంగఁ గై
కొనుచు న్నేఁ డిటు లానతిచ్చె దిది నీకున్ ధర్మమే నాయెడన్. 201

క. అన్నము వెట్టెడునతఁడును, నన్నము గొనియెడునతండు నయ్యన్నము నో
యన్నా! నీదుస్వరూపము, లన్న మఱియు నీవు గానియదియుం గలదే. 202

చ. అదియును గాక లేమి ఘనమై గృహకృత్యము సాఁగకున్నచో
ముదుకదనంబు వైచికొని మూర్ఛ మునుంగుచు వచ్చి ముంగిటం
జదికిలఁబడ్డయప్పుడ నిజంబుగ నీదగుదివ్యమాయగా
మదిఁ గని యున్నదాన మఱి మాటలు నేర్తునె నీదుసన్నిధిన్. 203

ఆ. ఆరగింపవయ్య కూరలు చల్ల నా,రంగ జాడ్యపడు ప్రసంగ మేమి
నీవు గుడువ కున్న నీవిప్రవర్యులుఁ, గుడువ రింతచేయఁ గూడునయ్య.' 204

క. నావుడు నవ్విభుఁడు యశో,దావాసమునందు శబరిమాలయమునఁ గుం
తీవరగృహమునఁ బోలెం, గేవలహర్షమున నారగించెఁ దనివిగన్. 205

చ. అరుదుగ నవ్విశేషమున సాధరణీసురకాంతముంగిటం
గురిసె సువర్ణవృష్టి యఘకుంజరయూథవిభంజనోగ్రకే
సరి యగునాజనార్దనుఁడు సాధ్విఁ గనుంగొని 'యింక నేనియు
న్వర మొక టిత్తు వేఁడుము ధ్రువంబుగ' నావుడు నింతి యిట్లనున్. 206

చ. 'అతిథిముఖంబునందు భవదర్చన నిచ్చలుఁ జేయ నట్టిస
న్మతియును శక్తియుం బడసి మానసదుర్లభ మైననీదుస
ద్గతి మదిఁ గాంచునట్టిఘనగౌరవముం గృపసేయు దేవ!మ
త్పతికిఁ గళత్రపుత్రసహితంబు సుఖస్థితి నుండునట్లుగన్'. 207

వ. అని వేఁడిన నట్ల యిచ్చి యచ్యుతుం డంతర్హితుం డయ్యె నయ్యిలనాగయుం బ్రతిదినంబు నతిథిపూజ గావించుచు భర్తృభాషితంబు చొప్పునఁ దప్పక విశేషతిథులం దమబావలను దోడికోడండ్రను వారిబిడ్డలను రావించి యశనంబు వెట్టుచు వసుమతియపోలెం దాల్మి గలిగి మెలంగుచుండె నంత నక్కాంతమగఁ డత్యంత దూరం బరిగి యొక్కనాఁడు పదత్రాణార్థం బొక్కచర్మకారకసదనంబుచక్కటికిం జనిన నతం డి ట్లనియె. 208

క. 'ఎందుండి రాక మీ రిట, కెందుల కేకార్యమునకు నేఁగెద రది నా
కుం దెలియఁ జెప్పుఁ' డనవుడు, మందస్మితలలితవదనమండలుఁ డగుచున్. 209

చ. 'తిరముగ దక్షిణాంబునిధితీరమునం దొకయూరనుండి యేఁ
బరఁగఁగ నొక్కసంశయము వాపుకొనం జనుచున్నవాఁడ శం
కరగిరిజానివాస మగుకాశికి' నావుడు 'నట్లయేని నో
పురుషవరేణ్య! నేఁడు గడుఁ బుణ్యుఁడ నైతిఁ ద్వదీయసేవనన్. 210

క. అడరఁగ నే నాజాహ్నవి, నడిగితి నని చెప్పి నాకు నయ్యుత్తర మే
ర్పడఁ జెప్పుమయ్య యే నీయడుగుల కెరఁగెద మహీసురాన్వయతిలకా!' 211

చ. అనవుడు విప్రుఁ డియ్యకొని యచ్చటు వాసి క్రమప్రయాణఖే
లన మమరంగ సోమకళలద్యుతిశోభిజటాకలాపరం
జనుఁ డగుపార్వతీశుప్రియసద్మము నాఁ దగుకాశికిన్ ముదం
బునఁ జని జాహ్నవీసలిలపూరము చొచ్చి పవిత్రగాత్రుఁడై. 212

శా. ఈశానుం బరమేశు ఫాలనయనున్ హేలాజితానంగు గౌ
రీశుం గేశవతల్పభూషణుఁ ద్రిలోకేశు న్వియత్కేశు న
క్లేశోదంచితు భుక్తిముక్తిఫలదున్ గీర్వాణనిర్వాహకుం
గాశీనాయకు విశ్వనాథుఁ గొలిచెం గారుణ్యపుణ్యాకృతిన్. 213

క. పరదారగమనపాతకహరునకుఁ బ్రణమిల్లి బ్రహ్మహత్యాహరణే
శ్వరుఁ బూజించి యగస్త్యేశ్వరుఁ గొనియాడి యచలేశు వలగొని మ్రొక్కెన్.

సీ. కరమర్థిఁ బాతాళగరళేశ్వరునిఁ జూచె నన్నపూర్ణేశ్వరు నాశ్రయించె
మొగిని బరాఙ్ముఖు ముక్తీశు భజియించె యవిముక్తనాయకు నభినుతించెఁ
బాపసంహారలింగరూపంబుఁ గాంచె మహాపాతకధ్వంసి ననుసరించెఁ
బంచవక్త్రేశ్వరుభవనంబు చొచ్చెఁ బరాశరేశ్వరునకుఁ బ్రణతుఁ డయ్యెఁ
తే. బరశురామేశు సోమేశు భార్గవేశుఁ, బుత్రకామేశు భీమేశు వృత్రసంహ
రేశు విజయేశు నలకూబరేశుఁ దుంబు, రేశు సేవించె నాదివిఘ్నేశుఁ గొలిచె. 215

క. పంచమహాపాతకగజ, పంచాననుఁ డైనదండపాణిమహేశుం
బాంచాలి భానువిష్ణు నుదంచితతాత్పర్యమున నతఁడు దర్శించెన్. 216

క. ఆకాశగంగకును భూ,లోకపథము సూపి శిష్టలోకాభినుత
శ్లోకుం డైనభగీరథ, భూకాంతుఁడు గొల్చుశివునిఁ బొడగని మ్రొక్కెన్. 217

క. కనియెఁ ద్రిలోచనలింగము, ననలేశు నుపాస్తి చేసె నవ్వరుణేశుం
గొనియాడె మహామాయకు, వినయవినమితోత్తమాంగవిలసితుఁ డయ్యెన్. 218

వ. మఱియు నాకాశీనగరమునందు యోగపీఠారూఢ యగువిశాలాక్షి కామాక్షి మహా
దుర్గి వనదుర్గి మంగళగౌరి చిత్రఘంటాదేవి కాళికాదేవి మొదలుగాఁ గలుగుశక్తి

స్థానంబులును లోలార్క వృద్ధార్క సాంబాదిత్య మయూఖాదిత్య పురస్సరం బగు సౌరస్థానంబులును నాదికేశవ బిందుమాధవ జగన్నాథ బలభద్రులు లోనుగాఁ గల్గు వైష్ణవస్థానంబులును గమలేశ్వర భర్తృహరీశ్వర నీలకంఠేశ్వర త్రిలోకేశ్వర మాతంగేశ్వర మణికర్ణికేశ్వర గంగాసీసంగమేశ్వర మల్లికార్జున త్రిపుటమల్లికార్జునామృతలింగ కేదారలింగ ప్రధానంబు లగు శివలింగస్థానంబులును భగీరథాశ్వమేధ మణికర్ణికా మైత్రావరుణ పంచనదీ పిప్పలికా తీర్థసహితంబు లగు భాగీరథీతీర్థవిశేషంబులును నమృతకుండ పితృకుండ కపాలమోచన పాపమోచన వృషభధ్వజ జంబుకేశ్వ రేష్ట కామేశ్వర ఘంటాకర్ణేశ్వరేశ్వర గంగాప్రముఖంబు లగు పుష్కరిణీభేదంబులును ధర్మకూప హరిశ్చంద్రేశ్వరకూప వృద్ధకాకేశ్వరకూప కాలభైరవకూప ప్రభృతు లగు పుణ్యకూపంబులు నాదిగాఁ గల్గు నానావిధదివ్యప్రదేశంబులు నిరీక్షించి కాలభైరవ భూతభైరవుల నుపాసించి తదనంతరంబ. 219

ఉ. బొందులు వేఱు గాని తలపోయఁగఁ బ్రాణము లేక మా ద్రిలం
గొందఱు లేఁతమాట లవి కూరిమిఁ బట్టున నంచుఁ బ్రాణముల్
బొందులు నేకమై రనఁగఁ బో ల్పగు శంకరుని న్భవాని న
స్పందితభక్తిమైఁ గదిసి బ్రాహ్మణపుంగవుఁ డానతాంగుఁడై. 220

ఆ. అచట. గొన్నిదినము లతఁ డాభవానిఁ బ్రార్థించుచుండఁ దద్గరిష్ఠనిష్ఠఁ
జూచి మెచ్చి తనదుశోభనాకృతిఁ జూపి, గౌరి యొక్కనాఁడు కరుణతోడ. 221

క. 'ఓవిప్రుఁడ! నీ వేపని, కై వచ్చితి చెప్పు' మనిన నతఁ డి ట్లనుఁ 'ద
ల్లీ! విను మే నొకధర్మము, నీవలనం దెలియ వచ్చి నీకృపఁ గంటిన్. 222

ఉ. ఈపురి నేఁడు నాఁ డనక యెప్పుడుఁ దప్పక యన్నదాన మే
రూపమునందు నైన నొకరుండును నాఁకొనకుండునట్లు గాఁ
దీపెసలారఁ బెట్టుదఁట దేవి! తదీయఫలంబు చెప్పుమా
యీపరమార్థ నిర్ణయము నెవ్వరుఁ గానరు నీవు దక్కఁగన్. 223

క. *మా గేహమ్మునకును న,భ్యాగతులై కూడినట్టియవనిసురుల నే
నీగతి నడిగితి నెవ్వరు, నోగిరిజా! పల్కరై రయోగ్యులపోలెన్. 224

ఉ. వారలఁ జూచి యేను గరవారిరుహంబులు మోడ్చి నిల్చి మీ
రూరక నాదుప్రశ్నకు నిరుత్తరులై యిటు లుండ నేటికిఁ
బోరనఁ జెప్పరే తెలియఁ బోలనిదే యిది నావుడు న్ముఖాం
భోరుహ మెత్తి యం దొకప్రబుద్ధుఁడు నాదెసఁ జూచి యి ట్లనున్. 225

---

* మాగృహమున కొకనాఁ డ,భ్యాగతుఁడై కూడినట్టి యవనీసురు నే,
నీగతినడిగిన నాతఁడు, నోగిరిజా! పల్కఁడయ్యె యోగ్యత లేమిన్. ఛి. ని. ప్రా.

క. ఈయర్థ మితరు లెఱుఁగరు, కాయజరిపుదేవి యెఱుఁగుఁ గాశీపురికిం
బోయి తదీయవిశేషం, బాయంబికవలనఁ దెలియు మని పల్కుటయున్. 226

క. చనుదెంచితి నాకోర్కికినసురూపముగా భవద్వచోమృతపూరం
బున నిపుడు సావీసులు, సనకసనందాదియోగిజననుతచరితా!' 227

వ. అనిన నప్పరమేశ్వరి యతని కి ట్లనియె. 228

చ. 'ఎనయఁగ నన్నదానఫల మీశ్వరుఁ డొక్కఁ డెఱుంగు నేనిఁగా
కనయము నొడ్లెఱుంగుదురె గట్టిగ నీవు వినంగ నిచ్చనే
ని నొకయుపాయమే నిపుడు నీ కెఱిఁగించెదఁ జేసి చూడుమా
వనరుహసంభవాన్వయవివర్ధన ! తేటపడున్ సమస్తమున్. 229

వ. ఆయుపాయం బెట్టిదనిన. 230

ఉ. వారణగంగ నాఁగ హిమవద్గిరిచేరువఁ జూడ నొప్పుఁ బెం
పారఁగ నొక్కపుణ్యనది యానదిప్రాంత ననంతవైభవ
స్ఫారత నొక్కవీ్రి లమరుఁ బన్నుగ హేమవతంబు నాఁగ నం
గీరుఁడు నాఁగ నొక్కనృపకేసరి యప్పుర మేలు మేలుగన్. 231

క. ఆవసుధావల్లభునకు, దేవి యొకతె సుమతి నాఁగ ధృతిమతి కాంతి
శ్రీవిలసద్గౌరవముల, తావై పతిభక్తిచే దృఢంబై మెఱయున్. 232

క. ఆదేవికి సంతతి మున్, లేదు పతియు నేకభామినీవ్రతుఁడై సం
పాదింపఁడు మఱి భార్యల, నాదంపతు లున్న యెడకు నరుగుము విప్రా! 233

క. అరిగి యథోచితవేళం, గర మనురాగమున వారిఁ గదిసి ధరిత్రీ
భరణక్షముఁ డొకతనయుఁడు, హరిసత్వుఁడు మీకుఁ బుట్టు నని చెప్పు తగన్. 234

ఆ. పుట్టినపుడ సజ్జ ముట్టును బెఱవారు, జనని యాది గాఁగ సకలజనులు
తొలఁగియుండినన్నుఁదొలుత.జూడఁగ నిచ్చు,సుతునిఁ బిదపమీరుచూడుఁడనుము.

చ. అని యొడఁబాటు చేసికొని యాశిశురత్నముఁ జేరి యేకతం
బున నడుగంగ వాఁడు దెలుపు న్విశదంబుగ నన్నదానశో
భనసుకృతంబుచొప్పుచుఁ బార్వతి చెప్పిన నద్భుతాత్ముఁడై
'పనుపుము పోయి వచ్చెదఁ గృపారసమానస!' యంచుఁ జయ్యనన్. 236

చ. వలగొని మ్రొక్కి నేత్రకరవారిజసంజ్ఞల సాధ్వి వాని వీ
డ్కొలుపఁ బునఃప్రణామములు గోరి యొనర్చి 'భవత్కటాక్ష మె
వ్వలనను నాకు రక్ష' యను వాక్యముతోడఁ దదీయసద్మమున్
వెలువడి యొక్కరుండు కడువేడుక నుత్తరభూమి కేఁగుడున్. 237

శా. ఆవిప్రుం డొకచోటఁ జొచ్చి వని ఘోరారణ్యమార్గంబునం
దీవ ల్గాళ్ళను జుట్టఁ దొట్రుపడుచుం దిక్కేది విభ్రాంతుఁడై
పోవం బోవఁగ నొక్కబోయ గని యాపుణ్యాత్ముఁ డేయూరికిన్
బోవం బోయితొ త్రోవఁ దప్పె ననుచుం బూర్ణానుకంపామతిన్. 238

ఉ. ఆతనిఁ జేరఁ బోయి 'వసుధామర! యేపురి కేఁగె దీవు ఖ
ద్యోతనుఁ డస్తపర్వతగతుం డగుచుంచెఁ బథంబు దూర మీ
రీతి నరణ్యమధ్యమున రేయి చరింప వశంబె యెట్టిని
ర్భీతుల కైన వన్యమృగబృందము మైమయిఁ బోవ నిచ్చునే.' 239

క. అనవుడు నాబ్రాహ్మణుఁ డా, వనచరుతో 'నేను హేమవతపురమునకున్
జనుచుండి త్రోవ దప్పితి, నెనయఁగ నాత్రోవ చూపు మేఁగెద' ననినన్. 240

క. ఏటికి వేగిరపడ నీ, పూట నిచట నిలిచి రేపు పోవఁగ రాదే
మాటలఁ దప్పితి తెరు వి,చ్చోటికి నామడతుఁ బడియెఁ జుమ్మది' యనినన్. 241

చ. అని తనపోడుచేనికడ కాతనిఁ దోఁకొని బోయ యి
ట్లను 'నివె పొట్టికందులును నమ్మలు నున్నవి క్రొత్తకుండ లే
దనఘ! యుపాయ మెద్ది కడు నాఁకొని వచ్చినవాఁడ వీవు నీ
పనిచినయట్ల చేసెదఁ గృపామతి నానతి యిమ్ము' నావుడున్. 242

క. 'నీ సౌజన్యమున మదా,యాసము సర్వమును బాసె నంతియ చాలున్
గ్రాసేచ్ఛ లేదు నీవు వృ,థాసంకటపడకు సౌఖ్యతర మిది నాకున్.' 243

వ. అని యతని నూఱడించి యవ్విప్రుండు తనకలశోదకంబున సాయంకరణీయంబులు దీర్చి కూర్చుండునెడ నక్కిరాతుండు రెండుదొప్పల చాఱబియ్యంబును దేనెయుం దెచ్చి యిచ్చిన నవి భగవదర్పితంబు చేసి యుపయోగించి యాప్యాయనంబుగా నుదకంబు గొని కృతాచమనుండై పర్ణతల్పంబున నుపక్రమించిన. 244

క. 'క్రూరమృగంబులు గల వీ, ఘోరాటవి నిచట నిద్రఁ గూరుట గొఱగా
దీరును మత్సతియును బొడ,వారినమంచెపయి నుండుఁ' డని యెక్కించెన్. 245

వ. ఇట్లెక్కించి యక్కిరాతుండు. 246

ఉ. తా నొకవిల్లు నమ్ములును దాల్చి ముదంబున నిద్ర గాచి యా
చేనికి దుష్టసత్త్వములు చేరకయుండ నదల్చుచుండ న
చ్చో నరుణోదయం బగుట చూచి యొకించుక కన్ను మోడ్చె నా
లోనన యొక్కబెబ్బులి విలోలత వచ్చి వధించె నాతనిన్. 247

క. అప్పులి గవిసినయప్పటి, చప్పుడు విని యక్కిరాతసతి మేల్కని వా
తప్పక యొక్కశరంబునఁ, జెప్ప నరిది గాఁగ దానిజీవము గొనియెన్. 248

శా. ఆవిప్రుండును నప్డు బిట్టులికి యత్యాకంపముం బొంది వా
పోవం జొచ్చె లతాంగి వెన్నఱవి విప్రుం దేర్చెఁ బద్మ ప్రియుం
డావార్త ల్విని వచ్చినట్లు కరసంఘాగ్రంబునం జీకటుల్
పోవం ద్రోచుచుఁ దోఁచె నాదిమదిశాభూమీధ్రశృంగంబునన్. 249

క. అక్కరణిఁ దరణి యాకస, మెక్కినఁ దెలు పెక్కె దిక్కు లిందీవరముల్
స్రుక్కె విలసిల్లెఁ దమ్ములు, జక్కవపులుఁగులకు విరహజవ్యథ వాసెన్. 250

ఉ. అంతఁ గిరాతకాంత వగ నంపెడువిప్రునిఁ జూచి 'తండ్రి! యే
నింతకు నోఁచి యుండ నిది యెరికి వశ్యమె తప్పఁ ద్రోవ ని
శ్చింతత నేగుఁ డాతపము చేఁ గడుఁ జిక్కెద రింకనైన న
ల్లంతనె పోవు త్రోవలె యుదగ్రమహోగ్రమృగప్రకీర్ణముల్.' 251

చ. అనిన నతండు 'నాకుఁ దగవా? యిటువంటి పరోపకారి నెం
దును గొడగాన నీతఁడు మృతుం డగుటేఁ గనుఁగొంటిఁ జూచి యే
మని చనువాఁడ మిన్నక యథాపరతంత్రము సేయ' కంచుఁ జే
ర్చిన కృపతోడఁ జేయఁ బనిచెన్ దహనక్రియ వానిమేనికిన్ 252

క. వనితయుం నప్పుడు పతితో, ననుగమనము చేయఁ బూని యావిప్రుని న
వ్వనభూమి వెడలునంతకు, ననిపి మరలి వచ్చి చేయునదియై నిల్చెన్. 253

వ. అతండును దాని నూరార్చి 'నీ నేర్చువిధంబున నితనికిం బరలోకక్రియలు నిర్వర్తింపుము నాకుం బోవలయు' ననిన నవ్విప్రుమాటకు నబ్బోటి యిట్లనుఁ 'దండ్రీ! నీ వీయరణ్యమార్గంబులు మున్నెఱుంగవు నిన్ననిపి వచ్చెదం బద' మని ధనురస్త్రపాణి యగుచు నాసుశ్రోణి యతనిం దోడ్కొనిపోయి గతాగతజనంబులవలన నిరంతరసంకులం బగు హేమవతపురంబు తెరువు చూపి యతని వీడ్కొని వచ్చి పచ్యమానుం డగుచున్న తనభర్తం జూచి 'యే నిట వచ్చెద నిలువు' మని సస్మితంబుగాఁ బల్కుచు నయ్యగ్నియందుఁ బ్రవేశించె నంత నక్కడ. 254

ఉ. హేమవతాభిధానపురి కేఁగి మహీసురుఁ డాన్నృపాలచూ
డామణితో రహస్యపుటెడ న్మను పార్వతి చెప్పినట్లు చే
తోముద మొప్పఁగాఁ బలికి ధూతకళంకతఁ గొన్నిమాసముల్
సోమకళాధరాలయము సొచ్చి జపం బొనరించుచుండఁగన్. 255

ఉ. పుట్టెఁ దనూజుఁ డాన్నృపతిపుంగవు దేవికిఁ బుణ్యవేళ న
ప్పట్టునఁ దత్తఱించుచును బాఱి యథోచితభంగి నేఁగి 'మా

ముట్టమ! కన్ను విచ్చి ననుఁ జూడుము చెప్పుము విప్రజాతికిం
బెట్టినయన్నదానమునఁ జేర్చుఫలం బని వేఁడె విప్రుఁడున్. 256

చ. కలకల నవ్వుచుక్ శిశుశిఖామణి యి ట్లని చెప్పె నప్డు 'వి
ప్రులకుఁ బ్రయత్నపూర్వముగ భోజన మిడ్డఫలంబు చెప్ప నా
యలవియె మీ రెఱుంగరె యనంతఫలప్రద మన్నదాన మేఁ
దెలుపఁగ నేల వేఱె యొకదృష్టము చెప్పెదఁ జిత్తగింపుఁడా. 257

ఉ. మీ రలనాఁడు పంకరుహమిత్త్రుఁడు పశ్చిమవార్ధి లోనికిం
జేరెడువేళ మద్గృహము చేరినఁ బెట్టితి నింతదేనియుం
జేరెఁడుచాఱబియ్యమును జిత్త మెలర్పఁగ దానఁజేసి బృం
దారకరాజ్యతుల్య మగుధారుణి యేలుట కిట్లు పుట్టితిన్.' 258

వ. అని పలికి యర్భకుండు పూర్వజన్మంబునం దాను గిరాతుండై యుండిననాఁ డత
నికిఁ జేసినసత్కారంబుకొలందిఁ దెలిపి మఱియు నిట్లనియె. 'అయ్యా! యయ్యల్ప
దానంబువలన నాకిట్టియనల్పఫలంబు సిద్ధించె నీవు నిరంతరాన్నదానశీలుండవు నీ
కెంతటిఫలంబు గల్గునో యది యాపరమేశ్వరుండె యెఱుంగుం గాని యన్యు
లెఱుంగ లేరు నీవు విచ్చేయు' మనిన నాద్విజాతుండు ప్రీతుండై. 259

క. అంగిరునిం దగ వీడ్కొని, యంగీకృతసుప్రయాణుఁడై ముక్తిపుర
ప్రాంగణ మగుకాశీపురి,కిం గర మనురాగమున మగిడి చనుదెంచెన్. 260

ఉ. క్రమ్మఱ నాభవానిపదకంజయుగంబు శిరంబు సోఁక మో
దమ్మునఁ జాఁగి మ్రొక్కి 'వనితాతిలకంబ! భవన్మతంబునం
గ్రమ్మఱ నేఁగి యాశిశుముఖంబున నే వినఁ గంటి నన్నదా
నమ్ముఫలం బగణ్య మని' నావుడుఁ బార్వతి ప్రీతి నిట్లనున్. 361

క. 'విను విప్రోత్తమ! నీవచ్చినపని సిద్ధించె నింకఁ జేరుము భవదీ
యనివాసమ్మునకు గృహస్థునకుఁ బ్రవాసైకవృత్తి దోషము సుమ్మీ. 262

క మఱి యాశ్రమస్థు లెల్లను, వఱలుగృహస్థాశ్రమంబువారిన కానం
బఱ తెంతురు తమ దగునక్కఱ దీర్చుకొనంగ నొండుగతి లే కునికిన్. 263

చ. వ్రతులు గృహస్థువాకిటికి వచ్చి యథోచితపూజఁ గానరే
నతనిగృహస్థధర్మమది యంతయు నిష్ఫల మండ్రు పెండి య
య్యతిథికృతాఘసంచయము లన్నియు నాతనిఁ బొందుఁ దత్సమం
చితసుకృతంబు లయ్యతిథిఁ జెందుఁ జుమీ పరమార్థ మారయన్. 264

క. గృహపతి లేనిగృహం బది, గ్రహపతిరహిత మగుదినముగతి మధ్యం బై
మహిమ చెడి యుండుఁ గావున, బహుచింతాలతలఁ జిక్కువడక యరుగుమా.

చ. అనవుడు నట్ల కాక యని యంబిక వీడ్కొని యాత్మభూమికిం
జనియెడువేడ్క నివ్వటిల జాహ్నవి దాఁటి మహీసురుండు సె
మ్మనమున నల్లయంత్యజునిమాట దలంచి యదేమిచంద మో
కనుఁగొని పోదు నంచు సెసకంబుగఁ గ్రమ్మఱ నిచ్చి యిట్లనున్. 266

క. 'ఓదేవి! వినుము ని న్నొక, మాదిగవాఁ డడిగె వానిమాటకుఁ గలదే
యేదైన నొక్కయుత్తర, మాదట నెఱిఁగింపు నాకు నరుగఁగ వలయున్.' 267

మ. అనినం గంగ నిజాంగదీప్తినిచయం బవ్వాహినీమధ్య మె
ల్ల నతిస్నిగ్ధముగా నొనర్ప నయనోల్లాసంబు మందస్మితా
ననకాంతిం బొదలింపఁ గంకణరవోన్మాదంబుతో హస్త మె
త్తి నయం బారఁగఁ బల్కె 'నోద్విజుఁడ! యర్థిన్ వింటి నీవాక్యముల్. 268

ఉ. శీలగుణోన్నతుం డమలచిత్తుఁడు మత్ప్రియసేవకుండు చం
డాలుఁ డనంగ రా దతిదృఢవ్రతుఁ డాతనికిన్ శుభంబె నా
మేలును జెప్పు మాతనికి మిత్త్రజ లోనగపుణ్యవాహినీ
జాలముతోడ విశ్వపతిసన్నిధి నెమ్మదిఁ బాయకుండుదున్. 269

మ. అని గంభీరరవంబునం బలుకుపుణ్యాకారిణిం బ్రీతిఁ గ
న్గొని విప్రుండు కరాబ్జము ల్మొగిచి 'నీకున్ మ్రొక్కెదన్ దేవి! యే
జనులుం గానరు నీదుదివ్యతను వస్మద్భాగధేయంబు పెం
పున నేఁ గంటి భవత్కటాక్ష మెలమిం బొందించె నాడెందమున్. 270

క. వాఁడును గేవలపురుషుఁడు, గాఁ డెవ్వఁడొ యంత్యజుండు గాఁ గత మేమో
పోఁడిగ వినవలయు నినున్, వేఁడెదఁ జెప్పు' మని జాహ్నవిని బ్రార్థించెన్. 271

వ. అట్లు ప్రార్థించి యడిగిన నమ్మహానది యతని కి ట్లనియెఁ 'దొల్లి గౌతమీసింధుసమీ
పంబున నొక్కపసులమంద యుండ నొక్కనాఁ డయ్యేటివెంట నీటివడిం బడి
యొక్కగర్భిణి కర్కటివచ్చి యచ్చో నొక్కబొక్క గావించుకొని యుండుడు
దానిమీఁద నచటిగోపాలుఁ డొక్కపాలకడవ యిడిన నది ప్రమాదంబునం బగిలి
తత్ప్రదేశంబు జొబ్బిలం దడిసె నంత. 272

క. ఆకర్కటిగర్భమున న, నేకంబులు పుట్టెఁ బిల్ల లీనుచు మృతయై
పోక యది యేమికతమునన్ క్రమ్మఱ బ్రతికి యుండదె నొగిఁ గర్కటియున్,

ఆ. అట్లు పుట్టి పిల్ల లాదుగ్ధపూరంబువలనఁ దోఁగి కమ్మ వలచుచున్న
మంచిమృత్తికఁ దిన మఱికొన్నిదినముల, నంతవట్టు దెగిన నరుచి పుట్టె. 274

ఉ. అందొకయర్భకంబు దమయమ్మకు నిట్లను 'నాదుజిహ్వ కే
చందమొ మున్నువోలెఁ జవి చాలదు మృత్తిక రోగ మెద్దియుం
బొందదు దీపనాగ్నియును బుట్టక మానుట లేదు నాకయో
యిందఱి కిట్లయో తలఁప నేమి యుపద్రవమో తలంపఁగన్.' 275

చ. అనవుడుఁ బుత్రుతోడ దరహాస మెలర్పఁగ నెంద్రిలేమ యి
ట్లను 'వినవన్న! పట్టి! యిది యచ్చపుమంటిగుణంబు గాని తోఁ
చిన దొకదోష మేమియును జెప్పఁగఁ జొప్పడ దొక్కకారణం
బున రుచిపుట్టె యామిసిమిపోయినఁ గ్రొత్త యొనర్చె జిహ్వకున్'. 276

వ. అనియమ్మన్న మున్ను పయఃపూరంబువలన రుచిపారం బగుటఁ దెలిపి 'నీవు పుట్టిన కోలె నదియ సేవించి పెరిగితి గానఁ గేవలమృద్భక్షణం బెఱుంగ వట్లు గావున నీ కిప్పు డిది యరుచి పుట్టె' ననిన విని వెఱఁగుపడి యప్పిల్ల తల్లి కి ట్లనియె. 277

క. 'పా లని చెప్పెద వది దా, నేలాగున నుండు దాన నెనసినయీజం
బాలం బింత మధుర మది, గ్రోలెడువారికిని జవులు గొఱఁతయె చెపుమా. 278

ఆ. పాలు లేనివాని బ్రతుకు నిరర్థంబు, పాలు గల్గువాఁడు చాల భోగి
పాలు మనకు నేయుపాయంబునందు సిద్ధించుఁ దల్లి నాకుఁ దెలుపు' మనిన. 279

క. 'సురలోకమునకు నమృతము, నరలోకంబునకుఁ బా లనఁగ నీరెండుం
సరిచేసె బ్రహ్మ యల్పుల,కరయంగాఁ దత్సుఖంబు లబ్బునె కొడుకా! 280

వ. అనిన నది మఱియు నిట్లనియె. 281

క. 'నరలోకం బెటువంటిది, సురలోకం బెట్టి దీవు చూచితె మనమం
దిరములసాటివి యౌనో, విరచిత్రగతి నింతకంటె విస్తీర్ణములో. 282

క. అందుండెడువారికి మన,చందమొ రూపములు వేఱెచందమొ నా కా
చందము వివరింపు' మనిన, నందనుమాటలకుఁ దల్లి నవ్వుచుఁ బల్కెన్. 283

క. 'మన ముండెడుబొక్కలకును, మనపను నుపమేయమాత్రమా వారలభ
వ్యనివాసస్థలములుఁ ద,ద్వినుతాకారములుఁ దెలియ విను మట్లయినన్. 284

క. నాక మనఁ బరగు దివిజుల, లోకములో మఱియు నూర్ధ్వలోకము మఱి భూ
లోక మనఁ బరగు మనుజుల, లోకము మన మిప్పు డున్నలోకము పుత్రా! 285

చ. చరణము లారువు ల్లఘునచక్రము లానతనాభు లంచితో
దరములు పీనవక్షము లుదారభుజంబులు కంబుకంఠముల్

సురుచిరవక్త్రపద్మములు శోభితచక్షులు ఘ్రాణకర్ణముల్
శిరములుఁ గేశపాశములుఁ జెన్నగు మేనులవారు దేవతల్. 286

క. దేవతలకు వినుము ముదిమియుఁ, జావును లే దెన్నఁడును బ్రశస్తగుణాఢ్యుల్
కావున విమానయానులు, నై విహరింపుదురు వా రుదాత్తప్రీతిన్. 287

క. జరయును రుజయును నరులకు, దొరకొనె నని కాని యాకృతులు దలఁపఁగ ని
ర్జరులట్ల నరులు వారికిఁ, గరితురగాందోళికలును ఘనవాహనముల్. 288

వ. కావున నట్టిప్రభావంబు లోకోత్కృష్టసుకృతవిశేషంబులం గాక యూర కెట్లు సిద్ధించు మనము పూర్వజన్మంబున దూరీకృతసుకృతుల మగుట నిట్టిదుష్టజన్మంబు వాటిల్లె' ననిన విని 'జననీ! నీ కిట్టిపరమజ్ఞానం బేమి విధంబునం గలిగె నెఱిఁగింపు' మనిన వాని కిట్లనియె. 289

శా. 'ఏ నా గౌతమిలోన నుండు నెడ సయ్యేటం గృతస్నానులై
నానాదేశసమాగతద్విజులు నానాధర్మము ల్చెప్పుచో
నానారీతులమాట లేను వినుట న్నా కిట్టియత్యుత్తమ
జ్ఞానం బబ్బెఁ బురాణగోష్ఠి కెనయే సౌఖ్యంబు లొం డెవ్వియున్. 290

ఆ. అందుఁ గానరానియర్థంబు లే దిది, ధర్మఫణితి యిది యధర్మసరణి
యని యెఱుంగ వచ్చు నవివేకి కైనను, నదియ చూవె తలఁప నాత్మహితము. 291

మ. విను మయ్యుత్తమగోష్ఠియందుఁ గొడుకా! విశ్వంభరం గల్గు పు
ణ్యనదీతీర్థవిశేషముల్ తెలిసె నెన్నం బెద్ద యాగంగ త
ద్వినుతస్నానఫలంబునం గలుగుఁ జూవే పుణ్యలోకంబు లె
వ్వనికిం బొంద నశక్య మైనయవి దుర్వారప్రచారంబుగన్'. 292

క. అనవుడు 'భవదుపదేశం,బున దల్లీ! నాకు వేడ్క పుట్టెడు నన్నుం
బనుపుము గంగాస్నానం,బున కీదివసములు రిత్తవోవక యుండన్.' 293

ఉ. నావుడు 'నద్దిరన్న తగునా యిటు వల్క నరణ్యముల్ ఘన
గ్రావము లేఱు ఱాళ్ళు నగరంబులు నా బహుభంగు లైనయా
త్రోవల నేఁగ నీవశమె త్రొక్కవె గోమహిషాదికోగ్రస
త్త్వావళి గంగ యెక్కడ త్వదాలయ మెక్కడ వెఱ్ఱివాఁడవే. 294

చ. అది యటు లుండె నీశిశువు లందఱు నిం కిట వచ్చు వేసవిం
బ్రదుకుట సన్న మాపడియపట్టున నీళ్ళను నింక గౌతమీ
నది మనస్రోఁతపట్టు జతనంబున నచ్చటి కేఁగి యున్న నే
కొదవయు లేదు రం' డనుచు గొబ్బునఁ దోఁకొని పోయెఁ బిల్లలన్. 295

క. ఆపిల్ల లామహానది, నాపోవఁగ మధురతోయ మాని యథేచ్ఛ
వ్యాపారంబుల నుండఁగ, నేపారఁగఁ ద త్తనూజుఁ డి ట్లను మఱియున్. 296

ఉ. 'నీ కిది చాఁగి మ్రొక్కెద ననిందగుణాస్పదమూర్తి వేను గం
గాకమనీయతోయములఁ గాయము దొప్పఁగఁ దోఁచి యొత్తి య
స్తోకపురాకృతాఘములదొంతులు సర్వము గూలఁ దన్నుదుం
గాక భవ త్తనూభవతఁ గాంచియు నిర్వ్యథవసాయి నౌదు నే. 297

క. నా తెగువకుఁ దగ నీవును, నో తల్లి! యనుజ్ఞ యొసఁగు మొయ్యనఁ జని సు
స్నాతుఁడనై మనయన్వయ, జాతులకును బుణ్యలోకసౌఖ్య మొనర్తున్.' 298

వ. అని నెట్టుకొని పల్కినం గర్కటి 'యక్కటా! యేమియు నెఱుంగనినావెఱ్ఱి కూనకు గంగామాహాత్మ్యం బేల చెప్పి బేల నైతి' నని పశ్చాత్తాపంబు నొందుచు దాని కిట్లనియె. 299

క. 'యోగులుఁ గాశీప్రాణ,త్యాగులు నేమిగతి గాంతు రనురాగముతో
నాగతి హరిదివసంబున, నీగౌతమిఁ గ్రుంకువారి కేర్పడఁ గల్గున్. 300

క. ఈగౌతమి మును పుట్టెను, భాగీరథి పిదపఁ బుట్టె ఫల మొసఁగెడిచో
నీగౌతమియె యెక్కుడు, భాగీరథికంటె నండ్రు ప్రాజ్ఞులు పుత్రా! 301

క. అట్టిఘనపుణ్యవాహిని, నట్టింటనె యున్నయది మనకుఁ బెఱనదులం
బుట్టెడులాభం బెట్టిది, పెట్టి గదే భూమిఁ దిరుగ విడుపు దురాశల్.' 302

చ. అనుడుఁ 'బథప్రయాస మది యల్పమె దూరపుఁ దీర్థ మారయఁ గా
ఘనము సమీపతీర్థమునకంటె ననం బొగడొందు గౌతమిం
గనుఁగొనఁ గల్గె నేఁడు మఱి గంగయుఁ జూడఁగ నబ్బు టొప్పదే
జనని! కృతాంతరాయములు చాలుఁ జలంబొ ఫలంబొ చెప్పుమా.' 303

ఆ. అనినఁ గొడుకుమాట కడ్డంబు చెప్పంగ, నలవి గాక యుండి వెలఁది పలికెఁ
'దీర్థయాత్ర సేయఁ దివురువారల నడ్డ, పెట్టి పాప మేలి కట్టుకొందు. 304

ఉ. పిన్నవు గాన నీవలని ప్రేమము నా కధికంబు గాన నే
నిన్నియుఁ జెప్పి చూచి తుది నేమిటనుం గడ గాన నైతి ని
న్నెన్నఁడు చూతు నింక నెటు లేఁగెదవో పరభూములందు నాఁ
కొన్నఁ బథశ్రమంబు మదిఁ గూరిన నన్నుఁ దలంపుదో కదే. 305

ఉ. గంగకు నేఁగి నీసుతునిఁ గంటిమి నెమ్మది నున్నవాఁడు మా
పంగడి వచ్చి వచ్చి యొకచక్కటికిం బయనంబు చేసె నో

యంగన నేఁట నెల్లిటను నాతఁడు వచ్చుఁ దలంకకుండు మం
చుం గర మర్థిఁ జెప్పునిజసూక్తులు వీనుల కెన్నఁ డబ్బునో. 306

ఆ. నీవు గంగ కేఁగి నిరపాయదేహివై, మరల వచ్చి తేని మనకులంబు
వారి కెల్లఁ దీర్ఘవాంఛ జనించుఁ బో, చిత్తవృత్తులందుఁ జిన్నిపడుగ! 307

ఆ. బొమ్మనంగఁ జాలఁ బో కని మాన్పంగఁ, జాల నీకు నెట్లు పోలు నట్లు
చేయు' మనిన నతఁడు చిఱునవ్వు నవ్వుచు, మాతయడుగులకు నమస్కరించి. 308

క. తమ్ములఁ గౌఁగిటఁ జేర్చుచు, నెమ్మి యలర బుజ్జగించి నిలుపుచు నచ్చోఁ
ద్రిమ్మరుఋషభదర్దురముల, సమ్మతిఁ గొని గౌతమికిఁ బ్రశస్తాంజలియై. 309

క. అనది వెడలి సమంచితయానంబునఁ గొంతనేల యరుగఁగ నొకచో
బ్రానిపయినుండి చూచె మహానిష్ఠురమూర్తి యొకవిహంగము దానిన్. 310

క. చూచి పటుతెంచి యొడిసి యగోచరవేగమున నెత్తుకొనిపోయి సమీ
పాచలశిలపయిఁ దినియెన్, వాచవి కలరుచును వానినంజూడు వెలుచన్. 311

వ. ఇట్లు తిని యాఖగం బెగసి పోయె నాకర్కటికుమారుండును నట్లు మరణంబు నొంది గంగాయాత్రలు సేయువారలు విధివశంబున నడుమనె మృతిం బొందిరేని జన్మత్రయంబునఁ దద్దర్శనంబు సిద్ధించు ననుట సిద్ధంబు గావునఁ దదనుఫలంబుగా నొక్కమహీపాలుకీలారంబుగోవులలో నొక్క గోవుకడుపున జన్మించె నంత.

క. ఆరాజొకనాఁ డాకీలారముపసిఁ జూడ వచ్చి లావణ్యతను
శ్రీరుచుల నొప్పి సింహకిశోరముక్రియ నున్నక్రేపుఁ జూచి ముదమునన్. 313

సీ. గోపాలకులతోడ భూపాలుఁ డిట్లను 'నిదె కంటిరే తనయీడుకోడె
లకు లేనికాంతియుఁ బ్రకటితరూపసంపదయును మిక్కిలి యదటుఁ గలిగి
విషమలోచనుఁ డెక్కువృషభవల్లభునకు వావి నేమవునొక్క వసుధమీఁద
నన మీఁటు గలిగి యున్నది దీని నాఁబోతుఁ గావింపఁ దగు నాలకదుపులోన

ఆ. నింక దీనితల్లి నెన్నఁడుఁ బిదుకకుఁ, డిదియ చన్ను గుడిచి బ్రదుకుఁ గాని'
యనిన వారలును మహాప్రసాద మ్మని, ప్రీతితోడ నట్ల పెనుపఁ బెరిగి. 314

సీ. చెలఁగి కాల్ద్రివ్విన నిల ప్రక్కలై భుజంగమరాజుతలలరత్నములు దోఁప
వెస ఱంకె వైచిన వసుధాధరేంద్రగహ్వరముల మారులు బిట్టదరిపడఁగఁ
గొమ్ములఁ గోరాడి చిమ్ముచో నెగసినఘనగండశిలలు మేఘములు దాఁక
జేఁదఱ గొని పాఱుచోఁ దరుశ్రేణు లుద్ధురవాతహతి బోలెఁ దుమురు గాఁగ

ఆ. దనకు నెదురులేని ఘనసత్త్వసంపద, నలరి గోపికాచయంబులోని
గోపకృష్ణునట్లు గోరత్నములలోన, వృషభ మధికసౌఖ్యవృత్తిఁ బెరిగె. 315

క. కరువునఁ బోసినవిధమున, నరుదుగఁ దనరూప మెట్టి దట్టిద కాఁ ద
త్సురభులు గ్రేపుల నీనఁగ, బొరిఁబొరిఁ నే టేఁటఁ గదుపుపాఁడి పగుడెంచెన్ 316

క. ఈ తెఱఁగునఁ బెక్కేఁడులు, బ్రాతిగ భోగించి తనివి పదపడి వృషభం
బాతను వాకమృగపతికి న,నాతంకప్రీతి నొసఁగె నాహారముగన్. 317

క. మఱి కొంకణదేశంబున, నెఱసిన సితదత్తనామనృపతికి సుతుఁడై
గుఱి లేనిపరమగుణముల, వఱలెఁ దృతీయభవమందు వంజరుఁ డనఁగన్. 318

క. వంజరుఁ డఖిలాశ్రితశుక, పంజరుఁడు విరోధిభయదబాహాబలది
క్కుంజరుఁ డభిరామయశో,మంజరుఁ డన నొప్పె నతిసమంజసవృత్తిన్. 319

ఉ. ఆతని పెండ్లి సేయుటకునై సితదత్తవిభుండు రాజక
న్యాతిలకంబులం దడవునప్పు డతండును దండ్రితోడ 'న
య్యా! తనుదోషము ల్వాలియునట్లుగ జాహ్నవి కేఁగి యందు సు
స్నాతుఁడనై నినుం గొలువఁ జయ్యన వత్తునె వేడ్క పుట్టెడున్.' 320

క. అనవుడు 'నే నెటు దలఁపఁగఁ, దనయుం డెటు దలఁచె బాపు దైవమ! యింకే
మని పల్కుదు నీతఁడు పాసఁగ నిక్కోరికఁ గోరె నెట్టు గా నున్నదియో? 321

సీ. ఇల నెందుఁ దల్లిదండ్రులకు గారామారఁ బెరిగి నానాఁటికి గురులవలన
విద్య లన్నియుం నేర్చి విహితమార్గమున వివాహమై సంతానవంతుఁడైన
తుదిఁ గదా మనుజుండు దూరతీర్థము లాడ నరుగుట తాపసవరులతోడి
సంసర్గ వ్రతములు సలుపుట యిది ధర్మపరిపాటి వీని నుపక్రమంబు
తే. గాఁగ నెవ్వఁడొకో వియద్గంగమీఁది, వాంఛ పుట్టించె శైశవావస్థయందె
యనుచుఁ దలపోసి నాదుప్రయత్న మెల్ల, నింక నెవ్వరి కని చేష్ట లెడలి యడలి.

వ. ఇంచుకసేపు విచారించి యానృపసత్తముండు దనకుమారోత్తముపెసఁ గ్రమ్మఱ
నవలోకించి. 323

క. అక్కటిక మెసఁగ ని ట్లనుఁ, 'జెక్కడిచినఁ బాలు వడుచుచిన్నవడుగ! నీ
వెక్కడ గంగాస్నానం, బెక్కడ పసిబిడ్డ వేమి యెఱుఁగుదు చెపుమా. 324

క. విను మింతియ వలసిన బోరన విప్రోత్తములఁ బనిచి రావించెదఁ బా
వన మగుగంగాతోయము, పనివడి నీయరుగునంతపని యున్నదియే.' 325

క. అని పుత్రస్నేహంబునఁ, దనుఁబల్కినఁ దండ్రితో నతం డిట్లనుఁ 'బ్రా
గ్జననోదాత్తసుకృతవా,సన నానినమానసాంబుజము వికసింపన్. 326

సీ. 'ధర్మకర్మము సేయుదానికి నిది ప్రాయ మిది కాల మని వాలయింపఁ గలదె?
తనయోపినంతయుఁ దగిలి యొనర్పంగ నట యబ్బినంతయు నబ్బెఁ గాక

చేయూర ధర్మంబు చేయఁ గాలము లేదె యనుచు నేమఱి యున్న నజానితలఁపు
తనచేతిలోనిదే ధర్మేచ్ఛ గలుగుట యల్పమే కలిగినయది నిరర్థ

ఆ. కంబు చేసికొనుట కర్తవ్యమే నేత్రహీనుఁ డైనయాతఁ డెట్టు లున్న
నుండెఁ గాక తనకు రెండుకన్నులు గల్గియుండి యంధునట్లు యుండఁ దగునె. 327

క. నీ వెఱుఁగనిధర్మస్థితి, భూవర! మఱి కలదె నన్నుఁ బుచ్చుము త్రిజగ
త్పావని యగుగంగానది, కేవిఘ్నముఁ జేయ వలవ దిచ్చో' ననినన్. 328

క. 'అన్నన్న! యేల నీ కీ, పిన్నొడలికి నలవి గానిపెనుఁబోకలు నే
నున్నంతకాలమును నా, కన్నుల యెదుర నుండవన్న కథ లేమిటికిన్. 329

క. అని తన్ను నివారించిన, జనకునితో నతఁడు 'నన్నుఁ జన నీ కున్నం
జనవర! నీమీఁద నభోజన ముండుదు' ననుచు గెంటనము లాడుటయున్. 330

సీ. ఏఁ దన్ను వల దని యెన్ని చెప్పిన మానఁ డని పంప నేఁడాది కాఱునెలల
కైనను గ్రమ్మఱ నరుదెంచు బలిమి నేఁ డడ్డపెట్టితి నేని నశన ముడిగి
వేగంబె ప్రాణము ల్విడుచు నీరెంటియందును వీనిఁ గాశికిఁ బనుచుపనియె
లోనఁగి యున్నది యని వసువస్త్రధాన్యాదికముగఁ బాథేయంబు గలుగ నొసఁగి

తే. పరిజనముల నుచితభంగిఁ దోడిడి కొంద, ఱవనిసురులఁ గూర్చి యవ్విభుండు
తనకుఁ బ్రణతుఁ డైనతనయుని నాశీర్వదించి వీడుకొలిపెఁ దగువతోడ. 331

క. ఈవిధమునఁ దనుఁ బాసియుం, భావంబునఁ బాయ కున్నబాలునిరూప
శ్రీవిభవము పలుమఱు లో, కావేశమతిం దలంచు నశ్రులు నించున్. 332

క. నాయనుఁగుఁదనయుఁ డింతకు, నేయెడ కరుగు ననుఁ దొల్లి యెఱుఁగండు ప్రవా
సాయాసం బను నేనును, బోయెదఁ గా కనును గడచి పోకున్నె యనున్. 333

ఉ. ఆతనిక్షేమవార్త లనయంబున నాకెఱిఁగించుసద్గుణో
పేతుఁడు గల్గునో కొ యనుఁ బెద్దలు నెవ్వగ నొందుచుండ నీ
రీతిని దూరదేశము చరించుట గా దని త్రిప్పి తెచ్చి నా
చేతికి నిచ్చుసత్సుకృతచిత్తుఁడు చొప్పడఁడో కొ నేఁ డనున్. 334

క. ఇన్నాళ్లేద్దిదియు నెఱుఁగము, క్రొన్నెలక్రియఁ గ్రాలుముద్దుకొడుకు కరిగిన నేఁ
డిన్నియును దోఁప వయ్యెడు, నెన్నఁ డతనిఁ గన్నులార నేఁ జూతు ననున్. 335

క. ఇవ్విధమునఁ దలపోయుచు, నివ్వటిలెడుపుత్రశోకనిష్ఠురవహ్నిన్
గ్రొవ్వు చెడ నెరసి జీవం, బవ్విభుఁడు దొఱంగె స్వజను లాక్రందిం పన్. 336

తే. అనిన విప్రుండు గంగకుఁ దనకరాంబుజాతములు మోడ్చి 'యోతల్లి! యాతఁ డట్లు
పుత్రశోకంబుచే మృతిఁ బొంద నేమి, కారణము గల్గెఁ జెప్పవే కరుణ' ననిన.

వ. విని దరహాసితానన యగుచు నమ్మహానది యమ్మహీదేవున కి ట్లనియె. 338

క. 'తడ వయ్యె నసక చెప్పం, బడియె ననఘ! నీవు నన్నుఁ బ్రవ్యక్తముగా
నడిగెదు కావున విను మే, ర్పడఁ జెప్పెద నాసృపాలుప్రారంభంబున్. 339

చ. కలఁ డొక బ్రాహ్మణోత్తముఁ డకంపితచిత్తుఁ డనేకవత్సరం
బులు పరమేశుఁ గూర్చి వనభూమిఁ దపోధనవృత్తి నున్నవాఁ
డలవడ నొక్కనాఁడు దనయాశ్రమమందు సుఖాసనస్థుఁడై
విలసితబుద్ధి నొక్కఁడును వేదము వేడుక నుగ్గడింపఁగన్. 340

సీ. నడుచుచో నూరులయొడికంపుమెఱుఁగులు సరిఁ బొఱుటాకులసంది నిగుడఁ
బులినస్థలంబుతోఁ బురుడించుజఘనంబు వడిఁ జేదకొనుకు వడఁ కొనర్ప
నిభకుంభయుగళంబు నేపు దింపఁగఁ జాలు బిగువుఁజన్నులు క్రొత్తజిగిఁ దలిర్ప
విద్యుదంబరములు వెదచల్లువిధమునఁ గ్రాలుఁగన్నులఁ జూపుగములు పొలయఁ
తే. గ్రీడఁ బందికై తొడరినకృతకశబర, వనిత క్రీడార్థ మచటికి వచ్చె ననఁగ
వన్యశాకఫలార్థమై వచ్చె నొక్క, చెంచుటెలనాగ మైదీఁగెమించు దొలఁక. 341

క. అవ్వనజాననచూపులు, పువ్విలుతునితూపులై తపోధనుహృదయం
బవ్వలికి వెడల నాఁటిన, నవ్వేళ నతండు బ్రతుకు టద్భుతమయ్యెన్. 342

ఆ. అట్లు మరునిబారి కగ్గమై యాతాప, సోత్తముండు దానిచిత్తవృత్తి
యెఱుఁగ లేక కదిసి యఱిముఱిఁ బై పడఁ, దరుణి కోపమున నదల్చివైచె. 343

మ. 'అమితక్రోధులు నాదుబంధుజను లుద్యద్బాణబాణాసనా
దిమహాశస్త్రనిరూఢు లూర్జితమహోద్రిక్తాంగు లీకానన
ద్రుమవల్లీనిచయప్రదేశముల నెందుం దార యున్నారు వి
ప్ర! మదిన్నీ దగునాగడం బెఱిఁగినం బ్రాణంబు పోఁ జేయరే.' 344

ఆ. అనిన నోడుపు తప్పినట్టిసర్పమువోలె, నప్పు డంబకముల నిప్పు లురుల
దానియాననంబుఁ దప్పక చూచి 'దుర్జాతి! పొమ్ము మెచ్చవైతి నన్ను. 345

ఉ. ఏ నినుఁ గోరి దగ్గఱిన నిచ్చ యెఱుంగక రేఁచుతుక్కుచం
దానఁ గఠోరభాషల నదల్చితి కావున నీవుఁ గుక్కవై
యూనినకిన్కతో మొఱుఁగుచుండు తపస్వులఁ జూచి యంతటం
గాని భవన్మనోమదవికారము పో' దని యిచ్చె శాపమున్. 346

క. అటుగాన నాఁటఁ గోలెను, జటాభసితధారు లైనసత్పురుషుల నె
చ్చటఁ గనినను శునకము శ్రుతి, పుటములు చీదఱలువోవ మునుకొని మొఱుఁగున్.

వ. అట్టి దారుణశాపంబునకు భయంపడి యప్పుడంతి యతనిసమక్షంబున. 348

క. గడగడ వడఁకుచు నశ్రులు, వడియఁగఁ జేదోయి మొగిచి 'స్వామీ! కోపం
బుడుగుము శాపంబునకును, విడుమర యెన్నఁ దగుఁ జెప్పవే కృపతోడన్.' 349

చ. అనవుడు 'నీకు నేను దగ నంచుఁ గదా యిటు చేసి తింక నీ
శునకశరీరచిహ్నలకుఁ జూడఁగ నీ డగుగండుఁగుక్కతో
నెనయ సుఖించి గర్భము వహించి తనూభవుఁ గాంచి తన్మృతిం
గనలెడుశోకపావకశిఖావలిఁ గ్రాఁగక శాప మాఱునే.' 350

వ. అని యాతఁడు మఱియు నారసి కోపంబున శాపంబునకు నవధి చెప్పినవాఁడై యథేచ్ఛం జనియె నాచెంచులేమయు నసారం బగుసారమేయత్వంబు నొంది యెన్ని చెప్పినఁ జక్కటికి రానియవివేకిచిత్తంబువోనివక్రపుచ్ఛంబుతో లుబ్ధు నడిగి యలబ్ధమనోరథుం డగునర్థివిధంబునం జెవు లడఁచికొనుచు నెటయేనియుం దిరుగుచుఁ గఱవుకాలంబునాఁటిబడుగుచందంబునం గుడిచి వైచినపత్త్రభాజనంబులకుం గడిసి తద్గతోచ్ఛిష్టంబులం బొట్టఁ బ్రోచికొనుచు బహుజనద్వేషివిధంబున నింటింటికిం జని ఛీ యన మరలి పోవుచు దూషకువిధంబున నెవ్వరిం బొడగనినం దొలంగి తలయేఱు వట్ట మొఱుఁగుచు నసూయాగ్రస్తువిధంబునఁ గులంబువారితోడన క్రోధించుచు వరువుడువిధంబునఁ గాముకులతో నెదురుపడం దాఁ గాట్లాడుచు నప్పుగొని తీర్పలేక కుతిలపడుగడుసరివానివిధంబున మైథునాంతరంబున నొండొంటి నంటుకొని సకలజనంబులకు నపహాసాస్పదం బైనసరియాఁక లుండుచు నిట్లు రోఁతల కెల్ల నూఁత లగుచేఁతలం గొంతకాలంబు గడపి గర్భిణియై యొక్కకొడుకుం గని సకలజనులుం దెగడ నిసర్గస్నేహంబున వానితోడం జెరలాడుచుండె నంత నొక్కనాఁడు 351

క. సితదత్తుఁ డడవిలోపలఁ, గతిపయపరివారుఁడై సుఖవ్యాపార
స్థితి నుండఁగఁ జోరులు దన, సుతులకుఁ దగ నెగ్గు సేయఁ జూతురొ యనుచున్.

క. ఉఱక యెదురేఁగి మూఁకకు, నుఱికి మొఱఁగుకొనుచు మిగుల నుగ్రాకృతియై
కఱవం బైకొనఁ బెల్కుఱి, పఱచిరి తద్భటులు రాజుపట్టుకుఁ బెలుచన్. 353

ఉ. ఆనరనాథుఁ డప్పు డచలాత్మకుఁడై దల యెత్తి చూచి యీ
శ్వానము కేమి యూఁడె నని చాపము ద్రిప్పుచు నొత్తికొంచుఁ బోఁ
బో నొకచక్కటిం దనదుపుత్త్రునిఁ గూడినఁ జూచి రేఁగి యీ
కూనకునై కదా మొఱఁగికొంచు మముం గఱవంగ వచ్చెడున్. 354

క. దీనిఁ బొరిగొనక యూరక, పో నని బాణంబుఁ దొడిగి భూపాలకుఁ డా
కూనఁ బడనేసెఁ దచ్ఛో, కానలమున నెరియుచుం దదంబ యిటు లనున్. 355

క. 'ఈకన్నులు దెఱవనిశిశు, వేకీ డొనరించె నీకు నిట నృపవర! నీ
వీకాస సేఁగు దెంచుట, నా కీశోకంబు గట్టినా నిర్దయతన్. 356

క. భువిఁ బుత్రస్నేహము మా, నవజాతికె కాక లేదె నరనాయక! మీఁ
దు విచారింపక చేసితి, తవిలెఁ గదా నీకు బెట్టినపు శాపము దాన్. 357

ఆ. భూప! నీవు నింకఁ బుత్రశోకమునను, జావు' మనుచుఁ దీవ్రశాప మిచ్చి
శునకవనిత యతఁడు విని యద్భుతస్వాంతుఁ, డగుచుఁ దిరిగి పోయె నాత్మపురికి.

క. పదపడి తచ్ఛునకాంగన, హృదయంబున శోకవహ్ని యొసఁగం బుత్రుం
బొదువుక కన్నుల నీర్లం, గదురఁగ ని ట్లనుచు పగవఁ గాఁ దొడఁగె నొగిన్. 359

సీ. 'అంటినఁ గందెడునట్టినీ మెత్తనియొడలికిఁ జిచ్చుఱపిడుగువోని
నుగ్రాస్త్ర మెక్కడనుండి సంగ్రహ మయ్యె నాముద్దుకూన! యేనరపతియును
విపినభూములు చొచ్చి వేట లాడెడుచోటఁ గ్రూరసత్త్వంబులఁ గూల్చఁ గాక
యదయుఁడై తొడఁగి కుక్కురపోతముల కల్గుపాపకర్ముఁడు భూమిపైని గలఁడె
ఆ. యెవ్వ రెచట నున్న నే మని నే నూరకుండ నేర నైతి నుఱికి వారిఁ
గఱవఁబోయినంత వెఱపింపఁగాఁ బోయి, వెఱచినట్టు లయ్యె నుఱక నేఁడు'. 360

క. అని విలపించుచు వేఁదుఱు, గొని యూరక మొత్తువెట్టుకొనుచు వనం బె
ల్లను దిరిగి తిరిగి యొకచోఁ, శునకము పడి చచ్చెఁ బుత్రశోకాతురతన్. 361

క. ఆదోషము గొని మునుఁగుటఁ, గాదే సితదత్తుఁ డట్లు కాయము దొఱఁగెన్
మేదిని నన్యాయరతుల, నాదైవం బేల చక్క నరుగఁగ నిచ్చున్'. 362

చ. అనవుడు విప్రుఁ డి ట్లనియె' నాతఁడు చచ్చినవార్త యేక్రియన్
వినియెను వంజరుండు విని పీటికి వచ్చెనొ రాక కాశికిం
జనియెనొ వానివర్తనముచందము నా కెఱిఁగింపు' మన్న ని
ట్లనుఁ దటినీలలామ యగునాదివిజాపగ శీతభావలన్. 363

క. 'సితదత్తుఁ డవ్విధంబున, మృతుఁ డగుటయు మంత్రివరులు భృత్యులును బురో
హితసామంతాదులు స్మృతి నాలోచించి యైకమత్యం బెసఁగన్. 364

క. ఈవార్త చెప్పి వంజరు, నేవిధమున నైనఁ ద్రిప్పియిటతోడ్తేరం
గావలయు ననుచు ధరణీ, దేవతలం బనుప వా రతిత్వరితగతిన్. 365

ఉ. ఆతనిపాలి కేఁగి 'సుగుణాకర! నీజనకుండు నిర్జర
వ్రాతములోని కేఁగె మనరాజ్యము కెవ్వరు దిక్కు లేరు నీ
పీతఱిఁ దీర్ఘసేవ కిటు లేఁగుట నీతిపథంబె వైరిధా
త్రీతలనాథు లిం కిట మదింపరె శిక్ష యొనర్ప కుండినన్. 366

ఉ. క్రమ్మఱ రమ్ము' నావుడుఁ బ్రకంపితుఁడై నృపసూతి శోకబా
ష్పమ్ములు గ్రమ్మ ని ట్లను 'నృపాలుఁడు నెమ్మదినుండి యుండి ప్రా

ణమ్ముల నుజ్జగించె ననినం గడు నద్భుత మయ్యె నేమి మా
ర్గమ్మున నింత పుట్టె వినఁగా వలయుం గ వివరించి చెప్పఁడా? 367

క. అని పంజరుఁ డడిగిన ని, ట్లని 'రారాజు నిను వలువ దని చెప్పంగా
వినక యిటు లరుగుదెంచిన, నినుఁ దలఁచి తలంచి మేదినీవిభుఁ డీల్గెన్.' 368

క. అనిన విని 'యకట! నాకై, తనప్రాణము విడిచెఁ దండ్రి తత్పురి కే నే
మని వత్తు గంగ కరిగెద, నని వెల్వడి వచ్చి మగుడ నర్హం బగునే. 369

సీ. మీ రేగుఁ డగ్నిసంస్కార మారాజోత్తమునకు సమంత్రకముగ నొనర్పుఁ
డయ్యస్థినిచయంబు చయ్యనఁ బుత్తెందు గంగాజలంబులఁ గలిపి యతనిఁ
జిరతరమోక్షలక్ష్మీసమన్వితునిఁగా నొనరింతు నటు సేయకుంటి నేని
నతనిపుణ్యోదరమందు జన్మించినయాఋణం బూరక యేల తీఱు'

ఆ. ననిన వార లిట్టు లనిరి 'తండ్రిది చావు, వినియు వెనుక చేసి చనఁగ నగునె
యింత దొడ్డవాఁడ వేల వివేకహీనతకుఁ జొచ్చి' ననిన నతఁడు గినిసి. 370

క. 'ఎక్కడిపితృమరణము మఱి, యెక్కడిరాజ్యంబు గంగ కేఁగెదుచో మీ
రిక్కడ విఘ్నము చేసెద, రెక్కడిబ్రాహ్మణులు మరలుఁ డే రా నొల్లన్. 371

వ. అని విడియ నాడిన నతనియాగ్రహంబునకు నిగ్రహపడక సామోపాయంబునఁ
గార్యంబు గొన వలయు నని యవ్విప్రు లి ట్లనిరి. 372

చ. 'అనఘ! కుమారచంద్ర! తగునయ్య! మదిం గలుషింప భూమి నెం
దును మనఁ జెప్పవాఁడ వగతుం డను మాట ధ్రువంబు చేసెదే
విను మొకమాట చెప్పెదము వీనుల నించి ఘటించి చూడు మె
వ్వనికిఁ బురోహితోక్తి యనివార్యము కార్యము నిర్వహించుచోన్. 373

క. దేవర లేనిగుడియుఁ నర, దేవుఁడు లేనట్టివసుమతియుఁ నశ్లాఘ్యం
బై వేగమె చెడిపోవుం, గావున నీ వుండియును దగవె యిటు సేయన్. 374

సీ. మాతృవిహీనులమాడ్కి నేపఱి యున్నపౌరులమదిలోనిభయము వాయఁ
దెఱవాకిటికిఁ బొంచి తిరుగుశ్వానంబులగతి నున్నవైరులగర్వ మడఁగఁ
బ్రియుఁ రాక గోరెడుబింబోష్ఠిక్రియ నున్నరాజ్యలక్ష్మికి ననురాగ మెసఁగ
జవ మేది యున్న నాజ్ఞాచక్రమునకుఁ గ్రమ్మఱఁ బ్రవర్తనశక్తి నెఱపఁగలుగు

ఆ. నీ కుపగత మైననృపతి సింహాసనంబున వసించి మమ్ముఁ బ్రోవు మయ్య
యఖిలతీర్థఫలము నఱచేతిలోనిదె, వచ్చు సంశయింప వలదు నీవు. 375

క. సంకల్పభంగ మగు నని, శంకింపకు మానవులవశమె దైవికమై
యంకిలి పడియెడుపనులకు, సంకటపడు టదియుఁ నొకవిచారమె చెపుమా! 376

సీ. ఏము ధర్మస్థితి యెఱుఁగని వారమే మామాట నీకు నమ్మంగఁ దగదె
మీతండ్రి మమ్ము నేరీతి మన్నించు నీవును నట్లకాఁ గనుఁగొనఁగఁ దగదె
ప్రార్థితంబుగఁ జేయు పని దోష మనిపింప నేల యీవలవనిజోలి నీకు
నంతియ వలసిన సంతతి వడసి రాష్ట్రమునకుఁ బుత్త్రుఁ బట్టంబు గట్టి
తే. పిదపఁ బోయిన నడ్డపెట్టెదమె రాజపుత్త్ర!' నావుడు వీరు చెప్పుట హితంబు
గానఁ బోవుట గా దని కడఁకతోడఁ, గాళి కెదు రుండి కృతనమస్కారుఁ డగుచు.

క. 'క్రమ్మఱఁ బనివినియెదఁ జు, మ్మమ్మ! భవత్సేవ' కనుచు నచ్చపుభక్తిన్
మమ్ముఁ దలంచుచు నాత్మపురమ్మునకుం జనియె వంజరప్రభుఁ డెలమిన్. 378

వ. ఇట్లు చని సితదత్తమహీభర్తకుఁ బితృకృత్యంబులు యథోచితంబుగా నొనర్చి యొక్కశుభదినంబునఁ బుణ్యనదీజలాభిషేచనపురస్సరంబుగాఁ బట్టంబు గట్టుకొని యప్రతిహతప్రతాపంబు దీపింప ననేకవర్షంబులు భూమి యేలుచు ధామిని యను కామినియందు నుగ్రలోచనుం డనునుదగ్రపరాక్రముం డగుకొడుకుం గని వాని మీఁద సకలసామ్రాజ్యభారంబును బెట్టి నన్ను దర్శించి తపోవనంబునకుం జని.

ఉ. వేసవికాల మాతపమువేఁడిమిఁ గాలినఱాలమీఁదఁ బ
ద్మాసనలీలఁ గైకొనుచు నంబుదవేళ నుదానవాబ్జుఁడై
వేసట లేక ఘోరతరవృష్టిఁ దోఁగుచు శీతకాల మా
యాసము నోర్చి పెన్మడుఁగులందు వసించుచుఁ బెక్కువర్షముల్. 380

ఉ. ఉగ్రతపంబు సేయఁ బురుహూతుఁడు తద్దయు భీతుఁడై మనో
నిగ్రహ మాపట్టిల్లఁ దననిర్జరరాజ్యము వోవు నీనరేం
ద్రాగ్రణిచేత నింక నని యచ్చరలేమలఁ బిల్చి మీరు ప్ర
త్యగ్రతనూవిలాసములు దక్కక చూపుఁడు వానిముందటన్. 381

క. ఆసందున మఱఁ డిత్తుల, రాసన మందుకొని యలరుటమ్ములు పైపై
నేసి యతనితప మంతయుఁ, గాసిగ నొనరించుఁ బొందు గ్రక్కున ననుడున్. 382

వ. నిజకటాక్షజితజగత్త్రితయలయ్యును నయ్యతివ లతనితపఃప్రభావంబు తమకు నసా
ధ్యం బగుట యెఱింగి గర్వంబు దక్కి యి ట్లనిరి. 383

ఉ. 'దేవవరేణ్య! మావలనఁ దీరెడుకార్యము గాదు వంజర
క్ష్మావిభుఁ డుగ్రశాసనుఁడు గాని తలంపఁగ భూతలంబునం
గేవలరాజు గాఁ డచటికిం బనుపంపఁ దలంచితేని సం
భావన చేసి నారదునిఁ బంపు సమస్తము చక్కనయ్యెడున్'. 384

చ. అని యిటు లప్సరోవనిత లాడటఁ జెప్పిన సమ్మతించి య
మ్మునిపతిఁ గాంచి వజ్రి నృపముఖ్యుఁ డొనర్చుతపంబురీతియుం

దనమదిలోనిభీతియుఁ దప్పక చెప్పి 'భవద్గురుండు నా
కనిమిషరాజ్య మిచ్చె నది యన్యుల కేర్పడకుండఁ జేయుమా.' 385

క. అనిన నతఁ డతని కి ట్లను, 'విను మిది యొంతటిపని యని వెఱచెదవు విధిన్
బనుపుము నాతో నిప్పుడ, చని యాతని బేలుపఱతుఁ జయ్యన' ననుచున్. 386

క. విధిఁ దోఁకొని చని నారదుఁ, డధికతపోవృత్తి నున్నయవనిపుప్రొదమాం
బుధిలోఁ దారసి వాసవుఁ, డధీరమతి గాక తనకు నాపద గలదే. 387

ఆ. తపము సేయ రాదె ధరణి నెవ్వరికిని, మూఁగవానియెదుట ముక్కు బఱట
రాని చంద మయ్యె రాజ్య మెవ్వని కెంత, యధిక మాతభీతి యడరుఁబుమ్ము. 388

ఆ. ఇతఁడు శివునిఁగూర్చి యేకాగ్రచిత్తుఁడై, యుగ్రతపము సేయుచున్నవాఁడు
హరుఁడు మెచ్చి తనకు వర మిత్తు ననిన దే,వేంద్రపదవి యాకఁ డేల యడుగు.

క. అమరత్వము నింద్రత్వము, కమలభవత్వమును సరకుగాఁ గొన రత్యు
త్తమశివలోకానందప్రదము గోరెదుపరమశైవధర్మవిధిజ్ఞుల్ 390

ఉ. ఐనను నింద్రుతోడ మనుజాధిపుబుద్ధి గలంతు నంచు నా
తో నిట తెచ్చితి న్విధి నదోషపథంబును నొక్కకార్యముం
బూని యొనర్తు నంచుఁ దలపోసి జగద్ధితముగ్ స్వకార్యమున్
గా నొకత్రోవ చిత్తమునఁ గన్గొని యవ్విధితోడ ని ట్లనున్. 391

ఆ. 'ఏను వీనిచిత్త మెఱిఁగితి నింద్రపదంబు గోరి కా దితండు తపము
సేఁత శివునిఁగూర్చి చేయుచు నున్నాఁడు, వీనిఁ జెఱుపఁ బాడి యౌనె నీకు? 392

వ. అయినను నీతపంబు దేవేంద్రునిచిత్తంబునకు రాదు మనము పనివడి వచ్చియు
నితని నిచ్చోటం గదల్పక పోవుట యెత్తు చాల దన్నింటికిం దగ నొక్కయుపా
యంబు చెప్పెద నీ చేరువం బుణ్యనదులు లేవు గావున నీవంజరుం బనిచి యీశ్వర
జటావిభూషణం బగుదివ్యతటిని నిటకుం దెచ్చెద దానం జేసి యతనికిం గీర్తి సు
కృతంబులు గలుగు మనకార్యంబును సిద్ధించు నీవు సితదత్తనృపతి యాకృతి
దైకొని యీ యంతరిక్షంబున నదృశ్యరూపంబున నుండు నే నితనిసమ్ముఖంబునకుం
బోయి యిట్టివిధంబున సంభాషించి దానికి సాక్షిగా నిన్ను నాహ్వానంబు చేసెద
నీ వప్పుడు వంజరునకు దృష్టిగోచరుండవై మేదినికిం డిగ్గి యిట్టిట్టివిధంబునం బల్కు'
మని కఱపిన నియ్యకొని యాతం డట్ల యుండె నంత. 393

ఉ. ఉన్నతశారదాభ్రరుచి నొప్పెడు మేను తటిత్ప్రిజాకృతిం
జెన్నుసలారు కెంజడలు చే నొకవీణెయుం మర్త్యకోటికిం
గన్నులపండువై మెఱయఁగా దివినుండి తపఃప్రభావసం
పన్నుఁడు వచ్చె నారదుఁ డభంగుఁడు వంజరుఁ డున్నచోటికిన్. 394

ఉ. వచ్చిన నర్ఘ్యపాద్యములు వావిరి నిచ్చి నమస్కరించి 'మీ
వచ్చుటఁ జేసి నేఁడు మునివల్లభ! పుణ్యుఁడ నైతి నేను మీ
వచ్చినకార్య మెయ్యది ధ్రువంబుగ నా కెఱుఁగంగ వచ్చునే
నచ్చిన నానతిం' డనిన నాఋషి రాజతపస్వి కిట్లనున్. 395

చ. 'విను మొకనాఁడు దండధరువీటికి వేడ్కయ పోలె నేఁగి యా
తనిసదనంబునందు నుచితస్థితిఁ గొన్నిదినంబు లుండుచో
ననుఁ గని యేమి చెప్ప నయనంబుల బాష్పకణంబు లొల్కఁగాఁ
దనపడుపాటు లన్నియును దప్పక చెప్పె నొకండు దీనతన్. 396

క. నీ వెవ్వఁడ వని యడిగిన, నే వంజరుఁ గన్నతండ్రి నిల సితదత్త
త్మావిభుః డనువాఁడ మదీ,యావస్థ యెఱుంగఁ జెప్పు మయ్య యతనికిన్.' 397

ఉ. ఇన్నిదినంబు లే నిచట నెవ్వరుఁ గాననిచోటఁ జిక్కి యో
యన్న దురంతఘోరనరకాదులచేఁ గడు వేఁగుచున్నచో
నిన్ను మదీయభాగ్యమున నేఁడు గనుంగొన వచ్చె నాకు నీ
మన్ననఁ జేసి నావెగులు మానక పో దని చాఁగి మ్రొక్కనన్. 398

ఉ. ఏ నిటు లంటి నీతనయుఁ డీస్థితి చెప్పిన నమ్ము నమ్మఁ డ
జ్ఞానులు భూమివాసులు నిజంబుగ గానరు గాన భానుమ
త్సూనునితోడఁ జెప్పి నినుఁ దోఁకొనిపోయెద నీవు వచ్చి నీ
సూనునితోడఁ జెప్పు మనుచుం గొని వచ్చితిఁ జూడు మాతనిన్. 399

క. అని మీఁదు చూచి 'సితద, త్తనరేశ్వర!ర' మ్మనిన నతనియాకృతి దా
ల్చినవిధి చయ్యన వచ్చినఁ, గని ఘనశోకాగ్నిచే ముఖము డిల్లపడన్. 400

క. సాష్టాంగ మెఱఁగి వంజరుఁ, 'దష్టదిశావలయవలయితావనియును సం
తుష్టిగ నేలినరాజవు, కష్టదశకుఁ బ్రాప్తమైతె కడపటఁ దండ్రీ!' 401

చ. అనుచు సబాష్పుఁడై నిలువ నాతనిఁ గౌఁగిటఁ జేర్చి 'పుత్ర! నీ
తనువిభవంబు గానక కదా మృతి వాటిలె నాఁడు నేఁడు నిన్
గనుఁగొనఁ గల్గె నాకు ఘనకారుణికోత్తముఁ డైనయిమ్మహా
మునికృప' నంచు మస్తకము మూర్కొని యిట్లను దీనభాషలన్. 402

క. 'మును రాజ్యాంతము నరక, మ్మనుట యథార్థమ్ము కాని యనృతముఁ గాదో
తనయ! విను మేను సర్వము, గనుఁగొంటిఁ గృతాంతభటనికాయముచేతన్. 403

క. జగమున నింతటిపుత్త్రుఁడు, తగఁ గల్గియు నాయవస్థ దఱఁగక యున్నన్
నగరే ప్రాజ్ఞు లపుత్త్ర, స్యగతిర్నాస్తి యనుచదువు చదివినఁ బుత్త్రా! 404

క. నాభాగ్య మెట్టిదో నిను, నీభంగిని దూఱవలసె నిప్పుడు నాకున్
శోభన మొనర్పఁ దలఁచిన, నోభవ్యచరిత్ర! చేయు మొకకార్యంబున్. 405

ఉ. ఈయెడ నాశరీర మిడి యేఁగెద శంకరుమౌళి నున్నయే
టీయెడ కేఁగు దెంచువెర వీ వొనరింపుము తజ్జలంబు మ
త్కాయము సోఁకఁ బుణ్యగతిఁ గాంచెద నిప్పని సేఁత నాక కా
దీయెడ నున్న సన్మునుల కెల్లఁ బ్రియంబు సుమీ తనూభవా! 406

క. కావున నిప్పని మఱవక, కావింపుము బ్రతుకు పెద్ద కాలం బనుచున్
దీవించి కృత్త్రిమాంగముఁ, దావైచి యదృశ్యుఁ డగుచుఁ దద్విధి చనియెన్. 407

ఉ. అంతట నమ్మునీంద్రుఁడును నానృపు వీడ్కొని యింద్రుపాలి క
త్యంతరయంబునం జని ముఖాబ్జమునం జెఱునవ్వు దోఁప 'వృ
త్రాంతక! యంతయుం బదిల మయ్యెఁ జుమీ మనకార్య మింక ని
శ్చింతత నుండు మీ' వనుచుఁ జెప్పె సమస్తము విస్తృతంబుగన్. 408

మహాస్రగ్ధర. విని దేవేంద్రుండు భాస్వద్విమలతరవిభావిస్ఫురన్నీరజోద్య
ద్ఘనరీతిం గన్ను లెల్లన్ వఱలఁ దనమనోవ్యాధికిన్ వీడుకో లి
చ్చి నిజాస్యాంభోరుహం బూర్జితతనువిలసచ్ఛ్రీకి సాధారమై యొ
ప్ప 'సమర్త్యేంద్రత్వ మిచ్చోఁ బనుపడుట భవద్బంధుసంపత్తిఁ గాదే. 409

క. కా కున్న నింతకార్యము, నా కెవ్వరు తీర్పఁ గలరు నారద! పుణ్య
శ్లోకుఁడవు నీవు నీకృప, నేకొఱఁతయుఁ లేక జగము నేలుదు నింకన్.' 410

క. అని తను భాషించిన న,య్యనిమిషపతి వీడుకొని మహాముని ప్రీతిం
జనియె' నని గంగ చెప్పిన, విని విప్రుఁడు నెమ్మనమున విస్మితుఁ డయ్యెన్. 411

మ. అని సిద్ధుం డలభోజరాజునకు ని ట్లైతిహ్యముం జెప్పె నం
చనసూయాతనయుండు చెప్పిన మహుం డానందముం బొంది మో
డ్చినకే లౌఁదలఁ జేర్చి నమ్రుఁ డయి "తండ్రీ! యేఁ గృతార్థుండ నై
తి నెఱింగింపఁ గదే తదుత్తరకథల్ తెల్లంబుగా" నావుడున్. 412

చ. త్రిభువనవంద్య! దానవసతీగళమంగళసూత్రభంగ! ది
గ్విభుసముదాయ సేవిత! రవిద్విజరాజసునేత్ర! సర్వలో

క భరిత! యోగిహృద్విమలకంజమధువ్రత! సూర్యకోటి స
న్నిభ! యిభరాజరక్షణ! ఫణిద్వీపదద్రినివాసభాసురా! 413

క. కరుణారసభరితాంతః, కరణా! సుకవీంద్రరచితకవితాచరణా!
శరణాగతజనభయపరి, హరణా!దివిజగణసంతతార్చితచరణా! 414

ఇంద్రవజ్రము. శ్రీరాజతల్పీకృతసింధురాజా!, స్వారాజనీలామలచారుదేహా!
గోరాజరాజానలగోవిలాసా!, క్షీరాజపత్నీహిమసింహకీర్తీ! 415

గద్యము. ఇది వాణీవరప్రసాదలబ్ధవాగ్వైభవ తిక్కనామాత్యసంభవ సుకవిజనవిధేయ అనంతయనామధేయప్రణీతం బైనభోజరాజీయం బను కావ్యంబునందు గోవ్యాఘ్ర సంవాదకథావిశేషంబు విని బ్రహ్మరాక్షసుండు పనుప రత్నమండనుండు నిజపురంబునకుఁ బోయివచ్చుటయుఁ దదీయోపాయంబున నపాయంబు దరలుటయుం నన్న దానఫలాకర్ణనార్థంబు బ్రాహ్మణుండు కాశీయాత్ర చేయుటయుఁ బతివ్రతామాహాత్మ్యంబును జర్మకారసంభాషణంబును భవానీసమాశ్రయంబును తదనుమతంబున విప్రుపునరభిగమనంబును గిరాతదర్శనంబును శిక్షోపదేశంబును గంగావిప్రసంవాదంబును పంజరుజన్మత్రయప్రశ్నయుఁ దత్తపోవిఘ్నార్థంబు నారదుండు విధి నచ్చోటువాపి చని యింద్రుపీడఁగొని యడ్డెచ్చం జనుటయుం నన్నది షష్ఠాశ్వాసము.



శ్రీ

# భో జ రా జీ య ము

## స ప్త మా శ్వా స ము



క. శ్రితవిపులోరస్స్థల!
యాశ్రితజనపారిజాత! యానందసుధా
మిశ్రితమానస! నిగమప
రిశ్రితఫలపాకరూప! శ్రీనరసింహా! 1

ఉ. ప్రీతి యెలర్పఁగా నవధరింపు భవద్విమలాంశజుండు వి
ఖ్యాతతపోమహాత్ముఁ డగున త్రితనూభవుఁ డానతిచ్చు నా
భూతలనాథుతో నిటులు భోజవిభుం డడుగంగ సిద్ధుఁ డ
త్యాతతయుక్తిఁ జెప్పెను సమంచితపుణ్యకథాప్రసంగముల్. 2

చ. వనరుహగర్భసంభవుఁడు వంజరుఁ దా నటు దేలు పుచ్చి యిం
ద్రునికడ కేఁగి యవ్విధము రూఢిగఁ జెప్పి యథేచ్ఛ మేఁగె నం
చనిమిషసింధురత్న మటు లాదటఁ జెప్పినఁ జోద్య మంది నె
మ్మనమున విప్రుఁ డప్డు వినుమా యటమీఁదటిగోష్ఠి చెప్పెదన్. 3

క. ఆవిప్రుఁడు కేలు మొగిచి, 'దేవీ! మఱి వంజరక్షితిపుఁ డేక్రియ గౌ
రీవల్లభుఁ బ్రార్థించి న,భోవాహిని నెట్లు తెచ్చె భూమికి?' ననినన్. 4

క. 'కంజభవాన్వయదీపక!, వంజరుచరితంబు భువనవర్ణ్యము విను నీ
కుం జెప్పెద' నని యాభవ, భంజని యి ట్లనుచుఁ జెప్పె బ్రాహ్మణుతోడన్. 5

చ. 'గురునకు ముక్తిత్రోవ సమకూర్చెదఁ బొమ్మని పోయి క్రౌంచభి
ద్గురునకు మామయై పరగుకొండకు దక్షిణభాగమందు భా
సుర మగుపుణ్యదేశములు చొచ్చి తపం బొనరింపఁ జొచ్చె న
చ్చెరువడి యెల్లవారలును జేరి కనుంగొనుచుండునట్లుగన్. 6

సీ. నాతోడిసవతియై మాతండ్రిజడలలో నుప్పొంగుచదలేటియుబ్బు దఱఁగఁ
ధౌళిఁధౌళి గౌతముం డలఘుతపశ్శక్తిఁ గొనిపోయె నుర్వికిఁ గొంతనీరు

మఱి భగీరథుఁ డనుమానవాధీశుండు గొనిచన్ననీటికి గొలఁది లేదు
ఇంకఁ జిక్కిననీటి నీవంజరక్షితీంద్రుఁడు గొనిపోయినఁ దొడుసు మాలి
ఆ. యుండ వచ్చు నీతఁ డొనరించుతపమున, కడ్డపడకు మని గణాధిపతికి
గౌరి బుద్ధి చెప్పెఁ గాక కానున్న విఘ్నంబు కాదె యతనికార్య మనఁగ. 7

క. తొల్లిటితపసులకంటెను, బల్లిదుఁ డీతండె పో తపశ్శక్తి ననం
జెల్లగుదృఢనిష్ఠ సలుప, నుల్లంబున మెచ్చి శంభుఁ డొదవెడుకృపతోన్. 8

చ. ఉరగవిభూషణంబులును నుగ్రగజాసురచర్మవస్త్రమున్
గరమున నొప్పుశూలమును గంఠముకప్పును ఫాలభాగమం
దరుదగుమోడ్పు తెప్పయును నొఁదలగంగయు జూటకోటిపైఁ
బరగుశశాంకరేఖయును బ్రాతిగ నాతనిమ్రోల నిల్చినన్. 9

చ. కనుఁగొని మేన నెల్లఁ బులకంబులు జాదుకొనంగఁ గన్నులన్
నినుపులు గాఁగ బాష్పములు నివ్వటిలంగ బహుప్రమాణముల్
గొనకొని చేసి భక్తిరసగుంభన మొప్పఁ బ్రహృష్టగద్గద
స్వనమున వంజరుం డపుడు సంస్తుతి సేయఁ దొణంగె శంభునిన్. 10

లయవిభాతి. 'ఒడల నొక లేమయును జడలఁ బెనువెల్లియును
నడుగక వసింపఁ బెఱపొడవులకు నెల్లం
బొడవనఁగ నొప్పు మెయిపొడవునకు భూతి దగు
తొడవుగ నొనర్చి బెడఁ గడరునిను భక్తిన్
విడువక తలంచునతఁ డెడపనివిముక్తిపురి
కొడయఁ డగు నంచు నదె తడఁబడక నేఁడున్
దొడఁగి శ్రుతి మ్రోయు నది పెడచెవులఁ బెట్టి చను
గడుసరికి నేది గతి కడపట నుమేశా!

లయగ్రాహి.

వాచవులు లోనగుమఱేచవులు నేనటుల ద్రోచి కడుపథ్య మగులోచవికిబుద్ధిన్
వే చొనిపియీచవికి నేచవియుఁ బెట్టనని చూచికయికొన్నచవిఁ బ్రోచుభవదీయా
నీచకరుణామృతనిషేచనసుఖంబునకు వాచకముగాఁ బ్రథమసూచన యొనర్పం
జూచుగురుభాషణము నీచెవుల నింపరఁట గోచరమె నీమనసు నాచికొన రుద్రా!

లయహారి. జపములకుఁ జొరక మఱి తపములకుఁ జనక మదిఁ
గపటములు విడిచి నినుఁ గృపణులమై వేఁడన్

విపులతర మగుపరమకృప చిగురు నిగుడఁ బెఱ
నెపములకుఁ దొడి వఱవ కపుడు నిజరూపం
బుపమలకు మిగిలి యతినిపుణగతిఁ బొరలు మృదు
లపితముల నెసఁగ నధికపుమహిమ చూపన్
సుపథ మగుసుగతి గని యపగతదురితు లగుదు
రపరిమితవిధములను త్రిపురదనుజారీ!' 13

క. అని బహుభంగులఁ బొగడెడి, జనపతికిఁ బ్రసన్నుఁడై భుజంగాభరణుం
డనుపమకరుణామృతమున, నెనసినకనుదోయి మెఱయ ని ట్లని పల్కెన్. 14

ఉ. 'మెచ్చితి నీతపంబునకు మేలుగ నొక్కవరంబు వేఁడు మే
నిచ్చెద' నన్న నాతఁడు గిరీశున కి ట్లనుఁ గేలు మోడ్చి 'మీ
మెచ్చున కెంతవాఁడ నను మీపదభక్తులలోనఁ గూర్చి యీ
యచ్చున నానతిచ్చుభవదాదరణం బిది గోటి సేయదే. 15

చ. పితృహితబుద్ధిఁ జేసి భవభీకర మీశిరమందు శాశ్వత
స్థితిఁ జెలువొందునుత్తమనది న్మహికిం గొనిపోవఁ గోరి వ
చ్చితి మిము నాశ్రయింపఁ గృప సేయుఁడు' నావుడు 'నట్ల కాక యి
చ్చితి' ననియెన్ శివుం డపుడు చెచ్చెర నే నిటు లంటి వానితోన్. 16

ఉ. 'ఓమనుజేంద్ర! నీవెనుక నుద్దవడిం బఱతెంచుదాన నీ
వామహనీయవేగమున కంకిలి సేయక తూఁగ నోపినం
గామితసిద్ధి వొందు దటు గాని తెఱం గది గల్గెనేని నే
భూమికి నైన నేఁ దొలఁగి పోదుఁ జుమీ యిదె చాటి చెప్పెదన్.' 17

చ. అనవుడుఁ గేలు మోడ్చి వినయంబు నయంబును దోఁప నాతఁ డి
ట్లను 'నిటు పల్కె నేల జగదంబ! భవ ద్ఘనవేగ మెక్క? డేఁ
జనువిధ మెక్క? డ ట్లయినఁ జాలఁ జుమమ్మ! మదీయవాక్యముల్
విను మిపు డేను ని న్నొకటి వేఁడెద నెగ్గుగఁ బట్టకుండినన్. 18

వ. అది యెయ్యది యంటేని జవసత్త్వసంపన్నం బగునొక్క వాహనంబు సమకూర్చు
కొని తదారూఢుండనై నిన్నుఁ గొలిచి వచ్చెద నీయొక్కచనువు నాకు నొసంగ
వలయు నట్లు సేయక యితరోపాయంబున మోస పుచ్చెద ననినఁ దల్లి! యేన కా
దీమూఁడులోకంబులయందు నిన్ను గెలువ నెవ్వండు గలండు. 19

ఉ. విష్ణుపదంబునం బొడమి విశ్వమునుం గబళింపఁ బూనిన
విష్ణునిమాయవోలెఁ బెనువెల్లువయై చనుదెంచునీదువ

ధిష్ణత చూచి భ్రాంతు లయి దేవత లందఱుఁ దల్లడిల్లఁగే
విష్ణుపదీ! భవత్ప్రియుఁడు వీతభయుండు శివుండు తక్కఁగన్. 20

ఉ. కావున నీమహామహిమ గానఁగ నెవ్వరు నేర్తు రమ్మ నీ
జీవన మీజగత్త్రితయజీవచయంబులకుం దలంపఁగా
జీవన మిట్టినీవు ననుఁ జేకొని కాచుట పోల దమ్మ! నీ
సేవకకోటి కెన్నఁడును జెందఁగ లేవు కదమ్మ దుర్దశల్'. 21

వ. అని ప్రార్థించినం బ్రీతచేతస్క యగు నాచేత ననుజ్ఞాతుం డగుచు నమ్మహీనాథుండు. 22

ఉ. అక్కడఁ బెక్కువత్సరము లవ్విభుఁ డర్థిఁ దపం బొనర్పఁగా
వెక్కసనిష్ఠఁ జూచి మురవిద్విషుఁ డాతనికిం బ్రసన్నుఁడై
పొక్కిటితమ్మితోడ సిరిఁ బొందినవక్షముతోడ నాదరం
బెక్కినచూడ్కితోడ వర మీఁ బచరించినకేలుదమ్మితోన్. 23

వ. ఆదేవదేవుండు తనదివ్యరూపంబు చూపిన నతండు సర్వాంగాలింగితమహీతలం బగు దండప్రణామంబు చేసి లేచి నిలిచి మోడ్పుఁగేలు ఫాలంబున మోపి యిట్లని స్తుతియించె. 24

దండకము. 'శ్రీకామినీచారువృత్తస్తనాలింగితోరస్స్థలున్ శంఖచక్రప్రభాశోభిహస్తద్వయుం బీతవస్త్రావృతోద్యన్నితంబోజ్జ్వలున్ సంతతోజ్జృంభణాంభోజనాభ్యంతరాళుం ద్రిలోకైకసంరక్షణాత్యంతదక్షున్ సరోజాక్షు నక్షీణసంపన్ను నిన్నుం బ్రశంసించునన్నాలుకల్ నాలుకల్ నీచరిత్రంబు లాలించునాకర్ణముల్ కర్ణముల్ నీశుభాకారముల్ చూచునానేత్రముల్ నేత్రముల్ నీమహాతత్త్వచింతాంబుధిం దేలునచ్చిత్తముల్ చిత్తముల్ నీపదాంభోజసంసేవ రంజిల్లునాహస్తముల్ హస్తముల్ కాక కాకున్న నందొందునే లేమియున్ లేమి తెల్లంబు గాదే భవద్భక్తిహీనాత్మకుల్ సేయునాచారముల్ ఘోరనీరాకరానేకవర్షంబులై యూషరక్షేత్రనిక్షిప్తబీజంబులై భస్మమధ్యంబునం బెట్టుహవ్యంబులై యుగ్రకాంతారవాటిం బ్రకాశించునక్కౌముదీసార్థమై పోవు నంచున్ పురాణార్థవేదుల్ యథావాదులై మాటికి న్మాటికి న్మాటి చెప్పంగ నవ్వాక్యము ల్వీనులం జేర్పఁ దా నొల్లకజ్ఞానసాంద్రాంధకారంబులోఁ డింది నిస్సారసంసారకూపంబునం గూలి యాశాజలాంతర్నిమగ్నత్వముం బొంది నానాఘదుష్టాహిసందష్టులై నిర్గతప్రాణులై యాతనాదేహులై కాలపాశంబు లత్యుత్కటక్లేశముం జేయఁ దత్కింకరాకృష్టకేశాగ్రులై దుర్గతిం ద్రెళ్ళి వెళ్ళింప దిక్కెవ్వరున్ లేక శోకానలజ్వాలలం ద్రేలుసక్కా

శిలం జెప్పఁగా నేల నీదాసదాసానుదాసత్వముం బూని దుష్కర్మముల్ వాసి సద్భక్తిచేఁ బూని చిత్తంబు వక్త్రంబు గాత్రంబు నాఁ గల్గునీమూఁడురూపంబులం బాపముల్ చెందఁగా నీక నీకందువల్ సద్గురూక్తిప్రశంసత్వనిష్ఠాగతిం గాంచి సేవించుపుణ్యుల్ త్రిలోకీశరణ్యుల్ వరేణ్యుల్ గదా వారిచారిత్రముల్ చెప్ప నప్పద్మజుం డోండె నాశేషుఁ డోండెః సమర్థుండుగా కొండు మర్త్యుండుశక్తుండె నీదాసు లాదోషరాసుల్ సమస్తంబు విధ్వంసముల్ చేసి నిర్ఘాతధూమాగ్నికీలంబులం బోలి వర్తిల్లు టొక్కండకా దాత్రితశ్రేణినిం గర్మనిర్ముక్తులం జేసి భాసిల్లుచున్నారు తత్కారణంబై భవద్దాసమూలంబునం జేసి ధర్మార్థకామాపవర్గంబు లక్లేశమార్గంబునం బొందఁగా వచ్చుటల్ నాకుఁ దోఁచెః భవద్దివ్యపాదారవిందంబు డెందంబునం గూర్చి యర్చింపఁగాఁ గల్గుసౌఖ్యంబు దా నెట్టిదో యేను మర్త్యుండ నజ్ఞానచిత్తుండ నిన్నుం బ్రశంసింప నుక్తుండఁగా నైన నీసత్కృపాదృష్టధారాపూర మత్యంతముం దోరమై నాదెస న్వ్రాలుటం జేసి యే నిన్ను వర్ణించుచున్నాఁడ నీవాఁడ నై నాఁడ న న్నింక నేవంకనుం బొచ్చెపోకుండ రక్షింపు రక్షింపు పక్షిధ్వజా! రక్షితాండవ్రజా! యాదినారాయణా! భక్తసంరక్షణోపాయపారాయణా! సర్వలోకాధినాథా! రమాప్రాణనాథా! నమస్తే! నమస్తే! నమః' 25

వ. అని ప్రణుతించుపంజరనృపాగ్రణిఁ జూచి సమస్తసత్కృపా
వననిధి యాజగన్నిధి నవస్మితవక్త్రసరోజ మొప్ప బో
రన నఖిలామరాభయకరం బగుతత్కర మెత్తి' యిందు ర'
మ్మని తగఁ జేరఁ బిల్చి 'భవదాగమనార్థము చెప్పు' నావుడున్. 26

వ. ఆదేవోత్తమునకు నానరదేవోత్తముం డి ట్లనియె. 27

చ. 'సరసిజనాభ! యోగినిగమసన్నుత! నీచరణారవిందసుం
దరమకరందబిందువు గదా వియదాపగ!తజ్జలంబు శం
కరుఁడు శిరోవిభూషణముగా ధరియించెఁ బ్రియంబుతో సుధా
కరశకలంబు క్రొన్నురువుకై వడి నొప్పఁగఁ దత్తటంబునన్. 28

ఆ. అది యసాధ్య మొరుల కాగౌతముండును, నాభగీరథుండు నధిక మైన
తప మొనర్చి కనిరి తద్విశేషంబ యర్థించి మద్గురుండు పంచె నన్ను. 29

ఆ. యాతనాశరీరుఁ డై నరకాగ్నుల, నొఱగి తన్నివృత్తికొఱకు నన్ను
నిట్లు పంచెఁ గాన నెడనేయ నోడి ముక్కంటిఁ దగిలి విడువుఁ గంటి నేను. 30

వ. అప్పుడాగంగ యుపాంగదీప్తు లొలయ న న్నవలోకించి మత్ప్రవాహవేగంబునకు దగ నీవు ముందటం దెరువు పెట్టుకున్న నే నెటయేనియుఁ బోదుం బొమ్మన్నఁ దలంకి

తల్లీ! నేను బాదచారినై నీచిత్తంబు రా నడవ నోప నొక్క వాహనంబు నెక్కి
వచ్చునట్లుగా నెల వీవలయు నని ప్రార్థించిన నట్లు సమ్మతించెం గావున. 31

క. నీవారి గెలువ నీవల, నీవారిక కాక ధారుణీవలయములో
నేవారికి మఱి శక్యమె, యోవారిజనాభ! నాకు నొసఁగు ఖగేంద్రున్.' 32

వ. అనిన నిప్పని దీర్చి రమ్మని యాభక్తపరాధీనుండు నిజాధీనుం డగు వినతాసూను
నియోగింప నాభూరమణుండు కృతాచమనుండై వచ్చి తదారూఢుం డగుటయుం.

సీ. ఉంకించి యెగయుచో నుభయపార్శ్వంబులపర్వతంబులును గంపంబు నొందఁ
బక్షవిక్షేపణప్రౌఢిమ నెఱపుచోఁ గారాకులట్లు మేఘములు దూలఁ
గమనీయబహుచిత్రగతుల నేపారుచో సురవిమానంబులు సూరగిలఁగ
నిద్దంపుఁజూపులు నిగిడించుచో శంభుతోడవుపాములకుఁ దల్లడము గదుర

తే. గరుడగమనుండు వచ్చెన కాఁ దలంచి, నెమ్మి దళుకొత్తఁ బ్రమథగణమ్ముతోడఁ
గదలి బాలేందుశేఖరుం డెదురు నడవ, నిగిడె గరుడుండు కైలాసనగముపైకి. 34

క. ఆలోనన పంజరుఁ డిరు, గేలును దల మోపికొని యకృత్రిమబుద్ధిన్
ఖేలాగతి ని ట్లను నా, శైలసుతోపేతునకు వృషభకేతునకున్. 35

క. 'గురుహితముపొంటె నీ దగు, చరణాబ్జము లాశ్రయింపఁ జనుదెంచినచోఁ
బరమేశ! నీవు నా కొక, వర మిచ్చితి వొసఁగు మేను వడిఁ జనుచుండన్.' 36

చ. అనిన శివుండు మెచ్చి దరహాస మెలర్ప జటాకలాపబం
ధన మెడలించి 'మద్ఘటుఁ డితం డెటు దోఁకొని పోయె నందుఁ బో'
మ్మని తగ నానతిచ్చుడు మదంశము డిగ్గి దిగంతరాళఘూ
ర్ణనముగ మ్రోయుచుం గదలినన్ జయవెట్టి రశేషజీవులున్. 37

ఉ. భర్గజటాకలాప మను ప్రావృడుదారపయోధరంబు ని
ర్నిర్గతమై విశుద్ధతటినీఘనవృష్టి సమగ్రసంభ్రమా
నర్గళమై మదీయగురుఁ డాదిగఁ గల్గుపితృవ్రజప్రసు
ర్వర్గముఁ బ్రోచు నింక నని పంజరుఁ డెంతయు సంతసిల్లఁగన్. 38

ఆ. వ్యోమకేశుజడలనుండి యవ్వాహిని, కుప్పిగంతు కొనినఁ గ్రుంగె ధరణి
గిరులు పడఁకెఁ గలఁగె శరనిధుల్ ఫణిరాజు, శిరము వంచె దిశలకరులు ద్రెళ్ళె.

ఉ. అట్టియుదగ్రవేగమున నానది దూఱె రసాతలంబు నేఁ
బుట్టియు నీయధోగతులఁ బుణ్యులఁ జేయక యెట్లు పోదు న
న్నట్టును బోలెఁ బెల్లగసె నంతటిలోన మదీయు లర్థి లీ
పట్టున నీకు నంచు సురభర్తకుఁ జెప్పఁ గడంగెనో యనన్. 40

క. తదవసరమ్మున నృపతియుఁ, బదపడి త్రోవ యిడ కున్నఁ బాథోరయసం
పద నిం కెట చనునో యీ, నది యని యద్దిక్కు తార్క్ష్యునకుఁ జూపుటయున్. 41

క. మిన్నుదలఁ బాఱె ఖగపతి, యన్నదియును బాఱఁ దొడఁగె నవని యద్రువ నే
మున్నో తా మున్నో యని, పన్నిదమునకు గెడగూడి పాఱినభంగిన్. 42

క. గరుడుం డెటు మెలఁగిన నప్పరమ నదియు నట్లు తాను బాఱు నుపాయాం
తరమునఁ బగ నీగుదు నని, యుఱవడి వెనుదగిలి పాఱునురగేంద్రగతిన్. 43

సీ. ధరణి యంతయు మన్ను దఱఁగి వేసినమాడ్కిఁ బాథోరయంబునఁ బాయపడఁగ
నడలున నోదానఁ బడువన్యగజములకరణిని దరిగడ్డ లురలి పడఁగఁ
దఱిమెన సంధించి మెఱమిన క్రియఁ దటద్రుమకోటు లున్మూలితములు గాఁగ
ఘనవజ్రహతిఁబోలెఁ దన కగ్గమైన శైలములు వేగంబె తుత్తుమురు గాఁగ
తే. వైనతేయుపక్షోత్కటధ్వనియుఁ దనక, డళ్ళ పెనుమ్రోఁతయును దిక్తటంబుఁబర్వ
బాఱెఁ గృత్రిమనృపకళేబరముదాఁక, నమ్మహానది సకలజనాద్భుతముగ. 44

క. అతటిఁ గృతకశవం బిట్లై తత్సంస్పర్శఁజేసి యంబరగతిఁ బ్ర
ద్యోతనబింబము కెదురై, యాతని దీవించుకొనుచు నప్పుడ చనియెన్. 45

క. అది కపట మయ్యు భావన, కిది దా నిక్కపమె కాన యింద్రునిపురి నె
మ్మది నున్ననృపతిముఖ్యుఁడు, ముదితుఁ డగుచు బ్రహ్మలోకమునకుం జనియెన్. 46

వ. అయ్యవసరంబున. 47

ఉ. వంజరుఁ డొక్కరేఁబు గొనివచ్చె మదాశ్రమభూమి కంచుఁ దా
రుం జతురత్వముల్ చెలఁగ రూఢిగ స్నానము లాడ నాపగా
సంజనకాంత్యులై రచటిసన్మును లందఱు భూజనంబు లో
జం జనుదెంచి యద్భుతరసంబులఁ దోఁగుచుఁ దోఁగి రానదిన్. 48

ఉ. వంజరుఁడుం గృతార్థుఁ డయి వాహనరాజము డిగ్గి భక్తితో
నంజలి చేసి నిల్చి 'జగదంబ ఫలించె మదీయవాంఛ సి
ద్ధాంజనదృష్టిఁగైకొని మహానిధి గాంచినసాధకుండు వో
లెం జిరసౌఖ్యముల్ వడసె లెస్సగ మజ్జనకుండు నీకృపన్. 49

చ. పరహితసచ్చరిత్రు లయి పాపము లెల్లఁ దొఱంగి వేగ నీ
కరుణ నశేషభూజనులు గాంతురు ముక్తిపదంబు నింక నీ
వరుగుము స్వేచ్ఛ యైనయెడ' కంచుఁ బ్రణామ మొనర్ప నానరే
శ్వరతిలకంబుపేర నది వంజర నాఁ జని చొచ్చె గౌతమిన్. 50

క. అతని పిడొక్కని యవ్విన, తాతన యుఁడు నరిగె నాగదాధధుకడమం
ప్రీతుఁ డయి చనియె వంజర, భూతలనాథుండు నొకతపోవనమునకున్. 51

క. ఇది పంజరము మహానది, యుదయము సకలేష్టదము మహోపద్రవశాం
తిద మిది యెవ్వరు వినినన్, జదివిన నిష్టార్థసిద్ధి సమకూరు వెసన్. 52

వ. అనిచెప్పిన నవ్విప్రపుంగవుండు గంగ కి ట్లనియె. 53

ఉ. 'ఈమహిలోనఁ బూర్వమున నింద్రునికిన్ సరిగాఁ దలంప ను
ద్దామఖగేంద్రుఁడై యధికదర్ప మెలర్ప నశేషనిర్జర
స్తోమసమాశ్రయుం డగుచతుర్భుజవాహన మైనయున్నతుం
డీమనుజేంద్రు మోచుటకు హేతువు గల్గెనె పో మహానదీ!' 54

చ. అనిన ధరామరోత్తమున కానది యి ట్లను 'విత్తలేశ గ
ల్గనె మహిమీఁద నోషధులకుం జనక్రియ విఘ్న సాధ్యసా
ధనములు లోనుగాఁ గలుగుద్వంద్వము లెల్లను హేతుపూర్వమై
చనుఁ బరమార్థ మిప్పలుకు శాస్త్రచయంబులు నిట్లు చెప్పెడిన్. 55

వ. కావున నీకుం దదీయహేతువు చెప్పెద నాకర్ణింపుము. 56

ఉ. గారవ మొప్ప నవ్విభుఁడు కర్కటిజన్మమునాఁడు నన్ను నిం
పార భజించు వేడుకఁ బ్రయాణము గైకొని రాఁ బథంబునం
గ్రూరవిహంగమం బొకటి కొంకక చంపుట వింటి గాదె త
ద్దారుణకల్మషం బొదవెఁ దార్క్ష్యునకుం బతిభృత్యపద్ధతిన్. 57

ఆ. అనఘచరిత్ర భృత్యుఁ డపరాధి యైనఁ ద, త్స్వామి దండ్యుఁ డనుట శాస్త్రమతము
కాదె యదియ సువ్వె కారణం బయ్యె పం,జరుని మోవఁ బక్షిసత్తమునకు.' 58

వ. అని చెప్పి మఱియు ని ట్లనియె. 59

క. 'విప్రవరా! నీ యడిగిన, యాప్రశ్నల కుత్తరంబు లగుకథ లత్యం'
తప్రకటము చేసితి హృద, యప్రీతిగ నింక నేమి యడిగెదు నన్నున్.' 60

చ. అనవుడు గంగఁ జూచి వినయంబునఁ జేతులు మోడ్చి విప్రుఁ 'డో
జనని! భవద్వచోమృత సుసంగత పుణ్యకథాప్రసంగముల్
వినియును నామనంబు దనివి న్వసియింపదు పంజరక్షితీ
శునియటమీఁదివర్తనము చొప్పును జెప్పఁగదమ్మ!' నావుడున్. 61

క. 'విను విప్రవర్య! పంజరుఁ, డనఘుఁడు నాపైఁ బ్రియభక్తుఁ డాభూపతిప
ర్తన మంతయు వివరించెద', నని యి ట్లని చెప్పె నమ్మహానది ప్రీతిన్. 62

చ. గురునకు నిత్యముక్తి యొదఁగూర్చితిఁ బొమ్మని యూఱడిల్లి యా
నరపతి నిశ్చయం బగుమనంబును బూని తపంబు సేయుచో
సురపతి క్రమ్మఱన్ దిగులు సొచ్చి యుపద్రవ మాచరింప నీ
వెర వొనరించెనో యనఁగ వేలుపులేమయ పోనికామినిన్. 63

క. ఒక్కతె దోడ్కొని యచటికి, నొక్కమహీసురుఁడు నొక్కయుర్వీశ్వరుఁడుఁ
జొక్క మగునొక్కవైశ్యుఁడు, నొక్కచతుర్థుండు వచ్చి యొండొరుఁ గడవన్. 64

క. ఆమనుజాధీశునకుఁ బ్ర, ణామము లొనరింప నతఁడు నలుగురఁ గని 'మీ
రీమగువయుం దగ నిచటికి, నేమిటి కిట్లరుగుదెంచు టేర్పడఁ జెపుఁడా.' 65

వ. అని యడిగిన నతనికి బ్రాహ్మణుం డిట్లనియె. 66

చ. 'అనయము వేశ్య యీతరుణి యాతఁడు క్షత్త్రియుఁ డేను విప్రుఁడన్
విను వణిజుండు వాఁ డితఁడు వెల్మియు నల్వురఁ దొల్లి దీనిది
క్కునఁ జరియించుచుండుదుము కొండొక కాలము చెల్ల నింతి మా
మనములఁ గల్గుప్రేమపరిమాణ మెఱుంగఁ దలంచి యి ట్లనున్. 67

ఉ. 'నీరును బాలుఁ బోలె మననెయ్యము తియ్యము నొంది నేఁడు సొం
పారెడు మీఁద నాకొకటి యైనఁ బదంపడి యే మొనర్తు రో
మీ' రని యొత్తి చూచుటయు మేలుగ విప్రుఁడు 'నీకు నగ్నిసం
స్కార మొనర్చి శల్యములు జాహ్నవికిం గొనిపోదు నే' ననెన్. 68

ఉ. 'చచ్చినతోన చత్తు' ననె క్షత్త్రియజాతుఁడు' వైశ్యుఁ 'డర్థముల్
వెచ్చము సేయువాఁడ' ననె 'విప్రముఖంబున మించి కాష్ఠముల్
దెచ్చి దహించువాఁడ' ననెఁ దెంపున నాలవజాతియాతఁ డీ
యచ్చునఁ బల్కునప్పలుకు లాదటఁ గైకొని యుండు నింతియున్. 69

ఆ. అంతఁ గొంతకాల మరుగ నాయింతి కృతాంతుప్రోలి కరిగె నతఁడుఁ దోన
చచ్చె నితఁడు ధనము వెచ్చించె వాఁడు దహించె నేను శల్యసంచయంబు. 70

సీ. గంగకుఁ గొనిపోయి కలుపుచో గంగ ప్రత్యక్షమై 'నీవు బ్రాహ్మణుఁడ వకట
శూద్రశల్యములు దెచ్చుట నీకుఁ బాడియే?' యనిన నేఁ బూర్వవృత్తాంత మెల్లఁ
జెప్పి 'నాయెడఁ బాటు దప్పక యిట్లు దెచ్చితి నేమి సేతు నయ్యతివరూప
మచ్చొత్తినట్లు నాయంతరంగంబునఁ బాయకున్నది మరుబాణములకు
ఆ. దెప్పమైతి ననుచు ఱెప్పలఁ గన్నీరపుడు గ్రుక్కుకొనుడుఁ గృప దలిర్ప
నస్థిచయముమీఁద నాగంగ యొకమందు; వైవ నిది పునర్భవంబు నొందె. 71

క. క్షీరాంబుధిఁ దరువఁగ మును, శ్రీరమణి జనింపఁ దోన శీతకరుండున్
బోరన పుట్టినక్రియ నీ, భూరమణుఁడు పుట్టెఁ బొలఁతిపుట్టుకతోడన్. 72

ఉ. అంత నదృశ్యమై చనియె నాదివిజాపగ యేను వేడ్క ని
య్యింతికరంబు పట్టఁ గర మెత్తఁగఁ దా నెడ సొచ్చి దీనితోఁ
బంతము దక్క మున్న ఘనపావకకీలల మేను వైచి యీ
యంతరమందు నీకుఁ గుటిలాలక నొప్పన చేసి పోదునే. 73

ఆ. వలదు తొలఁగు వెఱ్ఱివాఁడ వయ్యెద వీల, తాంగఁ గదిసి తేని యనిన నస్థి
సంచయంబు పుణ్యజలములఁ గలిపి ప్రాణములు మగుడఁ బడసినాఁడ నేను. 74

ఆ. నానిమిత్తమునను మానిని యిచ్చోట, బ్రతికె నింతితోడఁ బరిణమింతు
నబ్జవదనమీఁదియభిలాష విడిచి నీ, కిష్ట మైనయెడకు నేఁగు మంటి.' 75

వ. అనిన నతం డుదరి రోకసంబు దాఁకి యేమీ కొంకక యింకను నిట్లు పల్కుమా
నాచేతికోలఁది చూతు గాని యని భుజాస్ఫాలనంబు సేయుచు నిలిచి యదల్చె
నేనును నాధౌతోత్తరీయంబు నడుమునం జుట్టుకొని నెట్టుకొని యుండితి నప్పు
డీతనుమధ్య మధ్యస్థయై మమ్ము వారించి నామనోనేత్రంబులకు మీ రిరువురు
నొక్కవిధంబు కాని భేదంబు లేదు వాదంబు దక్కి మనపురంబునకు నన్నుం దోఁ
కొనిపోయి నలుగురు చెప్పినట్లు పొందని పల్కె నంత. 76

క. ఇట్టిద యగుకార్యం బని, గట్టిగ నింతిఁ గొనిపోయి కతిపయతిథులం
బట్టణము సొరఁగఁ గోమటి, సెట్టియు నీరెడ్డికొడుకుఁ జెఱి యొకవలనన్. 77

చ. కనుఁగొని హర్షచిత్రపులకంబులు మేనుల నివ్వటిల్ల నీ
వనితకునై కదా ధనము వంచన సేయక పాఱఁ జల్లితిం
బనివడి చేగకట్టియలు బండ్లకుఁ బూన్చితి నంచుఁ దారు చే
సినపను లుగ్గడించుచును శీఘ్రగతిం గదియంగ వచ్చినన్. 78

ఉ. చేరకుఁ డింతి నెవ్వఁ డిటు చేరినఁ బ్రాణముమీఁద వచ్చు నం
భోరుహసంభవాన్వయుఁడు పూజ్యుఁడు గాన సహించి యుంటిఁ గా
కారయ నన్యు లెంతటిబలాధికు లైనఁ దృణీకరింపనే
మీర లెఱుంగ రిట్లు పులిమీసల నుయ్యల లూఁగ వచ్చునే. 79

క. అని యారాజకుమారుఁడు, కినిసి పలికె నపుడు వారికిని మాకును నీ
వనితకు వాదము ముదిరినఁ, జని చెప్పితి మప్పురంబుసభవారలకున్. 80

వ. చెప్పిన విని యాసభాసదు లందఱు నొండొరులమొగంబులు చూచి యీముడి
మాచేతం దీరదు తత్పురసమీపంబున నొక్క రాజర్షి యున్నవాఁ డతనిచేతఁ జక్క
నగు నందుఁబొం డనిన మిమ్ముఁ గాన వచ్చితి' మని యంతవృత్తాంతంబును జెప్పి
యవ్విప్రుండు మఱియు ని ట్లనియె. 81

క. 'మానలువురవర్తనములు, వీను లలర మీరుఁ దొలుత వింటిర కాదే
యీనారీరత్నము మాలో నెవ్వరి కర్హ మగుఁ దెలుపవే కరుణన్.' 82

మ. అని భూదేవుఁడు పల్క వంజరనరేంద్రాధీశ్వరుం 'డేను జె
ప్పిన మీ రందఱు సమ్మతించెదరె యీబింబోష్ఠి మీలోన నొ

క్కనిసొమ్మయ్యెడిఁ గాన మాన రితరుల్ కామాతురస్వాంతులై
వెనఁగం బడ్డ నమంద మయ్యెడుఁ జూడీ వెన్వ్రేరులై' నావుడున్. 83

క. 'వినుతయశా! తగవునకుం, జఖి యోడిన నరుఁడు ముదిసి చచ్చిన వగవం
బని లేదు బుద్ధిమంతుల, కనునానుడి వినమె యింత యన నేమిటికిన్. 84

తే. మీరు నిఖిలార్థవేదులు మీరు చెప్పినట్లు గా దని త్రిప్పంగ నగునె మాకు
ననుచు నందఱు నేకవాక్యముగఁ బల్క, వారిదెసఁ జూచి యారాజవల్లభుండు. 85

సీ. 'పూఁబోఁడి నెక్కటిఁ బుట్టించుటకు హేతు వైతి గావునఁ దండ్రి వగుదు విప్ర!
వనజాక్షిపుట్టుతోఁడన నీవుఁ బుట్టితి గాన సోదరుఁడవు క్షత్రియుండ!
యువతి యీల్గినఁ బూని యంత్రక్రియలు సేయుటఁదనూజుఁడవు వైశ్యుండ! నీవు
లలనకు నున్న కాలము కూడుఁ జీరయు నడిపి చచ్చినఁ గట్టె లిడుటఁ జేసి
తే. నీవు భర్తవు గాఁ దగుఁ జూవె శూద్ర!,' యనుచు వివరించి చెప్పిన నతనిమాట
విని రయంబున శూద్రుండు వికచవదనుఁడగుచు నయ్యింతిఁ జేపట్టె నాక్షణంబ.

చ. కనుఁగొని యున్న మువ్వురును గామశరానలతప్తచిత్తులై
కనలుచుఁ బోలుఁ బోల దని కాన కితం డొక కాఁపువాని కే
మని కొనిపోయి నిష్కరుణుఁడై నవపల్లవకోమలాంగిఁ గ్ర
క్కునఁ దగ నిచ్చె మానికముఁ గ్రోఁతికి నిచ్చినమాడ్కి నైవడిన్. 87

తే. ఎంత చెప్పిన నావగింజంతభూతి, పూయువానికి గుమ్మడికాయయంత
వెఱ్ఱి గల దనునార్యోక్తి వినమె తొల్లి, యితనియవివేక మది వేఱె యెన్న నేల.

చ. అదియును గాక పేరడవులందు మృగంబులఁ గూడి యున్న పెం
ముదుకని కెట్టుపుట్టుఁ దుదిముట్టిననాఁగరికంపుఁజందముల్
పదలక తోఁడఁ జచ్చుట సువర్ణము దానము సేత ప్రేతరా
ట్సదనము చొచ్చి యున్నసతిఁ జయ్యనఁ దెచ్చుట యెందుఁ బోయెనో. 89

క. మోపెడుకట్టెలు గాల్చిన,కాపే యర్హుఁ డగునటె జగన్మోహనలీ
లాపరిచయవృద్ధిప్రీ,వ్యాపారాపాంగ మైనయంగనఁ గవయన్. 90

వ. అని కోపోద్రేకంబు సైరింపం జాలక యాపెద్ద నుద్దేశించి 'యోయీ! నీవుమాపెద్ద
చెఱిచితివి గావున వనితానిమిత్తమై వహ్నితప్తుండవు గ'మ్మని బ్రాహ్మణుండును 'నీ
దయితకు నీవు భ్రాతవు గ'మ్మని క్షత్రియుండును 'నీకళత్రంబునకు నీవు పుత్రుం
డవు గ'మ్మని వైశ్యుండును శాపంబు లిచ్చిన నెడ సొచ్చి యాశూద్రుండు వారి
కి ట్లనియె. 91

క. 'ఓహో! యిటు సేత గురుద్రోహ మగుట గాన నేరరుం గదె 'కామాం
ధో హి' నపశ్యత్యనుపలు, కూహింపఁగ నిక్క మయ్యె నుడుగక మాచేన్. 92

తే. ఇచట మీరిచ్చు శాపంబు లెన్నియైన, గాక కానిందు సత్యవ్రతైకశీలుఁ
డితఁ డపరాధుఁ డగు క్షమియింపుఁ డనఁగ, నతని వారించి వారి కిట్లనియె విభుఁడు.

ఆ. 'కాముకునకుఁ బాపకర్మున కవివేకి, కవనిపతికిఁ గోపవివశమతికి
మదవిజృంభితునకు మద్యపాయికిఁ గ్రూర,చేతసునకుఁ దగవు చెప్పఁ జనదు. 94

వ. అదియునుం గాక సకలద్వంద్వములు విడిచి సముజ్జ్వలకాంచనుండనై యుండియు మీతో భాషించినదోషం బూర కేలపోవు నైనను మీకు నాచెప్పినట్లగుం గదా యని వాలాయించి యడిగినప్పు డియ్యకొని యిప్పు డిటు చేత నా భాగ్యంబ కాక మీ రేమి సేయుదు రోపితిరేని శాపంబులు క్రమ్మఱింపుం డంతకు శక్తులు గారేని నూరక పొం' డనిన వారు 'తంత్రీ! వేసరినవాఁడు వెలుంగుమీఁద వేనీళ్ళు చల్లినట్లు నిలుపోపక పలికితిమి గాక నిన్ను శపింప మే మెంతవార' మని యుపచారోక్తులు పలుకుచు దుస్సి పోయిరి గాని శాపంబులు మరలింప నోపరైరి శూద్రుండు నతనిచేత ననుజ్ఞాతుండై యాసలియుం దానును నిజగృహంబునకుం జనియె మఱికొండొకకాలంబు సనుటయు నొక్కనాఁడు. 95

క. ఆవనమున నొకభూపతి, భావ మలర వేఁట వోయి ప్రత్యక్షభవా
నీవిభుఁడో యన నొప్పెడు, నావంజరుఁ గాంచి నమ్రుఁడై యచ్చోటన్. 96

ఉ. కొండొకసేపు తద్విమలగోష్ఠి సుఖించుచు నుండి యీనృపా
లుండు మహానుభావుఁ డని లోకమువారలు చెప్ప నెప్పుడుం
విందును మున్ను నాకు నిదె నేఁడు నిదర్శన మయ్యె నన్ను నీ
తండు కృతార్థుఁ జేయఁడె ముదంబున మత్పురి కేఁగుదెంచినన్. 97

వ. అని తలంచి. 98

క. ఆతనిఁ దనపట్టణమున, కాతతభక్తిఁ గొనిపోయి యతనికిఁ బరిచ
ర్యాతంత్ర మొనర్పఁ దనూ,జాత నునుప నలినివాతసదనమునందున్. 99

క. ఆరాజుచేత నతఁ డటు, లారాధితుఁ డగుచు నుండె నంతట నొకనాఁ
డారామారత్నము దన,చేరువ మెల్లఁగఁ గోర్కి చిగురొత్తుటయున్. 100

సీ. అగ్ని డెందము సోయ కాగ్నిచేఁ బ్రేల్చినయతుల ప్రతాపుఁ డీయంగఁ జూండు
మం డెడు వజ్రంబు బెండుగాఁ బుచ్చునాతుఁ గలఁచినవీరుఁ డీకాయఁ జూండు
నాచారనిధి యైనయజునితాలిమి వమ్ము చేసినయధికుఁ డీచిత్తజుండు
హరునిచిచ్చుఱకంటిపురుటి వదల సేఁకు పఱపినబలియుఁ డీభావజుండు

తే. తనకు వదనైన మెయిమెయిఁ జనఁగనిచ్చు,నయ్యొ యితరుల ననఁగనయ్యె వనివిభుని
వ్రతము లన్నియుఁ గొనిపోయి పఱదఁ గలిపి, చిత్త మంతయుఁ గసిబిసి చేసివిడిచె.

ఉ. * అప్పుడు వాని నెమ్మనమునందుఁ గడుం దమకంబుచీకటుల్
ముప్పిరి గొన్నఁ దొట్రుపడి ముందర గానక పుష్పకోమలం
దప్పక మాచుఁ జూచి యటు దగ్గఱు దగ్గఱి స్వాభిలాషముం
జెప్పఁ దలంచు నుత్తలఁపు సిగ్గులచే టని కొంత చింతిలున్. 102

వ. మఱియును. 103

ఉ. ఇన్నిదినంబు లింద్రియము లే పఱఁ దాపసవృత్తి నుండఁగా
నన్నుఁ గదల్ప లేవు మదనా! మదనాగసమానయాన కీ
కన్నియ కేను లోఁబడినఁ గార్ముక మంది తె యొప్పు నొప్పు నె
ట్లన్న నరుండు తోడు గల యప్పుడ తాఁ బగ సీఁగ కుండునే. 104

వ. అని యిట్లు దలపోసి విప్రాదికం బగువిటత్రయంబువలన నైనశాసంబులు దన్నుఁ
బ్రేరేప నాగొంతి నతిప్రీతిం జూచి వ్యంగ్యరీతి నతం డిట్లనియె. 105

క. 'పెక్కుఁ దెఱంగుల నా కి, ట్లెక్కుడుపరిచర్య చేసె దీ వెప్పుడు నిం
కొక్కటియ సుమీ కడమం, జిక్కినయది తెలిసికొమ్ము శీతాంశుముఖీ!' 106

చ. అనవుడుఁ గేలు మోడ్చి వినయంబున ని ట్లను నాల తాంగి 'మ.
జ్జనకుఁడు మీపదాబ్జములు చల్లన కాన భవత్సమీపముం
దునిచిన నున్నదాన మఱి యొం డన నేరక సన్మునీశ్వరా!
కనుఁగొన సర్వముం గడమ గాక యొకం డని చెప్ప నున్నదే. 107

ఆ. ఏను బాల నగుట యెఱుఁగరే నాయందుఁ, గడఁగి కొఱత లెన్నఁ గలరె మీరు
నోలిఁ దప్పు లైన నొప్పులుగాఁ జూడుఁ, డిట్టు లవధరింప నేల యనఘ! 108

ఉ. నావుడుఁ జెక్కు మీటి 'నలినస్ఫుటలోచన! మాట లేల నీ
యౌవనలక్ష్మికిన్ భటుఁడ నైతి ననుం గరుణింపు' మంచు వాఁ
డూవిశ్శుబారుచుం బిలువ నుత్పలగంధియు 'నోమహాత్మ! నీ
కీవిధ మెట్లు చొప్పడియె నే నొకభ్రాతియె నీదుకోర్కికిన్. 109

సీ. ఆలోలమందానిలాధూతలతమాడ్కి నినుఁ గాంచి హర్ష కంపనముతోడ
రతిపు: బుష్పపహారమునఁ బ్రీతునిఁ జేయుగతిఁ గల్గిచూపులు గడలుకొనఁగ
మృదులతల్పము డిగ్గి యెదురేఁగుదెంచుచో నందెలు చెవులకు విందు సేయ
సరసభాషారంభ సంరంభయగురంభ పరిరంభసౌఖ్యసంపదలఁ బొదలి
తే. చిరతపఃక్లేశఫల మెల్లఁ జేకుఱంగఁ, ద్రిప్ప ము ప్పెన్నఁడును లేక త్రిదశపురని
పట్టణమ్మున నెమ్మితోఁ బ్రాఁతకాఁపు, నై వసింపంగఁ బ్రాప్తుఁడ వనఘ! నీవు. 110

---

* అప్పుడు వాని నెమ్మనమునందుఁ గడుందమకించి ముచ్చటల్, చెప్పఁగఁ గోరుఁ గోరియును జేరు శరీరనిజాస్యపద్మముల్, తప్పక చూచు,...ఛి ని, షా.

ఉ. అట్టిమహాపదంబునకు హానిగ నీదుతపఃప్రభావ మి
ప్పట్టునఁ గోల్పడం దగునె భవ్యుఁడ!' నావుడు నాతఁ డి ట్లను
'గట్టిఁడిమన్మథుండు ననుఁ గాఱియఁ బెట్టుట కోర్వఁ జాల నీ
పుట్టువునందు నాకు నినుఁ బొందఁగఁ గల్గుటె యింద్రభోగముల్. 111

ఉ. కావున నన్నుఁ జైకొనుము కాదనునంతియ కల్గెనేని రం
భావిభవోపగూహనము భ్రాంతిగఁ జెప్పితి కాదె యిప్పు డా
త్రోవకు నైన నన్ బనుపు తొయ్యలి! నీమనసార నింతలో'
నావుడుఁ దల్లడిల్లి నరనాథునకుం బ్రణమిల్లి మెల్పునన్. 112

ఉ. 'కన్నియ నేను ధర్మగతి గామి యెఱింగియు నిట్టు లానతీఁ
జన్నె?' యనన్ 'లతాంగి! యిది క్షత్త్రియవంశమునందుఁ జెల్లు నా
కిన్నియుఁ జెప్ప నేల నను నేలఁ గదే!' యను వంజరుండు ము
న్నెన్నఁడు లేనినింద యిది యె ట్లగునో యనిఁ బ్రాలు బాలయున్. 113

ఉ. కొమ్మపదారవిందములకుం బ్రణమిల్లె విభుండు మేనఁ గం
పమ్ము దలిర్ప నప్పడఁతి 'పాపము గట్టకు పార్థివేంద్ర! నీ
విమ్మెయి నిప్డు వేగపడి యీలువు పెంపెడలించి పోవఁగాఁ
బిమ్మటిమాట కోర్వ ననుఁ బెండిలి గమ్ముటు లైన మే లగున్.' 114

వ. అనిన నతం డి ట్లనియె. 115

క. 'ఇది గాంధర్వవివాహము, సుదతీ! మన కిపుడు సాక్షి సూర్యుఁడె' యన 'నో
ముదుకఁడ! నీకొద దీఱిన, వదలెద వే నొల్ల' ననుఁ బ్రవాళాధరియున్. 116

క. 'ఏ నేల నిన్ను వదలుదు, మానిని! యనుమాన మడిగి మన్నింపుము నా
చే నొకశపథము గొను' మని, దానియడిగినట్ల చేసె ధరణీపతియున్. 117

వ. ఇత్తెఱంగున నత్తెఱవచిత్తంబు మెత్తం జేసి చిత్తజసుఖకేళిం దేలి యయ్యెడం దనివి వోక యాకన్నియ నెత్తుకొని పరదేశంబున కరిగి యొక్కవివిక్తదేవాలయంబునందు నయ్యిందువదన నునిచి గ్రాసార్థం బాసమీపగ్రామంబునకుం జనిన నం దొకవారనారీపరిచారిక వచ్చి పరిణతవయస్కుండయ్యు వళిపలితంబులం బొరయక తరుణవయస్కుండపోలె నున్న యన్నరనాథుం జూచి 'మాయక్క యెక్కడనేని యొకచక్కనివాఁడు గల్గినంగాని కేవలనరమాత్రుల నెల్ల నంగీకరింపదు నేఁడితనిం జూపి యమ్ముచ్చెకంటిచేత మెచ్చు వడయుదు' నని తలంచి యతనిం దోడ్కొనిపోయిన.

ఉ. అతనిఁ జూచి వేశ్యయుఁ దదాగమనోచితభావణాదులం
బ్రీతునిఁగా నొనర్చి యధరీకృతమన్మథుఁ డివ్విటుండు నేఁ

డీతఁడు నాకుఁ జొప్పడునె యే నిల నింతకృతార్థ నౌదునే
నాతికిఁ జారుభర్తయ ధనంబులు సొమ్ములు వేయు నేటికిన్. 119

ఆ. ఇతనిఁ దడవు గాఁగ నిచ్చోట నిలుపను, వీనిమనసులోనివింతదనము
పాయఁ ద్రోవ నేయుపాయంబు గలదొకో, యుచితభంగి యయ్యు నుండవలయు.

క. అని తలఁచి వెండిపలకయుఁ, గనకపుసారెలును రత్నఖచితములై పే
ర్చిన పాచికలును దెప్పించి నృపోత్తము నెత్త మాడఁ జీఱిన నతఁడున్. 121

క. 'నీతోడ నాడఁ దీరదు, నాతీ! నానాతి నేఁడు నావెంట నతి
ప్రీతిఁ జనుదెంచి శ్రాంతిస, మేత యగుచు నొంటి నున్న దేఁ బోవలయున్. 122

క. అనిన విని 'నీకు నిప్పుడు, వనితలు లే రనుట గాదు వచ్చినపిదప
న్మనసార నిష్టసుఖవర్తనముల నొక్కింతసేపు దడయుంట కీడే. 123

క. పోయెదవు గాని రమ్మని, యాయంబుజనేత్ర దనకరాకర్షణముం
జేయుడు నొం డన నేరక, కాయజునురిగోలఁ దగులుఖగమును బోలెన్. 124

క. ఆటలకుఁ నోర్చి మ న్నొక, జోటి నటుల దెచ్చికొనుట చూడక నృపుఁడ
య్యాటలకుఁ జొచ్చె నిం కే,యాటలకును నోడఁ డనఁగ నయ్యంగనతోన్. 125

క. అప్పుడు సతియును బతియును, మెప్పుగ సమదృష్టినుండి రుచితాసనులై
కుప్పనఁగూరలుగా మరుఁ, డప్పువ్వులకోల లేయ నద నయ్యె ననన్. 126

క. ఇతరేతరాగ్రభాగస్థితి నెత్తపుసారె లొప్పెఁ జిత్తజసమరో
చితముగ నప్పుడొనర్చిన, ప్రతికోటలకొమ్మ లనఁగఁ బ్రవ్యక్తములై. 127

వ. అంత నావామాక్షి దనవామహస్తంబునం బలక దాటించుచు. 128

సీ. నిజదృక్చకోరికానికరంబుకోరిక సమకూర నృపవక్త్రచంద్రుఁ జూచు
నరుణబింబాధరాభరణాయితంబులై దంతంబు లరదోఁపఁ బంత మడుగు
నతఁ డిచ్చుమధురోత్తరామృతపూరంబు శ్రోత్రయుగ్మమునకుఁ జూఱ విడుచు
మనుజులరాగంబు మన కేల మరుఁడ రాగంబు సు మ్మనుచు వ్యంగ్యముగఁ బల్కుఁ

ఆ. బాసికలఁ గరాబ్జవాసనఁ బొరయించు, రమణుఁ గలయఁ గుల్కు రత్నఖచిత
కంకణములు మొరయ గల్లన వైచు న,ప్పలకమీఁద సరసభావ మెసఁగ. 129

క. దశవిధములనెత్తంబుల, శశిముఖి యే నెత్త మడిగెఁ జయ్యన నది త
ద్వశ మగు ద్యూతవిధిజ్ఞులు, ప్రశంస యొనరింప నానృపతి లజ్జింపన్. 130

ఉ. నట్టలు రెండుఁ దాన జతనంబునఁ జేకొని యున్న యిందులం
గట్టి నృపాలుసారెలకుఁ గా లిడ నెందునుఁ జోటు లేక యు
న్నట్టుగఁ జేసి యెట్టిసమయంబున నొడ్డిన సారెదిక్కు గ
న్పట్టి దృఢాస్త్రవేదిగతిఁ బెక్కుగఁ దాఁకఁగ వైచి వైచినన్. 131

ఉ. ఓటమి మీఁద వైచుకొని యూరక పోవుట యెత్తు సాల ది
య్యాట యవశ్యముం గెలుతు నంచుఁ జలంబున నాడు నాడి యా
యాటయు నోడు నోడి యురియాడు నిజాంగన యున్నయుంకికిం
బాటలగంధితోఁ గెలువఁ బాటఱు యుండమికిన్ విభుం డెదన్. 132

వ. ఇవ్విధంబున నమ్మహీపాలునకుఁ గాలవిడంబాబు సిద్ధించె నంతఁ బౌరకాంత యొ
కర్తు యొక్కపని వెంట నారాజపుత్త్రి యున్న దేవాగారంబునకుం బోయి. 133

క. ప్రాచినతం గెడువోలె మ,రీచినిబిడమణిగణస్ఫురితభూషణాలీ
లాచాతురిఁ జెలువొందెడి, నాచపలాక్షిఁ గని యద్భుతాత్మిక యగుచున్. 134

ఉ. 'ఎక్కడనుండి వచ్చెనొకొ యీనవనీరజకోమలాంగి తా
నిక్కడ నొంటి నుండఁ గత మెయ్యదియో శశిమౌళిమౌళిపై
నెక్కినయేటితోడఁ గలహించి హిమాద్రిజ యల్గి వచ్చి యీ
చక్కటి నిల్చెనో' యనుచుఁ జప్పుడు సేయక డాయఁ బోయినన్. 135

ఆ. బెదరి చూచు లేడికొదమచూపులఁ గీడు, పఱచునట్టితనదు మొఱఁగుఁజూపు
లదర నెదురు వచ్చి యప్పౌరకామిని, తోడ నిట్టు లనియెఁ దోయజాక్షి. 136

క. 'ఎందుల దానవు? వెలఁది! న,నుం దా నిట డించి మన్మనోనాయకుఁ డేఁ
గెం దడవు గలదు రాఁ డే, చందమొ కానవు గదా యిచట నెచ్చోటన్. 137

మ. హరవిద్వేషము దక్కి మన్మథుఁడు రుద్రాక్షంబులున్ భూతియుం
బరగం దాల్చి తదీయసత్కృపకుఁ దాఁ బాత్రుండు కాఁ బూని సు
స్థిరభక్తిం జరియింపఁ జొచ్చె నన నక్షీణద్యుతిం బొల్చు సుం
దరదేహుం డతఁ డేమి యయ్యెనొ కదా! తల్లీ! తలం కయ్యెడున్'. 138

చ. అనుచు వివర్ణవక్త్ర యగునానృపపుత్త్రిక నూఱడించి కా
మిని 'యొకదిక్కు చన్నతుది మిన్నక క్రమ్మఱ వత్తురమ్మ! పో
యినపని గాక భానుఁ డదె యిమ్ములఁ బశ్చిమవార్ధికిన్ రయం
బునఁ జనుచున్నవాఁడు తమముం గడుఁ బెల్లగు నింకఁ బైపయిన్. 139

క. చోరులు వత్తురు గాదే, క్రూరమృగావళులు వచ్చు గుడిలోపల నీ
వీరేయి యొంటి నున్కి వి, చారము గా దరుగుదెమ్ము చయ్యన నాతోన్. 140

చ. ఎదురుగ వచ్చు నీదుహృదయేశుఁడు నంతట రాక తక్కినన్
సుదతి! మదీయగేహమున సుప్తి వహించుట భార మైనఁ గాం
చెద నతఁ డెందు నున్న' నని చెచ్చెర నచ్చపలాక్షిఁ గొంచు న
మ్మదుసలి యేఁగె నంత నృపముఖ్యుఁడు వచ్చి యదృష్టభార్యుఁడై. 141

ఉ. చిత్తము జల్లన న్మిగులఁ జేడ్పడుఁ బెద్దయుఁ గన్నునీరు చే
నొత్తుచుఁ జూచు నల్దెసలు నూరక యిట్టును నట్టుఁ బాఱు నె
త్తెత్తి పొరింబొరిం బిలుచు నెవ్వరు పల్కిన నాలకించు డ
గ్గుత్తిక పెట్టు నెట్లగునొకో యను నెక్కడికేఁగెనో యనున్. 142

ఆ. ఏను బోయి తడవుగా నున్న నబల యిచ్చోట నాకు నెదురు చూచి చూచి
యొంటి నుండ వెఱచి యూరిలోనికిఁ బోవఁ, బోలుననుచు మఱియుఁ బోయి వెదకు.

ఆ. నిప్పు ద్రొక్కినట్లు నిలువఁ డెచ్చోటను, నాఁడుముసుకు గని మహాశతోడఁ
గూడఁ బాఱి తేఱకొనఁ జూచు మాచి యప్పొలఁతి గాకయున్నఁ బుల్లవడును.

చ. పలుమఱుఁ దన్నుఁ జూచి మఱి పౌరజనంబులు వీఁగి వెఱ్ఱి నా
నలయక వీథులందు నిటు లాఱడిఁ ద్రిమ్మరుచున్న యమ్మహీ
తలపతిచంద మంతయును దా విని తొల్లిటివారకాంతయున్
వెలయఁగ నాతనిం బిలిచి వేగ వివేకము నివ్వటిల్లఁగన్. 145

క. ఉపచారోక్తుల నాతని, యుంపతాపము డిందుపఱచి యొయ్యొయ్యనఁ దా
నుపగూహనాదిసుఖముల, నపరిమితప్రీతుఁ జేయ నతఁ డట్లుండెన్. 146

ఉ. అక్కడఁ బేదరాలినిలయంబున నానృపపుత్రి నెవ్వగం
బొక్కుచు మేర లేనితలపోఁతలఁ దూలుచు నుండ నొక్క నాఁ
డక్కమలాక్షిఁ గన్గొనియె నప్పుర మేలెడురాజసేవకుం
డొక్కఁడు వాఁడు పోయి యదియున్నతెఱం గెఱిఁగించె భర్తకున్. 147

ఆ 'అవధరింపు దేవ! యయ్యంబుజానన, యొప్పుచూడ నేత్రయుగము చాల
దాలతాంగిగుణము లభినుతింపఁగ నొక్క, జిహ్వ చాల దేమి చెప్ప నింక. 148

సీ. కమల మొక్కట నల్లగలువలు రెంట భృంగములు పెక్కింట శంఖము నొకంట
బిసకాండములు రెంటఁ బసిఁడికుండలు రెంట నొప్పార సృజియించె నొక్కసగము
ఘనరథాంగద్వంద్వకంబునఁ గమనీయరంభామృదుస్తంభరాజయుగ్మ
కమున మన్మథశరగౌరవ్వయంబునఁ బల్లవయుగమునఁ బరగఁ జేసె

ఆ. నొక్కసగము రెండు నొగిఁ బొందుపడఁ గూర్చి, పిడికిలించి పట్టె నడుముఁ జేసె
నజుఁడు నాఁగ నింతి యవయవోత్పాదన, లీలఁ దెల్పు నవ్వళిత్రయంబు. 149

క. అవ్వనజాయతలోచన, యెవ్వరిసొమ్మై చరించు నివ్వసుమతిలోఁ
బువ్విలుతుఁ డతఁడ కా కొకఁ, డవ్వల మఱి కలఁడె' యని మహాశగఁ జెప్పెన్.

క. ఆరాజు వానిచే నటు, లారాజీవాయతాక్షియౌవనవిభవం
బారఁగ విని మదనాస్త్రవి, దారితహృదయుఁ డయి తగవు తలఁపనిమదిలోన్. 151

క. ఆపడఁతిఁ బిలిచి తెండని, పైపై దూతికలఁ బనుప భయ మందుచు 'నో
పాపపుదైవమ! తుది న, న్నీపాటులఁ బడఁగఁ జెచ్చితే యిచ్చటికిన్. 152

ఉ. తల్లినిఁ దండ్రిఁ బాసి కులధర్మము చూడక వెఱ్ఱిదాననై
యిల్లును బట్టు డించి యిటు లేటికి వచ్చితి వచ్చి మన్మనో
వల్లభు నిందుఁ గోల్పడితి వాఁ డిట కెప్పుడు వచ్చు నింతలోఁ
గల్లరిబ్రహ్మ యేది గతిగా నొనరించెనొ యేమి చేయుదున్. 153

క. ఈనృపతి పాపకర్ముం, డే నీతనిసమ్ముఖమున కేమని పోదున్
మానము వెలి యగుఁ బ్రాణము, మానినులకు నేమి భ్రాంతి మహి నూహింపన్.' 154

క. అని తలఁచి యబల దూతీ, జనముల కిట్లనియెఁ 'గొంతసైరణ వలదే
కనుమఱుఁగు లేక యూరక, తనవలసినచోట్ల మెలఁగుతరుణులు గలరే. 155

ఉ. ఎప్పుడు ప్రొద్దు గ్రుంకెడినొ యించుక సైఁపుఁడు మీనృపాలుతోఁ
జెప్పఁడు వేగ మేల కడుఁ జేరువ నున్నది కార్య' మంచుఁ దా
నప్పని కియ్యకొన్నయటు లాడినఁ బోయిరి వారు నాఁటిరే
యప్పటుబుద్ధి బుద్ధియుతు లాదట మెచ్చఁ దొఱంగె దేహమున్. 156

క. పుడమి నపప్రథ యగునెడఁ బడఁతికి దేహంబు విడువఁ బాడియ కాదే
సడికంటెఁ జావు మే లను, నొడువు పురాతనము గాక నూతనపదమే. 157

వ. ఇట్లాసతి మృతిఁబొందుట విని యమ్మనుజేంద్రుం 'డిది యెట్టి పతివ్రతయొకాక, నా చేసినధార్ష్ట్యంబునకు లజ్జించి ప్రాణంబు లుజ్జగించె' నని పశ్చాత్తాపంబు నొందుచు నట్టికేలకు నారాత్రి గడపి మఱునాఁడు దానికి నగ్నిసంస్కారంబు సేయ నియోగించె నావృత్తాంతంబుఁ గర్ణాకర్ణి నాకర్ణించి వంజరుం డది తనయింతియ కాఁబోలు నని యూందోళించుచు వచ్చి చూచి నిశ్చయం బగుటయు. 158

క. మగువ విరహవేదనఁ గను, మొగిచినగతిఁ జచ్చె నింత మోసపుఁ గార్యం
బగునె యని యార్పఁ దొడఁగిన,పగిది నృపతి గన్నుసీరు పఱపె నొదవుయిన్. 159

వ. ఇట్లు శోకాక్రాంతుం డగుచు నమ్మహీకాంతుం డిట్లని విలాపించు. 160

ఉ. 'హా! మదిరాక్షి! నన్ను మదనానలకీలలఁ గ్రాగుమంచు నీ
వీమహితానలార్చులకు నీతను వాహుతిఁ జేసి నేఁడు సు
త్రామపురాంగనాజనకదంబముతో విహరింపఁ బోయితే
కామిని! నన్ను డించి చనఁ గా దని బుద్ధిఁ దలంపవే కదే.' 161

వ. అని విలాపించి. 162

చ. 'నలినదళాక్షి! నీవు నలి నావెనుకం జనుదెంచి నాకుఁ జే
కలిమి యొనర్చి తిప్పు డిటు లీ వమరావతికిం జనంగ నే

నిలుచుట పంతమే యిపుడు నీవెనుకం జనుదెంతు' నంచుఁ దా
రలు వెఱఁ గందఁగా నుఱికె స్రుక్కక వంజరుఁ డాచితాగ్నిలోన్. 163

వ. ఇట్లావిప్రశాపంబునకు ననురూపంబుగా నతండు మృతుం డగుటయు నావేశ్యయు నానిమిత్తంబై కదా వీ రిరువురు నిట్లైరని తాను నయ్యగ్నియందఁ గూలె నమ్మువ్వురి మరణంబులకుం గారణంబైయుండి యే నూరకుండుట ధర్మంబు గాదని దాసియుం దదనుగమనంబు చేసె నంతయుం విని. 164

క. ఆరా జచ్చెరు వందుచు, నారాజసరోజముఖుల యస్థులు గంగా
వారిఁ గలిపి రం డని తన, వారిం బనుపంగఁ బోయి వారును నొకచోన్. 165

వ. ఒక్కవిప్రుండు పెద్దకాలంబు దేవి పురశ్చరణంబు చేసి తత్ప్రసాదంబున సంజీవని వడసి యుండుట యాప్తపరంపరవలన నెఱింగి యతనియున్నెడ కేఁగి తమ తెఱంగు చెప్పి 'విప్రా! నీవు పెద్దయుం నాయాసపడి గడించినదివ్యవస్తువునకుం దాత్కాలికంబై యత్యంతసుకృతప్రదం బగు ప్రయోజనంబు సిద్ధించె వీరలప్రాణంబు లెత్తు మిదియ నీదగునౌషధంబునకు నిదర్శనంబు నగు' నని ప్రార్థించిన నతం డట్ల చేసిన. 166

క. తారయుం జ్యేష్ఠయు లక్ష్మియుఁ, దారాధీశుండు నెవ్విధంబున దుగ్ధాం
భోరాశిఁ బుట్టి రట్టుల, యారమణులు నతఁడుఁ బుట్టి రౌషధశక్తిన్. 167

ఆ. ఇట్లు పుట్టి యతనియింతి మన్మథవికారావలోకనంబు లడర నతని
చెట్టు పట్టఁ బోవఁ 'బట్టకు పట్టకు, బాలఁతి! నీకుఁ దోడఁబుట్టు నైతి. 168

వ. నన్నింక వరించుట యుచితంబుగా దూరకుండు' మనిన వెఱఁగుపడి యుండె నంత నవ్వేశ్యయు నాలాగె ట్లనిన నతండు దాని కిట్లనియె. 169

క. 'ధర్మాధర్మపథంబుల, మర్మ మొకని కొకఁడు చెప్పుమాటయ లోకం
బర్మిలిఁ గొని తెలియ వలదె, కర్మాకర్మైకయుక్తి గనియెడుపనికిన్. 170

క. మదిరాక్షి! వినుము నీవును, మదంగనయుం దాసియును సమంబు సుమీ నా
హృదయమున' కిప్పు డనవుడుఁ, బొదలెడుకోపమున రాజపుత్రిక పలికెన్. 171

వ. 'ఏ మేమీ గ్రుడ్లు దింటయుం గాక గూడెక్కి కూసెద వీవేశ్యయుం దాసియుం నీ కన్నుల కెంత ప్రియ మైన నయిరి కాక నాకు సవతుగా నిట్లు పలుక నెట్లు నో రాడె నీవు నన్ను వరించునప్పు డన్యకాంతాసంగమంబు సేయ కుండుటకును నన్ను వదలకుండుటకునుం జేసినశపథంబును గాడుపఱచితి పాపకర్ముఁడా! నీవు శుద్ధాత్ముండవైన నిన్నియలజ్జ లేల వచ్చు'నని నిషేధించి పలికి యంత నిలువక. 172

క. 'పిండుము బొంకెడుపురుషుని, జండాలుం డనఁగ నీవు క్షత్రకులుండవై
యుండియుం బొంకితి గావునఁ, జండాలత నొందు' మనుచు శాపం బిచ్చెన్. 173

క. అన పంజరుండు 'వనితా!, నినుఁ గదిసిన నట్ల యగుదు నీవును ననుఁ జే
రిన నట్టులు కా వలదే,' యనుచుం బ్రతిశాప మిచ్చినట్టుగఁ బల్కెన్. 174

ఆ. పలికి తపము సేయుతలఁపున వనభూమి, కరిగె నదియు నొక్కయడవి కరిగెఁ
జూచి వేశ్య వనరుచును బోయె నింటికి, దాసి తనదువెంటఁ దగిలి రాఁగ. 175

వ. మఱియుఁ గొంతకాలంబునకు నొక్కనాఁ డప్పంజరుండు నిజానుష్ఠానంబులు దీర్చి వన్యఫలంబు లనుభవించునప్పు డం దేమి విశేషంబు సోఁకెనో మస్తకంబు మొదలు కొని సకలావయవంబులందును నొక్కపొర యూడి సర్పంబుకుబుసం బూడిన ట్లైన షణ్మాసమాత్రబాలుం డై. 176

సీ. పుడమి పాన్పుగఁ బడి యడుగులు మృదువాతకంపిత నవపల్లవములభంగి
నందంద కదలించు నరవిరిదమ్ములతమ్ములౌ తనదుహస్తమ్ము లెలమి
నాడించు వెడ యేడ్పు నంతన యుడుగు ను గ్గడుగు నూఁకరలిచ్చు నాలకించుఁ
గలువఱేకులసందిఁ దలచూపుఁ జీఁకుమీలకైవడి వెడమోడ్పుఁగన్ను లమరఁ

ఆ. గొంతతడవు నిదుర గూరు మిన్నక నవ్వు, మేలుకను విరక్తిశీలునట్లు
చలన లేక చూచు శరజన్మజన్మంబుఁ, బోలెఁ దనదుబాలలీల మెఱయ. 177

వ. అంత నతనికాంతయుం దైవవశంబున నాప్రోవ నరుగుచుండి యతనిం బొడగని 'వీఁ డెవ్వరివాఁడో వీనితల్లిదండ్రు లె ట్లేమైరో యామిషార్థంబు పక్షిరాక్షసులం దెవ్వరేని వీనిం గొనిపోయి పోయి చేతప్పి పడవైచిరో కాక యిందు రాకకుం గారణం బేమి' యని నలుదిక్కులం బరికించుచు నెత్తుకొని యుఁరంబున నొత్తుకొని.

క. మే నెంతయుఁ బులకింపం, గా నప్పుడు ప్రాణనాథుఁ గౌఁగిట నిడి న
ట్లైన మది సంశయించుచు, వానిం గొనిపోయి పెంచె వనిత ముదమునన్. 179

క. దినదిన మొక్కొకకళ గాఁ, జెను పొందెడుచంద్రుమాడ్కిఁ బెరిగె నతం డే
డెనిమిదిదినములనాఁటికి, మనసిజుకైవడి నతిసుకుమారాకృతితోన్. 180

వ. ఇట్లు నవయౌవనుండై యావనితపై నివ్వటిల్లుతనకోర్కి వితర్కించి దానికిట్లనియె.

ఉ. 'మాతవు నీవు నిన్నుఁ గని మానస మారయ నేమి పాపమో
నాతి యధర్మలక్షణమునం జొరఁ బాఱెడు నోజ లేక నా
కీతల పేల పుట్టెనొకొ యేగతి కేఁగుదునొక్కొ' నావుడుం
జేతులు మోడ్చి యవ్వనిత చెచ్చెర నిట్లని పల్కె వానితోన్. 182

ఉ. 'నీవు శిశుత్వ మొంది యవనిం బడి యుండఁగ నెత్తుకొన్న మ
ద్భావము నిట్లదయె వెఱఁగుపాటు జనింపఁగఁ దెచ్చి పెంచితిం

దేవ ! నిజంబు చెప్పుము మదీయమనోహరుఁ డై నపంజర
త్స్వామిభునట్ట తోఁచెదవు కావు గదా యనుమాన మయ్యెడున్.' 183

ఆ. అనిన నతఁడు దెలిసి 'యనుమాన మేటికి, పంజరుండ నగుదుఁ గంజనయన !
వెడలఁబడితిఁ బొమ్మ విప్రాదు లగువారి, మూఁడుశాపములను ముక్తి వడసి.' 184

వ. అనిన నయ్యతివ యతని కి ట్లను 'విప్రాదు లనువా రెవ్వరు ? వారు నిన్ను శపింపం గారణం బేమి? నీ విప్పుడు శాపవిముక్తుండ నై తిఁ బొమ్మనుట యేమిటం జేసి! యనిన నవ్విటచతుష్టయంబు వనితావాదనిమిత్తంబునం దనసమ్ముఖంబునకు వచ్చుటయుం దాను దీర్చినతగవు శూద్రునకుఁ దక్కఁ దక్కినమువ్వురకు నసహ్యం బైనం గోపించి శాపంబు లిచ్చిన తెఱఁగునుం జెప్పి మఱియుం ని ట్లనియె. 185

క. 'నీతోడఁ జచ్చి క్రమ్మఱ, నీతో జన్మించి పిదప నీవు పెనుపఁగా'
నీతనయుండ నై పెరుగుట, నోతరుణి! త్రిశాపముక్తి నొందితి నంటెన్.' 186

తే. అని చెప్పుచు నెటకేనియుఁ, జన నుద్యోగించు రాజసత్తముఁ గని య
వ్వనిత మతి బెదరు గదుర న్నతని కి ట్లను మోమునందు దైన్యము దోఁపన్. 187

క. 'ఝషగర్భంబునఁ బొడమిన, ఝషకేతుని: గాంచి సంతసము నొందినయా
ఝషకేతువనితఁ బోలితి, ఝషకేతుసమాన! చూడు సత్కృప నన్నున్. 188

వ. అని తొల్లి మన్మథుండు నిటలనేత్రు నేత్రవహ్నివలన సమసిననాఁడు శరమాయాడంబరుం డగుశంబరుం డంబరమార్గంబునఁ బఱతెంచి తత్సతి యగురతి నతిత్వరితగతి నెత్తుకొనిపోయి యంతఃపురంబున వైచుకొనిన నది మాయావతి యనుపేరం దన్స్వాగతం బొక్కటియు వెలిగాఁ దక్కటిపను లన్నియుఁ దానయనుసంధించుచు స్వసంకల్పకల్పితయుం స్వమూర్తిసదృశయు నగునొక్కకృతకవనిత నతనికోర్కి దీర్ప నప్పటప్పటికి నియోగించుచుఁ దనపాతివ్రత్యంబునకు హాని లేకుండ నిట్లు చరించుచుండెఁ బెద్దకాలంబునకు ద్వాపరాంతంబున నఖిలభువనావనగుణభ్రాజిష్ణుం డగువిష్ణుండు కృష్ణుండై పుట్టిన నప్పుణ్యమూర్తికి రుక్మిణీదేవికిఁ గాముండు ప్రద్యుమ్నుండై పుట్టుట శంబరుండెఱింగి యాశిశువుం గొనిపోయి సముద్రమధ్యంబున వైవ నొక్కమీను మ్రింగె నది యొక్క వేఁటకానిచేతం దగులువడి యాశంబరునకు వాఁడు కానుకగాఁ దెచ్చి యొప్పింప మాయావతిచేతం దఱుఁగంబడు నప్పుడు శుక్తిమధ్యంబునం బొల్చుముక్తాఫలంబునుం బోలె నాఝషజఠరకుహరంబున నున్న బాలునిం గని యతనిగూఢవృత్తి నెత్తుకొనిపోయి యద్దేవి రహస్యప్రదేశంబున నునిచి పెనుచుచుండ నతండు సంప్రాప్తయౌవనుండై శంబరు వధియించి శంబరారి యనుపేర నిజసతీయోగసౌఖ్యంబు లనుభవించుచుండుటఁ జెప్పునప్పురాతనకథారూపంబు దీపింప నాడిన నతం డి ట్లనియె. 189

ఆ. 'నలినవదన! యల్లనాఁడు నీ వాడిన, మాట మఱచి తెట్లు మాలతనము
వచ్చు నన్నుఁ జేర వచ్చిన నే నింత. కోర్వ నింక నూరకుండనిమ్ము.' 190

క. అని యతఁడు విడియఁబాడిన, 'ననఘా! యింతనెగు లైన నతులితసత్త్వం
బున నుపఘాతిక మయ్యెడు,నని కొడఁబడుదురె వివేకపరిణతు లెందున్. 191

ఆ. నన్ను వదల కుండ మున్ను చేసినబాసఁ, దలఁప వైతి గాన దానఁజేసి
సొలసి నిన్ను నట్లు పలికితి నీవు నా, పలుకు లింత యొగ్గు పట్టఁ జనునె. 192

వ. అది యట్లుండనిమ్ము. 193

మ. నరకం బైనను నాక మైన మది నానందంబు గావింపదే
పురుషుం డింతియుఁ దానుఁ గూడి చనినన్ భూమీశ! చండాలదు
స్తరభావం బది నాకు నీకు సమమై సంధిల్లుఁ బ్రారబ్ధముల్
పరిభోగం బధికంబు లౌ టెఱుఁగవే పౌరాణికప్రోక్తిమై. 194

క. కావున మన మెట్లైనను, దైవకృపం జేసి బ్రతికెదము గాని ధరి
త్రీవర! నాపోరిక వృథ, గావింపకు' మనుచు మ్రొక్కెఁ గన్నీ రొలుకన్. 195

చ. నృపతియుఁ దత్కుతూహలము నెమ్మిఁ గనుంగొని యాత్మఁ దద్దయుం
గృప దిగురొత్త నాశశిముఖిం దగఁ గౌఁగిటఁ జేర్చి మేన ద
ట్టపుఁబులకల్ జనింపఁగఁ దొడంగి మనోభవకేళిఁ దేల్చె నా
నెపమున నంత్యజాకృతులు నెట్టనఁ దాల్చిరి వార లిద్దఱున్.' 196

ఉ. నావుడు విప్రుఁ డిట్టు లను 'నాకమహానదితోడ పంజరుం
డావల మూఁడుజన్మములయప్పుటఁ గోలెను యుష్మదీయసే
వావిమలాత్ముఁ డట్టె తుది పంజరుఁ డెచ్చుట యాది గాఁగ నే
లా వివిధంబు లైనవ్యథలం బడఁ జొచ్చెఁ దపంబు పెంపఱన్.' 197

చ. అనిన 'నతండు ముక్తి వడయన్ సమయం బరుదెంచెఁ గాన యా
తనకిఁ బురాకృతంబు లగుదారుణకర్మము లొందె నివ్విధం
బున నఘముక్తి గావలనె భూసురసత్తమ! యట్లు గాక త
క్కిన భవబంధముల్ తెగునె కేవలకర్మనిబద్ధదేహికిన్. 198

ఉ. కావున వాఁడు క్షత్రియుఁడు గాని తలంపఁగ హీనజాతి గాఁ
డో వసుధామరేంద్ర! యతఁ డున్నెడకుం జని చెప్పు మయ్య నా
జీవనగౌరవం బటులఁ జెప్పిన నప్పుడు వాఁడు ముక్తుఁడై
పోవుఁ బ్రియాసమేతుఁ డయి పొమ్ము సమస్తము విస్తరించితిన్.' 199

క. అని గంగానది చెప్పిన, విని విప్రుఁడు 'తల్లి! యేఁ బవిత్రుఁడ నైతిన్
బనివినిరొంద' నని మ్రొక్కుచుఁ, జని కలివయతిఘుల నకనిసదనము చేరెన్. 200

ఆ. అతఁడు నతనిరాక కత్యుత్కటప్రీతి, దనర నెదుర చూచు చునికిఁ జేసి
కన్నయదియు మొదలు గాఁగ సాష్టాంగదండప్రణామములు గడంగి సేయ. 201

క. ఉర్వీసురవర్యుఁడు నా, శీర్వాదము లొనరఁ జేసి స్మితవదనుండై
'గీర్వాణుల కెన వచ్చున, ఖర్వగుణుఁడ వీవు నవతు గలదే నీకున్. 202

ఉ. ఏను భవన్నియోగమున నేఁగితిఁ గాశికి గంగలోఁ గృత
స్నానుఁడ నైతి నీ దగువచస్థితి చెప్పితి నప్పవిత్రతో
నానది దివ్యతేజ మొలయం దనరూపము చూపె మందహా
సాననకాంతితోడ నయనామలరోచులు మేళవింపఁగన్. 203

క. తనుఁ జూచిన యట్టులకా, ననుఁ జూచి ప్రహర్ష మంది నాభృత్యుఁ డతం
డనితరసదృశుఁడు సుమ్మీ, యని ప్రస్తుతిం జేసె నమ్మహానది నిన్నున్. 204

ఆ. అట్లు ప్రస్తుతించి యతఁడు నీమంబున, నున్నవాఁడె నామనోన్నతియును
జెప్పు మతని కనియె నప్పుడే నిట్లంటి, గంగతోడఁ గరయుగంబు మొగిచి. 205

ఉ. నీకరుణారసంబునకు నిక్కముగా నిటు ప్రాప్తుఁ డైనను
శ్లోకుఁడు హీనజాతుఁ డని చూడఁగ రా దతఁ డెట్టిపుణ్యుఁడో
నా కెఱిఁగింపవే యనిన నాకమహానది నీప్రభావముల్
కైకొని చెప్పి వీడ్కొలిపెఁ గంటిమి నీ వగునద్భుతక్రియల్. 206

సీ. గాఢనీహారంబు గప్పినఁ దప్పునే మార్తాండబింబవిస్ఫూర్తి పెంపు
నీఱు పైఁ గవిసిన నాఱంగ నేర్చునే ప్రకటితదావపావకునివేఁడి
మసిసోఁక ముడిచినఁ బస చెడిపోవునే తనరుననర్ఘ్యరత్నంబుకాంతి
భూరిశైవాలంబుఁ బొదివినఁ బొలియునే విలసదంభోరుహావిభ్రమంబు
తే. దైవవశమున నీకుఁ బ్రాప్తవ్య మైన, ఘోరదురితంబు నీఁగెడుకొఱకు నిచట
నంత్యజాకృతి నొందినయంతలోన, వర్ణ్య మగునీతపోమహత్త్వంబు చెడునె. 207

క. కంకుఁ డయి ధర్మజుఁడు వల, లాంకుండై వాయుజుఁడు బృహన్నలయై ని
శ్శంకుఁడు పార్థుఁడు హయగో, కింకరులై కవలుఁ దొల్లి గెలువరె దినముల్. 208

క. వంజరుఁడ వీవు నీచే, వంజర యనఁ బరఁగఁ గాదె వసుమతి నంహో
భంజని యాదిమగంగ స, మంజసగుణహార! నీవు మఱి యల్పుఁడవే'. 209

వ. అని యవ్విప్రుండు పల్కు ప్రస్తుతవాక్యంబు లతనిచండాలత్వంబునకు నుచ్చా
టనమంత్రంబులై శివసారూప్యపదకారణంబు లగుటయుం. 210

సీ. బహుభుజంగమభోగభారంబుక్రియ వ్రాలి నురుజటాజూట మచ్చెరువు గాఁగ
శకలేందుమధ్యగైరికరేఖగతి మోడ్పుఁగన్ను ఫాలమున కక్కజము గాఁగ

రజతాద్రిపై మంచు గ్రమ్మినపగిది భస్మపుంబూఁత యొడల విస్మయము గాఁగ
ధ్రువతటిత్పుంజంబు భువి నిల్పఁ బొడిచినపోల్కిఁ ద్రిశూల మద్భుతము గాఁగ
తే. లలితగజదైత్యచర్మంబు వెలయ భూరి,భుజగభూషణరాజవిస్ఫూర్తి యొసఁగ
నోలిఁ జండాలవేషంబు నుజ్జగించి, శంకరాకార మొందె వంజరవిభుండు. 211

చ. అనిమిషు లప్పు డర్థిఁ గొనియాడఁగ నాడఁగ నప్సరస్సతుల్
పనివడి కిన్నరాంగనలు పాడఁగ జూడఁగ నెల్లవారలుం
గనకవిభూషణాంబరసుగంధసముజ్జ్వలమూర్తిఁ దాల్చెఁ ద
ద్వనితయుఁ నావిమానగతిఁ దాఁ గదిసెం బతివామభాగమున్. 212

వ. అయ్యవసరంబున. 213

ఆ. కప్పురంపుఁబ్రతిమ కైలాసనగరంబు, నొద్ది పాదరసముముద్ద యనఁగ
నానృపాలుపాలి కలిచిత్రగతులతో, వచ్చి నిలిచె వృషభవల్లభుండు. 214

వ. అట్లు సదాశివలాంఛనలాంఛితుండును సంగనాసమన్వితుండును గోరాజవాహనుండును
నై యారాజపరమేశ్వరుండు. 215

సీ. దుగ్ధాబ్ధిలోపలిదొడ్డముత్యము లెల్ల రాసిగాఁ గొనివచ్చి పోసిరొక్కొ
శరదభ్రవితతికి శాశ్వతస్థితి యిచ్చి యొకచోటన బ్రహ్మ యునిచెనొక్కొ
*కరఁగు టెన్నఁడు లేక గరివడ్డ లేమంచు దెచ్చి యున్నతముగాఁ దీర్చిరొక్కొ
విషమలోచను మోచువృషభేంద్రుఁ డంతటఁ దనియకీమూర్తియుఁ దాల్చెనొక్కొ
తే. యనఁగ ధవళప్రభాసమై హరనివాస, మై సమస్తాఘసంత్రాసమై యతీంద్ర
లాలితోల్లాస మైనకైలాసమునకు, నేఁగెఁ బ్రమథు లంతంతఁ దన్నెదురుకొనఁగ.

వ. అట్లు గావున. 217

క. సత్సంగతి గడుఁ బుణ్యము, సత్సంగతి సేయవలయుఁ సత్పురుషులకున్
సత్సంగతి గని వంజరుఁ, డుత్సుకమతి నభవుపురికి నొప్పుగఁ జనఁడే. 218

క. ఆరాజేంద్రుం డటు శివ,సారూప్యపదంబు నొంది చనిన తెఱఁగుఁ గ
న్నారఁగఁ జూచుచునికిఁ బెం,పారఁగ నవ్విప్రుఁ డిట్టు లని వర్ణించున్. 219

ఉ. 'ఏమని చెప్ప వచ్చుఁ బరమేశ్వరభక్తులసచ్చరిత్రముల్
తామసులట్ల యుండుదురు ధారుణిలో మఱి శంభుపాలి కు
ద్దామత నేఁగుచోఁ దమప్రతాపముఁ దేజముఁ జెప్పఁ జిట్టలై
భూమిఁ బొగడ్త కెక్కఁ దమపోఁడిమి చూపుదు రెల్ల వారికిన్. 220

క. పుట్టువుల కెల్లఁ గడపటి,పుట్టువుగా నిట్లతండు పుట్టినదానం
గట్టిగ సంత్యజుఁ డని పే,రెట్టివిశేషార్థ మయ్యెనే యీతనికిన్.' 221

---

* శరఁగుడెన్నఁడు లేకగరివడ్డ మంచురాలేర్చి యున్నతముగాఁ జేర్చి రొక్కొ.
(పి. ని. పా.)

మ. అని వర్ణించుచుఁ దద్విచిత్రసుమహాత్త్వాధిక్య మూహించి నా
రని వేడ్కల్ చిగురొత్త బాష్పజలధారాధౌతగండద్వయం
బును రోమాంచసమంచితాంగకములుం బ్రోత్ఫుల్లవక్త్రాబ్జమున్
వినతాకంపితమస్తకంబుఁ దగ నవ్విప్రోత్తముం డుండఁగన్. 222

ఉ. పౌరులు చేరి 'యోపరమపావనమూర్తి! భవత్సమాగమం
బారయ నెట్టిదో యిచటియంత్యజుఁ డిప్పుడ ముక్తుఁ డయ్యెఁ బం
కేరుహసూతివో వృషభకేతుఁడవో హరివో కదయ్య నీ
వారినకాఁ దలంపు బుధవత్సల! య'మ్మని పల్కి రందఱున్. 223

క. ఆపల్కుల కతఁ డి ట్లను, 'నోపౌరశ్రేష్ఠులార! యొప్పుగ వినుఁ డే
నాపద్మజశివవిష్ణుల,లోపల నెవ్వఁడనుగాఁ బలుకు లేమిటికిన్. 224

క. విప్రుఁడ నే నయ్యంత్యజుఁ, డాప్రమథాధిపతిభక్తుఁ డాతఁడు తనధ
ర్మప్రాభవమున నియ్యెడ, నప్రతిహతతేజుఁడై హరాద్రికిఁ బోయెన్. 225

క. వినుఁ డతనిమహిమ చెప్పెద,' నని తన కాశీప్రయాణ మాదిగ మఱి యా
తని మోక్షము తుదిగాఁ గల్గునడిమివృత్తాంత మెల్లఁ గొనకొని చెప్పెన్. 226

ఉ. చెప్పినఁ బ్రీతులై యతనిఁ జెచ్చెరఁ దోడ్కొని పోయి బూరెలుం
బప్పును నెయ్యి పాయసముఁ బక్వఫలాదులు నేత్రతృప్తిగాఁ
గుప్పిరి మున్ పథశ్రమము గూరిన మేనికి దప్పి దీఱున
ట్లప్పురివిప్రముఖ్యులు ప్రియంబునఁ గైకొని యేఁగె నాతఁడున్. 227

వ. ఇట్లేగి తనపురంబు చేరి యాత్మగతంబున. 228

ఉ. 'కాశికిఁ బోవఁ గంటి మణికర్ణికఁ గ్రుంకిడఁ గంటి నేను వి
శ్వేశుపదాబ్జసేవఁ బరమేశ్వరిసత్కృపఁ జాలఁ గంటి న
క్లేశగతిన్ హిమాచలముక్రిందటిభూములు చూడఁ గంటి న
చ్చో శిశువక్త్రజంబు లగుసూక్తు లొగి న్వినఁ గంటిఁ జేటగన్. 229

ఆ. అక్కజంబు లైనయట్టివిశేషంబు, లర్థిఁ జూడఁ గంటి నచట నచట
తిరిగి వచ్చి జన్మదేశము చేరఁ గంటి, మంటి' ననుచు నాతఁ డింటి కరిగె. 230

క. భయభక్తిసంభ్రమంబులు, రయమున ముప్పిరి గొనంగఁ బ్రణమిల్లినయా
ప్రియసతి నుచితవచనసం,చయములఁ దగ గారవించి సౌహార్దమతిన్. 231

ఉ. ఇమ్ములఁ గాశికాపురికి నేఁగెడునప్పుడు నందునుండి య
య్యుమ్మికపంపునన్ హిమవదద్రిసమీపము కేఁగునప్పుడున్
గ్రమ్మఱి వచ్చునప్పుడును గన్నవిశేషము లింతితోడ మో
దమ్మునఁ జెప్పె విప్రుఁ డది దానును జెప్పె నిహప్రసంగముల్. 232

వ. ఇట్లన్యోన్యవిశేషభాషణంబులం గొండొకసేపు వినోదించి యెల్లదానంబులయం దును నన్నదానం బసమానం బనియును నందు సిద్ధించుపుణ్యం బగణ్యం బనియును నెఱింగిన వారై యాదంపతులు తదీయాచరణంబులు తమకు శరణంబులుగాఁ బ్రవర్తించుచు ధనధాన్యసమృద్ధియుఁ బుత్రపౌత్రాభివృద్ధియుం గలిగి బ్రతుకుచుండి రని చెప్పి సర్పటిసిద్ధుండు. 233

సీ. అన్నంబు బలకరం బన్న మాయుర్వృద్ధికర మన్న మత్యంతకాంతికరము
తనుఁ జంప వచ్చినఘనశత్రునకు నైన నన్నంబు బంధుత్వ మావహించు
నన్నంబువలనన యమరులు ప్రీతులై పరులకుఁ గోరినవరము లిత్తు
రన్నదానముఁ బోల వన్యదానంబులు ధరణిలోపల నెల్లదానములకు
ఆ. ఫలము సరిగఁ జెప్పఁబడుఁగాని యన్నదానంబుచేత కీఫలం బనంగ
నబ్జభవుఁడు నోపఁ డటు గాన నీవును, నన్నదానపరుఁడ వగుము భూప! 234

క. ఇది నీయడిగినప్రశ్నకు, సదమల మగునుత్తరంబు జనవర! యేఁ బో
యెద' ననిన నాతఁ డిట్లను,' నిది తగవా మిము భజించు టిట్లనుటకు నే. 235

సీ. అఖిలదానములందు నన్నదానంబు విశేషంబుగా మీరు చెప్పుచున్న
వారు తత్ఫలములవలనను జేరెడునను నేయను మీరె యగుటఁజేసి
తత్ప్రతిగ్రహముచేతను మీర యర్హు లారయ నిప్పు డవ్వేళ యయిన దదియుఁ
గాక మీయందును గనఁగ నామీఁదియనుగ్రహం బధికసమగ్ర మగుటఁ
తే. బరిహరింపక నావిన్నపంబు మీర, లవధరింపంగఁ దగు' నన్న 'నవనినాథ!
యింత చెప్పంగ నేల నే వింతవాఁడ, నయ్య వ్రతభంగ మగు నని యంటిఁ గాక.

ఆ. నృపకులాబ్ధిచంద్ర! నీ వింత నెట్టుకొనంగఁ ద్రోచి పోవ నాకుఁ దగదు
వినఁగ వలయుఁ నాదువిధమును నీకు నట్లగుట నొకటియుపాయ మవధరింపు. 237

చ. అనఘ! భవద్వధూవిమలహస్తసరోరుహదత్తభిక్షయుం
దనరఁగ వేఁడి నాల్గుసదనంబులభిక్షయుఁ గాంచి యివ్విధం
బునఁ గలపంచభిక్షయును భూపవరా! భవదీయపఙ్క్తి నిం
పెనఁగు భుజింతు నొండనకు మిప్పని దా నుభయార్థముం జుమీ. 238

ఉ. అచ్చటఁ దెచ్చుభిక్షయు నరాధిప! నీయశనంబు గాదె నీ
వచ్చపుఁగూర్మిఁ బ్రోచుమనుజావలిసొమ్ము భవద్ధనంబ కా
కెచ్చటనుండివచ్చె నిది యిట్టిదకా మది నిశ్చయింపు నా
కిచ్చిన విమ్ము' నావుడును 'నిట్టిదృఢవ్రతుఁ డెందుఁ గల్గునే. 239

క. పట్టఁగ వలవదు వ్రత మది, పట్టినఁ దుది విడువ వలదు పట్టినవ్రత మే
పట్టున వదలక జరిపెడి, నట్టిజనులు పూజ్యు లనిమిషావళి కైనన్. 240

వ. అని కొనియాడుచు నమ్మునిజేంద్రుం డనుమతింప నతం డట్లు చేసె నట్టిరువురు నా
హారంబులు గొనిన తదనంతరంబ. 241

క. భోజమహీపతిచేతం, బూజితుఁడై యరిగె సిద్ధపుంగవుఁడు నరేం
ద్రా! జగతి నన్నదాన, భ్రాజిష్ణుం డయ్యె నానృపాలవరుండున్. 242

చ. వినుము నరేంద్ర! భోజపృథివీతలనాథునిరాజ్యలీలయుం
బొసరఁ దదీయకాలమునఁ బుట్టినయట్టివిశేషరీతులుం
గొనకొని నీదుకర్ణములకు న్విశదంబుగ విస్తరించితిన్
మనునిభుఁ డవ్విభుం డతనిమార్గము తక్కినవారి కబ్బునే. 243

సీ. మొదలిసామోపాయమున సర్వభూప్రజాపరిపాలనము సేయుఁ బాడితోడ
నడరి రెండవయుపాయం బైన భేదముఁ బచరించుఁ బుణ్యపాపములయందు
మొగిఁ దృతీయోపాయ మగుదానవిభవంబు నెఱపు నశేషార్థినికరమందు
నటఁ జతుర్థోపాయ మైనదండక్రియ యడరించు మృగయావిహారమందుఁ

తే. దనకు నెందును నెదురు లేకునికిఁ జేసి, చతురుపాయములకు నిట్లు గతి యొనర్చె
నౌర యితఁ డంచు నీతిజ్ఞు లాదరింప, బుధపయోధిసుధాంశుండు భోజవిభుఁడు. 244

సీ. చర్చింప రెండవచంద్రుఁడు మూఁడవయశ్విని నాలవయగ్నిదేవుఁ
డైదవలోకపాలాఖ్యుఁ డాఱవపాండుసంతాన మేడవచక్రవర్తి
యెనిమిదయగుసన్మునీశు డాతొమ్మిదయగు భోగిపతి పదియవవిరించి
పదునొకొండవచక్రపాణి పండ్రెండవశూలి పద్మూడవసూర్యుఁ డనఁగఁ

ఆ. దనరుఁ గాంతి రూపమునఁ బ్రతాపమున సత్యమున ధర్మచరిత నాజ్ఞ శుచిని
భూరిసత్త్వమునఁ బ్రబుద్ధతఁ గలిమిని, భూతిఁ దేజమునను భోజవిభుఁడు. 245

ఉ. ఆరసి వీరు వీ రని కృతాదియుగంబుల మూఁటియందు నిం
పారఁగఁ జేర్కొనం గలుగునట్టిఘను ల్గల రెన్నఁ జో బహు
త్మారమణోత్తముల్ కలియుగంబున భోజవిభుండు సద్గుణా
కారుఁ డొకండ కాని మఱి కల్గఁడు తత్సదృశుండు భూవరా! 246

తే. క్షీరపూరితఘటము కర్పూరయుతక,రండ ముద్యదిందుద్యుతి రమ్య మైన
కైరవాకర మనఁగ జగంబు మెఱయు, భోజవిభునిత్యకీర్తి విస్ఫూర్తిఁ జేసి. 247

చ. అవిరళకీర్తినిత్యుఁడు సమంచితసత్యుఁడు శ్రీప్రయాగమా
ధవకరుణావలోకనసుధారసజన్ముఁడు కామినీజన
ప్రవిమలచిత్తజన్ముఁడు ప్రభాకరతేజుఁడు భోజుఁ డొప్పు వై
ష్ణవశుభయోగలక్షణవిచక్షణుఁడై చిరజీవనోన్నతిన్. 248

క. అభినవభోజుఁ డనంగాఁ, బ్రభవించెఁ దనూజుఁ డానృపశ్రేష్ఠునకున్
శుభలక్షణలలితుఁడు శ,త్రుభయంకరుఁ డార్యసన్నుతుఁడు ధీయుక్తిన్. 249

క. నెట్టన భోజునికడుపునఁ, బుట్టినపుత్త్రుఁ డఁట యవ్విభునిచారిత్త్రం
బెట్టి దన నేల పులికిం, బుట్టినకూన యఁట వేఁడి పులు మేసెడినే. 250

చ. అవనికిఁ జందనంపుఁగలయంపి పయోధికి ఫేనచిహ్న వృ
క్షవితతికిం బ్రసూనతతి శైలచయంబునకున్ సితాభ్రగౌ
రవ ముడువీథికిన్ సురతరంగిణివెల్లి యనంగ నొప్పు భూ
భువనబిడౌజుఁ డైననవభోజునికీర్తి మనోజమూర్తియై. 251

ఉ. అతఁడు గాంచెఁ బుత్త్రుల ననంతగుణాఢ్యులఁ దత్తనూజులుం
జాతిగఁ గాంచి రాత్మజులఁ జారు యశస్కుల వారలుం దనూ
జాతులఁ గాంచి రున్నతవిచారుల నీక్రియ భోజవంశ మ
త్యాతతకీర్తి నొప్పె భరతాన్వయసన్నిభమై జగంబునన్. 252

క. ఈభోజరాజచరితము, భూభువనమునందు నిఖిలపుణ్యాస్పదమై
శోభిల్లు నధికతేజో, లాభంబుల నిచ్చు శ్రోతలకు వక్తలకున్. 253

వ. అని భోజరాజీయంబు నెయ్యంబున నాద్యంతంబు నత్యంతహృద్యంబుగా నుప
న్యసించి. 254

సీ. అత్త్రిపుత్త్రుండు పవిత్త్రచరిత్త్రుండు వితతతపోమార్గసతతపథికుఁ
డజ్ఞానదూరుఁ డతిజ్ఞానసారుఁ డంతర్వేది విదళ సాఖర్వబలుఁడు
చిరతరాయుష్మంతుఁ డురుతరస్వాంతుఁ డష్టాంగయోగప్రియాసంగతుండు
లక్ష్మీనివాసుండు లక్ష్మీనిరాసుండు నిఖిలాశ్రితవ్రాతసుఖకరుండు
ఆ. సజపుఁ డచలుఁ డనఘుఁ డజుఁడు దత్తాత్రేయ,మునివరుండు దనకు వినతుఁ డైన
మహుని వీడుకొల్పి మహితకృపాదృఙ్మ,రీచు లెసఁగ బుధులఁ బ్రోచుచుండె. 255

క. దత్తాత్రేయప్రోక్త ము,దాత్తసుకృతభోగవిశ్రుతసునీతిపథా
యత్తంబై యితిహాసము, క్రొత్తగదే భూమి ననుచుఁ గొనియాడంగన్. 256

క. ఆచక్రవాళ మూప్పు, ధ్వచక్రం బాశశాంకతిగ్మమయూఖా
బాచతురాస్యముఖాఖిల, ఖేచర మగుఁ గాత నాదుకృతిరత్నము దాన్. 257

సీ. అఖిలజగత్సేవ్యమై భూమిపై నహోబలము దా నెందాఁక వెలయుచుండు
నాతీర్థమందుఁ బ్రఖ్యాతమై భవనాశనీనది యెందాఁక నెగడుచుండు
నామహానదిప్రాంత నత్యంతపూజ్యమై గరుడాద్రి యెందాఁకఁ గదలకుండు
నయ్యద్రిశిఖరంబునందును నెందాఁక శ్రీనృసింహస్వామి స్థిరత నుండు
ఆ. నస్మదీయకృతియు నందాఁక సంతత,శ్రావ్యమై సమస్తసభలయందు
విస్తరిల్లుఁ గాత వివిధకథానూత్న,రత్నభూషణాభిరామ మగుచు. 258

క. గోవులకును బ్రాహ్మణులకు, భూవలయములోనిపుణ్యపురుషులకు సభీ
ష్టావాప్తి యొదవుఁ గావుత, దేవార్చితుఁ డగునృసింహదేవునికరుణన్. 259

చ. అని జగదేకవంద్యునకు నాదినృసింహున కిందిరామనో
వనజమధువ్రతేంద్రునకు వారిజనాభునకుక్ సరోజలో
చనునకు సూరిలోకనుతచర్యునకున్ భవబంధజాలమో
చనునకు నేను నీవిమలసత్కృతి కానుకఁగా నొసర్చితిన్. 260

క. నన్ను భవద్భృత్యులలో, నెన్ని దయాదృష్టిఁ జూచి యిది మొదలుగ నీ
వెన్నఁడు వదలకు మిది నా,విన్నప మట్లైన నఘనివృత్తుఁడ నగుదున్. 261

చ. సరసిజపత్రనేత్ర! భవసాగరబాడబవీతిహోత్ర! ని
ర్జరపరిచార! రాత్రిచరసంఘవిదార! విఘాతపాతకో
త్కర! సుకృతార్థికైరవసుధాకర! యాశ్రితపారిజాతసు
స్థిరవరదాత! యోగిజనసేవిత! శాస్త్రపురాణభావితా! 262

క. అవయవయుతపరతత్త్వా!, భువనత్రితయాంతరాత్మ! పూర్ణమహత్త్వా!
భవనాశనతటినీతీ రవిహారా! భాస్వదిందిరావనికీరా! 263

తోటకవృత్తము చందనకుంకుమసంయుతవక్షా! కుందసుకుట్మలకోమలధామా!
వందితభక్తజనప్రియ! యోగా, నంద! యహోబలనాథ! నృసింహా! 264

గద్యము. ఇది వాణీవరప్రసాదలబ్ధవాగ్వైభవ తిక్కనామాత్యసంభవ సుకవిజనవిధేయ అనంతయనామధేయప్రణీతం బైనభోజరాజీయంబనుకావ్యంబునందు వంజరుండు నిటలాక్షునీరజాక్షులఁ బ్రత్యక్షంబు చేసికొనుటయు విష్ణుప్రసాదంబునఁ బతంగాధిపుం దనవశంబు చేసికొనుటయుఁ వంజరమహాప్రవాహావరంబును వంజరుకడకుఁ దమ తగవు దీర్చుకొన వచ్చి బ్రాహ్మణక్షత్రియవైశ్యులు శపించివిపోవుటయు నృపకన్యాసంగమంబును ద్విశాపానురూపఫలానుభవంబును చిత్రపునరాగమనంబును శివసాహాయ్యసంధియుఁ నన్నదానవిశేషాకర్ణనంబును సర్పటి పంచభిక్షాన్న సేవయుం భోజుం డన్నదానపరాయణుండై రాజ్యంబు సేయుచుఁ బుత్రపౌత్రాదిసంతానసమృద్ధిం బ్రవృద్ధి నొందుటయుఁ దత్ప్రసంగంబులం విబుధకుముదవనాశ్రయుం డగుదత్తాత్రేయుం డుపన్యసింప నఖిలధరాభారవహుం డగుమహుండు విని కృతార్థుఁడై నిజస్థానంబునకుం జనుటయుఁ నీభవ్యకావ్యస్ఫూర్తిపరిపూర్తి నొంది ప్రహ్లాదవరదుండును భవనాశననదీతీరవిహారుండును నైహికాముష్మికసుఖప్రదుండును నహోబలతీర్థభర్తయునగు ప్రసన్నలక్ష్మీనృసింహదేవునకు విన్నవించుటయుం నన్నది సర్వంబును సప్తమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ



చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1952